శ్రీరస్తు

# టిప్పుసుల్తాన్

## నవల

ఇది

ఆంధ్రసాహిత్యపరిషత్తు మేనేజరు ఆమీద
మదరాసుప్రెసిడెన్సీకాలేజీ తెనుగుపండితులు నగు
విద్యాశేఖర శ్రీ ఉమాకాన్తమ్‌గారిచే
రచింపఁబడినది.



చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
వారిచేఁ బ్రకటితము.
1953

శ్రీరస్తు.

# గద్యవాఙ్మయప్రశంస

## నవలారచన

"బ్రహ్మైవ రసః, రసోవై సః"—శ్రుతి

(బ్రహ్మయే రసము, రసమే బ్రహ్మ)

As the active world is inferior to the rational soul, so fiction gives to mankind what history denies and in some measure satisfieth the mind with shadows when it cannot enjoy the substance : – Bacon. (జ్ఞానవిశిష్టమైన యాత్మ చరప్రపంచమునకంటె నుత్కృష్టమైన పగుట మానుష్యమునకుఁ జరిత్రవలనఁ గలుగనిసంస్కారము కల్పనచే సమకూరుచున్నది. బుద్ధికి వాస్తవానుభవము లేనప్పుడు కొంతమట్టునకుఁ దదాభాసముననైనఁ గల్పన తృప్తిపఱుచుచున్నది.) అని యొక యాంగ్లేయతత్వజ్ఞుఁడు వచించినట్లు కల్పనయొక్క ప్రాధాన్యము వాఙ్మయమునందు గణనీయముగ నున్నది. మనయాంధ్రవాఙ్మయమునందుఁ గావ్యములు గద్యపద్యాత్మకములుగ నున్నవి. కేవల పద్యాత్మకములును కేవల గద్యాత్మకములునుగూడఁగలవు. ఏదేశముయొక్క వాఙ్మయచారిత్రము నవలో[illegible]చినను ప్రథమమున గద్యకావ్యము లుత్పన్నమైనట్లు కాన్పింపదు. లిపి [illegible], లేఖిన్యాదిసాధనము లలవడినతరువాత, విజ్ఞానము హెచ్చినకొలఁది, [illegible]వ్యముల వ్రాయ నారంభించిరి. మొదట మొదటఁ గవులుమాత్రము [illegible]న గౌరవము ప్ర నొసఁగినవారు కారు; పద్యమే తమవాక్కులకు

దివ్యాంబరం బని తలంచిరి. కాని కవితాప్రవాహంబు సాగిసాగి యనేక విజృంభించిన కాలమునఁ గొందఱు వచనమునసే తమకవితాస్ఫూర్తిని బ్రవహింపఁజేసిరి. పద్యము వ్రాయునతఁడా గద్యము వ్రాయునతఁడా కవి యని విచారింపవలసియున్నది. కవిలక్షణము లేవి? ఎవ్వరి మనోదర్పణంబునఁ బ్రకృతి ప్రతిబింబించియుండునో, ఎవ్వరు ప్రకృతికింగూడ నతీతులై యుందురో, యెవ్వరి లేఖిని ధర్మోద్ఘోషణంబునందును దుర్నీతిఖండనంబునందు నమోఘశక్తిమంతంబై యుండునో, యెవ్వరిజ్ఞానేంద్రియములకు సామాన్యమానవుల కజ్ఞేయంబులగు తత్త్వరహస్యంబులు లీలామాత్రగోచరములై నెగడునో, యెవ్వరి యశ్రుకణంబులు సర్వప్రపంచదుఃఖనిర్వాపకారణంబులగునో, యెవ్వరి సంతోషపారవశ్యంబులు నిఖిలమానవపరమానందసంజనకంబులగునో, యామానుష్యప్రతినిధులు కవు లని చెప్పినచో లక్షణ మసమగ్రముగనే యుండును. కవులను గుఱించి షెల్లియను పండితుఁ డిట్లు నుడివియున్నాఁడు:-

"A poet, as he is the author to others of the highest wisdom, pleasure, virtue and glory, so he ought personally to be the happiest, the wisest and the most illustrious of men......The greatest poets have been men of the most spotless, virtue, of the most consummate prudence and if we would look into the interior of their lives, the most fortunate of men."

(ఇతరుల కత్యుత్కృష్టమైన యానందమును, జ్ఞానమును, నీతిని, గీర్తి నొసంగును గాన కవి స్వయముగ సామాన్యమనుజులకంటె నధిక[illegible] గీర్తనీయుఁడును జ్ఞానసంపన్నుఁడు నైయుండును. ఉత్తమకవులు [illegible] నిష్కళంకమైన ప్రవర్తన గలిగి సంపూర్ణమైన వివేకము గల మనుజులై యుండిరి. వారిజీవితములను బరీక్షించినచో నందఱికంటె నెక్కువ [illegible] యుండి రని తెలియఁగలము.) మఱికొందఱు, కవులు మనుష్యులకును కని మధ్యవర్తు లని చెప్పియున్నారు. పాశ్చాత్యవిద్వాంసులే గాక

విద్యా" యనియు "కవితాయద్యస్తిరాజ్యేన కిం" మ్మనియు వచించిన మన పూర్వపండితులుగూడఁ గవుల యసాధారణమహిమను గ్రహించియే యుండిరి. మఱియుఁ గావ్యప్రకాశములో మమ్మటుఁడు

"నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం
నవరసరుచిరా మాదధతీ భారతీ కవే ర్జయతి"

(నియతిచేఁ జేయఁబడిన నియమము లేనిదియు నానందైకమయమైనదియు ననన్యపరతంత్రమైనదియు నవరసమనోజ్ఞమైనదియు నగు నిర్మాణమును కల్పు కవియొక్క వాక్కు సర్వోత్కృష్టముచే వర్తిలును) అని గ్రంథముఖమున స్తుతియించియున్నాఁడు. విశ్వగుణాదర్శమున

"అంతర్ధ్వాంతహరాయత కవయస్త్వయా నాధిక్షేప్యాః"

(మనస్సుయొక్క యజ్ఞానమను చీఁకటిని బోఁగొట్టు సూర్యులగు కవులు నీచే నధిక్షేపింపఁబడఁదగినవారు కారు.) అని విశ్వావసు కృశానువుల సంవాదములో వేంకటాధ్వరి కవుల సర్వాతిశాయిత్వమును గొనియాడెనాఁడు. ఆనందవర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకమునందుఁ దృతీయోద్యోతములో

"శృంగారీచేత్ కవిః కావ్యే జాతం రసమయంజగత్
స చేత్ కవి ర్వీతరాగో నీరసం వ్యక్తమేవ తత్"

(కవి శృంగారియైనేని కావ్యమునందు జగత్తంత రసమయమగును. వీతరాగుఁడయినచో జగత్తంత నీరసముగ వ్యక్తమగును) అని కవుల శక్తిని వర్ణించియున్నాఁడు. సుబంధుఁడు వాసవదత్తయందు

"కరబదరసదృశమఖిలం భువనతలం యత్ప్రసాదతః కవయః
పశ్యన్తి సూక్ష్మమతయః సా జయతి సరస్వతీదేవీ"

(ఎవ్వతె ప్రసాదమున సూక్ష్మమతులైన కవులు సమస్త భువనస్వరూపమును జేతిలోని రేఁగుపండువలెఁ జూచుచున్నారో యాసరస్వతీదేవి సర్వోత్కృష్టముచే వర్తిల్లును.) అని కవులమాహాత్మ్యమును సూచించియున్నాఁడు. ఉత్తరరామచరిత్రములో ద్వితీయాంకమున బ్రహ్మ వాల్మీకిని స్తుతించినట్లు

"ఋషే, ప్రబుద్ధోఽసి వాగాత్మని తద్బ్రూహి రామచరితం
అవ్యాహతం జ్యోతిరార్షం తే చక్షుః ప్రతిభాతి ఆద్యః కవిరసి"

(ఓఋషీ శబ్దబ్రహ్మమునందు ప్రబుద్ధుడవైతివి. కావున రామచరిత్రము చెప్పుము.) ఋషిసంబంధియోగజమైన నీనేత్ర మప్రతిహతప్రకాశమై విలసిల్లును. ఆదిమకవి వగుచున్నావు." అని భవభూతి వచించి కవులయొక్క జ్ఞాననేత్రమునకుఁ దెలియనివిషయ ముండ దను తనయభిప్రాయమును వెలిపుచ్చెను. చూడుఁడు విష్ణుపురాణమునందు

"కావ్యాలాపాశ్చ యే కేచి ద్గీతకాన్యఖిలాని చ
శబ్దమూర్తిధరస్యైతే విష్ణో రంశా మహాత్మనః"

(కావ్యాలాపములు నఖిలగీతకములు శబ్దమూర్తిధరుఁడైన విష్ణువుయొక్క అంశములు) అని కవివాక్యములు కీర్తింపఁబడినవి. వేయేల! "నానృషిః కురుతే కావ్యం" (ఋషికానివాఁడు కావ్యమును జేయఁడు) అని మహాకవు లందఱు మహర్షులే యను నభిప్రాయమును మన పూర్వులు కలిగియున్నారు. ఆగ్నేయపురాణమునం దీకవులనుగుఱించి యింకను జెప్పఁబడియున్నది, కాని విస్తరభీతిచే నావాక్యము లుదాహరింపక విడుచుచున్నాఁడను. సంస్కృత విద్వాంసులే గాక యాంధ్రపండితులుగూడఁ గవుల ప్రభావమును మెచ్చియే యుండిరి.

క. "కమనీయసమస్తకళా
గమములకును జననభూమి కావ్యము కావ్యా
గమవిదులు సర్వవిదు లని
సమయచతుష్టయమునందుఁ జదివిరి మొదలన్."

అని కవిజనాశ్రయకారుఁడు కవుల యౌత్కృష్ట్యమును గొనియాడినాఁడు. "తళుకుటద్దంబు సత్కవులమనసు" (సరస్వతీదేవికిఁ గవులమనసు తళుకుటద్దము) అని శ్రీనాథుఁడు కవుల యతిశయమును దెలియఁజేసెను.

"చ. మనమునఁ గొన్ని సెవ్వగలు మాన్పి ఘటింతు రకాండసమ్ముదం
బనఘకథాముఖంబున హితాహిత బోధమొనర్తు రింపుగాఁ
గనుఁగొనుకంటె సద్భుతముగా నెఱఁగింతు రతీంద్రియార్థముల్
ఘనమతు లెల్లవారికి నకారణబంధులుగారె సత్కవుల్."

అని సంకుసాల నృసింహకవి కవులను ప్రశంసించియున్నాఁడు. ఇంక నిట్టివాక్యము లనేకములు గలవు. కవులన నీదృశానన్యసామాన్యసుగుణగణ విరాజమానులైన మహాపురుషులై యుండ నిక్కాలమునఁ బొటివేషములు వేసికొని కవిహంసల మని, కవిచక్రవర్తుల మని మిట్టిపడుచుఁ గవిశేఖరుల మని యుప్పొంగుచుఁ, గవిఘటాపంచాననుల మని, బాలసరస్వతుల మని, మాకు సమానులులేరని మీసములు దువ్వుచు, రైలుబండికంటె వేగముగఁ గవిత్వము చెప్పుదు మని, చేయిమోపక కవిత వ్రాయుదు మని విఱ్ఱవీగుచుఁ దమను దామే వేనోళ్లఁ బొగడుకొనుచు గర్వసంస్తంభులై జల్పములాడువారిచేష్టల నేమన వలయునో చదువరులే యూహించికొనఁగలరు. కాళిదాసునియంతటివాఁడు,

"మందః కవియశఃప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతాం"

(మూఢుఁడనై కవియశస్సు నభిలషించుచున్న నే నపహాస్యతను బొందుదును.)

అని వినయమును గనఁబఱచెను. కవిచక్రవర్తి కవిఘటాపంచాననేత్యాద్యనేకదంభబిరుదములఁ దాల్చి యిప్పుడు గర్వోక్తులాడువా రీకాళిదాసుని కంటె ఘనులా! ఘనులే యనుకొందము. ఘనత్వము హెచ్చినకొలఁది వినయాదిసద్గుణము లతిశయింపవలెను గదా! ఈకాలమునం దొకరినొకరు తిట్టుకొనుటయే కవిత్వమైనది. ఆతిట్లే యామ్నాయములైనవి. భారతామ్నాయముతోఁ దుల్యములఁట! మూర్ఖులు వానినే యాసక్తితోఁ బఠించుచున్నారు. అక్కటా! జనులయజ్ఞానమును, గవితాదుర్దశయు, నింతకంటె హెచ్చఁ గలవా? చివరకు "కందము చెప్పినవాఁడు కవి, పందినిఁ జంపినవాఁడు బంటు" అనుసామెత నిజమైనది.

మన తెలుఁగుదేశమునం దిప్పుడును వినయాదిసుగుణహితులైన సత్కవులు కొందఱు "ప్రభాతకాలమునందలి వియత్తారకలవలె" నరుదుగనైనఁ గల రని మాత్రము తెలిసికొనుటకు సంతసిల్లుచున్నారు. ప్రకరణమునకుఁ దగినంతవఱ కిచ్చట విఖ్యాతప్రముఖ కవులనుగుఱించి వ్రాసితిని. ఈమహనీయులభావమే కవిత. శబ్దమునుబట్టి కవిత యనుపదమున కర్థ మిదియే యైనప్పటికి నింకను విస్తృతార్థమునందు గ్రహింపఁబడవలయును. కావ్యములందుమాత్రమే కవిత యుండు నని భావింపరాదు. క్రొంబసిమినీను చివురుంజొంపములయందుఁ గవిత గలదు. వక్రగతిం బ్రవహించు సెలయేళ్ల నిర్మలజలశీకరములయందుఁ గవిత గలదు. సరోవరస్ఫటికోదకంబుపైఁ దాండవమాడు సాంధ్యరాగంబునందుఁ గవితగలదు. వెన్నెలరాత్రులలో నాథునిపజ్జఁ జేరి యల్లనల్లన ముచ్చటలాడు తొయ్యలి జిలిబిలిపలుకులయందుఁ గవిత గలదు. అగ్నివెన్నంబోలెఁ బ్రియుని హృదయమును గరఁగించు యువతీ నేత్రాంచలమునందుఁ గవితగలదు. పరిణామరమణీయంబులైన మధుమాసవేళల మత్తిల్లి శ్రావ్యగానంబులు సల్పుకోయిల కంఠస్వరమునందుఁ గవిత గలదు. హరితవిశాలశాద్వలతలంబులందు మయిమయి మేయు నావుల నాకర్షించుగోపకుని వేణునాదంబునందుఁ గవిత గలదు. వేయేల ? ఎయ్యది నిర్భరమైన యానందము నొడఁగూర్చునో, యెయ్యది మనస్సును జ్వలింపఁజేయునో, యేయది యింద్రియగోచరమైనవెంటనే యాటభూమియందలి బాలురను, విహారప్రదేశమునందలి ప్రియాప్రియులను, మందమునందలి వృద్ధులను సమీపమునకుఁ జేరి పారవశ్యము నొందుదురో, యెద్దానిచే మానవమనోవృత్తులు రసోచితంబుగ నవస్థావిపరిణామంబులం బొరయునో, యయ్యది కవిత యని చెప్పిన మన సిద్ధసాధ్యసిద్ధాంతము లన్నిటికిం జాలును. ఇంతవఱకుఁ గవితాతత్త్వము కొంచెము వివరించితిని. ఇఁకఁ బ్రస్తుతాంశమునకు వచ్చి గద్యపద్యములయందలి కవితనుగూర్చి విచారింతము.

కవియొక్క మనస్సునందు సముద్రమునందుఁ దరంగములభంగి. భావములు జనించి యుప్పొంగునప్పు డేవిధమునఁ బయల్పడునో! పద్యరూపము

వనో! గద్యరూపమునవో! అనివార్యములై, స్వేచ్ఛానిర్మలహృదయోద్గతములైన భావైక్యము లేరూపమున నుండినను దానియందనన్యసామాన్యమైన యొక్క సమత, యొక్క యాకర్షణము, నొక్క వైలక్షణ్యము, నొక్క శక్తి, యొక్క లోకోత్తరత మనకుఁ బొడకట్టుచుండును. కావున గద్యమునైనఁ బద్యమున నైనఁ గవిత యప్రతిహతముగఁ బ్రకాశించునని స్పష్టపడుచున్నది. కాని యన్ని గద్యములందు నన్ని పద్యంబులందుఁ గవిత యుండు నని మాత్రము మనము తలంపఁ బోలదు. అనఁగాఁ బద్యములు వ్రాసినవారందఱును, గద్యములు వ్రాసినవారందఱును కవులని భ్రమపడఁగూడదు. గణితము, వైద్యము, జ్యోతిషము, వ్యాకరణము మొదలగు శాస్త్రములు మనవారు ఛందోబద్ధములుగ రచించిరి. వీనియందును,

"అచ్చన బుచ్చనలందున
నచ్చన్నే మంచి మనుజుఁ డది యెట్లనఁగా
నచ్చన్న బొచ్చు పీకెను
బుచ్చన బొచ్చంత పట్టి పుట పుటఁ బీకెన్"

అనురీతిగ వ్రాయఁబడిన పద్యగ్రంథములయందును,

శ్లో. "స్వచ్ఛందోచ్ఛల దచ్ఛకచ్ఛకుహరచ్ఛాతేతరాంబుచ్ఛటా
మూర్ఛన్మోహమహర్షిహర్షవిహిత స్నానాహ్నికాహ్నాయ వః
భిద్యాదుద్యదుదారదర్దుర దరీ దీర్ఘాదరిద్రద్రుమ
ద్రోహోద్రేకమహోర్మిమేదురమదా మందాకినీ మందతాం."

(స్వచ్ఛందముగునట్లుగాఁ బైకి లేచుచున్న, నిర్మలతీరనిమ్నప్రదేశములం దచ్ఛిన్నమైన, నీటిసమూహమువలనఁ బోవుచున్న మోహముగల మహర్షులచేత సంతోషముతో విహితములైన స్నానాహ్నికములు గలదియు, నెగురునట్టి యద్భుతములైన కప్పలు గల తటకందరములయందు విజృంభించునట్టి గొప్ప యలలచే సాంద్రమైన మదము గలదియునైన మందాకిని మామాంద్యమును శీఘ్రముగఁ బోఁగొట్టుఁగాక.)

యనుభాగిం బదాటోపమమాత్రమే కల శ్లోకములందును, "అజ బండి. దాని నెద్దు లాగును. దానికి రెండుగాళ్లు కలవు,"

అనువిధమున రచింపఁబడిన వచనపుస్తకములందును

"కుంకుమమందారబృందారకదంతావళమందాకినీచంపకముక్తాహార నీహార చంద్రకోటీర పాటీరశారదాశారదాంభోజకాశనీకాశయశః ప్రకాశా"

అను చందమున నుండు భావదారిద్ర్యము గల దీర్ఘగద్యములందును గవిత లేదనుట నిర్వివాదాంశము. కావునఁ బై నుదాహరింపఁబడినవానివంటి గద్యపద్యములను రచించుటవలనఁ దద్రచయితలు కవి శబ్దవాచ్యులు కానేరరని విశదమగుచున్నది. మన యాంధ్రవాఙ్మయమును బరిశీలించి పూర్వులలో నేమి, యాధునికులలో నేమి, నిజముగఁ గవులని పిలువఁబడఁదగిన వారెందఱు కలరని విచారింప, సంఖ్య కడుంగడు స్వల్పముగా నున్నదని వ్రాయుటకు మాత్రము సాహసించుచున్నాను. సందర్భానుసారముగ వచ్చిన యీచర్చ నింతటితో వదలెదను.

పద్యమునందేకాక గద్యమునందుఁగూడఁ గవిత యప్రతిహతముగఁ బ్రకాశించుచుండు నని యిదివఱకుఁ జెప్పియుంటిమి. కావుననే కాళిదాసునితోఁ గలహము సంభవించినప్పుడు

"కవిర్దండీ కవిర్దండీ కవిర్దండీ నసంశయః"

అని సరస్వతీదేవిచేఁ బేర్కొనఁబడినట్లు ప్రసిద్ధికెక్కిన దండియు,

"బాణోచ్ఛిష్టం జగత్త్రయం"

అని కీర్తిపడసిన బాణుఁడును, భాషాశైలిచే వన్నెకెక్కిన సుబంధుఁడును, గద్యకావ్యరచనవలననే సంస్కృతవాఙ్మయమున నుత్తమకవులుగ నెన్నఁబడుచున్నారు. కాని మనయాంధ్రవాఙ్మయమునందు గద్యకావ్యరచనచేఁ గవులని పేరువడసినవారు లేరు. ఆధునికులలో నయితము కేవల గద్యరచనాసం-గవియశస్సు నార్జించినవారు కానరారు. ఆంధ్రవాఙ్మయమున కాదశ వచ్చియుండలేదని భావింపవలసియున్నదికాని చక్కని గద్యకావ్యములు వ్రాసినవారిటి-కారని పూర్వుల నిందించుట వివేకముగాదు.

ఆంధ్రకవులు గద్యకావ్యములను విరివిగ విరచింపకపోయినను గద్యమునకు లక్షణము మాత్రము చెప్పికొనియే యున్నారు.

క. హృద్యానవద్యకావ్యము
గద్యము పద్య మని చెప్పఁగా ద్వివిధమగున్
గద్యం బపారపదనిక
రద్యోతితనవరసార్థచనల నెగడున్.

అని కవిజనాశ్రయమునఁ జెప్పఁబడియున్నది. మనవా రీలక్షణమును సంస్కృతలాక్షణికుల ననుసరించి చెప్పిరి గాని, వారి లక్ష్యముల ననుసరించి కాదంబరివంటి గ్రంథములను రచించినవారుకారు. పద్యము చెప్పనిది కవికాఁడను మూఢాభిప్రాయము ముదిమఱ్ఱిచెట్టుయొక్క వేఱు భూమియందుంబలె, నిప్పటి మనవారిలో ననేకులమనస్సులయందు దృఢముగా నాటికొనియున్నది. పూర్వులలోఁ గొందఱు దాక్షిణాత్యులు వచనగ్రంథములు వ్రాసిరఁట. వానిని నేను జూచితిని. పరిశీలింప నవి కథాంశములు సులభముగ బోధపడుటకై వ్రాయంబడిన గద్యగ్రంథములుగా నున్నవి. లక్షణములు కాకపోయినను మదన కామరాజుకథలు, కాశీరామేశ్వరమజిలీలు, షట్చక్రవర్తులకథలు, చమత్కార విడికథలు, అక్కచెల్లెంద్రకథలు, పలుకనిపద్మావతికథ, శుకపంచవింశతికథలు, పరమానందయ్యశిష్యులకథలు, కైషేయ్యతులు, పండకవిలెలు మొదలగునవి కూడఁగలవు. మఱియు గొడుగులపదనము, భారతసావిత్రియను నవి కలవు.

భాషాచరిత్రముల పుటలను దిరుగవేసితిమేని నే భాషయందైనను గథాఖ్యానంబులతోడనే గద్యరచన ప్రారంభమైనట్లు తేటపడఁగలదు. 19 వ శతాబ్దమునందును మనగద్యవాఙ్మయ మీ ప్రాథమికావస్థయందే యుండెను. పాశ్చాత్యదేశములందలి కథాఖ్యానరూపంబైన గద్యరచన నుండియే యుత్తమ కవితాధిష్ఠానమై, మానవజీవితప్రతిబింబమై, ప్రాపంచిక ప్రవృత్తియందొక యనల్పశక్తియై పరిణమించిన గద్యరచన యుద్భవిల్లెను. దీనికే నావెల్ రచన యనిపేరు. "నావెల్" అనుదానికి ఫ్రెంచిలాటిను భాషలలో మూలపదములు.

గలవు. వానికి "నూతనముగఁ జెప్పఁబడినవి, క్రొత్తవి" అనియర్థము. "నావెల్" అనునది యిప్పుడింగ్లీషులో విశేషణముగను విశేష్యముగను వాడఁబడుచున్నది. విశేషణమైనప్పుడు "క్రొత్త, విచిత్రమైన" అనియు, విశేష్యమైనప్పుడు "విచిత్రములు మనోహరంబులు నైన కల్పనలుగలిగి మనుష్యజీవితమునకు యథార్థప్రతిబింబము నిచ్చుకల్పిత వచనకావ్యము" అనియు నర్థములను గలిగి యుండును. కొంచెమించుమించుగ నిట్టి రచనలను మన పూర్వులేమైనఁ జేసిరి కేమో చూతము.

బాణాదులు గద్యకావ్యములను రచించిరని యిదివఱకే చెప్పియుంటిని. అపాదపదసంఘాతమని, ఛందోలవవివర్జితమని, లాక్షణికులు గద్యమునకు లక్షణము చెప్పియున్నారు; ముక్తము, వృత్తగంధి, ఉత్కలికాప్రాయము, చూర్ణకమునని గద్యమును నాలుగు విధములుగ విభజించియున్నారు. విశ్వనాథకవి సాహిత్యదర్పణమునందు షష్ఠపరిచ్ఛేదములో

"వృత్తగంధోజ్ఝితం గద్యం ముక్తం వృత్తగంధిచ
భవేదుత్కలికాప్రాయం చూర్ణకంచ చతుర్విధమ్
ఆద్యం సమాసరహితం వృత్తభాగయుతం పరం
అన్యద్దీర్ఘసమాసాఢ్యం తుర్యం చాల్పసమాసకమ్"

అని గద్యకావ్యముల విషయమై చెప్పెను.

"గురుర్వచసి, పృథురురసి"

అను భంగి సమాసరహితమైన గద్యము ముక్తకము.

"సమరకండూలనిబిడభుజదండకుండలీకృతకోదండ
శింజినీటంకారోజ్జాగరితవైరినగర"

అనువిధమున మధ్యమధ్యమున వృత్తభాగముతోఁ గూడుకొనిన గద్యము వృత్తగంధి. ఇందులో "కుండలీకృతకోదండ" యనునది వృత్తభాగము.

"గుణరత్నసాగర, జగదేకసాగర, కామినీమదన, జనరంజన"

అనువిధమున నల్పసమాసయుక్తమైన గద్యము చూర్ణకము.

* "అనిస నిసుమర ణిసిద సరవిసరి విసళిత సమరపరిగప పవరపరబు"

అనుకరణి దీర్ఘసమాసాత్మకమైన గద్య ముత్కలికా ప్రాయము. ఇవి గద్యరచనా భేదములు.

సరసమై మనోహరమైన గద్యకావ్యమునకు మనవారు కథ యని పేరిడిరి. లాక్షణిక మతానుసారముగ నీకథయం దచ్చటచ్చట † వక్త్రాపవక్త్ర కార్యావృత్తము లుండును. అదియందుఁ బద్యములచే భగవత్ప్రార్థనాదులు సల్పఁబడును. వీనియందు సరసమైన వస్తువర్ణన పద్యములచేతనే చేయఁబడును. బొంబాయి నిర్ణయసాగరముద్రాయంత్రములో నచ్చొత్తింపఁబడిన సాహిత్య దర్పణమునందు

"కథాయాం సరసం వస్తు గద్యైరేవ వినిర్మితం,
క్వచిదత్ర భవేదార్యా క్వచిద్వక్త్రాపవక్త్రకే."

అను శ్లోకమున "గద్యైరేవ" యనుట యచ్చుపొరఁబాటని యూహింపవలయును. "పద్యైరేవ" యని సవరించుకొనునది. కథవలెనేయుండి కవివంశానుకీర్తనము నన్యకవులయొక్క వృత్తమును గలిగి యచ్చటచ్చటఁ బద్యములు కలది యాఖ్యాయిక. కథాఖ్యాయికల యంతర్భవము లాఖ్యానాదులు.

కాదంబర్యాదులు కథలు. హర్ష చరిత్రాదు లాఖ్యాయికలు. పంచతంత్రాదు లాఖ్యానములు. కథను గుఱించి బాణుఁడు కాదంబరియందు

శ్లో. స్ఫురత్కలాలాప విలాసకోమలా కరోతిరాగం హృది కౌతుకాధికమ్,
రసేన శయ్యాం స్వయమభ్యుపాగతా కథా జనస్యాభి నవా వధూరివ.

(చంచన్మధుర శబ్దరచనయొక్క విలాసముచేఁ గోమలమైన యభినవ కథ శయ్యను (పదగుంఫనము) స్వయముగఁ బొంది రసముచేఁ బ్రేమచేత శయ్యను (పాన్పు) స్వయముగఁ బొంది ప్రసర్పన్మంద్రవచన వ్యాపార

* అనిశ విస్పృమరనిశిత శరవిసర విదళిత సమరపరిగత ప్రవరపరబు"

† వీనికి లక్షణము వృత్తరత్నాకరమునందు ద్వితీయాశ్వాసమునఁ జూచుకొనునది.

సుందరమైన యభినవవధువువలె, సహృదయ జనుని యాంతఃకరణమునందుఁ గౌతుకపూర్ణమైన రాగమును గలుగఁజేయును.)

అనియును,

శ్లో. హరంతి. కం నోజ్జ్వలదీపకోపమై ర్నవైః పదార్థై రుపపాదితాః కథాః,
నిరంతరశ్లేషఘనా స్సుజాతయో మహాస్రజ శ్చంపకకుట్మలై రివ.

(ఉపమానోపమేయములయొక్క యర్థసామ్యరూపమో శబ్దసామ్యరూపమో యైన శ్లేషచేత బహుతరమైనవియు సుజాతులును (ఛందోవిశేషములు) గలవియు, దీపకోపమాలంకార నూతన పదార్థములచే నుపపాదింపఁ బడినవియునగు కథ లెడతెగనికూర్పుచేత నిబిడములైనవియు, మంచిజాతి పుష్పములు గలవియునై యుజ్జ్వలదీపకతుల్యములైన సంపెగమొగ్గలచేఁ జేయఁబడిన గొప్పహారములవలె, నేమనుజుని సంతోష పెట్టవు? అనఁగా నెవ్వరికి మనోహరములు కావు ?)

అనియు వచించియున్నాఁడు. కావునఁ బాశ్చాత్యుల నావెలను కించుమించుగ సరియైనది కథ యనియే చెప్పవలసి యుండును. ఇకారణమునఁ గాదంబర్యాదులు నవలలే యని తలంపఁ గూడదు.

"శేషాహిరివధరణీభార ధరణక్షమః
సలిలనిధిరివ మహాసత్వః
జరాసంధ ఇవ ఘటితసంధివిగ్రహః
త్ర్యంబక ఇవ ప్రసాధితదుర్గః
యుధిష్ఠిరఇవ ధర్మప్రభవః......
బృహస్పతిరివ సునాసీరస్య
కవిరివ వృషపర్వణః
వసిష్ఠఇవ దశరథస్య
విశ్వామిత్ర ఇవ రామస్య

ధౌమ్యఇవా జాతశత్రోః

దమనకఇవ నలస్య.........

అస్తి, సకలత్రిభువనలలామభూతా, ప్రసవభూమిరివ............

..................................................

..................................................

సురభిమాసమారుతేనైవ సతతదక్షిణేన

హిమగిరికాననేనైవాంతస్సరళేన

లక్ష్మణేనైవ రామారాధననిపుణేన

శత్రుఘ్నేనైవా విస్మృత భరతపరిచయేన

దివసేనైవ మిత్రానువర్తినా

భౌద్ధేనైవ సర్వాస్తివాదశూరేణ

సాంఖ్యాగమేనైవ ప్రధానపురుషోపేతేన

జినధర్మేణైవ జీవాకంపినా విలాసజనేనాధిష్ఠితా

సశైలేవ ప్రసాదైః

సశాఖానగరైవ మహోభవనైః

సకలవృక్షైవ సత్పురుషైః

దర్శితవిశ్వరూపైవ చిత్రభిత్తిభిః

సంధ్యైవ పద్మరాగానురాగిణీ

అమరాధిపమూర్తిరివ మఖశతానలధూమపూతా

పశుపతిలాస్యక్రీడైవ సుధాధవళాట్టహాసా

వృద్ధైవ జాతరూపక్షయా

గరుడమూర్తి రివాచ్యుత స్థితిరమణీయా

ప్రభాతవేళైవ ప్రబుద్ధసర్వలోకా

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

ఉజ్జయినీనామనగరీ."

ఈవాక్యములు కాదంబరిలోనివి. వీనిలోని "అస్తి"కిం బైనున్న "ఇవ" ల నటుంచుదము. "అస్తి" పదమునుండి చివరదాఁక నుజ్జయినీపట్టణవర్ణన చేయఁబడినది. ఈవర్ణనలోని "ఇవ" లను జదువరులు గ్రహించియేయుందురు. ఇవ్విధమున సందర్భములేని యుపమలయొక్కయును శబ్దశ్లేషలయొక్కయుఁ జాబితాలు గొండవీటిచేంతాడులవలె దీర్ఘములైయుండ నేమేమో యల్లికకథలచే నొప్పారుకాదంబర్యాదులు చంకలుతీరిన పాశ్చాత్యుల నవలలవంటివని వచించుటకు వీలులేదు గాని, వానిని బోలుటకుఁ బ్రయత్నించునవి లేక వానికి సమీపములైనవి యనిచెప్పుకొనవచ్చును. ఇంతమాత్రమునచేఁ గాదంబర్యాదుల నిరసించితి ననుదోషము నామీఁద నారోపింపవలదని [illegible]. యని చదువరులను బ్రార్థించుచున్నాను. సత్యము మాత్రము వ్రాక తప్పదుగదా! కాదంబర్యాదులు కథలని నుడివియుంటిమి.

సాధారణముగా మనదేశమునం దిప్పుడు కథాశబ్ద మున్నిటికి వాడఁబడుచున్నది. "చమత్కార విడికథలు, ఇందువదన, సుందరాంగకథ, బాలనాగమ్మకథ, నిజలింగ చిక్కయ్యకథ, బొబ్బిలికథ, హిందూదేశ కథాసంగ్రహము" అని సర్వసామాన్యముగ వ్యవహరింపఁబడుచుండుట సకలజనవిదితము. కావునఁ బూర్వలాక్షణికులచేఁ గథకుఁ జెప్పఁబడిన లక్షణములు విస్మృతములై యవిచారితముగఁ గథాశబ్దము పిట్టకథల పట్టునుండి చరిత్రములవఱకు నుపయోగింపఁబడుచున్నది. గాయకుల దీక్షను హరికథ జంగముల కథలుగూడ సంపూర్ణస్వాతంత్ర్యముతోఁ జేర్చికొనిరి. వీనినన్నిటి విచారింపఁ గథాశబ్దమునకిప్పుడు మనోహరమైన గద్యకావ్య మనునర్థము వ్యవహారములో రూఢముగా లేనట్లు స్పష్టమగుచున్నది. కావున మన ప్రస్తుత లోకోత్తర సరసగద్యకావ్యములకుఁ గథాశబ్దము పనికిరాదని నిశ్చయింపవచ్చును. తగినపదము మఱియొకటి

లేదు. కనుక మనచే నిప్పుడు ఉపయోగింపఁబడుచున్నదియగు "నావెల్" అను పదముయొక్క వికృతియైనదియు నగు "నవల" యనుపదము వాడుటయే సమంజసముగ నున్నది. నవలయను దేశ్యశబ్దము మనకిదివఱకే గలదు. దానికి బడఁతియని యర్థము. ఈ విషయమును పస్త్రీతోఁబోల్చుట మనవారికలవాటు కావునఁ బూర్వులయభిప్రాయానుసారముగ "నవల" యనుపదము తగినదిగనే యున్నట్లు చదువరులు గ్రహింపఁగలరు.

ఈ నవలారచన ప్రారంభమునకు ఇటాలీదేశమునందు జనించిన Bocaccio అనుకవియొక్క లేఖినిచే వర్ధిల్లెను. 16-వ శతాబ్దమున నింగ్లాండునందు Bocaccio, Bandello, Cinthio మొదలగు నిటాలీయను కవుల నవలల నాంగ్లీకరింపఁ బ్రారంభించిరి. అదివఱకాంగ్లేయులు నవలల నెఱుఁగరు. ఇంగ్లాండునందు నాకాలమున నవలారూపమైన గద్యరచనకుఁ బద్యరచనకు నొక విధమైన పోరాటము సంభవించినదని చెప్పవచ్చును. మొదట మొదట బండితబృందముచే నవలలు గౌరవింపఁబడలేదు. 1579-వ సం॥మున జాన్ Lilly యను నతఁడు Euphues అను నవలను బ్రకటించినప్పుడు నవలలను ద్వేషించుచున్న పండితమ్మన్యులందఱు దానినిజూచి తలలూఁచిరి. పిమ్మట Swift, Defoe అనుకవులు ప్రబలినతరువాత నవలారచన పద్యరచనపై విజయము నొందినదని చెప్పఁదగిన స్థితికివచ్చెను. ఇవ్విధమున నీరచన దినదినాభివృద్ధిచెంది చారిత్రకనవలారచనాపితామహుఁడుగ శ్లాఘనీయుండైన స్కాటుచే మహోన్నతపదవికిఁ దేఁబడెను. సెయింట్స్బరి యనునతఁడు తన యాంగ్లభాషాచరిత్రమున నీస్కాటుకవిని గుఱించి యిట్లు నుడివియున్నాఁడు.

"General comment on Scott's novel works can only be presented here in a rigidly limited summary. He created the historical novel after some years of unsuccessful attempt. He first showed how national character, national dialect and national characteristics generally could be made not as drama had already made them implements.

in a burlesque and interlude but a "main colour," and a substantive element in the interest of fiction. He added to the gallery of imaginary personages more and greater figures than had been added by any one except Shakspeare. He did what even Shakspeare had been prevented by his medium of communication from doing with equal fulness. He provided a companion gallery of landscape and interior such as had never been before known. And partly by example and partly by indication and as harbinger, he showed the possibility of kinds of novel quite different from those which he most commonly practised himself. He found the class still half-despised, and very scantily explored, popular but with a sort of underground and illicit popularity. He left it the equal of any literary department in repute, possibility, and he infused into it as Fielding had done before him a tradition of moral and intellectual health, of manliness, of truth, honour, freedom and courtesy which has distinguished the best days of the English novel as it distinguishes those of hardly any other kind.

(స్కాటుకవియొక్క నవలనుగుఱించి న్యాయవిమర్శన మిచ్చుట నతిస్వల్పముగ నుండును. అనేకసంవత్సరములు జరపిన సవిఘ్నప్రారంభముల తరువాత నితఁడు చారిత్రకనవల సృజించెను. జాతీయశీలము, జాతీయసంభాషణ, జాతీయధర్మములు, సాధారణముగ నెట్లు నిర్మింపఁబడఁగలవో యతఁడు ప్రదర్శించెను. ఇవి నాటకప్రవేశక ప్రహసనములందు సాధనములవలెఁగాక కల్పనాప్రాశస్త్యమునకుఁ బ్రధానాంగముగ నుండునట్లతఁ డొనరించెను. షేక్స్పియరు తప్ప నితనివలెఁ గల్పితపాత్రకదంబమునకు లోకోత్తర గుణవత్పూరుషులను జేర్చినకవి మఱియొక్కఁడు లేఁడు. ఒకవిషయమున షేక్స్పియరుకంటె

స్కాటుకవియే యెక్కువ కృతకృత్యుఁడని చెప్పవలసియున్నది. ఏమందు రేని వక్తవ్యమంత షేక్స్పియరు పాత్రముల ముఖమువలననే చెప్పవలసియుండెను. స్కాటునకా నిర్బంధము లేదు. కావున స్వకీయభావములను స్కాటు సంపూర్ణముగ వ్యక్తీకరించెను. ఇతఁడు భవ్యగుణపాత్రములకుఁ దోడు పర్వతములు, పచ్చికబయళ్లు, వనములు మొదలగువానివర్ణన లతిమనోహరముగఁ గావించెను. నాశక్తియం దితని కెవ్వరు నీడు లేరు. గతానుగతికముగఁ దాను ప్రప్రథమమున రచింపఁగడఁగిన నవలలకంటె భిన్నములై యుత్కృష్టములైన వానిని రచించుట కవకాశము కలదని లోకమునకు జూపించిచూపినవాఁ డీ మహానుభావుఁడు. ఇతఁడు కలమెత్తునప్పటికి నవలలు పండితాదరణమును బూర్తిగఁ గలిగియుండినవి కావు. నవలారచన యందు నవకాశము లన్ని కనుఁగొనఁబడలేదు. గుణాగుణవిమర్శనము చేయలేని పామరులకుమాత్ర మవి వినోదకరములుగ నుండెను. ఇట్టి హీనస్థితియం దుండిన నవలల నితఁడు చేకొని ఖ్యాతియందును లాభసాధ్యతలయందును వాఙ్మయముయొక్క యుత్తరశాఖను దీసిపోకుండఁ జేసెను. ఫీల్డింగుమార్గము ననుసరించి నీతి-శౌర్య-సత్య-స్వేచ్ఛావిజ్ఞానసనాతన సంప్రదాయముల నితఁడు నవలలయందుఁ బ్రవేశపెట్టెను. ఉచ్చదశయం దుండిన కాలమున నింగ్లీషు నవలల కివి ప్రధానలక్షణములుగ నుండెను. వాఙ్మయముయొక్క యేశాఖయు నేదశయందు నిట్లు లక్షితము కాలేదు.)

ఇవ్విధమున స్కాటుకవిచే నవలారచన యత్యున్నతదశకుఁ దేఁబడెను. ఇతఁడు నూతనమార్గము చూపినతరువాత ఆస్టెనుదొరసాని (Miss Austen) ఎడ్జివర్తు దొరసాని (Miss Edgeworth) ఫెర్రియరు దొరసాని (Miss Ferrier) గాల్టు (Galt ఐన్సువర్తు (Ainsworth) జేమ్సు(James) లార్డు బేకన్సు ఫీల్డు (Lord Beāconsfield) మొదలగువారును డిక్కన్సు (Dickens) థాకరే (Thackeray)చార్లొటి బ్రాన్టి (Charlotte Bronti) ఆంథోని ట్రొలోపి (Anthony Trolope) జార్జి

ఇల్లియటు (George Elliot) మెడోసుటైలరు (Meadows Tailor) మొదలగువారును హృద్యములైన నవలల వ్రాసిరి.

ఇట్టి గణనీయమై కవితాప్రభాభాసమానమైన యాంగ్లేయ నవలావాఙ్మయమునుజూచియే మన యాంధ్రులు నవలారచనను బ్రారంభించిరి. ప్రప్రథమమున వ్రాయఁబడిన తెలుఁగు నవలలు కథాప్రణాళికయందేమి వర్ణనాంశములయందేమి స్వాభావికములై మనోజ్ఞములుగనే యున్నవి కాని నవలారచన యింకను వృద్ధిచెందవలసియున్నదని చెప్పినచోఁ బ్రాథమికములైన యానవలలకేమియు లోపముకాదని చదువరులు మనమునం దుంచికొనవలెను. తరువాత ననేకులు నవలల వ్రాయమొదలిడిరి. పూర్వమింగ్లండు దేశమునందు వలెనే మనదేశమందు నిప్పుడు నవలలకుఁ బండితగౌరవము తగినంత గానరాదు. తెలుఁగన్నను తెలుఁగుపుస్తకములన్నను తెలుఁగు గ్రంథకర్తలన్నను తృణము కంటెఁ దేలికగఁజూచు కేవలసంస్కృతపండితులును నేవలాంగ్లభాషాపండితులును మన తెనుఁగు నవలలను నిరసించుట యబ్బురముకాదుగదా? మాతృభాషానభిజ్ఞులైన యీమూర్ఖులయజ్ఞానమునకు జాలినొంది వీరిని క్షమింతమను కొనుఁడు. తెలుఁగుకవితలు పచరించుచున్నామని గర్వపడుచు నుభయభాషాప్రవీణుల మని యుబ్బుతలూగు ఘనులుకూడఁగొందఱు నవలలన్న నిరాదరణమే కనఁబఱచుచున్నారే! దీనికి మనము కారణమారయవలసియున్నది. పద్యమువ్రాయనివాఁడు కవికాఁడను దురభిప్రాయమొకటి మనలోఁ జాలమందికి గలదని యిదివఱకే చెప్పితిని. దీనికిఁదోఁడు నవలాప్రాధాన్యమిదియని యెఱుఁగకపోవుట పైనిరాదరణమునకుఁ గారణమై యుండును.

ప్రాథమికనవలాకారులుగాక తరువాత ననేకులు వ్రాయ మొదలిడి రని సూచించియుంటిని. ఆనవల లేలనో గణనీయవాఙ్మయములోఁ జేరకున్నవి. వీనిలోఁ జెక్కు లింగ్లీషు నవలలవలెఁ బ్రకృతికి యథార్థప్రతిబింబములుగా నుండక పాత్రాస్వాభావికశౌర్యధైర్యవర్ణనలు నలౌకిక కథాభాగములు కలిగియున్న వని కొందఱనుమానించుట సత్యమే యనక తప్పదు. ఇంగ్లీషు కవులచే పంక్తులుదీర్పఁ

బడి వర్ధిల్లిన నవలాలతయొక్క లక్షణముల నాంధ్రులు సంపూర్ణముగ నెఱిఁగి యుండమియే దీనికిఁ గారణమైయుండనోవు. ప్రఖ్యాతివహించిన యే యాంగ్లేయ కవియొక్క నవలయైనను దెనిఁగింపఁబడి ప్రసిద్ధముగఁ బ్రచారములో నున్నట్లు కాన్పింపదు. బంగాళీనవలల యాంధ్రీకరణము లధికముగ బయలు వెడలుచున్నవి గాని బంగాళీలకును మనకును మార్గదర్శకులైన యాంగ్లేయకవు లెట్లు నవలల రచించిరో, మనోవికారంబులను మానవ జీవితమును ప్రకృతి సౌందర్యము నెట్లుగవర్ణించిరో, కవిత్వ నెవ్విధమున వ్యక్తీకరించిరో, యాంధ్రులు తెలిసికొనుట యవసరంబని మనకుఁ దోఁపక మానదు. కావుననే సుప్రసిద్ధులగు నాంగ్లేయ నవలాకారులలో నొకఁడైన మెడోసుటైలరు యొక్క నవలను నానీరసవాక్యములతో నాంధ్రీకరించితిని. దానినే ముందునచ్చు పుటల యందుఁ జదువరులు గనుఁగొనఁగలరు. ఈయాంధ్రీకరణముచేతనే తెలుఁగు నవలల కొఱఁత దీఱిన దనుకొనునంత మూఢవిశ్వాసము కలవాఁడను గాను గాని, యాంగ్లేయకవుల మార్గము తెలియనివారికి నిండు చీఁకటిలోనున్న మానసిక సన్నని కిరణనిభాన దీపముచలెనైన నుండఁగలదేమో యను తలంపు మాత్రము కలిగియున్నందుకు విమర్శకులు మన్నింతురు గాక. సన్నని దీప మని న్యూనోపమ నాయాంధ్రీకరణమునందు లోపములుండఁగలవేమో యని చెప్పితిని గాని యాంగ్లేయకవుల రీతినిఁ దెలుపుటకు మెడోసుటైలరుయొక్క రచన చాల పని కాదు. ఈనవల పేరు.

## టిప్పూ సుల్తాన్

ఇయ్యది ప్రాతిపదికము. ఈనవల ఇంగ్లీషుభాషయందు రచించిన కవి టైయులరు. ఆంగ్లేయకవియొక్క చరిత్రము పొందుట కప్రస్తుతముగాఁ దోఁచి నను మనుజునియొక్క చరిత్రము తత్కృతకార్యముల నాదర్శప్రాయము కావున మన యిప్పటినవలకు నతని చరిత్రమునకు నెంతమట్టునకు సంబంధముకలదో తెలిసికొనుటకైనఁ దత్వజిజ్ఞాసువులకుఁ గుతూహల ముండక మానదని యెఱింగి యాతనిని గుఱించి క్లుప్తముగ వివరించుచున్నాఁడ. ఇతఁ డింగ్లాండుదేశములో

లివర్పూలను పట్టణమునందు 1808 వ సంవత్సరము సెప్టెంబరునెల 25 వ తారీఖున జన్మించెను. ఇతని సంపూర్ణమైన నామము ఫిలిప్సు మెడోసు టైలరు. 15 సంవత్సరముల వయస్సున నొక బొంబాయి వర్తకునియొద్ద గుమాస్తాగా నుండుటకై యింగ్లాండునుండి యీతఁడు హిందూదేశమునకుఁ బంపఁబడెను. 1824 వ సంవత్సరమున నితఁడు నైజాము ప్రభుత్వముక్రింద నుద్యోగము సంపాదించెను. నైజాముక్రిందనే పెక్కు సంవత్సరములుండి గొప్పగొప్ప పదవులనంది కార్యములను సామర్థ్యముతో నిర్వహించెను. ఈ సమయముననే యితఁడు దక్షిణ హిందూదేశమందలి యాచారవ్యవహారములను భాషా సంప్రదాయములను జక్కఁగ గ్రహించెను. ఇంతకూలంకషముగ హిందువుల సాంఘిక విషయములను గ్రహించిన విదేశీయ గ్రంథకర్త మఱియొక్కఁడు లేఁడని నుడువ వచ్చును. హిందువులసాంఘిక రహస్యములన్ని యితఁడు గ్రహించెనో లేదో యనువిచారము మన కవసరములేదు. గ్రహించినంతమట్టునకుఁ జక్కఁగ గ్రహించెననిమాత్రము తెలిసికొనవలసియున్నది. ఇతనికి ధర్మశాస్త్రమునందుఁ బ్రవేశముకలదు. మఱియు నితఁడు శిల్పశాస్త్రమునందు ధురీణుఁడు; చిత్రలేఖనమునందు నిపుణుఁడు; సారస్వతమునం దనల్పుఁడు. సెలవుపుచ్చుకొని 1840-వ సంవత్సరమున నింగ్లాండునకుఁ బోయినప్పుడు తన మొదటి నవలయైన "Confessions of a Thug" "థగ్గుయొక్క యొప్పుదలలు" అను దానిని బ్రకటించెను. వెంటనె మన ప్రస్తుత నవలయైన టిప్పుసుల్తానును బ్రకటించెను. పిమ్మట రచింపఁబడిన తార 1863-వ సంవత్సరమునను, రాల్ఫు డార్నెలు (Ralph Darnell) 1865-వ సంవత్సరమునను, సీత 1872-వ సంవత్సరమునను, నోబిలుక్వీను (ఉదారరాజ్ఞి) 1878-వ సంవత్సరమునను బ్రకటింపఁబడినవి. హిందువుల పూర్వపుటేర్పాటులందు నాచారములందును టైలరునకు గౌరవము మెండు. ఇంగ్లాండునుండి హిందూదేశమునకు వచ్చిన తరువాత నితఁడు 1853-వ సంవత్సరమువఱకు "టైమ్సు" అనుపత్రికకు విలేఖరిగనుండెను. "Student's Manual of the History of India

(విద్యార్థిహిందూదేశ చరిత్ర సంగ్రహము) అను చరిత్రమును రచించి 1870-వ సంవత్సరమునఁ బ్రకటించెను. షోరాంపురపు జమీందారు యుక్తవయస్కుఁడు కాక, జమీ దుస్థితిలో నుండ 1850-వ సంవత్సరమునఁ నైజాము ప్రభుత్వమువా రితని నాజమీకిఁ బరిపాలకునిఁగ నియమించిరి. మఱియొక్క యాంగ్లేయుని సహాయ మక్కరలేకయే యితఁ డా చిన్నజమీని మంచిదశకుఁ దెచ్చి రాఁబడి హెచ్చించెను. ప్రజలప్రేమను గౌరవమునకుఁ బాత్రుఁడై యుండుటచేత 1857-వ సంవత్సరపు సిపాయి కలహమునందు నయితమితఁడు సైన్యసహాయమక్కరలేక్కయే స్వస్థానమందు నిర్భయముగ నుండెను. ఆంగ్లేయ ప్రభుత్వమువా రితని సామర్థ్యములను గనిపెట్టి తమకొల్వులో నదివఱకుండక పోయినను (Western Ceded Districts) బడమటి సీడెడు జిల్లాలకు డిప్టీకమీషనరుగ నియోగించిరి. అచ్చటఁ బొలముల శిస్తు క్రమముగ నుండకుంట చూచి ప్రభువులకును బ్రజలకును లాభకరముగ నుండునట్లు శిస్తుపద్ధతి నిర్ణయించెను. 1860-వ సంవత్సరమున నుద్యోగము చాలించుకొని యితఁ డింగ్లాండునకుఁ బోయెను. ఆంగ్లేయ ప్రభుత్వమువా రితనికిఁ బింఛనిచ్చి "సి. యస్. ఐ." (Companion of the Star of India) (హిందూదేశపు నక్షత్రముయొక్క మిత్రుఁడు) అను బిరుదము నొసఁగిరి. 15 సంవత్సరముల లేఁబ్రాయమున, వచ్చి రాని విద్యతో, సహాయహీనుఁడయ్యుఁ, బ్రాపకరహితుఁడయ్యు, స్వగృహమువదలి, పరదేశమునకుం జని, నిరంతరకృషిచే నుద్గ్రిషకర్తయై 50 లక్షల జనసంఖ్యయు 36 వేల చదరపుమైళ్ల వైశాల్యమును గలదేశమును బరిపాలించునంతటి యుచ్చదశకు వచ్చిన యీకర్మయోగి 1876-వ సంవత్సరమున మృతినొందెను. ఈతని చరిత్ర మింతటితో ముగించి ప్రస్తుతాంశమునకు వచ్చెదను.

ఫీల్డింగునవలనో, స్కాటునవలనో యాంధ్రీకరింపక టైలరు నవలను దెలిఁగించు టేలయని ప్రశ్నింపవచ్చును. చాలమట్టునకు మెడోసుటైలరు నవలల యందు హైందవ జీవితము, హైందవాచారములు, హైందవప్రేమ, హైందవ

చరిత్రమును ప్రథానాంశములైయున్నవి. ఇవి హిందువులమైన మనకెక్కుడు హృదయాకర్షకములుగను సంభావ్యములుగను నుండకమానవనియు; మనదేశపుఁ బూర్వాధునిక కవులు వర్ణింపవలసియుండినవి వర్ణించినవి కొంచెము హెచ్చు తక్కువగ నీవిషయములే యగుటచే నొకటే విషయమున మన కవుల వర్ణనలకు నాంగ్లేయకవుల వర్ణనలకుఁ దారతమ్యము చూడవచ్చుననియు మెడోసు టైలరు నవలనే యాంధ్రీకరించితిని.

తారాచంద్రుల ప్రేమను శేషము వేంకటపతి పక్వముకావించిన విధమును సీనవలయందమీనాకాశిమాలుల యనురాగమును మెడోసుటైలరు వృద్ధిపొందించిన రీతికిని స్థూలదృష్టితోఁ జూచినను దారతమ్యము స్ఫుటముగఁ గానవచ్చును. శేషము వేంకటపతి వర్ణించినది ప్రాకృతుల వెఱ్ఱిమోహము. మఱియు నీమోహము నిరంకుశముగ సాగినది. తారాచంద్రుల నిద్దఱను వేంకటపతి నీచపాత్రములుగ వర్ణించెను.

"సీ. చదివెను ఋగ్యజుస్సామాదివేదంబు లధికరించెను చిత్రహాస్యజాత
మభ్యసించెను లక్షణానీకముల నెల్ల నధిగమించెను షడంగాంగములను
బరియించె గాణాదభాష్యమీమాంసలు తెలిసె వ్యాసమతంబు తేటపడఁగ
గ్రహియించె సాంఖ్యయోగముల మర్మములెల్ల నాకళించెను బురాణాదికముల
తే. నేర్చెఁ దర్కముగా దండనీతిశాస్త్ర
మరసె నాట్యంతముగను వైద్యాగమంబు
నెఱిఁగె సాంగధనుర్వేదమెల్ల నపుడు
సోముఁ డుత్కృష్టస్తోమధాముఁడగుచు.
"కవితల్ రచియింపఁగ నేర్చెనంతటన్"
క. అంగనల సౌఖ్యమందుగ, సంగీతము భరతశాస్త్రసరణియు విద్యా
సంగతులకు గంధర్వుల, సంగతి నష్టాటినయ మెసంగఁగ నేర్చెన్.
క. అరువదినాలుగు విద్యలు, నరపతి నరపతి మొగంబులయ్యనుతింపన్
సురగురునికరుణఁ జిరభా, సురగురునిమతిన్ సుబుద్ధి సోముఁడు నేర్చెన్."

అని వేంకటపతి మొదటఁ జంద్రుని వర్ణించెను. ఇంకను నేర్వఁదగిన విద్యలేవైన వేంకటపతి యెఱిఁగియుండినచో నవి యన్నిపాపము! చంద్రుఁడు నేర్చెననియే చెప్పియుండును. ఇన్ని ప్రకృష్ట విద్యలు నేర్చిన చంద్రునియొక్క ఘనత్వము నతని ప్రవర్తనమునం దెచ్చుటను వేంకటపతి కనఁబఱచినవాఁడు కాఁడు.

అయితే వేంకటపతివర్ణించిన తారాచంద్రుల సమావేశమువంటి సమావేశము ప్రపంచమున జరుగదని లోకానుభవముగలవా రెవ్వరును జెప్ప సాహసింపరు. అట్టికార్యములు జరుగుచుండు ననుట నిర్వివాదాంశము. కామోద్రేకంబున నింతకంటె నికృష్టములైన పనులుకూడ జరుగుచున్నవని చదువరులలోఁ జాలమంది వినియేయుందురు. మదనోన్మాదముచే విద్యార్థులయందును మఱి కొందఱియందు నెన్నియో యవాచ్యములైన దురభ్యాసములు ప్రబలియున్నవనుట సర్వజనవిదితమే కదా. ఈనీచకార్యము లన్నిటిని గ్రంథములందు వర్ణించుటమాత్రము గొప్పదోషము. తారాచంద్రుల మైత్రి దుర్నీతికాదనియు వారిద్దఱకును గలిగిన యన్యోన్యప్రేమ యీశ్వర ప్రేరితమనియు నట్టిప్రేమ యనివార్యమనియుఁ గొందఱనవచ్చును. ఆమతము నొప్పుకొన్నను సంభోగమునందలి రహస్యములును గుహ్యమర్దనములును మర్మస్థానములును నుపరతులును రసస్రావాది చిహ్నంబులును కామోద్రేక జనకంబులు గావున వానిని బచ్చిగ వర్ణించుటయైన దోషమునకు తప్పదు. ఈదోషములనే వేంకటపతిమీఁద నారోపించుచున్నాము. వేంకటపతిపక్షము నవలంబించు రసికు లీదోషములను సమాధానము చెప్పవలసియున్నది. నీనరసినగడ్డమునక్కలుపీఁకా—ముసలోఁడ—నీయేటుగాలిపోను—పక్కన—పట్టెకు—ముసలోఁడ—అని ప్రాకృతులు పాడు పదములు దూష్యములని మనమంటిమి నొప్పుకొనువిషయం బేగదా. పైగీతము కొన్నిచోట్ల వెలికిఁ దెలుపకపోయినను గుంటూరు మండలవాసులకు విశ్రుతంబుకావున నేను మధ్యమధ్యమునవిడిచిపెట్టినస్థలములయందలి పదములను వారుపూర్తిచేసికొని దానియోగ్యతాయోగ్యతలను నిర్ణయించికొనఁగలరు. ఈగీత

మేలదూష్యము ? అని విచారింపవలసియున్నది. దానియందలిభావములు సామాన్యజనులకు మన్మథోద్రేకమును గలిగించును. ఆమాటలను బవిత్రప్రవర్తన గల స్త్రీపురుషులు విన నిచ్ఛగింపరు. ఎవ్వఁడును దనభార్యగాని తనసోదరీమణులుగాని తనతల్లిగాని యాగీతమును వినుటకు సహింపఁడు. దానియందలి వర్ణనలు వినునప్పుడు మనస్సులో నీచములైన తలంపులు-వొచ్చును. తారాశశాంక విజయాదులయందలి దోషము నిదియే. ఉన్నది యున్నట్లు వర్ణించుట కవిలక్షణముగదా యని శంకింతురేమో ! వినుఁడు. "చిగురుటాకుల మెక్కి కోయిలలు శ్రావ్యగానములు సల్పుచున్నవి. పండుటాకులు రాలుటచే మహీజాలవాలంబులు వనలక్ష్మియెత్తిన యారతిపళ్లెరములవిధంబున నున్నవి. శబల శుకపికంబులు కిచకిచధ్వనులుసేయుచు వృక్షశాఖలపై నెగురుచున్నవి." అని యున్నది యున్నట్లు వర్ణించిన మనోహరముగ నుండునుగాని "అపానవాయువు వెడలునప్పుడు పుర్రుమని ధ్వనియగును. మూత్రము వడలినచో జలజలఁబోవును. మలవిసర్జనసమయమున నేదో యొకస్థానము విస్తృతమగును" అని చెప్పుట కవిలక్షణ మని యేబుద్ధిమంతుఁడును వచింప సాహసింపఁడుగదా ఈ నవలయం దొకచోట నొకవారవనిత మన్మథరసంబు చెలరేఁగఁబలికె నని మాత్రము వ్రాయఁబడియున్నది. పాత్రము నీచమగుటవలన నంతమట్టునకైన వాక్రువ్వఁబడినదని యెఱుఁగఁదగును. తారాచంద్రుల కుండిన సంబంధమే కొంచెము హెచ్చుతక్కువగ నమీనా కాశిమాలుల కుండినను వేంకటపతివలె మెడోసు టైలరు పాత్రములను నీచస్థితికిఁ దీసికొనిపోయినవాఁడు కాఁడు. వేంకటపతి వర్ణించినప్రకారము చంద్రుని మోహమును, నడపడినిఁజూడఁ జంద్రునియంత యవివేకిలేనట్లు మనకుఁ దోఁచును. మర్మస్థానోపరత్యాదివర్ణనలు లేకపోయినప్పటికిఁ దారాచంద్రుల ప్రేమకంటె నమీనా కాశిమాలుల యనురాగమే యెక్కువగా నుండెనని చదువరులకుఁ దెలియఁగలదు. ప్రేమ యొక్క వికాస మమీనా కాశిమాలులయందే యధికముగ గోచరమగుచుండును. మఱియు వరూధినీప్రవరాఖ్యులకును గుమ్మూబీకాశిమాలులకునుగల పోలికను విమర్శింపవచ్చును. ప్రవరాఖ్యుఁడు వరూధినినివలెఁ గాశిమాలి

కుప్మాబీనిఁ గవయకపోయినను బ్రాంచదూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లుబొంగారఁ గౌఁగిలించిన వరూధినిని బ్రవరాఖ్యుఁడు రెండుమూఁపులను బట్టిత్రోసి పడ నెట్టుటకును, మూర్ఛిల్లినకుప్మాబీని మెల్లఁగఁ బరుండఁ బెట్టి కాశిమాలి యదృశ్యుఁడగుటకును, దారతమ్యము విమర్శకులు కనుఁగొనవచ్చును. ముసలితనమున యువతులఁ బెండ్లాడునతని దుర్దశ ఖానునివలనను, సవతుల యంతఃకలహము లమీనాకుప్మాబీల వలనను, దుర్మార్గుల జయాపజయములు జమాదారునివలనను, వ్యక్తములు కాఁగలవు. ఇంక నిట్టివి చాల నుండినను గ్రంథవిస్తరభీతిచే దిఙ్మాత్రము ముదాహరించితిని.

ఈ గ్రంథము నాంధ్రీకరించుటలో స్వేచ్ఛనుగైకొని యవసర మని తోఁచినపట్టులఁ గథను గ్లుప్తముచేసితిని ; కొన్నిచోటులఁ బెంచితిని ; వర్ణనాంశముల నధికముగఁ జేర్చితిని ; కొన్నిస్థలములయందు రెండధ్యాయముల నొక యధ్యాయముగఁ జేసితిని; మఱి కొన్ని యెడల నొకయధ్యాయమునే రెండుగ విభజించితిని. హర్బర్టునను, హర్బర్టుకాంట ననియు హర్బర్టనియు రెండునామములు గ్రంథకర్త యుపయోగించినను సౌలభ్యముకొఱ కంతట హర్బర్టనియే చెప్పితిని. ఇట్లే హర్బర్టుయొక్క బావమఱఁదులగు ఫెలిప్సుచార్లెసుల పేరులకూడ నంతట నొకవిధముననే ప్రయోగించితిని. చరిత్రాంశములలో నాంగ్లేయుల యుత్కర్షము కనఁబడుచుండుట గ్రంథకర్త యాంగ్లేయుఁడగుటచే నని కొంద ఱనవచ్చునుగాని, చరిత్రఁ దెలిసికొనుటకుఁ బ్రమాణములని చెప్పఁదగిన యాధారములు లభింపకపోవుటచేత నిది యిట్లని నిశ్చయించుటకు వీలులేకున్నది. టిప్పుసుల్తానుఁడు ద్వారమునొద్దఁ బడి మృతినొందిన తరువాతఁ గోట యాంగ్లేయుల యధీనమైనకాలమున, ననఁగా మనకథయందు జరిగిన చివరయుద్ధములో, నుండిన కర్నలు మెకంజీదొరగారి వెంట ఏలూరునివాసి యగు కావలి బోరయ్య యనునాతఁడు పోయియుండి యుద్ధమునంత వర్ణించుచు నొకపద్యకావ్యము రచించె నని దక్షిణాపథకవులచరిత్రము (తెలుఁగుకవులచరిత్రములు కూడఁ గలవు), ప్రథమమున వ్రాసిన కావలి వేంకటస్వామిగారు లిఖించియున్నారు గాని యాపద్యములు దొరకకున్నవి.

సుల్తానుఁడు ప్రజాప్రభుత్వము నంగీకరించుటకై జరపిన హోమకర్మము నందు బరానువా రతని నవమానపఱచి రనియు, సుల్తానుఁడు క్రోధగ్రస్తుఁ డాయె ననియు గ్రంథకర్త వ్రాసెను. నేను దానిని మార్చి కర్మ మనుకూలముగనే జరిగినట్లు లిఖించితిని. కాలాంతరీకరించుటయందు ముక్కకు ముక్క యుండవలసినచోట నట్లును, భావమే ప్రధానముగఁ గొన్నిపట్టులను పొసఁ గించితిని. 48-వ పుటలో "శత్రుచాపప్రక్షిప్తశరంబు లురంబున నాటి జీవంబు కలఁగినప్పుడు" అని హార్బర్టు తనసఖితోఁ జెప్పినట్లు వ్రాసితిని. ఆంగ్లేయు లిప్పుడు చాపము లాయుధములుగ నుపయోగింపరుగదా! హార్బర్టు వాని నేల చెప్పె నని కొందఱు శంకింపవచ్చును. ఇచ్చట హార్బర్టుచేఁ దలఁపఁ బడిన శత్రువులు హిందువులు గనుకను, హిందువుల యాయుధమును గుఱించి యతఁడు పలుమాఱులు వినియుండును గనుకను నవ్విధమునఁ జెప్పెనని యెఱుఁగవలయును. గ్రంథమునం దాంగ్లేయులు, హిందువులు, మహమ్మదీయులు నందఱు తెలుఁగే మాటలాడిరి. వీరికందఱకుఁ దెలుఁగు వచ్చునా? యని విమర్శకులు ప్రశ్నింపరు. రామాయణము, భారతము, శాకుంతలము మొదలగు గ్రంథములు తెలుఁగులోఁ గలవు. రామలక్ష్మణాదులు, ధర్మరాజప్రముఖులును, శకుంతలాదుష్యంతులును దెలుఁగు మాటాడి రని యెంచవచ్చునా! అయితే యొక్కటిమాత్రము మనస్సునం దుంచుకొనవలయును. తెలుఁగే మాతృభాష యైనయెడల నానాపాత్రము లేతీరున మాటలాడుట స్వాభావికమో, యాతీరున మాటలాడినారా లేదా? యని మాత్రము విమర్శకుఁడు పరిశీలింపవలసియుండును. పాత్రముల పేరులను నేను మార్చలేదు. హలంతములైన ఖాన్, నిజామ్, జమాదార్, మదార్ అనుశబ్దములను ఖానుఁడు, ఖాను; నిజాముఁడు, నిజాము; జమాదారుఁడు, జమాదారు; అని ద్వైరూప్యము గ్రహించితిని. తెలుఁగులో వీని ప్రాతిపదికములను హలంతములుగ నజంతములుగ మన పూర్వులు వాడుచున్నారు. ప్రాతిపదికము లజంతము లైనప్పుడు,

"మహతస్సోర్డు జసితో భవేత్ పుంసి"

అను సూత్రముచే "ఖానుఁడు, నిజాముఁడు, జమాదారుఁడు, మదారుఁడు" అను రూపము లేర్పడును. "ఖాన్, నిజాం, జమాదార్, మదార్" అని ప్రాతిపదికములు హలంతములైనప్పుడు

దేహం బేమిటఁ గోటపీడుటలు మా దేహాలతో నొప్పలే
మాహో యిట్టి దురాగ్రహంపుఁబనులేలా ప్రేలఖాన్ సాహెబా !"

అను పద్యమున పిట్టకవినారాయణ "ఖాన్" అని హలంతముగఁ బ్రయోగించెను. ఇంక నిట్టి పనేకములు గలవు.

ఇంతియకాక నే నుపయోగించిన యనుకరణములంగూర్చి కొంత చెప్ప వలసియున్నది. "తళతళ మని మెఱయుచు, ఫెళఫెళని యుఱిమెను, దడదడఁ గొట్టుకొనెను, గిఱ్ఱునఁ దిరిగెను" అని నే నీనవలయందుఁ బ్రయోగములు కావించితిని. నన్నయభట్టు "అఋమాదీనాం ద్విత్వం" అని మాత్రము వచించి యుండెను. అథర్వణాదులును విశేషించి యీవిషయమున వ్రాసినవారు గారు. వ్యవహారమునందును బ్రయోగంబు లందునుగూడ ననుకరణము పెక్కు తెఱం గులఁ గన్పట్టుచున్నది. అనుకరణమునందుఁ బ్రాయికముగ మకారము వచ్చుట గలదు.

ఉ:—తళతళ+అని=తళతళ మని

భారతములో భీష్మపర్వ ద్వితీయాశ్వాసమునందలి

"క. పలుచోటులఁ బలుభంగులఁ, బలుమొన లిమ్మాడ్కిఁ బోరఁ బార్థునిపై న
గ్గలికనడరెఁ దాటి సిడము, తళతళమని మెఱయఁ గురుపితామహుఁడధిపా."

అనుపద్యమున "తళతళమని" అను ప్రయోగము కలదు. శ్రీనాథుఁడు నైషధములో షష్ఠాశ్వాసంబున

"గీ. మిసిమిగల పుల్లపెరుగుతో మిళితములగు
నావపచ్చళ్లు నవిచూచి రాదరమునఁ
జుఱ్ఱుమని మూర్ధములు దాకి యెఱ్ఱదనము
పొగలు వెడలింప నాసికాపుటములందు."

అను పద్యమునందు "చుఱ్ఱుమని" యని మకారమును బ్రయోగించెను. మకారాభావముకూడఁ గాన్పించుచున్నది. అల్లసాని పెద్దన మనుచరిత్రమునఁ జతుర్థాశ్వాసములో

క. నిగిక యిఱుంచెయెత్తివె,సంగోయని యూర్వఁబత్తుసంహతిగాడ్పులీ
సింగని ప్రోయఁగుజాగ్రము, కొంగల నొకలగుడు డిగ్గికొట్టె నిలఁబడన్"

అనుపద్యమున మకారము లేకుండ "సింగని" యని వ్రాసెను. కొన్ని యెడల ద్రుతాగమము కాన్పించుచున్నది. సౌప్తికపర్వ ద్వితీయాశ్వాసమునఁ దిక్కనసోమయాజి

"మ. ధరణీచక్రము విర్దిరందిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె భూ
ధరముల్వెల్లగిలెన్ దిశావలయముత్కంపంబు నొందెన్ దివా
కర చంద్రాగ్నులదీప్తిమానె సురలోకం బాకులంబయ్యె న
ప్పరమేశుం డటు లామహోత్కటతు పరిభ్రంశార్థియై వచ్చినన్"

అనుపద్యమున "విరదిరన్ దిరిగె = విరదిరందిరిగె = విర్దిరందిరిగె" అని ద్రుతసహితముగ ననుకరణము నుపయోగించెను.

పింగళిసూరన ప్రభావతీప్రద్యుమ్న తృతీయాశ్వాసమున

"క. అట్టియెడఁ గట్టెదుర నొక, చెట్టున నురిఁదగులుపడిన చిలుక వెఱపుతో
నిట్టటు ఱెక్కలు తటతటఁ,గొట్టుకొనుచు నెగయఁ బెనఁగఁ గోమలికనియెన్."

అనుపద్యమున "తటతటన్" అని ద్రుతాంతముగఁ బ్రయోగించెను. కొన్నియెడల ద్రుతసహితనాగమప్రాప్తికూడఁ బొడకట్టుచున్నది. శేషము వేంకటపతి తారాశశాంకవిజయమున

"చేరిమాటాడక చెలిగిరుక్కన నేగ మతిచురుక్కనిచాల వెతలఁజెంద"

అను సీసపద్యపాదమందు "గిరుక్కనన్" అని ద్రుతసహితనపర్ణము నుపయోగించెను. దిట్టకవి నారాయణ రంగారాయచరిత్ర తృతీయాశ్వాసమున

"చ. చొఱఁబడివచ్చువారి గుఱిఁజూచుచుఁ గొంకక జేరుగళ్లలో
నురవడి వంచిపట్టి యెడయూదక పైనెలగోలురర్గడీ
యురువడి వెంబడిన్నిలిచి గొర్చుచునేయఁగ మూఁగిపెల్లుగాఁ
బరువడి నొక్కపెట్టునఁ దుపాకులుఘామ్మఘమీఘమీలునన్."

అనుపద్యములో "ఘమీలునన్" అని సద్రుతనకారమును జేర్చి చెప్పెను. మఱియు నల్లసాని పెద్దన మనుచరిత్ర చతుర్థాశ్వాసములో

"గీ. కంపతోడుగీడ్చినట్లేదుగానఁజన్న
తెరువెఱుంగుచు నొకఁడేఁగి పరువుతోనఁ
బడియడఁగి యుండఁగాఁ బటపటన ముండ్లు
గాలిగదలుటఁ గనిపట్ట్ర కోలఁబొడిచె."

అనుపద్యమున "పటపటనన్" అని నుడివెను.

వృత్తియందు స్వత్వరూపము కానవచ్చుటకుఁ బ్రయోగబాహుళ్యంబు కలదు.

"రణితభేరీ ధణంధణం ధణరవంబు" కవిరాజమనోరంజనము.

"గుడిగుడీధూమపాన విఘూర్ణమాన
చకితదృగపాంగు హైదరుజంగుఁ గాంచి" రంగారాయచరిత్రము.

"కుండనీరుముంప ఘుమఘుమ ధ్వనివిని" రామాయణము.

ఇట్టివి లెక్కకు మిక్కిలిగాఁ గలవు. ఈరూపములన్ని వ్యాకరణంబునందుఁ జెప్పఁబడకపోయినను బ్రామాణికకవిప్రయోగసామర్థ్యమువలన సుష్టములు కానివగుచున్నవి కావున నీనవలయందు నాయొనర్చిన "ఘుమఘుమమని, ఫెళఫెళని, దడదడన్, గిఱ్ఱున్న్" మొదలగు ప్రయోగములును సాధువులే యగును. ఇంతియకాక "పట్టుకొనిరమ్ము, గుంజుకొనిరమ్ము" అనుటకుమాఱుగ "పట్టుకరమ్ము, గుంజుకరమ్ము" అని యచ్చటచ్చటఁ బ్రయోగించితిని. వీనికి వ్యాకరణాభయము లేదు. అయినను లాక్షణికుండైన యప్పకవి

"క. పాలును బెరుగును నేయిని, వాలాయంబుట్టెఁ బట్టి వంచుకత్రాగన్
ఈ లెక్కక నీబిడ్డఁడు, జోలెడిదేమమ్మయనఁగ శుద్ధాంధ్రంబుల్".

అనుపద్యమున "వంచుక, ఎక్కుక" యని నుడివినాఁడు. ఆధునికకృతులం దీప్రయోగములు చాల గలవు.

ఇఁక నే నుపయోగించిన ప్రశ్నార్థకములఁగూర్చి కొంత వ్రాయవలసియున్నది. పూర్వగ్రంథములందుఁ బలుచుగ "ఆ" యనునది ప్రశ్న తెలుపవలసినచోటఁ జేర్పఁబడుచుండును. "వాఁడా? వీఁడా? ఇతఁడా?" అను

రూపములందు "ఆ"ను జూడవచ్చును. పూర్వ మొకవస్తువునుగుఱించి విని దానిని జూచినప్పుడు సాధారణముగా "ఇదియేనా" అనిచెప్పుదురుగాని "ఇది యేయా" అని చెప్పరు. "ఇదియేనా సముద్రము? ఇతఁడేనా కృష్ణదేవరాయలు? వీఁడేనా వెంకఁడు?" అని ప్రశ్నింతుముగాని "ఇదియేయా సముద్రము?; ఇతఁడేయా కృష్ణదేవరాయలు?; వీఁడేయా వెంకఁడు" అని ప్రశ్నింపము. ఒకవేళ "ఇదియా సముద్రము?; ఇతఁడా కృష్ణదేవరాయలు?; వీఁడా వెంకడు?" అని చెప్పినను మొదటిప్రశ్నలకు నీప్రశ్నలకుఁ గలభేదము తెలుఁగుదేశములోఁ బుట్టి తెలుఁగు మాటాడ నెఱిఁగినవారి కందఱకు వ్యక్తమగుచునే యుండును. మొదటివిధపుఁ బ్రశ్నలయందుఁ గనఁబడు పృచ్ఛకుని యాసక్తి రెండవవిధపుఁ బ్రశ్నలయందుఁ గానరాదు. "ఇతఁడేనా బలిచక్రవర్తి" అనుకీర్తనమును తఱచుగ వినుచున్నాము. ఈప్రశ్ననే పోతన తనభాగవతమున

"మ. ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాదిది
క్పతిగర్వాపనయప్రవర్తి గతలోభస్ఫూర్తి నానాముఖ
క్రతుదానప్రవణానువర్తి సుమనోరామామనోభేదినో
ద్ధతచంద్రాతపకీర్తి సత్యకరుణాధర్మోల్లసన్మూర్తి దా.న్"

అనుపద్యమున "ఇతఁడే" అని "ఏ" కారముతో మాత్రమే సూచించెను కాని "ఇతఁడేనా" యనినప్పుడే వామనునిభావము స్ఫుటముగఁ బ్రకటితమగుచుండును. మఱియు ఆర్యవ్యవహారానుసారముగ నుండును. ఇతఁడేయా యనుట శ్రుతికటువనియు నితఁడా లేక యితఁడే యనురూపములు సంపూర్ణభావద్యోతకములు కావనియు నీనవలయందు "ఇతఁడేనా? ఇదియేనా?" అని కొన్నిస్థలముల విలిఖించితిని. వీనికి రూపనిష్పత్తి యీక్రిందివిధమున నుండవచ్చును. "ఇతఁడే" యనునది యేవార్థకము. దానికి సముచ్చయము "ను" చేర్చిన "ఇతఁడేను" అని యగును. "ఇతఁడేను" అనఁగా గట్టిగా నితఁడే యని యర్థము. దీనికిఁ బ్రశ్నార్థకసూచకంబైన "ఆ" చేర్చినచో "ఇతఁడేనా" అనురూపము ప్రాప్తించును. ఇట్లే యీనవలయందుఁ గానవచ్చు "చక్కనిదేనా" మొదలగు ప్రయోగములను సాధింపనగును.

**టిప్పు — 0**

"ఆఁ" అని కొన్నిచోట్ల వ్రాసితిని. అనునాసికమైన "ఆ" యని దీనిని గ్రహింపవలయును. ఇదస్మద్వ్యాకరణప్రసిద్ధము. అంగీకారమందును "సరి, ఆఁ" అను నర్థములందును దీనిని మనము వాడుచున్నాము.

"ఏమీ, ఏఁడీ, నరసిగడ్డమూ వాఁడూ, నిన్నకాక మొన్నకాదూ?" అని కొన్ని ప్లుతప్రయోగము లీ నవలయందుఁ గానఁబడును. ఇకారప్లుతమునకు భారతాదిగ్రంథములయందు లక్ష్యములు పలుచోటులఁ గన్పట్టుచునే యున్నవి. భాషానుసారముగ వ్యవహారములో ననుకూలముగ నకారమునకును ఉకారమునకును ప్లుతము చేర్చుట దోషముగానేరదు. సంబోధనమునందు దకారమునకుఁ బ్లుతము "జరత్కారూ మునిశ్రేష్ఠ" యనుచోట నన్నయభట్టు చేర్చియేయున్నాఁడు.

ఇంకఁ దిట్టులను జెప్పునప్పుడు నాయవలంబించిన క్రమమును దెలుపుచున్నాను.

చిన్నయసూరి,

"లాట్టున కెడుతవర్ణంబు ద్రుతాంతములగు"

లాణ్మధ్యమ పురులకు ముఙ్జులగు"

అని సూత్రముల వచించి "నీకు రాక్షసత్త్వంబు గలిగెడును, నీకు రాక్షసత్త్వంబు కలుగుతను, నీవు రాక్షసుఁడవగుము, మీరు రాక్షసుల రగుఁడు" అను నుదాహరణము లిచ్చెను. ఇది సంస్కృతభాష ననుసరించి తెలుఁగునకుఁ దెచ్చి పెట్టిన లక్షణము. తెలుఁగువారు "నీనోటిలో దుమ్ముపడెడును, నీనోటిలో దుమ్ముపడుతను" అని యెప్పుడును దిట్టరు. "నీనోటిలో దుమ్ముపడ, నీమొదలార, నీవుచావ, నీదుంపతెగ, నీకాష్ఠముకాల, నీతల్లికడుపుమాడ, నీయమ్మ కడుపుకాల, నీతల పండుపగుల, నిన్ను మాయగత్తరమ్రింగ, నీత్రాఁడుతెగ" అనియే తిట్టుదుము. ఈశాపములు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లందఱు సాధారణముగ నుపయోగించుచుందురు. తిట్టుట కిదియే తెలుఁగువారి స్వాభావికమైన పద్ధతియైయున్నది. "నీమొదలారుతను, నీకాష్ఠము కాలెడును, నీతల్లి కడుపు మాడెడును" అని శపించుట యెంత హాస్యాస్పదముగ నుండునో చదువరులే యూహింపఁగలరు. పూర్వకవు లెవ్వరును "నీమొదలార, నీదుంప తెగ" అనునట్టిరూపములను వాడలేదే యని సంకోచింపఁబనిలేదు. తెనాలి రామకృష్ణకవివిరచిత చాటువని చెప్పఁబడుచున్న

"చ. తెలియవిపన్ని తప్పులని దిట్టతనాన సభాంతరంబులం
బలుకఁగ రానిరోఁత పలుమాఱు పిశాపుఁబొఁపెట్టి నీ
పలికిననోట నమ్మువడ భాష్యకుఁబుంగవు పెద్దలైననా
రల నిరసింతురా? ప్రగడ రాట్కరసా విరసా తుసా, బుసా."

అనుపద్యమునందు "నోటనమ్మువడ" అను ప్రయోగము కలదు. ఇంత పట్టున విచారించి నేను యీనవలయందు "సిదుంపరెగ, నిస్సిగ్గుచితుక" మొదలగు ప్రయోగములఁ గావించితిని. మఱియును హాపసమణి, పీజులు, ఆగుకత్రె, కిరసని వీనికిఁ బర్యాయపదములు కల్పించుటకంటె సాంకేతార్థములయందు సందర్భోచితముగ వానినే యుపయోగించుట యుక్తమని యెంచితిని.

96-వ పుటలో "పోకతల" అను శబ్దము కానఁగును. ఇచ్చట "తల" యనుపదమునకు సమయమని యర్థము. శబ్దరత్నాకరము చూడుఁడు. నిర్వచనోత్తరరామాయణమున సప్తమాశ్వాసమునందలి తిక్కనయొక్క—

"క. మెలఁగుచెనమెలఁగి క్రమ్మఱు, తలనొక మఱిసెనమఱిచి దాఁటెమొయిం దో
ర్బలము మెఱసి పైఁబడి నా, చలము నెఱసిపోదుమీఁదుఁ జాటిలెఁ జుండీ."

యనుపద్యము నుదాహరించి "క్రమ్మఱుతల" అనఁగాఁ గ్రమ్మఱు సమయమని తద్గ్రంథకర్త లిఖించియున్నాఁడు. ఈ "తల" ధాతువులచేకాక, కృదంతములకుఁగూడఁ జేర్పఁబడుచుండును. "చావుపడలకు లావుసగఖము పోకతల" మొదలగునవి వ్యవహారమునందు రూఢములుగనే యున్నవి, "చావు సమయము, పోవుసమయము" అని వీని కర్థము. ఇవ్విధముననే నవల లక్షణరక్షితములు కాకపోయినను లక్ష్యశరణంబులైన రూపములను భాషారీతి చెడకుండఁ గైకొనిన నాచాపలమును దజ్ఞులు మన్నింతురుగాక. కొన్నియెడల స్వేచ్ఛను గైకొనియుఁ గొన్నియెడఁ గైకొనకయుఁ జాలమట్టునకు మాతృకానుసారంబుగ నవల నాంధ్రీకరించితిని. గుణాగుణవిచారము విద్వాంసులకు వదలిపెట్టుచున్నాను. తప్పొప్పులపట్టికలులేని యచ్చుగ్రంథములు తెలుఁగులో నరుదుగ నున్నవి. కీర్తియుతులైన పుస్తకములలోఁగూడ నచ్చుతప్పులు హెచ్చుగనే యున్నవి. ఈనవలయందలి యచ్చుతప్పులను సాధ్యమయినంతవఱకుఁ

బట్టికలో దిద్దితిని. మిగిలిన వేవైన నున్నచోఁ బండితులు చెప్పినయెడలఁ కృతజ్ఞుఁడనై సవరించికొందును.

కౌశవపలయందు రెండుచిత్రపటములుగలవు. పద్యముల కర్థములు వ్రాయు వ్యాఖ్యాతలకలముకంటెఁ జిత్రలేఖకులకుంచెయే కవుల మనోమార్గము నెక్కువగ వ్యక్తీకరించును. గ్రంథములందు సొంపైన చిత్రపటములఁ జేర్చువాడుక మనకు విస్తారముగ లేదు. బొమ్మల భాగవతము, బొమ్మల భారతము, యవన యామినీవినోదములు మొ॥ గ్రంథములయందుఁ జిత్రపటములు విస్తారముగఁ గలవు గాని యవియన్నియు నచ్చున నొత్తినట్లు కొంచెము హెచ్చుతక్కువగ నొకవిధముననే యుండును. భాగవతుల వేషములును గుజిలీపుస్తకములలోని బొమ్మలు నొకతరగతిలోఁ జేరినవి. పింగళిసూరన ప్రభావతీప్రద్యుమ్నములో

"చ. కలకలనవ్వినట్లు తెరకన్నులనిక్కము చూచినట్లు తోఁ
బలుకఁగడంగినట్లు కడుభావగభీరత లబ్బినట్లు వెం
పొలయఁదనర్చి జీవకళయుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా
చెలువునకాభిముఖ్యము భజింపఁదలంకెను దాను బోఁటిసుమన్."

అని నుడివినభంగిఁ జిత్రపటములు వ్రాయుపాటు మనదేశమున వర్ధిల్లి కవులకుఁ జేవోడుగ వెలయుచునుగాక. చిత్రలేఖనము, కవిత వీనియొక్క పరమార్థమును జనులు గ్రహింపఁగలుగుట నాగరకతాభ్యుదయసూచకం బని చెప్పవచ్చును. చిత్రలేఖనమున కనేకభంగుల మనము ప్రోత్సాహము కలుగఁ జేయవలసియున్నది. కౌశవపలయావలి రెండుపటములలో రెండవది చెన్నపురిలోని యొక ప్రసిద్ధ చిత్రశాలలో వ్రాయఁబడినది. మొదటిది యొక విద్యార్థిచే లిఖింపఁబడినది.

ఈ గ్రంథరచనకుఁ దోడ్పడిన శ్రీమజుందారు రామారావుగారికిని, శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికిని వందనము లాచరించుచున్నాఁడను.

చెన్నపురి.
17-11-12

అక్కిరాజు ఉమాకాన్తమ్.

శ్రీరస్తు

# టిప్పుసుల్తాన్

## మొదటి అధ్యాయము

---

1788-వ సంవత్సరము జూలైమాస మధ్యమున నొక గ్రీష్మ సాయంకాలమం దా జేసేయారూఢుం డగు వృద్ధనాయకునిచే నడపింపఁబడు కొంత జన మదోసిపట్టణమునకు దక్షిణదిశయందు వ్యాప్తంబై యున్న నల్లరేగడ బయళ్లలో నతిప్రయత్నంబునఁ గదలుచుండెను.

ఆగుఱ్ఱము శక్తికలదైనను దూరప్రయాణముచే నలసి మాటిమాటికి బురదగుంటలలో దిగఁబడుచున్న కాళ్లను బీఁకికొనలేక పీఁకికొనుచు శ్రమపడుచుండెను. ఎండవేఁడిమి తగలకుండఁ దలమీఁదను గన్నులమీఁదను గప్పికొనిన పట్టువంటి సన్నని వస్త్రముగుండ వృద్ధనాయకుని యొక్క స్ఫోటకపు మచ్చలుగల నల్లని మొగమును, విశాలములగు కాటుకకన్నులును గనఁబడుచుండెను. అతఁడు ధరించిన స్వాధికార సూచకపటములు బురఁదనీటిచిందులతో నిండియుండెను. అతని భుజముమీఁది బంగారుపట్టియుండి వ్రేలాడుచున్న కత్తి చక్కని సాలువుచే నడుమునకుఁ గట్టిగ బిగింపఁబడి యుండెను. పారసీకదేశపుఁ బనితనముగల పాదరక్షలు పదముల నలంకరించుచుండెను. అందముగఁ జిత్రితమైన జాలు రొమ్ముమీఁదుగఁ దీయఁబడిన వాఱుచే వీపునకుఁ గట్టఁబడి పల్లముయొక్క వెనుకచివరకును వెన్నునకును మధ్యమున నుంటచే నతని కించుమించుగ నానుపీఁటవలె నుండెను.

ఆవిశాలప్రదేశమునందీ యబ్దుల్ రహిమాన్ ఖానుఁడు చూడ్కి కద్భుతము గొల్పుచుండెను. ఇతని విగ్రహముచూచిన మాత్రమున వెంట వచ్చుచున్నవారికి ధైర్యము కలుగుచుండెను. ఆజనసమూహమున నింకను గొందఱు కాయుధధారు లుండిరి. బాట బురదగనుండి సాగకపోవుటచేఁ గొందఱు వెనుకఁబడిరి. కాలుఁగలవారు ముందరుగుచుండిరి. కొందఱు మధ్యమున నుండిరి. ఇట్లు జనమంతయుఁ జెదరియుండెను గాని కలిసియున్నచో గంభీరముగ నుండియుండును. అయిదుగు రాఱుగురు రౌతులు ఖానుని వెన్నంటి వచ్చుచుండిరి. వీరికిఁ గొంచెము వెనుక నొకపాలకీ వచ్చుచుండెను. ఆపల్లకీ బోయీలు పదునాఱుగు రుండినను తడవతడవకుఁ జేతులు మార్చుకొనుచుండిరి. పాలకి వెనుక నుండు బొసటకాండ్రెన్నియుల్లాసపుఁ గేకలు వేసినను దీసిపెట్టినపుడెల్లను నడుగు రొంపిలోఁ దిగఁబడుటవలన బోయీలు కడుఁగష్టముతో మోయుచున్నట్లు కనఁబడుచుండిరి. వీరందఱివెనుక బరువులను మోయలేక మోయుచు నెంత యదలించినను మెల్లఁగ నడచుచుఁ గొన్ని యొంటెలు వచ్చుచుండెను. చిట్టచివర నిద్దఱు సాహిణులు రెండు కులీనములైన గుఱ్ఱముల నడుసు దాఁటించుచు జాగరూకతమై గొనివచ్చుచుండిరి.

“అల్లా! అల్లా! సకల సుఖప్రదమైన మాహైదరాబాదు పట్టణము విడిచి యీయిక్కట్టులమారి త్రోవలోఁ బాధపడవలసివచ్చెఁ గదా! ఈరాత్రి నే నీయడవిలో నుండలేను. ఇంటివద్ద సుఖముగ బ్రతికినవాఁడను. నాగుల మీరాసాహెబూ! ఈయాపదనుండి తప్పింపుము. వాన రాకుండఁ జేయుము. నీ కొకమణుఁగు బెల్లము చదివించెదను. దాదూఖానూ! మన మీదినము మజిలీ చేరు మాట కలదా? ఇక్కడనే సరియా?” అని యొకఁ డనెను. ఇపుఁడు రహిమాన్ ఖానునివంటరి యగుజుల్ఫికారుఁడే. “ఓరిపిఱికిదా! ఏల యిట్లు భయపడెదవు? ఖానుఁడు నీ కొక గుఱ్ఱము నిచ్చియున్నాఁడు. దాని నెక్కి

తిన్నఁగ రాలేవా? ఆఁడుదానివలెఁ గంటనీరు పెట్టుచు నేమేమో మొక్కులు మ్రొక్కెదవు. అమీనా కదోనిలో నుండుట కిష్టము లేకపోవుటవలన ఖానుఁడు పైమజిలీకి బయలుదేరెను. ఖానునిగంజి త్రావుచు నతనిమాట కెదురాడవచ్చునా? ఛా! ఏమి! ఈపాడుముండ్లు. అడుగడుగునకు గ్రుచ్చి కొనుచున్నవి. జుల్ఫా! నీ మోమాటలాడ నుంకించుచున్నావుగాని నీ ప్రేలుడు చాలించి నోరుమూసికొని పద." అని దాదుఖానుఁ డతనిం జూచి పలికెను.

'నోరుమూసికొనియే యుండెదను. ఏమో నోరుండక యనుటయే గాని—మజిలీ చేరు నాశ నాకుఁ గానరాదు. ఈచుట్టుప్రక్కల నున్న యేదో యొక పల్లెకొంపలో నుండవలసి వచ్చునట్లున్నది. అచ్చట నీరాత్రి వేళ మాంసమా మన్నా? ఏమి లేదు. వట్టియన్నము నెండుకొట్టె తిని యుండవలెను. ఈకష్టములన్ని యెందుకు వచ్చినట్లు?" అని జుల్ఫ పలికెను. ఆ మాటలు విని యతని పార్శ్వమున నడచుచున్న యొకఁడు "పొటిమీఁది దేవరకుఁ గూటిమీఁదనే ధ్యాన మనిన ట్లెప్పుడు తిండితిండి యని కలవరించెదవు. కొన్నికొన్నిసమయములయందు రెండు మూఁడురోజు లన్నము లేక యుండవలసివచ్చును. దొరకినప్పుడు రెండు ముద్దలతోఁ దృప్తిచెంది యుండుము. నీవలెనైన మే మేమిచేయఁగలము?" అని యనెను. తలయూఁచి జుల్ఫకాఁడుఁడు "అయ్యా! యిఁకఁ జాలింపుము. నీకుఁ బదివేల సలాములు. నేను పుట్టినది మొదలు పస్తున్నది యెట్టిదో యెఱుఁగను. రంజాను నాఁడు నాఁడ నుపవాస ముండను. నాబదు లొక పకీరును బస్తుంచి వానికిఁ జాల దక్షిణ యిచ్చుచుందును. నేనుమాత్ర ముపవాసము కలలోనైన నెఱుఁగను. భగవంతుఁడా! ఖానుఁడు మంచిమజిలీ చేరున ట్లనుగ్రహింపుము." అని నుడివెను.

ఇంతలో సూర్యుఁడు పశ్చిమాద్రిం జేరె. తదనంతరంబు కొంతవఱకు మసకగ నుండెను గాని రాను రాను బ్రబలాంధకారంబు రోదసీగహ్వరంబు

నందు వ్యాప్తంబయ్యె. దిక్చక్రంబునం దచ్చటచ్చటఁ దటిల్లతావితానంబు సూపట్టఁ దొడఁగె. మేఘనిర్ఘోషంబు లంతటంతటఁ గర్ణగోచరము లగు చుండెను. పోయినకొలఁదిఁ త్రోవ కష్టతరం బగుచుండెను గాని గట్టినేలఁ గానరాదయ్యెను. ఖానుఁడు గుఱ్ఱము నాపి తనలోఁ దా నిట్లు గొణఁగెను. "నే నెంత మూఢుఁడను? ఆదోనిలో నీరాత్రి నిలువవలసియుండెను. కానిమ్ము. జరిగిన దానింగూర్చి చింతించిన ప్రయోజనము లేదు. ముందుఁగాఁ దగిన కార్యము విచారింపవలయును." తరువాత స్వాశ్వమును జూచి "మోతీ! మిక్కిలి యలసితివి. అయినను నీవడి తగ్గలేదు. నీవు నన్నిఁక ముంగొట్టు మోయఁ గలవో కదా" యని మెడను జేతితో దువ్వఁగ నది యజమానుఁడు చెప్పినది గ్రహించినదానివలె మోరయెత్తి సకిలించి నల్దిక్కులఁ జూచెను.

ఖానుఁడు—కనుచూపుమేరలో నెచ్చటను గ్రామ మున్నటాడ కానరాదు. కాని యీప్రాంతముల నెచటనో యొకపల్లె యుండవలయును. ఇబ్రహీం! ఈప్రదేశములన్ని నీవు తిరిగినవే కదా! మన మేదైన నూరి దగ్గఱకు వచ్చుచున్నామా?

ఇబ్రహీము—చిత్తము. ఈత్రోవన నే నెప్పుడు నడచియుండలేదు. ఎప్పుడో పది పండ్రెండు సంవత్సరముల క్రిందట నొకసారి వచ్చితిని. అప్పుడును నేను సేనతో నుండుటవలన బాటను శ్రద్ధతోఁ బరిశీలింపలేదు.

ఖానుఁడు—అయియుండవచ్చును. ఇప్పుడు నీవు పరిశీలింపవలసియున్నది. ఉఱుములు మెఱపులు భయంకరములుగ నున్నవి. అమీనా యొండ కన్నెఱుఁగని యువతి. నా భార్యయైనందువలన నిట్టికష్టముల కలవాటు పడవలసి వచ్చినది.

హరిజనుఁడు—అమీనా పాలకి యల్లదె వచ్చుచున్నది. బోయీలు త్రోవ నెఱుఁగుదు రనుటకు సందియము లేదు.

పల్లకి దాపునకు వచ్చెను. ఖానుఁడు బోయీలవంకఁ జూచి మజిలీని గుఱించియు, రోడ్డును గుఱించియుఁ, బ్రశ్నముమీఁదఁ బ్రశ్నము నూఱు ప్రశ్నముల వేసెను. వారిలో నాయకుఁడు ముందుగఁ జనుదెంచి "అయ్యా! బాట యింతపాడుగ నుండు నని మే మనుకొనలేదు. తెలిసినచో నదోనినుండి మిమ్ము రానిత్తుమా? ఇప్పుడు మాత్రము మునిఁగిపోవున దేమి లేదు. అదిగో నా చేతివంక మిట్టమీఁద నొకయూరు గలదు. చెట్లుకూడఁ గనఁబడు చున్నవి. దానికిఁ గ్రోసెడు నరదూరమున నొక్క పెద్దయూ రున్నది. అక్కడ సేలినవారికిఁ గావలసిన వసతులన్ని సమరఁగలవు. మహాప్రభూ! కష్టను మాచి. చాకిరిముండ కొడుకులము—గొల్లెపిల్ల—మీదయ—" అని యనెను.

ఖానుఁడు—ఒకటికాదు రెండిచ్చెదను. రేపు మిమ్ముఁ గష్టపెట్టను. కొంచెము దూరమే నడుతము. (భార్యం జూచి) అమీనా నీ వేమందువు? నావంటి శూరునిఁ బెండ్లాడుటవలని కష్టములం జూచితివా?

అమీనా—నన్ను గుఱించి మీ రాలోచింపకుఁడు. బోయీలు మీరు కలిసి విచారించి యనుకూలమైన విధమున నొనర్పుఁడు.

ఖానుఁడు—గోపాలూ! నీయభిప్రాయ మేమి?

గోపాలు—ఒక్క గుక్క హుక్కాద్రావి బయలుదేఱుదము. కొంత యాయాసముకూడఁ దీరును.

ఖానుఁడు—కానిండు. కొంచెము సేపు విశ్రమింతము.

అంతట నందఱు హుక్కాపీల్చి బయలుదేఱిరి. కాని నభోమండలంబున మేదురంబుగ మేఘము లొండొంటితో నొరయుచుఁ బరువిడుచుంట చూడరైరి. దిగంతపర్యంతంబు కాఱుగ్రమ్మి కన్ను పొడిచికొనినను గానరాని యంధకార బాహుళ్యంబునందు నిమిష నిమిషమునకు నేత్రంబులు మిఱుమిట్లు గొనునట్లు మెఱయుమెఱపులచేఁ ద్రోవ తటాలునఁ గనఁబడి తిరిగి

యదృశ్యమగుచుండెను. ఖానుఁడు మొగముపై వస్త్రమును దృఢముగ బిగియించి నల్దిక్కులు చూచి 'ఘోరంబైన యీరాత్రి యెట్లు గడచునో తెలియదు' అనియెను. దాదుఖానుఁడు వెనుకనుండి వచ్చి "నే నొక మనవి చేసెదను. ఇదిగో యీమార్గమునకు సమీపమందే చెట్లగుంపొకటి నల్లగఁ గానవచ్చుచున్నది. అచ్చట నొక గ్రామ మున్నట్లు నాకు జ్ఞాపకముకలదు. దేవరవా రచటికి దయచేయుదురా?" యని విన్నవించెను. "మంచిది అచ్చటికే దారితీయుము" అని ఖానుఁడు వాక్రుచ్చెను. వీ రిట్లు మాటలాడుచునే యుండిరి. చుట్టుప్రక్కలనున్న భౌతికప్రపంచంబంత సుషుప్త్యవస్థా సంకలితంబైనదో యన నిశ్శబ్దముగ నుండెను. వాయువు నిజసంచారము నుపసంహరించెను. వృక్షాగ్రములయందున్న పర్ణములు సహితము నిశ్చలములై యుండెను. "అల్లా, అల్లా, ప్రాణ ముడ్డుకుడుచున్నది. గాలియాడుట లేదు." అని జుల్ఫు రుమాలుతో విసరుకొనెను. "గాలియా? వచ్చుచున్నది. యుండుము" అని యొకఁ డనెను. "అబ్బబ్బ! కర్ణాటదేశపు గాలివానలు ప్రసిద్ధములైనవి" అని మఱియొకఁడు గుండె గుద్దికొనెను. "అయ్యయ్యో! హైదరాబాదు విడిచి వీరివెంట నేల వచ్చితి" నని జుల్ఫు నిట్టూర్పు విడిచెను. వేగముగ వచ్చుచున్న జలప్రవాహధ్వనిపంటి శబ్దము వారికిఁ గర్ణగోచరమయ్యెను. అంతట శీఘ్రముగ నడువ మొదలిడిరి. - "ఆచెట్లసమీపమునకు వైళంబ చేరిన మేలుగనుండును" అని ఖానుఁడు పలికెఁగాని రానున్న గాలివానను గుఱించి చింతించుచు నతని మాటలకుఁ బ్రత్యుత్తర మెవ్వరు నీరైరి. అల్లనల్లన వృక్షములు కదల మొదలిడెను. జీర్ణపర్ణములు గాలిలోలేచి తిరుగాడుచుండెను. ఒక దానివెంట మఱియొకటి దుమారములు మెండయ్యెను. ఆతైక్ష్ణ్యము కొంతసే పుండి తగ్గునని వా రనుకొనిరి గాని, నిమిష నిమిషమునకు హెచ్చుచునే యుండెను. వాయుధ్వనికిఁ దోడు మేఘముకూడ గర్జిల్లసాగెను. ఆయాఉరుములను మెఱపులకుఁ దాళలేక యమీనా యాక్రందనము చేయుచుండెను. ఖానుఁడు

బోయీలను దొందఱపఱచెంగాని మజిలీ చాలదూర ముండెను. ఉన్నట్టుండి యాకస్మికముగఁ గన్నులు మిఱుమిట్లుగొని యెచ్చటివా రచ్చట నిశ్చేష్టితులుకాఁ దళుక్కున నత్యద్భుతమగు నొక్క మెఱపు మెఱసెను. వెంటనే దుస్సహమయి మహావృక్షముల సయితము పెకలింపఁజాలిన పెద్దగాలి వీచెను. గాలిదెబ్బ కాగలేక పాలకి క్రిందఁ బడెను. తెఱచినమాత్రన నోటి నిండ దుమ్ము వడు ననుభీతిచే నెవరును బెదవి కదల్పరైరి. ఒంటెలు, గుఱ్ఱములు స్వాభావికజ్ఞానముచేఁ బుచ్ఛభాగంబులు గాలివైపునకుఁ ద్రిప్పి నిల్చుండెను. మొట్టమొదట నొక్కొక చినుకు పడుటఁ బ్రారంభించెను. రెండుమూఁడు నిమిషములలోఁ జినుకులు మెండై మిన్నుమ న్నేకమగున ట్లఖండమైన కుంభవర్షము కురిసి వారినిఁ దడిపి ముద్దచేసెను.

మేఘనిర్ఘోషంబులు క్షణవిరామమైన లేక నిరంతర గర్జనముండెను. కడవలతో ముంచిపోసినట్లు వర్షము, కన్నులు మూఁతలుపడు మెఱపులు, చెవులు బ్రద్దలగు నుఱుములు—ఆనాఁటిరాత్రి వారిస్థితి నే మని చెప్ప వలయును? ధైర్యస్థైర్యమంథాద్రియైన ఖానుని గుండెగూడఁ జెదరినది. రెండు గంటలకాలము గడచిన తరువాత వాన తగ్గుడుఁ దిరిగి బయలుదేఱిరి. అప్పుడు, ఇబ్రహీమేఁడీ" యని యొకఁ డనెను. 'ఏఁడీ' యని యందఱు నఱచిరి. "ఇబ్రహీ మేమాయెను? మీలో నొకరుపోయి యటునిటుఁ జూడుఁడు." అని ఖానుఁడు వాక్రుచ్చెను. తదాజ్ఞ ననుసరించి యొకఁ డా త్రోవప్రక్కకేగి యచ్చటఁ బడియున్న గుఱ్ఱమును మనుష్యునిఁ జూచి యఱవఁగ ఖానుఁడు పోయి యాతనిఁ గదలించెను. ప్రాణములేదు. పాపము! పిడుగుపడి గుఱ్ఱముతోఁగూడ మృతినొందెను. "మన మేమి చేయఁగలము. ఎంతకష్టపు దినము. ఆపిడుగు మనమీఁదఁ బడిన నేమయియుండెడిదో! భగవంతుఁ డతనికిఁ జావిచ్చట వ్రాసిపెట్టెను గాఁబోలును? తప్పింప నెవఁడివశము? ఎచ్చటఁ బుట్టెనో? ఎచ్చటఁ జెరిగెనో? గడియను వచ్చునది తెలియదు" అని ఖానుఁడు దీనముగఁ బలికెను.

వాన వెలిసినది కాని తమంబు విరిసినది కాదు. మార్గోపాంత పల్వలానీకంబులందు భేకీభేకనినాదంబులు హెచ్చెను. శీతానిలంబు సేవిష్ఠ విటపివిటపాంతరంబుల ఝంకార మొనర్చుచుండెను. జలప్రవాహానీత కంటకంబు లధ్వగులకు దుస్సహబాధాకరములై యుండెను. శకుంతసంతానంబులు పక్షంబుల విదుల్చుకొనుచు నికుంజంబులఁ గలకల నిస్వనంబులు గావించుచుండెను. విహాయసంబున మేఘంబులు వెల్లనై నలుదిక్కులకు నతివేగంబునఁ జనుచుండెను. కీటక విశేషంబులు శ్రోత్రపుటంబులు దిమ్మువట్ట నిరంతరముగఁ గీచురవంబులు సేయ మొదలిడెను. ఖానాదులకు సంభవించిన యాపదకుఁ బ్రకృతి కన్నీరు విడుచుచున్నదో యనఁ బర్ణాగ్రములనుండి జలబిందువులు జారుచుండెను. ఆర్ద్రవస్త్రపీడితులై జనులు కంపిల్లుచుండిరి. అడుగడుగునకు బురద యంటికొనుచుండ నడచుచు నాలుగు పూరిగొంపలుగల చిన్న గ్రామముం జేరిరి; కాని యచ్చట భోజనమునకేని, యారాత్రి గడపించుకొనుటకేని, వీలు లేకుండుటచే నాయూరినుండి యొకమనుష్యునిఁ ద్రోవ చూపుటకై వెంటఁబెట్టుకొని ఖానుఁడు మరల బయలుదేరెను. మజిలీ యింకను క్రోసెడుదూర ముండెను. కొంతదూరము నడచిన తరువాత మిణుగు మిణుగుమని కనుచూపుమేరలో నొకదీప మగపడి యదృశ్యమయ్యెను. అది కొఱవి దయ్యమేమో యని కొందఱు భయపడిరిగాని ధైర్యశాలుర వాక్యములవలన గుండె తెచ్చుకొనిరి.

ఖానుఁడు:— (వెంటవచ్చినవానితో) ఏమిరా? ఇంక నెంతదూరము పోవలెను?

మనుష్యుఁడు:—ఎంతదూరము లేదు. ఒకపరు గుండి లేనట్లు—మనకు ముందొక యేఱు తగులును. దాని యావలి యొడ్డుననే గ్రామము గలదు.

ఖానుఁడు:—అయినచో నది యీరాత్రి వర్షమునకు నిండియుండును. మమ్ము నీమార్గమున నేల తెచ్చితివి. నీప్రాణము తీసెదను జూడు.

మనుష్యుఁడు:—అయ్యా నా బ్రతుకు మీచేతిలో నున్నది. ఇంతకంటె మంచి మార్గము లేదు. అయినను నీయేఱు లోఁతైనది గాదు. సులభముగ దాఁటవచ్చును.

ఇబ్బంగి మాటలాడుకొనుచు నందఱు నేటియొడ్డునకు వచ్చిరి. వెంట వచ్చిన మనుష్యుఁడును దాదుఖానుఁడును ముందు నీటిలోనికి దిగి యవతలి తీరమునకుఁ జేరిరి. ఖానుఁడు భార్యను గుఱ్ఱముమీఁద నెక్కించికొనవలయు నని చూచెఁగాని యామె పల్లకినుండి దిగుట కిష్టపడలేదు. కాఁగడాలు వెలిఁగించి యందఱు నేఱుదాఁటుటకు సంసిద్ధులైరి. బోయీలు పాలకి నెత్తికొని "జైభవాని" యనియఱచి నదిలోనికి దిగిరి. ఖానుఁడు గుఱ్ఱమెక్కి పల్లకీవెంట బయలుదేఱెను. నీళ్లు బోయీలభుజములవఱకువచ్చి పల్యంకికం దాఁకుచుండెను. ఆసమయమున నేటుపోటు నెటువచ్చునోయని గుండె కొట్టికొననివాఁడు లేఁడు. ఒకరి నొకరు హెచ్చరించుకొనుచు బోయీ లొక గజము దూరము నడచిన తరువాత నీటిలోఁ దధికమయ్యెను. జీవనము కంఠగతమాయెను. జాగరూకతతో నడుగిడుచుండిరి. కాని నీటిక్రింద నేమున్నది యెవరెఱుఁగుదురు? మొదటిబోయి జలాధోభాగంబుననున్న యెత్తయినరాతిమీఁదఁ గాలుపెట్టెను. అది మొట్టమొదలడుగిడి యదిమి నప్పుడు గట్టిగనుండెఁగాని ముందుకాలుదీసి వెనుకకాలు పెట్టఁబోవునప్పటికి దొరలి పాదమునకుఁ బట్టుచిక్కక యతఁడు తలక్రిందుగఁ బడెను. ప్రక్కన బోయీలు పాలకిఁబట్టఁ జాలకపోయిరి. చివరకది నీటిలోఁ బడెను. ఖానుఁ డీవిపత్తుచూచి యల్లాయల్లాయని యఱచి గుఱ్ఱముమీఁదినుండి దుమికి భార్యను లేవఁదీయఁబోయెను గాని తానే మునిఁగిపోవుటకు సిద్ధుఁడయ్యెను. పరిజనులలోఁ గొందఱతనిని దిన్నఁగ నొడ్డునకుఁ జేర్చిరి.

## రెండవ యధ్యాయము

ఆకలవరము వర్ణనాతీతము. ఎల్లెడ నాక్రందనధ్వనులు మెండయ్యెను. అన్యోన్యామంత్రణారావంబులు మిన్నుముట్టెను. గుజ్జముల సకిలింతలు తఱచయ్యెను. ఒకయువజనుఁ డతిశీఘ్రముగ వచ్చి నదిలోనికి నిర్భయముగఁ జొచ్చెను. అయ్యో చచ్చెఁ జచ్చె నని యంపఱు కేకలువేసిరి. నీటిలోఁబడి మృతినొందుటకు సిద్ధముగనున్న యమీనాను బయటికిఁదీసి యామెదేహము నిండ గుడ్డకప్పి "అదేమి యదేమి" యని యడుగుచుండిన జనసమూహపు మాటల లక్ష్యపెట్టక యామెను దీసికొని శీఘ్రముగ నిల్లుసేరెను.

తల్లి యతనింజూచి "నాయనా! మోసికొనివచ్చితి వెవరిని?"
'అమ్మా యొకసుందరినిఁ దెచ్చినాఁడ' నని యతఁడు బదులుచెప్పెను. "ఎచ్చటఁ దెచ్చితివి. ఏదీ? తడిసియున్నదే" యని తల్లి యడిగెను. "అమ్మా యీమె ఖానునిభార్య. నీటిలోఁబడి కొట్టికొని పోవుచుండఁగాఁ బట్టికొనివచ్చినాఁడను. దేహ మింకను వెచ్చగనున్నది. చచ్చినట్లు కనఁబడదు. నీవు చేయఁగల సహాయము చేయుము." అని కాశిమాలి చెప్పెను.

అమీనా నామె మక్కువతోఁ జూచుచు వలసినయుపచారములు సలుపుచుండెను. ఖానుఁ డూరిచావడిలోనికి జేర్చఁబడి కొంతసేపటికిఁ దెలివిగా భార్యనుగూర్చి విలపించుచుండెను. ప్రాణవల్లభా! వియోగజాయమాన దుస్సహదుఃఖాక్రాంతుఁడైన ఖానుని కమీనా జీవించి యున్నదనుమాట లమృతతుల్యములుగ వినఁబడియెను. శుభవార్తను దెచ్చిన కాశిమాలినిఁ జూచి ఖానుఁడు "నిజము చెప్పుము. చింతతోఁ గృశించుచున్న నన్ను నీవు పరిహసించుచున్నట్లగపడుచున్నది. అమీనా నదిలోఁ బడి పోయెను. భీకరకల్లోలజలప్రవాహ నిమగ్నయైనప్పుడే నిరాశచేసికొంటిని." అని యనెను.

"తమనా పరిహసించుట? నిజముగ నామెను నీటిలోనుండి బయటికిఁ దీసినాఁడను. మా తల్లి యామె కుపచారము సల్పుచున్నది." అని గట్టిగఁ జెప్పి ఖానుని వెంటఁ బెట్టుకొని కాశీమాలి నిజగృహముం జేరి తగినగదిలోఁ దివాసి పఱచి దానిపై నుచితవస్త్రంబుల నమర్చి యతని నచట విశ్రమింపఁ జేసి తాను శయనమందిరమునకుఁ బోయెను. నీటిలోనుండి తీసినది మొదలు కాశీమాలియొక్క తలంపు లన్నియు నమీనామీఁదనే యుండెను. ఎంత ప్రయత్నముచేసినను గాశీమాలి కంటికి నిద్దుర పట్టదాయెను. కనులు మూసికొనినప్పుడెల్ల నీటిలోఁబడ్డ యమీనా, వెలుఁగుచుండిన కాగడాలు, కేకలు వేయుజనులు నతని మనస్సునకుఁ జిత్రరూపములుగఁ గన్పట్టుచుండెను. ఆసమయమున నమీనా పరుండియున్నగదినుండి యొకకోమలస్వరము వినఁబడెను. ఆమృదుకంఠధ్వని యమీనాదే యని యతఁ డూహించి యాగదియొక్క ద్వారప్రదేశముచేరి యతిసంభ్రమముతో వినఁజొచ్చెను. ఈ క్రింది వాక్యము లాతనికర్ణగోచరము లయ్యెను. "నాచిన్నతనమందు నన్నొకరి కిత్తురని రోళ్ళరోకండ్లఁ బాడిరి. కాని వివాహము కాకపూర్వమే యతఁడు మృతినొందెను. అప్పటినుండి యెన్నియో గొప్ప సంబంధములు వచ్చినవి. మావాండ్రు దేనికి నిష్టపడలేదు. చిట్టచివరకు మైసూరిలోఁ బెద్ద యుద్యోగము చేయుచున్నవీరు నన్నుగుఱించి (చక్కదనమును గూర్చి) విని వివాహమాడ నిచ్చగించి మాతండ్రి నడిగిరి. ఆయన సంతోషించి నన్నియ నొప్పుకొనెను. పెండ్లి వైభవముతో జరిగినది. నాకు సొమ్ము చాల పెట్టిరి. నా కొసంగిన చీరలు వెలగలవి. వీరు టిప్పుసుల్తానునివద్దఁ గొలువులో నున్నారు. అచ్చటికే నన్నిప్పుడు తీసికొనిపోవుచున్నారు."

ఈవాక్యముల తరువాత నొకనిట్టూర్పును గాశీమాలి విని యమీనా యసంతుష్టితో నున్నదని తలఁచి యింక నేమిచెప్పునో యను కుతూహలముతో దత్తావధానుఁడై యుండఁ దనతల్లికి నమీనాకు జరిగిన యీసంభాషణము వినవచ్చెను.

అవ్వ—అమ్మా ఏల నిట్టూర్పు విడిచితి? నీ కేమికష్టము? సుఖపడెదవుగదా. నీపుణ్యమువలన నట్టి పురుషుఁడు దొరకినాఁడు.

అమీనా—అయ్యో దుఃఖము కాకేమి? మాయమ్మను నన్నలఁ దమ్ముల మీఁదుమిక్కిలి మాయింటినిఁ దలఁచుకొనినప్పుడెల్ల, నేమో పాఱవేసి కొనినట్లుండును. దేశము కానిదేశము పోవుచుంటిని. అక్కడ "నావారు తనవారు" అనుకొనువారు లేరుగద! ఎన్నియైన నున్న యూరు కన్నతల్లి యగునా?

అవ్వ—దిగులుపడఁగూడదు. నీపెనిమిటితో నింపునుక మాటలాడితిని. ఆయన నీమీఁదఁ బంచప్రాణములు విడుచుచుండును. ముసలివాఁడు గుదుక వాఁడు కాఁడు. నడివయస్సులో నున్నాఁడు. నీకేమి? అదృష్టవంతురాలవు. ముందెంతయో సంసారముచేసి సుఖపడవలసినదానవు. శీఘ్రమె బిడ్డల తల్లివయి నిండ నూ ఱేండ్లాయుష్షు కలిగి వర్ధిల్లునట్లు దేవుఁడు నిన్ననుగ్రహించును.

అమీనా—మావారితో మాటలాడితివా!

అవ్వ—నీవు నిద్రపోవునపుడు మాటలాడితిని. ఆయన కేలోపమును లేదు. నిక్షేపమువలె నడివయసులో నున్నాఁడు.

అమీనా—(మెల్లఁగ) కాదవ్వ..చిన్నవాఁడు కాఁడు. ఏండ్లు ముదిరినవి.

తరువాతఁ గాశిమాలి యచ్చటఁ జాలసేపు కూర్చుండెను గాని, యేమియు వినినవాఁడు కాఁడు. అతఁడు శయనగృహమునకుఁ బోయి పఱుపుపైఁ బరుండెను గాని, కూర్కురాక ఖానుఁడు నిద్రించుచుండిన చోటికిఁ జని, యచ్చటను గాలు నిలువక బయటితలుపు తెఱచి వీథిలోనికిఁ బోయెను.



# మూఁడవ యధ్యాయము

అప్పటి కర్ధరాత్రమైనది. గాలివాన తగ్గెను. మేఘములు చెదరి పోయినవి. ఆకాశము నిర్మల మయ్యెను. చంద్రుఁడు పిండియాఱఁ బోసినట్లు వెన్నెల కాయుచుండెను. ఇంటిముంగిట మిక్కిలియెత్తుగ నున్న తాటిచెట్టు క్రింద నంతట—గడ్డి, గాదము, రాలు—ఎవరికిదొరకినవి వారు తలగడలుగఁ జేసికొని ఖానుని పరిజనులంతయు నిద్రించుచుండిరి. వెన్నెలలో నొక గడ్డి కుప్పచుట్టు నొంటెలు పరుండి వాని దీర్ఘకంఠములు చాచి యప్పుడప్పుడు గడ్డికుప్పలలో నిష్టమైన పోచలను నాలుకతో నందుకొనుచుండెను. చరాచర ప్రపంచమంతయు నిద్రావివశమైయున్నదే మోయన నిశ్శబ్దముగ నుండెను గాని యెడనెడనొంటెల మెడలందుగల చిఱుగంటల ధ్వనులుమాత్రము వినవచ్చు చుండెను. వానకురిసి యప్పుడే వెలిసినది గనుకఁ బూర్వోదాహృతంబగు తాళవృక్షపుఁ బర్ణములపైనిల్చిన నీటికణములయందుఁ జంద్రకిరణంబులు పడి తళతళ మెఱయుచుండెను. ఏతాదృశస్వాభావిక ప్రదర్శనంబు క్రూరకిరాతుల చిత్తమును సైత మాకర్షించును; నాసద్వంశమునందు జనించి ప్రకృతిచే దయార్ద్రహృదయుండైన కాశిమాలికి మనోరంజకముగ నుండు నని వేఱుగ వచింపనేల ?

కాశిమాలి సయ్యదు తెగవాఁడు. ఇతని తండ్రి పేరు నాజరుద్దీను. నాజరుద్దీను నైజామునొద్ద నుద్యోగముచేసి ధనాధికారగౌరవముల నధికముగ సంపాదించినవాఁడు. మఱియు బీజపూరు నబాబులకును, విజయనగర రాజులకును, జరిగినయుద్ధములలో నబాబుల కితఁడు శక్తివంచనలేక సహాయ మొనర్చెను. వా రొకజాగీరుకూడ నితని కొసంగిరి. ఇతఁడు కొలఁదికాలము క్రిందటనే మృతినొందినందునఁ గాశిమాలి యొంటరియాయెను. ఆయన యసంప్రాప్తాధికారుఁడయ్యు వంశముయొక్క వెనుకటివాసిచే స్వగ్రామము నందు నిరుగు పొరుగూళ్లయందును జనుల గౌరవమునకుఁ బాత్రుఁడుగ నుండెను. జయ

కాంక్షావేశులయి విజృంభించుచున్న మహారాష్ట్రులొక ప్రక్కను, యుద్ధరంగముల మాటిమాటికిఁ బరాజితుఁడయ్యు ధైర్యచ్యుతిలేక పెనఁగులాడు నిజాముఁ డొకవంకను, మూఁకలఁ గూర్చికొని స్వల్పస్థితినుండి రాజపదవికి వచ్చి మైసూరుదేశం బాలవాలంబుగ యశోలతను వర్ధిల్లఁజేసిన హైదరాలి కుమారుఁడగు టిప్పుసుల్తానుఁడు మఱియొక వైపునను, వీరనాట్యంబులు సలుపు నిక్కాలమునఁ నితఁడు తన శౌర్యపరాక్రమములు ప్రకటించి యుచ్చదశకు రాఁగలఁ డని యందఱు ననుకొనుచుండిరి.

ఇతఁడు పారసీభాషయం దసాధారణ పాండిత్యము గలవాఁడు. వైదుష్యమహిమవలననో, ప్రాకృతజన వచోగోచరణనో, భరతఖండము వంటి యుష్ణప్రదేశమున నివసించుటవలన స్వాభావికంబుగఁ గలుగు విరాగమనోవికారంబుననో, యతనికిఁ బౌరుషముకంటె దైవమె బలవత్తర మని నమ్మిక గలిగి, యుద్యోగాపేక్ష నిజగ్రామము విడిచిపోవలయు నను సంభ్రమము లేక సాటివారిలో నెవరికూఁతునైన నా ప్రాణముండఁగనే పెండ్లాడుమని తల్లి యెంత బతిమాలినను దేవుఁ డెప్పుడు నిర్ణయించెనో యప్పుడు ప్రయత్నముగఁ గాఁగలదు. మనము త్వరపడుట యేల? దైవము తప్పఁ జూచిన మనయత్నములన్ని నీటివ్రాలగును. అని ప్రత్యుత్తరము చెప్పుచుండెడువాఁడు.

కాశీమాలివర్ణన మిఁకఁ జాలించి కథాసందర్భమునకు వత్తము. ఇతఁ డానఁడు రాత్రియందు వీథిలోఁ బ్రవేశించె నని యిదివఱకుఁ జెప్పియుంటిమి. కౌముదీ నిరంతరావకాశంబు తిలకించి తిలకించి మన్మథాగ్ని మనంబునం దరికొనఁ గాశీమాలి "ఆహా! కాగడాలవెలుతురునఁ జూచిన యాపె సుందర వదనారవిందంబు నిమీలితనేత్రంబయ్యు నసదృశ మనోహరంబై నా కనుల మెదలుచున్నవి. నదీసముత్థితయైన యాయువతి తడివెండ్రుకల నాపిడికిటఁ బిండినప్పటినుండియు నవి తుమ్మెదరెక్కలవలె నల్లగ బొండు

పొడుగునఁ బట్టుకుచ్చుమాడ్కి మెత్తగనుండి లోహము నయ
బోలె సాహ్లాదయము నాకర్షించుచున్నవి. ఆనితంబినీమ——
తిలకించిన క్షణంబుననే నా మన స్సాపెయందు లగ్నమైనది. ఆజవరాలును
నేను గరంబులు భుజంబులమీఁదుగ నురంబులఁ బడున ట్లిడుకొని
యన్యోన్యచుంబనంబులును సంభ్రమప్రేరితగాఢపరిష్వంగములును సరస
సల్లాపంబులును సలుపుచు, నిట్టి పండువెన్నెలయందు విహరించు టెన్నఁ
డబ్బునో! కాంతాతిలకమా ! కనులు విచ్చి భవత్కటాక్షవీక్షణ సూచితాను
రాగ రసబిందువులు నీవు నాపయిం జిలుకు టెన్నఁడు ? నారీరత్నమా !
అధరబింబంబు నల్లనఁ గదలిచి యవ్యక్త మధురధ్వనుల మచ్ఛ్రోత్రపర్వంబు
సేయు టెన్నఁడు ? వనజాయతాక్షీ ! పదియారు వన్నెయ బంగారురీతి
మిసమిస లాడుచున్న నీతనూలత నా కౌఁగిటఁ జేర్చి ఘనసారంబుచేతను
జంటనగంధంబుచేతను నవకోమల కుసుమంబులచేతను సుకుమార మృణాళంబుల
చేతను హిమకణంబులచేతను రాకాచంద్రికలచేతను బొంద శక్యముగాని
స్పర్శసుఖంబు నా కొసంగు టెన్నఁడు ? ఆనాఁడుగదా నా జీవితము ధన్య
మగుట. ఖానుఁడా ! వృద్ధుఁడవయ్యు నేమిసౌఖ్యము పొందఁగోరి యీ
యువతిని నీయధీనము చేసికొంటివి ? నైసర్గికవిలాసంబుచేఁ దళతళ మెఱయు
పసిండిభూషణంబును గాకంబు భ్రమియించి ముక్కునఁ గఱచికొనిపోవు
టయే కాని యేమి యానంద మనుభవింపఁగలదు? ఏమి వికాసము పొందఁ
గలదు ? దానిని ధరించి శోభితులు కాఁగలవారి హృదయంబులు తల్లడిల్ల
నది చిట్టచివర కేచెట్లనో గట్లనో పాఱవైచి చనును. మొగము ముడుతలు
పడినను వీపు వంగినను గఱ్ఱ చేతికి వచ్చినను నవయవంబులు జీర్ణములైనను
మానవుల కిచ్ఛమాత్రము వృద్ధత్వముం బొరయక వర్ధిల్లుట సహజంబు గాన,
ఖానుఁ డొకవేళ నాపైపై భ్రాంతినొందిన నొందుఁగాక. ధనమునకో యధి
కారమునకో గౌరవమునకో యాసపడి నవయౌవనసౌందర్యవతియైన
కూఁతును జూచుచుఁజూచుచు నట్టి ముసలివానికిఁ దలిదండ్రు లెట్లిచ్చిరి !

ఇచ్చెదరు వారి కేమి? మూఢులగు తలిదండ్రులు కూఁతులయంతర్భావములను గనిపెట్టి వారి సుఖదుఃఖముల నాలోచింతురా? కటకటా! ఈదృశ మాతాపితలవలన నెంతమంది లేఁబ్రాయంపుఁ బూవుఁబోండ్లు బ్రతికినంత కాలము దుర్వ్యథాపీడిత లగుచున్నారు! వీరి నన్ను ఫల మేమి? ఈశ్వరుఁ డెట్లు లిఖించిన నట్లు కాఁగలదు. భగవంతుఁడా! ఒక్కొకతఱి నీ కార్యములు సహితము ధర్మవు తప్పిన ట్లగపడును. మనోహరమైన నిజసౌరభంబు మరుత్తరంగంబుల వ్యాపింపఁ జేయఁజాలు మృదుతరపుష్పంబును గిణీభూత హస్తుండగు ముక్కుఁడి కొసంగిన విధంబున, సర్వాంగసుందరియైన యీపాలఁ తిని వృద్ధుండైన ఖానునిపాలు చేసితిని. (కొంచెముసేపు తలపంచి) అయ్యో! ఎంత పిచ్చివాఁడను? ముసలివాఁడైన నేమి? ముసుకవాఁడైన నేమి? సర్వభూతంబులు, సూర్యుఁడు, దివారాత్రంబులు సాక్షులుగ వివాహ మాడినతరువాత నాకు నతఁడే పరమదైవము. అతఁడే గురువు. అతఁడే ప్రాణవల్లభుఁడు. ఆహా! మానసమా! ఎంత చంచలమైన దానవు? కామ వివశత్వంబునఁ దగవుమాలి ధర్మంబుదూలి యెట్టినీచమైన తలంపులకుఁ జోటిచ్చితివి? మోహమా! వజ్రతుల్యంబులైన హృదయంబులసహితము మగ్గి వెన్నంబోలె గరగింపఁగల నీశక్తి యద్భుతముగదా! అక్కటా! పరకాంతాసక్తులై తుచ్ఛసుఖంబుల కాసపడి యెంతమంది ఘనదేహంబులఁ గోల్పోయి కుంఠితాంతరాత్ములయి నిందాపాత్రు లగుచున్నారు? ఎందఱు కీర్తికి దూరులై సత్పురుషసాంగత్యంబునకు బాహ్యులై చచ్చిన చావును, బ్రతికిన బ్రతుకును, గాక గర్హ్యులై నశించుచున్నారు? ఎంత చదివిన నెంతవినికి గలిగినను, జితేంద్రియుఁడు గానిచో, నవి నిష్ఫలంబులగును. ఒకవేళ మాయోపాయంబులచే నాపెను వశపఱచుకొంటినేని యతిథియై యింటికి వచ్చినవానికి ద్రోహంబు గావించినవాఁడ నగుదును. నలుగురిలోఁ బేరుప్రతిష్ఠలు సంపాదించి సన్మార్గవర్తియై గౌరవముగ బ్రతికిన నాజను డ్డీను కడుపునఁ జందనవనములోఁ దుమ్మమొక్క మొలచిన ట్లీదౌర్భాగ్యుఁడు

పుట్టెఁగదా యని లోకులు దూషింతురు. నాకుమారుఁడు తండ్రికీర్తి నిలుపు ననుకొంటిని గాని, యిట్టి దుర్మార్గుఁ డగు నని యనుకొనకపోతి నని వృద్ధురా లైన నాతల్లి చింతించును. ఛీ! క్షణభంగురము లై నీచతమంబు లైన సుఖములంగోరి పవిత్రమై శాశ్వతమైన కీర్తినిఁ బోఁగొట్టుకొనుజీవనము కావలెనా? అన్యకాంతాసక్తిచే నెట్టి యనిష్టంబులు సంభవింపవు? ధనహాని, మానహాని, యశోహాని, ధర్మహాని-ప్రతి సద్గుణమునకు హాని వచ్చును. అని ధర్మచింత సేయుచు నిమిషమునకు సంచలించుచున్న చిత్తమును బట్టలేక కట్టుచు, వీథిలోనుండి మరలి యింటిలోనికిఁ బోయి శయ్యం జేరి దక్షిణగవాక్షము నుండి యల్లనల్లన వచ్చు మారుతకిశోరంబులచే విశ్రాంతి చెంది కొంతసేపటికి నిద్రంగూరెను.

కూరుకుపట్టినదే కాని కనుమూసినప్పటినుండి స్వప్నంబులే. అమీనా యొద్దకుఁబోయినట్లు, నామెతో మాటలాడినట్లు, నామెను స్పృశించినట్లు, ననేకవిధములగు కలలు కనుచుండఁగాఁ దెల్లవాఱుడుఁ గలఁకనొందిన బుద్ధితో లేచి జడలేకగా నుండినను ప్రాతఃకాలపుఁ బ్రార్థనచేసి యెవరికెట్లు దైవము లిఖించిన నట్లు కాఁగల దని తలంచుచుండెను. ఖానుఁ డలసియుండుటవలనఁ బ్రొద్దెక్కిన తరువాత లేచి అమీనా మేల్కొని స్నానముచేసి సుఖముగ నున్న దని విన్నవాఁడై యతియుత్సాహముతో నామె యున్న చోటికిం బోయెను. ఆమె ముఖచంద్రుని వీక్షించినప్పు డతని నేత్రోత్పలంబులు సంప్రమోదవ్యాకోచంబులై యతనికిఁ గలిగిన యానంద మింతింత యని చెప్పుటకు వీలులేదు.

ఆమెకన్నులు చేరెడు వెడల్పున నతిమనోజ్ఞములుగ నుండెను. మందస్మితంబు వదనారవిందంపుఁ గళ హెచ్చించుచుండెను. అప్పుడే స్నాన మాచరించినది గనుకఁ దడియారుటకై విప్పఁబడి నల్లనికాంతుల వెళ్ళగ్రక్కుచు నున్నఁగ దువ్వఁబడిన గుంపెడు కురు లంసద్వయముమీఁదుగ వీపునం బడి

యంత్రంబున లంబమాన శిఖాంతంబులై యుండెను. ఆమె యొడ్డిదం కపలి నప్పుడును, భుజాబాల నెత్తినప్పుడును, నాప్రక్కనుగాని యాప్రక్కనుగాని తలవంచినప్పుడును, మృదుతరభాసమానంబులగు కొన్ని వెంట్రుకలు కర్ణంబులు దాటి కంటి కొలుకులవఱకు వచ్చి సహజసుందరం బగు వదనంబున కొకనూతనవికాసము కలిగించుచుండెను. ఖానుఁడు వచ్చినతోడనే యమీనా లేచి నిల్వఁబడ నామె నాలింగనముచేసి దగ్గఱఁ గూర్చుండఁ బెట్టికొని చెదరిన పాపట నల్లన సవరించుచు నిట్లనియె: "భగవంతుని కృప వలనఁ దిరిగి నేఁడు నిన్నుఁ జూడఁగలిగితిని. నీవు లేనినాఁ డెన్ని దినము లేమి? నామనస్సునకు సంతోష ముండదు. ప్రాణవల్లభా! సుఖముగా నుంటివా?"

అమీనా—స్వామీ! మనము బయలుదేఱిన వేళావిశేషమువలననో మన యదృష్టమువలననో యొకరి నొక రింతమాత్రము చూచుట తటస్థించినది. రాత్రి ఆ మెఱపులు! ఆ యుఱుములు! మిమ్మును మరలఁ జూతు నని యనుకొంటినా? ఆమెబుణ మెట్లు తీర్చుకొనఁగలనో గాని పాప మీయింటి యవ్వ యెంతయో యుపచారము చేసినది.

ఖానుఁడు—ఆయవ్వయేకాదు. ఈయింటివారందఱు మనకొఱకుఁ గష్టపడిరి. వారు లేకున్న మన మే మగుదుమో!

అమీనా—రాత్రి పడినకష్టములు నాకుఁ గొంచెము జ్ఞప్తియందున్నవి. పాలకీ నీటిలోదిగినది. నాలుగడుగులు వేసినతరువాతఁ జాకలవాండ్రలో నెవరికో కాలుజారి పల్లకి క్రిందఁబడినది. పడినప్పుడు పెద్దగ నఱచితిని. అప్పటినుండి యింటెనుక నింటివారు లేపి జలకమాడించు నంతవఱకు నేమి జరిగినదో నాకుఁ దెలియదు. అవ్వనడుగ నామనసు చెదరుననని కాఁబోలు నివ్వా డెందుకు లెమ్మని యేమియుఁ జెప్పినదికాదు.

ఖానుఁడు—అయితే పాలకీ నీళ్లలోఁ బడ్డతరువాత నిన్ను బయటికిఁ దీయుటకై నీవెంట దుమికినది, యాశవదలుకొనినది నీ వెఱుఁగవు.

అమీనా—ఇట్లు జరిగినదా! నేను గొట్టుకపోవుచున్నప్పుడు నన్ను రక్షించిన వారెవరు? మీరే కారా? నా కోసము మీరు—

ఖానుఁడు—ప్రియసఖీ! కాదుకాదు. నిన్ను రక్షించునంతటి భాగ్యము నా కబ్బలేదు. నీవు కొట్టుకొనిపోవుచుంటివని తొందరచేతఁ దొడిగిన చొక్కాయైన విడువక నీటిలోఁ దుమికితిని. బోయీలు వాండ్రు మీండ్రు బయటికిఁ దీసిరి. లేకపోయినచో నా ప్రాణము పోయియుండును. మనపాలిటి దేవుఁడైన యొకమహానుభావుఁడు వచ్చి తన ప్రాణములు గోరాప్యవృటక్కైనఁ దాపుచేసి కల్లోలములచే భయంకరముగా నున్న జలములోఁ బడ్డనిన్ను బయటికిఁ దీసెను. ఆయన కడుపుచల్లఁగాను! తిరిగి నాకు నిన్ను దయచేసిన దాయనయె. అతని వయస్సుమాత్ర మెంత? ఇరువదియైదు లేక యిరువదియెనిమిది సంవత్సరములు. తండ్రిలేని బిడ్డఁడు. అతని తల్లి కొక్కఁడే కుమారుఁడు. మంచివర్చస్సు గలవాఁడు. అతనితల్లి యెవరో కాదు. నీ కుపకారముచేసిన యవ్వనుఁ డీపని కెంత శ్రమపడినాఁడు పాపము!

అమీనా—ఆలాగా! ఆలాగా!

ఆమె యీతీరున నని యెవ్వియో తలంపులు మనస్సునకు వచ్చినందునఁ గొంచెముసేపు మాటలాడకుండ నేవియో విచారించుచున్నదానివలె నుండెను. ఒకటివెనుక నొకటి కన్నీటి బొట్టులు నిశ్శబ్దముగ జారెను. ఖానుఁడామెను జూచి కదలింపఁ గూడదని యూరకుండెను. కొంతసేపటి కెవ్వియో రెండుమూఁడుమాట లామెనోటినుండి వెడలివచ్చెను. ఆమె మనస్సంతయు దనను రక్షించిన తరుణవయస్కునిమీఁద నున్నట్టే యామాటలు సూచించెను.

అమీనా—మన కింత మేలుచేసినవాని కేమయిన బహుమాన మియ్యరా? ఇంటివద్ద మాఅమ్మ యేమిచేయుచున్నదో విడిచివచ్చిన యీకొద్ది కాలములోనే నామరణవార్త విన్నచో నామె యెంత యడలియుం

దును? (భర్తవంక దృష్టిసారించి) నేను గాకపోయిన నావంటిది రేపీవఱకు మీకు మరల రాఁగలదు. మాతలిదండ్రులకుఁ గూతుఁ రెచ్చటినుండి వచ్చును ?

ఖానుఁడు——కోమలాంగీ ! నీవంటిస్త్రీ వేయిజన్మములెత్తినను నాకు దొరకఁ గలదా ? నిన్ను నీటిలోనుండి తీసినయతఁడు నాపాలిటి యదృష్ట దైవతము గాని వేఱుకాదు. అతనికి బహుమానమా ? తీసికొనునట్లైన నాసంపదలో సగమిత్తును. కాని యతనిది మొదటినుండి గొప్పవంశము. మన మిచ్చు ద్రవ్యము తీసికొనఁడు. డబ్బు గాక యింకేమైన నీకుఁ దోఁచినది చెప్పుము.

అవితానా——తల్లికి సొమ్ములు తీసికొనునేమో ! నాసొమ్ముంతయుఁ దీసి యిచ్చెదను.

ఖానుఁడు——తల్లి ముత్తైదువ కాదు. ఆమెకు సొమ్మెందుకు? ఒకవేళ భార్యకుఁ బెట్టుకొను ననుకొందమా! అతనికిఁ బెండ్లి కాలేదు. కనుక సొమ్ము పుచ్చుకొనఁడు.

అవితానా——(మనస్సులో) ఇరువదియైదు సంవత్సరములవాఁడు ! ఇంకను (ప్రకాశముగా) గుఱ్ఱముల నాయుధములఁ బుచ్చికొనునేమో.

ఖానుఁడు——నిజమే. ఇందనుకనుండి యిది మఱచిపోయితిమి. అతఁడు వయస్సులో నున్నాఁడు. శౌర్యధైర్యములు కలవాఁడు. ఇతని తండ్రి, తాత-వారందఱు- యుద్ధములలోఁ దిరిగినవారు. గుఱ్ఱముల నాయుధముల నిత్తుముగాక. ఉద్యోగములేనిది యేమిలాభము? నావద్ద నిప్పుడేమి ఖాలీలు లేవు——(అని కొంచెముసేపు పైకిఁ జూచి) సరే. ఇతనికిఁ దప్పక సుల్తానుని దగ్గఱఁ బని యిప్పించెదను. సైన్యముసకంతటికి మణివలె నిటువంటివాఁ డొకఁ డున్నను జాలును. కొద్దిరోజులలోఁ ఐరంగీలతోడనో హిందువుల తోడనో యుద్ధముకూడ జరుగుటకు సిద్ధముగా నున్నది. సుల్తానునివద్ద నితఁడు స్వల్పకాలములోనే వృద్ధినొందఁగలఁడు.

అమీనా—అంతకంటె నీక నేమి కావలయును? ప్రాణ ముండినంతకాలము మిమ్ముఁ దలఁచుకొనుచుండును. (మనసులో సంతోషము బయటికిఁ గనఁబడ నీయకుండ) అయితే యతఁడు మనవెంట వచ్చునుగదా?

ఖానుఁడు—వచ్చిన నేమి? అతఁడు యోధుఁడే కాక గొప్పవిద్వాంసుఁడు కూడ నైయున్నాఁడు. నాకంటెఁ జాల గొప్పవాఁ డనియే చెప్పవలెను. అదిగాక రాత్రి మనపరిజనములో నొకఁడు మృతినొందెను. అతనికి బదులుగ మఱియొకఁడు కావలసియే యున్నాఁడు.

అమీనా—ఎవరు చచ్చినది? నీటిలోఁ బడియేనా?

ఖానుఁడు—పూవుఁబోఁడీ! నీటిలోఁ బడి కాదు. పాపము! పిడుగు పడి చచ్చినాఁడు.

అమీనా—(భయకంపితాంగియై) ఇాతఁ డెవరు?

ఖానుఁడు—ఇబ్రహీం.

అమీనా—ఇక్కడ మన కొక్కఁడు కావలయు నని యున్నది కాఁబోలును! రెండు సారులు మీప్రాణమును గాపాడినది యితఁడే కాదా?

ఖానుఁడు—నిజమే. ఆతనిప్రాంత యీతీరున నున్నది. ఎవరు తప్పింపఁగలరు? అయితే పటేలున కిబ్రహీమునుద్యోగ మీయమందువా?

అమీనా—మీ రడుగుచున్నారు గనుకఁ జెప్పెదను. పటేలు గొప్పవంశస్థుఁ డగుటవలన నతని కిబ్రహీము దానికంటెఁ బెద్దయుద్యోగ మీయ వలయును. ఇవంతయు నేల? "వేయిగుఱ్ఱాలకధిపతియైన యబ్దుల్ రహిమాను ఖానునివద్దకు శ్రీరంగపట్టణమునకు రమ్ము" అని చెప్పుము. అచ్చట నుద్యోగ మొసఁగవచ్చును.

ఖానుఁడు—ముద్దుగుమ్మా! బాగుగఁ జెప్పితివి. నీతో నే నిప్పు డనుభవించుచున్నట్టియు ముందనుభవింపఁబోవునట్టియు సౌఖ్యము నాకు దయ చేసినది యితఁడే. ఉద్యోగము కాదుగదా, యితని కేమి యిచ్చినను

ఋణము తీరదు. ఇతనివలనఁ గాకపోయినయెడల నీసౌందర్యమును ప్రేమను జూచి యుందునా ? సాయంత్రముపనుక నిన్నిఁకఁ గదలింపను. మనస్సు లోని కలఁతలు పోఁగొట్టుకొని సుఖముగ విశ్రమింపుము.

తరువాత నమీనా శయ్యం జేరి పరుండి కన్నులుమూసికొని 'ఇరువదియై దిరువదియొనిమిది సంవత్సరములవాఁడఁట ! వర్చస్సు గలవాఁడట ! విద్వాంసుఁడఁట ! యోధుఁడఁట. మావా రితనినిగుఱించి యెన్నియో విశేషములఁ జెప్పిరి. ఇన్నిసుగుణములు సామాన్యుల కుండునా ? ఆతఁడొక్కఁడే కుమారుఁడఁట! ఎంతగారాబముతోఁ బెంచుకొనుచున్నదో ? ఆమెను విడిచిపెట్టి మావెంట వచ్చునా?' 'నామొగ మతఁడు చూచి యుండును. నే నప్పుడు కప్పుకొనలేక పోయితిని. నన్నుఁబట్టికొని బయటికిఁ దీసెను. (ఉరముమీఁదను జఘనముమీఁదను బట్టసవరించుకొనుచు) ఆప్పుడు నావస్త్ర మెచ్చటనైనఁ దొలఁగినదేమో ! పడియుంటిలోనికిఁ దెచ్చినప్పుడు దీపపు వెలుతురున నన్ను బాగుగఁ జూచియుండవచ్చును. 'చక్కనిది చక్కనిది' యని నన్నుఁజూచిన వారెల్లఁ జెప్పుదురు. (వ్రేలియుంగరములోఁ నమర్పఁబడిన చిన్నియద్దమునఁ బ్రతిబింబమును జూచి చిఱునవ్వు మొగమునఁ జెలఁగ) నాచక్కఁదనమును జూచి యాయన యేమనుకొనెనో? ' అను ననేకవిషయములు తలఁపునకు రాఁగా మఱలఁ గన్నులుమూసికొని వాని నన్నిటిఁగూర్చి చింతించుచుఁ గొంతసేపునకు నిద్రపోయెను గాని, యది నిద్రయనుటకు వీలు లేదు. స్వప్నావస్థయం దుండినదని చెప్పిన యథార్థముగ నుండును. తుపాకు, కాశిమాలి, పాలకీ, నీరు, బోయీలు, కన్నులు మూసికొనియున్నంతసేపు నగపడుచునేయుండెను.

---

## నాలుగవ యధ్యాయము

సాయంకాలమైనది. సూర్యుఁడు ప్రపంచమును గొంతకాలఱి భయముష్టంబు గావించి పశ్చిమాంబుధిం గ్రుంకుచుండెను. చరిది పట్టికొనిపోయిన

చిన్నగడ్డ మొలత్రాడులలోఁ దోపికొని దారితొలఁగిపోవు పశువుల గద్దించుచుఁ బసులపిల్లవాండ్రు గవనులఁ బ్రవేశించుచుండిరి. వ్యవసాయకు లఱక విడిచి యెద్దుల మరలించి మెల్లమెల్లఁగఁ గాళ్లీడ్చుకొనుచు నిండ్లకుఁ జేరుచుండిరి. లేఁగల విడిచి యడవికిఁ బోయిన యావులు అంబా యనియఱచుచు నిజస్థానంబులకు శీఘ్రగమనంబునఁ బోవుచుండెను. ఊరిబయటనుండువారి కూరంతయుఁ బొగతోఁ గప్పఁబడినట్లగపడుచుండెను. నక్కల యఱపులు కోడెల అంకెలు నెడనెడ వినవచ్చుచుండెను. పెద్దనుపడిన వచ్చిన వాని బ్రహ్మీముకు బూడ్చిపెట్టి గోరీ నొకతీరుగ ముగించి ఖానుని పరిజనులు మరలి వచ్చిరి.

ఖానుఁడును రాశీమాలియు మాత్రము గోరీ సంపూర్ణమైనవఱకు నుండి దానిపైఁ బూలచెండ్లు వేసి యాలస్యముగ నింటికి వచ్చిరి. జుల్ఫికారుఁడు సిద్ధముగ వంటచేసి కనిపెట్టికొనియుండెను. ఖానుఁడు పరిజనులు తృప్తిగ భుజించి గట్టునఁ జేర్చుచు హుక్కాఁద్రావుచు నొకరితో నొకరు సల్లాపములు జరుపుచుండిరి. ఆమాట లీమాటలు చెప్పుచు ఖానుఁడు తనపూర్వోత్తరముల వచించి తాను నిరధికారియయ్యు హైదరాలివద్ద నుద్యోగముచేసి యతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడై యెట్లుచ్చపదవికి వచ్చినదియుఁ జెప్పి రాశీమాలి కుద్యోగాపేక్షం బుట్టఁగొల్పెను. కాని రాశీమాలి "నేను మీవలె నుచ్చస్థితికి వచ్చుట కలలోనివార్త. ఎవనికో తప్ప నంతటి యట్టి పదవి లభింపదు" అని బదులు చెప్పెను.

ఖానుఁడు వశీకరకంఠస్వరముతో "ఇప్పుడీ యధికారులందఱు నీకంటె ఘనులా? నీవు పరాక్రమశాలివి. విద్వాంసుఁడవు. నలుగురమెప్పు వడయఁ గలవాఁడవు. నాకన్నులయెదుటనే యెంతమంది పేద లధికారులైరి? హైదరాలివంశ మెట్టిది? తండ్రి పంజాబుఫకీరు. తల్లి కల్బుర్గిపట్టణ సమీపమున 'కొల్లఁడు' అను పల్లెటూరిలో బట్టలు నేయు నొక సాహెబుకూఁతురు. ఆతఁడో

మైసూరురాజ్యసింహాసనాసీనుఁడై సకలభోగంబుల ననుభవించెను. అదృష్టమునకు సాటి యేదియు లేదు. నీముఖవర్చస్సే నీయదృష్టమును జెప్పక చెప్పుచున్నది" అని చెప్పఁగఁ గాశిమాలి మీవాక్యములు నా కమితోత్సాహము కలిగించుచున్నవి. వ్యర్థముగఁ గాలము గడపుట నాకును లజ్జాకరముగనే యున్నది. కాని నైజామును గొల్చుటకు నా కిష్టము లేదు. మహారాష్ట్రులు విమతులు. వారికొల్వుకూడ నే నంగీకరింపను." అని ప్రత్యుత్తరమిచ్చెను. ఖానుఁడు "వారినిఁ గొల్చుట యేల? నాసిఫారసు లేకుండఁగనే నీవశ్వారూఢుఁడవై సుల్తానునియొద్దకేఁగినచో నీకుఁదగిన జీతమేర్పఱచి సైన్యములోఁ జేర్చుకొనును. నీవు నాకు మిత్రుఁడవు. రక్షకుఁడవు. నిన్ను వదలిపెట్టిపోవుటకు మనసొప్పకున్నది. ఇంత శక్తిమంతుఁడవయ్యు నింటిపట్టునుంట నాకు విచారకరముగ నున్నది. లెమ్ము. పయనమై రమ్ము. ఇంకను సందేహపడుచున్నాఁడవు. దేనిని గుఱించి? ఖానుఁడు తియ్యనిమాటలు చెప్పుచున్నాఁడు గాని యుడియాంతరము సత్యమా యనియా ?

కాశిమాలి—అయ్యా కాదుకాదు. మీరు నాకు దండ్రితో సమానులు. మీపాదములసాక్షిగ సుల్తానునివద్దనుద్యోగముచేయ నిచ్చగలదు. మాతల్లిగారివిషయ మెటులనో యని యాలోచించుచున్నాఁడను. అదిగాక నాకు గుఱ్ఱము లేదు.

ఖానుఁడు—గుఱ్ఱము లేదను చింత పెట్టికొనకుము. అయినా నేను నిన్ను గుఱించి యుదయమున మాటలాడితిమి. నీవు మా కొనరించిన యుపకారమునకుఁ బ్రత్యుపకార మేమి చేయఁగలము? నీకు నగలుగాని ద్రవ్యముగాని యిచ్చుట యుచితము గా దనుకొంటిమి. ఉద్యోగ మిప్పింపవలయు నని నిశ్చయించుకొంటిమి. నన్ను నీసోదరునిగ భావింపుము. నీమిత్రుఁడనైన నీయన్న నడిగినట్టే నన్నడుగుము. నా మోతీగాక రెండు మంచి పక్కాను గుఱ్ఱము లున్నవి. ఆరెంటిలో నీ యిష్టమువచ్చినదానిని దీసికొనుము. కాశిం

డును నిన్ను మెప్పింపనియెడల శ్రీరంగపట్టణములో మిగిలినగుఱ్ఱము లున్నవి. వానిలోడేనినైన నీవు కోరి తీసికొనవచ్చును. ఇంకను నీ కేమైనఁ గావలసియున్నయెడలఁ జెప్పుము.

కాశిమాలి—మీపాదములాన ప్రమాణము చేయుచున్నాను. ఏమైననుసరే మీవెంట నేను వచ్చెదను. నా కింతకంటె నెక్కువ యేమి కావలయును?

ఖానుఁడు—మంచిది. నే నిక్కడ రేపుమాత్ర మాగఁగలను. తరువాత నుండుటకు వీలులేదు. చేయవలసిన యేర్పాటులు త్వరగఁజేసికొని సిద్ధముగ నుండుము. నీవు వచ్చుచున్నాఁడ వనిన నమీనా కూడ సంతోషించును.

కాశిమాలి ఖానునియొద్ద సెలవుపుచ్చుకొని తల్లికడకుఁబోయి యామెతోఁ దనయభిప్రాయమును జెప్పలేక చెప్పెను. ఆమె కామాటలు శల్యతుల్యంబు లయ్యెను. పొరలిపొరలి వచ్చుచుండిన దుఃఖమును దిగమ్రింగి "నాయనా! మీతండ్రియైన నుండిన నాకు దిగులు లేకుండును. నీవు నిమిషము కానరాని యెడల నాకన్నులు పోయిన ట్లుండును. లేకలేక యొక్కనలుస చేపడితివి. ఒక్కఁడవుకూడఁ గన్నులయెదుట లేకుండఁబోయిన నాప్రాణ మెట్లు ఘోషించును? దేశముకాని దేశముపోయి యన్నమువేళ నన్నము, నీళ్లవేళ నీళ్ళును లేక, యేల కష్టపడవలసివచ్చినది? ఏనూఱుమంది గలరు? నీ వొక్కఁడవు బ్రతుకలేవా? ఉన్నది తినినఁ జాలును. ఈరోజువఱకు స్వామి కృపవలన నన్నవస్త్రములకు లోపములేకుండ జరుగుచున్నది నాయనా! అదిగాక యుద్ధముతోఁ గూడినపని. అన్నివేళలు మనవేళలా? ఆమాట తలఁచినమాత్రముననే నాయొడలు వణఁకుచున్నది. నేనును బెద్దదాననైతిని. కనులకు మసకలు సంభవించినవి. మాట తొందఱగ వినరాదు. ఇంక బ్రతికినన్నిరోజులు బ్రతుకఁబోను. లేచిన లేవలేకపోయిన, గొంతులోనీళ్లుపోయువారైన లేరు. ఇదివఱకుఁ గడుపు దుఃఖపెట్టితివో యెఱుఁగను. ఇట్లు దాఁటి పోయితివేని యపృష్టవంతురాలను. ఎప్పుడా యని కనిపెట్టుకొనియున్నాను. చావుదలకు లావు దుఃఖమని

మీతండ్రి మంటిపాలైనదైకాక, నీవుగూడ నన్ను విడిచిపెట్టిపోయిన నెవనిఁ జూచుచు నింటిలో నుండెదను. నాయనా!" యని కంటినీరు చెఱఁగునఁ దుడిచికొనుచు హృదయము కరఁగునట్లు పలికెను.

కాశీమాలి ధైర్యము తెచ్చుకొని "అమ్మా! కన్నదానవు కనుక నామీఁద నింతప్రేమ యుండుట సహజము. నాజరుద్దీను కడుపునఁ బుట్టిన కాశీమాలి వ్యర్థుఁ డయ్యె నన్న నీకుమాత్ర మపకీర్తి కాదా? శౌర్యపరాక్రమంబుల నెఱపి రాజానుగ్రహపాత్రుఁడ నయి సేవకులు పరివేష్టింప నెల్లెడ మహా గౌరవం బొందుచుండ జనులు నిన్నుఁ జూచి 'అమ్మా నీ వెంత సుకృత మొనరించితివో! ఇట్టి పుత్రుఁడు నీకుఁ బుట్టెను. పుణ్యముకొలఁది పురుషులు పూజకొలఁది బిడ్డలు. కడుపుచేటఁ బుట్టినవా రెంతమంది యైన నేమి? కాశీమాలి వంటివాఁ డొక్కఁడు చాలఁడా?' యని కొనియాడుదురు. అప్పుడు మన వానిని నే నింటనుండి కదలనీయకుండిన నింత గొప్పవాఁడు కాఁగలఁడే యని నీలో నీవే యనుకొందువు. దేశ మిప్పుడు విమతుల యధీనములో నున్నది. అయోధ్య బంగాళాదేశములఁ బరంగీలు స్వాధీనము చేసికొని ఆర్కాటక నవాబును నయోధ్యానవాబును జెఱసాలయం దుంచిరి. మహారాష్ట్రులు హిందూస్థానమును దక్కను నాక్రమించి నైజామువైపు పోటిమాటికిఁ బోవుచున్నారు. స్వదేశీయులు, స్వమతస్థులు నిట్టికష్టములఁ బడుచుండ నిజముగ మహమ్మదీయరక్తము నరములయందుఁ బ్రవహించు మానవుఁ డెట్లూరకుండును? శత్రువులపాలిటి మృత్యుదేవతయై మహమ్మదీయమతమును నుద్ధరించుచున్న సుల్తాను నాశ్రయించి నావిధి నెఱవేర్చెదను. తల్లీ! నాకు సెల విమ్ము. మానవహృదయస్పృహణీయంబులగు కీర్తి, సుఖము, గౌరవము నాకుఁ గలుగఁబోవునప్పుడు తద్విఘ్నము కావించెదవా? నాశ్రేయస్సును గోరుదువేని, నాకీర్తి నభిలషించెదవేని, నాసంపద నిచ్చగింతువేని, నాగౌరవ మపేక్షించెదవేని, నామీఁదఁ బ్రేమ కలదేని, నా కాజ్ఞ నిచ్చి పంపుము."

అని వాక్రుచ్చి నాయనమ్మ మాఱు మాటాడుటకును కుమారుని నక్కునఁ జేర్చి 'నాయనా! నీయిష్టము వచ్చినట్లు గావింపుము. నీకొఱకు సంపాదించిన విలువగలవస్త్రములు పెట్టెలో నున్నవి. పోకుండ నన్నిఁటిని భద్రముగ దాఁచితిని. వానిని గట్టికొనుము. నీకా అక్కఱగదా నాయనా! యవి పోకుండఁ గాపాడితిని' అని చెప్పెను. కాశిమాలి గ్రామకరణముకడకుఁ బోయి తాను ఖానునివెంటఁ బోవలయుచినవిషయము చెప్పి శ్రీరంగపట్టణమునకుఁ బోయిన పిమ్మట జీతము వచ్చుటకునకుఁ గావలసిన ఖర్చులకై కొంతదబ్బు బదులొసంగు మని యడిగెను. కరణము కలవాఁడు గనుక వెంటనే యడిగినంత యిచ్చెను. కాశిమాలి మేనమామను రప్పించి తల్లిపోషణమునకుఁ జేయవలసిన యేర్పాటు లతనితోఁ జేసెను. పిమ్మట నతఁడు ఖానునివద్దకుఁ బోయి తల్లి యొడఁబడిక మొదలగు విషయములు వివరించి బయలుదేఱుట కాటంకము లేదని చెప్పెను. ఖానుఁడు సంతోషించి 'ఆలస్యము చేయవలదు. లఘుభోజనమాత్రము తయారుచేయుఁడు' మని కాశిమాలికిఁ జెప్పగ నతఁడు శీఘ్రముగ సిద్ధము చేయించెను. అందఱును భుజించిరి. గుఱ్ఱములకు బల్లెములు కట్టిరి. ఒంటెలకు బరువు లెత్తిరి. పరిజనులందఱు ప్రయాణసన్నద్ధులైరి. తళతళ మెఱయుచు విలువగలిగిన దుస్తులు ధరించి కాశిమాలి తన తల్లియొక్క సెలవు పుచ్చుకొను చుండుట యెవ్వరును జూడలేదు కాని, యింటిలోనుండి బయటికి వెడలివచ్చి నప్పుడుమాత్ర మతనిబుగ్గ తడిగా నుండెను.

---

## అయిదవ యధ్యాయము

మనోహరవేషభాసమానుండైన కాశిమాలి బయటికివచ్చినపు డాశ్చర్యమతోఁ జూడని పురుషుఁడును ప్రేమతో వీక్షింపని స్త్రీయును లేదు.

ఖానుఁడు——సెబాస్! నీవు మా సేనలో నుండిన నంతియ చాలును. గుఱ్ఱముల మాట చూచికొనుము. అదిగో యాతఁడు హైదరు (గుఱ్ఱముల పేర్లు).

యాబూటు దిట్టమైనదే కాని మదించినది. బాగుగ నడువఁగలదు. నీవు చెప్పినట్లు వినునది. కాని జాగుగ నడుచును. ఈరెంటిలో నీ యిష్టమైన దానిఁ దీసికొనుము.

కాశిమాలి యాబూటునే తీసికొనియెద నని చెప్పి దాని నెక్కి స్వారి చేసి తనరౌతుఁదనము ఖానునికిఁ జూపెను. ఖానుఁడు మెచ్చి "ఇంకఁ జాలును. తిరిగిరమ్ము" అనఁగా నతఁడు గుఱ్ఱమును వెనుకకుఁ ద్రిప్పి ఖానునియొద్దకు వచ్చి పాలకి తెమ్మని బోయీలతోఁ జెప్పెను. నిండుగ ముసుఁగు వెట్టికొని యమీనా బయటికి వచ్చి పాలకీలోఁ గూర్చుండెను. కాశిమాలితల్లి వచ్చి యశ్రుకణములు కన్నులనిండ నుండ నమీనాను గౌఁగిలించికొని "అమ్మా నన్ను జ్ఞాపకముంచికొనుము. నిన్ను మరల నెట్లు చూడఁగలను? నావాఁడు నీతో వచ్చుచున్నాఁడు. వానికి మీరే తలిదండ్రులు. వాఁడు నీకొడుకుగాని నాకొడుకు గాఁడు. ఒగ్గెనఁ బడినదైన మీరుతప్ప వాని కెవ్వరు లేరు" అని గద్గదస్వరముతోఁ బలికెను. "అవ్వా పోయివచ్చెదను. నీవింత చెప్పవలెనా? నీకుమారుని నాకుమారునిఁగ నెంచెదను. మరలఁ జూచుట యెన్నిదినములకో, చెప్ప లేను. దయ యుంచుము." అని మెల్లఁగ నమీనా వాక్రుచ్చెను. అవ్వ దుఃఖవశమున మాఱుమాటలాడలేక పల్లకితలుపు వేసెను. బోయీ లాసంజ్ఞ నెఱిఁగిన వారు గనుక వెంటనే పాలకి నెత్తి యడుగిడసాగిరి. కాశిమాలి తల్లిదగ్గఱకుఁ బోయి గుఱ్ఱముమీఁద నుండియే వంగి 'తల్లీ పోయివచ్చెదను. నన్నాశీర్వదింపుము' అనెను. ఆమె కొడుకు నాశీర్వదించి కొంగునఁ గట్టికొనిన యొక రూకను విప్పి యతనిచేతిలోఁ బెట్టెను.

'అమ్మా అమీనాకు నన్నుగుఱించి చెప్పితివా' యని కాశిమాలి యడిగెను. 'నిన్నుఁ గాపాడుచుండు మని చెప్పితిని. ఆమెకు నీయందుఁ బ్రీతి యున్నట్లే యగపడినది' అని యామె పలికెను. కాశిమాలి తల్లితో మాట లాడుచుండఁగ ఖానుఁడు పరిజనులు కొంతదూరము పోయిరి. అతఁడు 'అమ్మా

నేను పెంచినచెట్లకు శ్రద్ధతో నీళ్లుపోయుచు నెండిపోకుండఁ జూడుము. నేను దిరిగి వచ్చునప్పటికిఁ బెద్దవగును' అని చెప్పి గుఱ్ఱము నదలింపఁగ నది దువాళించుచు ముందు పోయినవారితో నిమిషములోఁ గలిసికొనెను. కాళిమాలి యాగపడునంతవఱకు నతనితల్లి దారిపై నునికే దృష్టి నిగిడించి చూచుచుండెను గాని కొంతసేపటికి గుఱ్ఱము, లాంటెలు, ఖానుఁడు, కాళిమాలి, పరిజనులు నామెకనుచూపుమేర దాఁటిపోయిరి.

అయవ్వ యప్పుడు తనమీఁద ముసుఁగు లేకుండుట తెలిసికొని శీఘ్రముగ నింటిలోనికిఁబోయి పుత్రవియోగజనితంబై పొరలిపొరలి వచ్చుచున్న దుఃఖము పట్టలేక వెక్కి వెక్కి యేడువసాగెను. కాళిమాలియు ఖానుఁడును త్రోవను ననేకవిషయములంగూర్చి ముచ్చటించుచుఁ బోవుచుండిరి. ప్రసంగ వశంబున ఖానుఁడు నీ కేవేటయందుఁ గౌశలము కల దని యడుగ జింకల వేఁటయందు నేర్పరి నని కాళిమాలి చెప్పెను. "ఈదినము సాయంకాలపు భోజనమునకై యొకదానిని జంపుము. అవిగో జింకలు మందలు మందలుగ నున్నవి" అని ఖానుఁడు వక్కాణింప నతఁడు వల్లె యని గుఱ్ఱమును దిగి బొడ్డులోఁ గత్తినిదోపి చేతఁ దుపాకి పట్టుకొని కొంతసేపు నిల్చుండియుఁ గొంతసేపు కూర్చుండియుఁ గొంతసేపు వంగియుఁ గొంతసేపు నేలమీఁదఁ బ్రాకియు, మృగములు తనరాకను గనుఁగొనకుండ నవిమేయుచున్న ప్రదేశమును సమీపించి ఖానుని నమానాను నాశ్చర్యమగ్నులఁ గావించి, యొక పొంచిన కురంగమును దుపాకితోఁ గాల్పఁగ నది యొక్కసారి చౌకళించి నేలపైఁబడెను. వెంటనే కాళిమాలి దానిదగ్గఱకుఁబోయి ప్రాణము పోకముందే మంత్రముచదివి దానిగొంతు కోసెను. ఖానుఁ డతనిని గొనియాడి సాలువు బహుమానము చేసెద నని చెప్పెను. ఆ మృతసారంగము నుష్ట్రముమీఁద వేసి కట్టి యందఱు బయలుదేరిరి. ఖానునికిఁ గాళిమాలియందలి ప్రేమ ప్రతిక్షణము నధిక మగుచుండెను. దానికిఁదో డతఁడు విద్వాంసుఁడు గనుకఁ

దాను జదివినపఱకు షాహానామానుండి కొన్నిపద్యములను, హాఫీజుచెప్పిన పద్యములఁ గొన్నింటిని బోధించెను. ఇస్లాంకి సంబంధించి యను గ్రంథములనుండి కథ లను, మహమ్మదీయప్రవక్తల కీర్తనలను గూర్చి ఖానుఁడు వినిపించుచుండెను. నిత్య చిన్నవయస్సులోనే శౌర్యము నశ్వారోహణకళాకౌశల్యము, నిస్తులపాండి త్యము నుండుట యితనివద్దఁ జక్కఁ గనిపెట్టఁగలమని ఖానుఁడాశ్చర్య పడుచుండెను. ఇట్లు పోయిపోయి చిన్నగ్రామము జేరిరి. ఆయూరి పటేలు కాశిమాలి తండ్రి నెఱిఁగిన వాఁడగుటచే నతఁడు వీరిని సత్కరించి యొక మసీదులో విడియించి కావలసిన వస్తువుల సమకూర్చుటకుఁ బరిచారకుల నియ మించెను. ఆనాఁటిరాత్రి వా రచ్చట నాగిరి.

జుల్ఫికారుఁడు కటికవాని నొకని రప్పించి తాము తెచ్చిన జింకను గోయించి మాంసమును ముక్కలు ముక్కలుగఁ బఱిగించి వానిని శుభ్రముగఁ గడిగెను. తరువాత నాముక్కలకు మసాలాపట్టించి వాని నట్లుంచి యుల్లి గడ్డలు సన్నగఁ దఱిగి యొకగిన్నెలో వేసి వెన్నపూసతో వేఁగించెను. ఉల్లిగడ్డ ముక్కలు వేఁగిన తరువాత వానిలో మాంసపుముక్కలు నుప్పు పుల్లచల్ల పోసెను. అవి వేఁగుచుండ నితఁడప్పుడు గంటెతో ముక్కలఁ గలియించి కూర ముక్కలు వానిలో వేసెను. చుంయిమనుచు నన్నియుఁ బాగుగ వేఁగిన పిమ్మట ఘుమఘుమమని కమ్మనివాసన కొట్ట నారంభించెను.

ఆహారములేక కడుపు లోనికిఁబోయిన యూరఁగుక్కలు పసిపట్టి యావాసనగలచోటికిఁ బరుగెత్తి జుల్ఫికారుఁడు వంటచేయు చుండిన స్థలమునకు దగ్గఱగఁ దిరుగుచుండెను.

అతఁ డేమాత్ర మేమఱియున్నను మాంసము నెత్తికొనిపోవుటకుఁ బ్రయత్నించుచు నతఁ డెన్నిసారులు రాళ్లువేసినను బోక మరలమరల వచ్చు చుండెను. గద్దలు గుంపులుగూడి మాంసఖండాపహరణోద్యుక్తంబులై ప్రొయ్యికి సూటిగఁ బైనిఁ దిరుగాడ మొదలుపెట్టెను. కాకులు చుట్టుప్రక్కల

కుక్క కాళ్లమీఁదను గోడ మనుసులమీఁదను కూర్చుండి తొప్ప దాఁసి యజమానుని సీనము మంచి యాహారము దొరకును మన కని సంతోషించు చున్న తెఱఁగిఁ గనఁబడుచుండెను. కత్తియొక్క లోకప్రక్కను గాను లోఁ పంకను గద్ద లోకవైపునను సందైనచో మాంసశకలంబుల నెత్తుక పోవలయు నని చూచుచుండ జుల్ఫాకారుఁ దుమిలించుచు కాస్లఁజువ్వుచు నూపిరి పుచ్చుకొనలేక యుండెను. కాకుల నదలించుచున్నప్పుడు కుక్కలు గద్దలు వచ్చును. గద్దలను గద్దించుచున్నప్పుడు కాకులు కుక్కలు చేరును. కుక్కలను దోలుచున్నప్పుడు కాకులు గ్రద్దలు చనుదెంచును. ఆతఁ డీతీరునఁ గష్టపడుచుండ నెప్పుడో సందుచేసికొని యొకకుక్క యక్కడఁ బడియున్న జింకకాలిని నోటఁ గఱచికొని పోనే పోయెను. జుల్ఫా దానిని జూచి మనస్సులోనున్న కోపము పట్టుకొలఁకుటచే బయటికిఁ గనఁబఱచుచు "నీతల్లికడుపు కాల! నీదుంపతెగ! అడ్డాలదాన! విడిచిపెట్టు" మని నాలుగయిదురాళ్లు వెంటవెంట ఱువ్వఁగ నొకరాయి దానికాలికిఁ దాఁకి యది విఱిగెను. కాలువిఱిగిన బాధచే నఱచుచు జింకకాలి నచటఁ బడవేసి మూఁడుకాళ్లమీఁదఁ గుంటుచు భీతితో వీలైనంత వేగముగఁ బోయెను. కుక్క విడిచిపెట్టిన జింకకాలిని జుల్ఫా తీసికొనివచ్చుటకు వెళ్లెను. ఇంతలోఁ గాకులు గ్రద్దలు క్రమ్ముచుంట తిలకించి "ఇవి మృతసప్తముగాను! వీనితో నాకుఁ జచ్చురోజు వచ్చినది" యని యెంతో విసుగువడుచు నొక్కముండకొడుకైన ట్టగ్గఱఁ జావలేదు. వీనిదుంపతెగ. ఏమిచేయుదును?" అని కలఁత నొందుచుండెను. ఇతఁడు వెడల్పుగల చెక్కమీఁదఁ గత్తితో మాంసంబును ముక్కలుగఁ గోయుచుండఁ గాకులు గ్రద్దలు తటాలునఁ బెద్దముక్కల ముక్కునఁ గఱచికొని మింటికెగిరిపోయి యఱచుచుండెను. నైరాశ్యసమ్మిళిత క్రోధావేశంబున మాటమే యొకొక్కప్పు డతనికిఁ దోఁపకుండెను. జుల్ఫాకారుని యవస్థ నిఁకఁ జదువరులే యూహింపఁగలరు. ఇట్టిసమయమునఁ గాళిమాలి

యచ్చటికి వచ్చెను. అతనిని జూచినవెంటనే మనస్తాపము కొంత యుపశమింప జుల్ఫికారుఁడు "నాయనా నీకు నిండ నూఱేండ్లయాయుస్సు. నిన్నే యిప్పుడనుకొనుచున్నాను. అబ్బా! కాకులు, గ్రద్దలు, కుక్కలు—వీనితాడు తెగ. ఏమియేడిపించుచున్నవని చెప్పుదు? ఎన్నిదెబ్బలువిచ్చినను గదలవు. నీకడుపునఁ బుట్టెదను. కొంచెము కనిపెట్టి వీని నదలించుచుండుము. చేతిలోఁ బనిచేసికొనియెద" నని బ్రతిమాలనతని దుర్దశకు నవ్వియచట నొక లావగు దూలముండ దానిపైఁ గూర్చుండి "నీవింతగ బతిమాలనేల? ఎవరు లేరు గనుకఁ జూచుచుండెదను లెమ్ము. పాపము చాల కష్టపడితివి." అని కాశిమాలి పలికెను.

జుల్ఫా—(గిన్నెచూచి) ఇది హుజూరువారు తినుకూర. ఇట్టికూర జనానాకనేకపర్యాయములు వండితిని.

కాశిమాలి—అయితే నీవు నిజాముని వంటసాలలోఁ బనిచేసితివా?

జుల్ఫా—చేసితిని. తిండిపుష్కలముగ దొరకునుగాని, జీతము మాత్రము తక్కువ. అందువలన హుజూరు విడిచి ఖానునివెంట వచ్చితిని. నాయదృష్ట మెట్లున్నదో.

కాశి—జుల్ఫా! ఖానుఁడు మంచివాఁడు. నమ్మినవారినిఁ జెఱుపఁడు. చూడు నాకెంత సహాయముచేసినాఁడో.

జుల్ఫా—నీకు మేలుచేయుట యాశ్చర్యకరమా? పదునైదేండ్ల ప్రాయము గలిగి ముద్దులుమూటగట్టు భార్యను బ్రతికించితివి. చంద్రబింబమునకైన కళంకము కలదు గాని యామెకు వంక లేదు.

కాశి—(ఆతురముగ) నిజముగనా?

జుల్ఫా—నేనామె నీవేళనా యెఱుఁగుట? హైదరాబాదులో మాయింటి ప్రక్కననే వారిల్లు. పుట్టినప్పటినుండి యెఱుఁగుదును. కాని నన్నుమాత్ర మామె యెఱుఁగదు.

కాశిమాలి—ఇది యన్నిటికంటె నాశ్చర్యకరము.

జుల్ఫా—ఆశ్చర్యమేమి ? మా ప్రక్క వారియింటిలోఁ జాలకాలమునుండి వంటచేయుచున్నది. ఈపెండ్లిని గుఱించి నాకు సవిస్తరముగఁ జెప్పినది. మహావైభవముతో జరిగినదఁట.

కాశి—ఆఁ (ఆశ్చర్యదృష్టినిఁ గనఁబఱచుచున్నాఁడు).

జుల్ఫా—ఇది నిజము. పాప మీమె యింతముసలివాఁడైన ఖానునిఁ బెండ్లి యాడుట కెంతమాత్ర మిష్టపడలేదు. ఆమెతల్లికూడఁ బెనిమిటితో "ముసలివాని కిచ్చెదమని తలపెట్టితిరి. ముందు దానితోడివారందఱు బిడ్డలఁ గని యీడుజోడైన భర్తలతో నల్లారుముద్దుగ సంసారముచేయుచుండ మనయమ్మాయి వారినిఁ జూచినపుడెల్ల విచారపడుచుండును. పోయినప్పటి నుండి ముసలియాయన కుపచారము చేయుచుండుటతప్ప మఱియేవిధమైన సౌఖ్యము లేదు. భాగ్యమున్న నేమి ? సుఖము లేకపోయినతరువాత ? బ్రతికినంతకాల మది మనమీఁదఁ బడియేడ్చుచు." అని చెప్పి వారింపఁ జూచెను గాని, యబ్దుల్ రహిమాను ఖానునివంటివాఁడు వచ్చి యడిగి నప్పు డీయకపోయిన మర్యాదకాదనియు, నటువంటి సంబంధము మరల దొరకదనియు, నతఁడు ఖానున కే యిచ్చి పెండ్లిచేసెను. అతనితండ్రి భాగ్య వంతుఁడు కాఁడు. హుజూరులో సిపాయిగ నుండెడువాఁడు. ఖానునికి శ్రీరంగపట్టణములో నింక నిద్దఱుభార్య లున్నారఁట. కాని సంతానము లేదఁట—నాకు నాజరు చెప్పినాఁడు.

కాశి—అది మిక్కిలి విచిత్రము.

జుల్ఫా—చిత్ర మన్నఁ జిత్రమా ?

ఎవఁడో యొక పరిచారుఁ డచటి కాకస్మికముగ వచ్చినందున వారి సంభాషణ మంతటితో ముగిసెను. వచ్చినవాని నచటఁ గావలియుంచి కాశి మాలి పోయెను.

---

టిప్పూ—౬

## ఆఱవ యధ్యాయము

మఱునాటిదినమున వారందఱు బళ్లారిపట్టణములో నాగిరి. మరాటి దండు లూళ్లమీఁదఁ బడుచున్న దని జనులు చెప్పుకొనుచుండుటవలన నంది దుర్గమునకుఁ దూర్పుగనున్న త్రోవనే శ్రీరంగపట్టణమున కేఁగుటకు నిశ్చయించి ప్రయాణము చేయుచుఁ జేయుచు నొకనాఁటి సాయంకాలమున నొకచిన్న పల్లెటూరునందు దిగిరి. ఎచ్చటినుండి యేశత్రువులు వత్తురో యను భయముచే నెత్తైనగోపురము నెక్కి కాశిమాలియు ఖానుఁడును నల్దిక్కులు పరికింప దూరమున నొకగ్రామములో నిండ్లు తగులఁబడుచుండెను. వారట్లు వీక్షించుచుండ నిద్దఱుమనుష్యులు పొట్టిగుఱ్ఱముల నెక్కి స్వారిచేయుచు ఖానునియొద్దకు వచ్చి "మాయూరికి మరాటీలువచ్చి దోఁచి యిండ్లను నిప్పంటించి దక్షిణాభిముఖులై గుత్తిపట్టణమువంకఁ బోయి" రని చెప్పిరి.

ఖానుఁ డీవార్త విని భయకంపితమానసుఁ డయ్యెం గాని, కాశిమాలి ధైర్యము తెచ్చుకొని "భయపడవలదు. వా రేఁబదిమంది యని వినుచున్నాము. ఈయూరిమంచులను మనకుఁ దోడుచేసికొందము. చిన్నచిన్న దండులకే భీతినొందిన మన మేమి చేయఁగలము?" అని చెప్పి గోపురము దిగఁగనే కావలసిన మనుష్యు లగపడిరి. వారు ముదుకగుడ్డలు తొడలపఱకు బిగియించి పైగుడ్డలే తలలకుఁ జుట్టుకొని మంటవేసి చుట్టును గూర్చుండి చలి కాచికొనుచుండిరి.

వారి మొలలచుట్టు మందుకొమ్ములు, గుండ్లసంచులు, జానకి త్రాళ్లు కట్టలు వ్రేలాడుచుండెను. వారికి దగ్గఱనున్న మంటిగోడకుఁ గొన్ని బళ్లారి తుపాకు లానింపఁబడియుండెను. ఆతుపాకులపై నున్న యిత్తడికట్లు మంట వెలుతురుచే స్ఫుటముగఁ గనఁబడుచుండెను. కాశిమాలియొక్క కాలిచప్పుడు విని యెవ్వఁడో మనుష్యుఁడు వచ్చుచున్నాఁ డని చెత్తవేసి వారు మంట నెక్కువచేసిరి.

కాశీమాలి—(సమీపించి) సలామాలేకుం! మీలోఁ బెద్దనాయకుఁ డెవ్వఁడు?

చెంచు—అయ్యా నేనే పెద్దనాయకుఁడను. ఏమి సెలవు? అక్కడ నేమి చూచుచున్నాడవు తమరు ?

కాశి—ఏమి లేదు. ఊరు మండుచున్నది.

నాయ—మరాటివాండ్రు, వారి దుంప తెగ! ఒక కొంపయైన కాల్పకుండ విడువలేదు. ఊరివారందఱు నేడ్చుచున్నారు. మే మక్కడ లేక పోవుటవలన జాడ కనిపెట్టివచ్చిరి. మే ముండిన నెన్నిగుండెలు పెట్టుకొని రాఁగలరు? పిఱికినాయాండ్రు.

కాశి—మీ కిదివఱకే యీవిషయము తెలియునా యేమి ?

నాయ—ఇంత సేపా ? మాయూరికి రెండుసారులో మూఁడుసారులో వచ్చినప్పుడు వెళ్లఁదఱిమితిమి. ఒకరినో యిద్దఱినో కాల్చితిమి. తిరిగి మా యూరికి వా రెప్పుడును రాలేదు.

కాశి—దిట్టరివలె నగపడుచున్నాఁడవు. నీ పే రేమిరా ?

నాయ—అయ్యా నా పేరు నరసింగు.

కాశి—సెబాస్ ! నరసింగూ ! మేము శ్రీరంగపట్టణమున కేఁగుచున్నాము. ఈయడవులు కొండలు దాఁటుదనుక మావెంట వత్తురా ? నీ కన్నము పెట్టి దినమునకు రూపాయ యిచ్చెదము. తక్కినవారికి నీతోఁబా టన్నము పెట్టి చవలము నిచ్చెదము. ఏమందువు ?

నరసింగు—(నాయకులవైపునకుఁ దిరిగి) ఏమిరా ? మీ రేమందురు ? వారు సర్కారువారు. వారితో సబద్ధము లాడఁగూడదు.

చెంచు—అక్కడ మన మేమి సేయవలయును ?

కాశి—దొంగలనుండి మమ్ములఁ గాపాడవలయును.

నాయ—మా లింగు తుపాకి దిట్టముగ వేయఁగలఁడు.

కాశి—అతఁడు గుఱివేయఁగలఁడేమో కాని పోరాడలేఁడేమో ?

లింగ—మరాటివాఁడు తురకవాఁడు నాకు లక్ష్యములో లేరు. తన్నుగనకుఁ బడిపోరా ?

కాశి—సరి ! చూచెదము గదా!

లింగ—హైదరాలితోఁ బోరాడితిని. మావాండ్రు నన్ను సిపాయి యని పిలుతురు.

కాశి—మంచిది. మీరు పన్నిద్దఱున్నారు. మరాటీ లిచ్చట లేరు గనుక మీ యూరి కావలికి మీలో సగముమంది చాలును. తక్కినవారు మా వెంట రావచ్చును. ఏమి ? వచ్చెదరా ?

నాయ—మా కిత్తుమన్నదానిలో సగము మొద లీయవలయును ? మే మాఱుగురము వచ్చెదము. పోయిన తరువాతఁ ద్రిప్పలఁబెట్టిన వీలుకాదు.

కాశి—ఎవఁడో దుర్మార్గుఁ డట్లు చేయును, గాని యందఱు చేయుదురా ? మీరు డబ్బువిషయమై భయపడ నవసరములేదు. ఒక్కదమ్మిడి తక్కువ కాకుండ నిచ్చివేసెదము. మీకుఁ గావలసియున్నచో సగ మిప్పుడే యిచ్చెదను.

ఈసమయమున గోపురముపైనుండి "కాశిమాలి, కాశిమాలి ! పైకి రమ్ము త్వరగ రమ్ము" అని కేకలు వినఁబడెను. కాశిమాలి మాటలసడి గని ఖానుఁడు పిలుచుచున్నాఁ డని తెలిసికొని గోపురముమీఁదికిఁ బోయెను. చెంచునాయకులుకూడఁ గాశిమాలి వెంటఁ బైకెక్కిరి.

గోపురమునకుఁ గోసెడుదూరమున గ్రామము మండుచుండెను. మరాటీలు గుఱ్ఱములపై నెక్కి తిరుగుచుండిరి. ఊరిజనులు కాలుచున్నయిండ్లనుండి బయటికి వచ్చి తప్పించికొనఁ బ్రయత్నించుచుండిరి గాని క్రూరులైన మరాటీ లాజనులను గొందఱఁ దుపాకులతోఁ గాల్చిరి. కొందఱ బల్లెములతోఁ బొడిచిరి. కొందఱఁ గత్తులతో నఱకుచుండిరి. ఆక్రందనధ్వనులు వినవచ్చుచుండెను. అక్కరాతులు ఖడ్గములఁ ద్రిప్పునప్పటి ధాళధళ్యంబులు కనులకు మిఱుమిట్లు గొలుపుచుండెను. ఇట్టి దారుణప్రదర్శనంబు నిమీలితనేత్రంబు

ప్రకృతివశంబున నున్మీలితంబుగాక జ్ఞానజనకం బయ్యెనేని, ధ్యాననైశ్చల్యు లగు యోగుల నిస్త్రైగుణ్యచిత్తంబుసహిత మాపర మిక సుకృతపరాయణత్వంబు త్యజించి నిరుపకరణ ధర్మాయత్తంబై కరుణారసపూరితంబు గాదె !

ఆ క్రూరులు తమపైకివత్తురేమో యని ఖానుఁడు భయపడుచుండెను. కాశిమాలి ధైర్యచ్యుతి లేక యాయుధములు సిద్ధముచేసికొని తనవెంట వచ్చు చెంచునాయకులతో మరాటీలఁ దఱుమ నుపాయ మాలోచించుచుండెను. ఖానుఁడు క్రిందికి దిగి మరాటీవండ్రు వచ్చుచున్న దని యూరఁ జాటించి భార్యను గోపుర మెక్కించుటకై యామెయొద్దకుఁ బోయెను. పురజనులందఱు దండు రానేవచ్చె నని యుఱ్ఱికిపడిలేచి ప్రాణములు రక్షించికొనుటకై గోపుర సమీపమునకుఁ బరుగెత్తిరి. ఆతొందరలోఁ గొందఱు ముసలివాండ్రను వీపుపై నెక్కించికొని త్వరత్వరగఁ బోవుచుండిరి. తల్లులు కొందఱు మంచము మీఁదనున్న పిల్లలను మఱచిపోయి కొంతదూర మేఁగిన తరువాత జ్ఞాపకమునకు రా నేడ్చుచుఁ దిగిగి వచ్చుచుండిరి. సుఖదుఃఖాది ద్వంద్వంబులయందును దమ నైసర్గికవిలాసంబును యువతులు వదలరేమో యని తోఁచుభంగి గర్భిణులు మందమందగమనంబులతోడనే రక్షణస్థానమునకుఁ జనుచుండిరి. బీదలు పైగుడ్డలతోడనేఁ బరుగిడుచుండిరి. భాగ్యవంతులు తమపిల్లల మొదటఁ బంపి పెట్టె బేడ సవరించికొని గోపురమునొద్దకు వెళ్లి కొడుకులఁ గూఁతుల నెక్కడ నెక్కడ నని పిలుచుచుండిరి. ఆనాఁటిరాత్రి జనులయాందోళన మింతింత యని వచించుటకు వీలులేదు. ఎచ్చటఁ గాగడా యగపడిన నదిగో వచ్చె, నిదిగో వచ్చె నని బెదరుచుండిరి. వృద్ధులు పిల్లలను బగ్గఱఁ గూర్చుండఁబెట్టికొని యంతకుఁ బూర్వము తా మనుభవించిన దండుబాధలను గథాఫక్కిం జెప్పుచుండిరి. జను లొకరి నొకరు చీకాకుగఁ బిలిచికొనుచుండిరి. ఖానుఁడు భార్య నాపాదమస్తకము గప్పి వెంటఁబెట్టికొని గోపుర మధిరోహించెను.

అమీనా——అయ్యో! నన్నీచీకటిగదిలోఁ బడవేయుదు రేమి ? నే నొక్క దాన నుండలేను. మీతో నుండెదను. నేను శూరుని పుత్త్రికను. పురుషులు

చేయు క్రూరకృత్యములను సాహసకార్యములను జూడఁగలను. మీ పుణ్యము ! రానిత్తురు.

ఖానుఁడు——అచ్చటి కెంతమాత్రము రాఁ దగదు. దండు పైనిఁబడినప్పు డెంత కష్టము? అదియుంగాక మగవారు చాలమంది కలరు. నలుగురలోనికి రావచ్చునా? ఊరిజను లందఱు పరుగిడుచు వచ్చుచున్నారు. ఇంకఁ గొంద ఱీగదిలోనికి వచ్చెదరు. నీకు భయములేదు.

అమీనా——నే నొక్కర్తనైన నను భయములేదు. ఇట్టి యాపత్సమయమున స్త్రీలతో నుండుటకంటెఁ బురుషులతో నుండవలయు నని నాయభీష్టము.

ఖానుఁడు——ప్రస్తుత మిచ్చట నుండుము. సమయము వచ్చినప్పుడు పిలిచెదను.

ఖానుఁ డమీనా నచ్చట నుంచి కాశిమాలియొద్దకుఁ బోయి యనంతర కర్తవ్య మాలోచించుచుండఁ గొందఱు చావుబ్రతుకులమీఁదఁ బరుగిడుచు వచ్చి "మరాటీలు వచ్చిరి ! వచ్చిరి ! భద్రముగ నుండుఁడు. మాయూరు ధ్వంసముచేసి మీయూరికి వచ్చుచున్నారు!" అని యఱచిరి. కాశిమాలి వారిలో నొకనిని సమీపమునకుఁ బిలిచి మరాటీ లెంతదూరమున నున్నా రని సెప్పుమని యడిగెను. "ఇదిగో క్రోసెడుదూరమున నున్న పిల్లేఱు దాఁటుచున్నారు" అనియతఁడు చెప్పెను. ఖానుఁడు, కాశిమాలియుఁ జెంచునాయకులును మహాశులఁ గత్తులఁ బూని సిద్ధముగ నుండిరి.

"మరాటీ లుత్తరదిశనుండి వత్తురు. ఉత్తరపు గవనుగుండ వారు వచ్చునడి గనిపెట్టి యచ్చట నున్న పూరిగుడిసె యొకటి రగులఁబెట్టుఁడు. వారెందఱో స్పష్టముగఁ జూడవచ్చును" అని యాయూరిమునసబు కొందఱఁ దఱిమెను. తరువాత "అఱవఁబోకుఁడు. అఱవఁబోకుఁడు" అని కాశిమాలి జనుల నివారించెను. దండు దగ్గఱకువచ్చుచున్నదని భయము హెచ్చెను. భక్తవరుల హృదయంబునందు దైవధ్యానమువలె నప్పుడు జనుల చిత్తములందు భావిభయంబుతప్ప వేఱొండు లేకుండెను. అందఱు నిశ్శబ్దముగ నుండిరి. చంటి పిల్లల యేడ్పులుమాత్రము వినవచ్చుచుండెను.

# ఏడవ యధ్యాయము

కాశిమాలి—అదిగో అది యేమో విను.

ఖానుఁడు—(చెవి యొగ్గుచున్నాఁడు.)

మొదట నొకకుక్క యఱచెను. తరువాత గొల్లున నూరనున్న కుక్కలన్ని భయంకరముగ మొఱుఁగసాగెను. 'దగ్గఱకువచ్చిరి. సిద్ధముగనుండి యగపడఁగనే కాల్పుఁడు' నని చెంచునాయకులకుఁ గాశిమాలి చెప్పెను. మునసబు పంపిన మనుష్యు లుత్తరపు గవనునొద్ద నున్న పూరిగుడిసెకు నిప్పంటించిరి. మొదలుమంట చూరుల నంటెను. తరువాత నింటికప్పు క్రింద రగులుటవలన గోపురముపైనున్న కాశిమాలి మొదలయినవారికి వెలుతురు స్ఫుటముగఁ గనఁబడకపోయెను. ఎంతసేపటికిని మంట పెద్దది గాకుండుట చూచి 'వాసములు దూసిన బాగుగ నుండు' నని ఖానుఁడు పలికెను. గుడిసెవద్ద నున్నవారిలో నొకఁ డీ ఖానునిమాట వినెనేమో యనునట్లు సాహసించి రెండువాసముల దూసెను. ఒక్కసారి భగ్గుమని నిప్పిల్లంతట నంటుకొని మండసాగెను. వేయి కాగడాలు వేసినంత వెలుతురు వచ్చెను.

---

# ఏడవ యధ్యాయము

ఈ మంటయొక్క ప్రయోజనము మరాటీలు గ్రహింపఁజాలక వెలుతురున నత్యంతోత్సాహముతో రాఁజొచ్చిరి. వారు గ్రామమును సమీపింపఁగనే కాశిమాలియు నాయకులును దుపాకులఁ గాల్చిరి. "మందు కూర్చుటకు వ్యవధి లేదు. సిద్ధముగనున్న యింకొక తుపాకి యందిమ్ము. ఏమి? ఎవరు నచ్చట లేరా?" యని కాశిమాలియఱచెనుగాని యాకలవరమునం దతనిమాట వినినవారు లేరు. తుదకు నిండుగ ముసుఁగు వేసికొనిన యొకస్త్రీ సంభ్రమమున నందిచ్చెను. తుపాకినంది కాశిమాలి వెనుకకుఁ దిరిగిచూడ నందిచ్చుటలో మరుద్వశమున ముసుఁగు తొలఁగి నిర్గతరజోవరణంబైన పుష్పంబుమాడ్కి నలరుచున్న యువతీరత్నమును గనుంగొని యమీనా యగుట గ్రహించి

సచ్చరిత్రమనస్కుండై సత్ప్రసవశూరుండు గావునఁ జిత్తం బన్యాయత్తంబు గానీక శత్రుభంజనమునకుం బూని తుపాకిసిఁ గాల్చెను. సూటిగఁ దాఁకి యిద్దఱు మరాటీలు క్రిందఁబడిరి. తక్కిన నాయకుల దెబ్బలకు మఱియిద్దఱు పడిరి. నల్వురు హతులైనతోడనే మిగిలినవారు స్వస్వప్రాణావనోద్యుక్తులై పరుగెత్తిరి. కాశిమాలి గోపురము దిగి వారిని వెంబడించి ఖడ్గముతో మరల నిద్దఱిఁ గాలునిపురి కనిపెను.

కాశిమాలికిఁగూడ రెండు కత్తిదెబ్బలు ఱొమ్మునఁ దాఁకెను. మరాటీల పండంత పంచబంగాళమై పోయెను. శాత్రవపరాభవంబు పూర్తిగ నొనర్చి వస్త్రస్థగిత వక్షోనిర్యద్రక్తంబుతోఁ గాశిమాలి వెనుకకుఁ దిరిగెను.

ఖానుఁడు—ప్రాణవల్లభా! చూడుము కాశిమాలి వచ్చుచున్నాఁడు. మనకొఱ కింత పాటుపడిన యీపురుషవరేణ్యుని నాదరించుట మనకు ధర్మము. ఎదురుగఁ బోయి యతనిఁ దీసికొనివత్తము రమ్ము.

అమీనా—పాప మతని శరీరమున నెన్నిగాయములు పడియెనో! ఎన్ని దెబ్బలు తగిలెనో! ప్రాణమునకుఁ దెగించివచ్చిన యీదుష్టు లూరకుందురా?

ఖానుఁడు—కొదండే కాదు. ఇట్టివి పదివచ్చినను గాశిమాలికి లక్ష్యము లేదు. అతఁడు మహాశూరుఁడు; వీరాగ్రేసరుఁడు. అతఁ డెట్టియపాయమును బొందఁడు.

అమీనా—(నిట్టూర్పు విడుచును.)

వీరిద్దఱట్లు సంభాషించి యతనికెదురుగఁ బోయిరి. పగులఁబడి చూచుచున్న జనములో సందులేక నెట్టికొని నెట్టికొని కాశిమాలి ఖానుని సన్నిధికిఁ బోయెను. వెలుతురు బాగుగనుండనందునఁ జాకలవానిని కాగడా యెత్తు మనిరి. వాఁడు నట్లు చేసెను.

అమీనా—అల్లా! అల్లా! ఇంచుకనుండి యగపడలేదు. చావుదెబ్బలు

తగిలినవి. గుడ్డలన్ని నెత్తుటఁ దడిసినవి. (అని యాతురము చూపి కాశి మాలి దగ్గఱకుఁ బోఁబోయెను.)

ఖానుఁడు—ఛీ! ఛీ! వెనుక నుండుము. శత్రువులరక్తమును మా రక్తమును జూచుటకు నీవుత్సాహపడవలయును. (కాశిమాలిం జూచి) అంత పెద్ద దెబ్బ పగిలినదా? కాశీం.

కాశిమాలి—ఆదుర్మార్గులలో నొకఁడు అరొమ్ముమీఁదఁ గత్తితోఁ గొట్టెను. అయినను నా కది లక్ష్యము లేదు. శౌర్యసంపన్నులైన యోధు లీపాటి ఖడ్గఘాతములకు నొచ్చుదురా?

ఖానుఁడు—కొద్దిదో గొప్పదో గాయము పడినది కదా! తగిన చికిత్స వెంటనే చేయవలయును. వ్రణవైద్యమునందు నాకుఁ గొంతపరిచయము కలదు. (భార్యం జూచి) అమీనా! గట్టి గుడ్డపేలిక తెమ్ము. కట్టుగట్టుదము. జులేఖా! గిన్నెతో నీళ్లు కొనిరమ్ము. కాశిమాలీ! చొక్కా విడిచి గుడ్డ తీయుము. ఎంత గాయమో చూతము.

అంతటఁ గాశిమాలి గాయమునకొత్తుడు తగులకుండఁ జొక్కా విడిచెను. గాయమును జూచి సుమారు పదిదినములలో మానునని ఖానుఁడు చెప్పెను. ఇదివఱకు వ్రణములను గూర్చి కర్ణాకర్ణిగ వినియుంట తప్ప స్వానుభవముచేఁ గాని పరబాధావీక్షణమువలనఁ గాని యమీనా యెఱుఁగదు. బాహుమూలలో పరిభాగము మొదలు వక్షోదేశంబువఱకు సగముమట్టున కంగుళముల లోతున దాడిమఫలముయొక్క పగులురీతి నున్న యాగంటిని జూచి భయకంపమానయై కాశిమాలి యెట్లోర్చెనో యని వగచి పటచ్చరశకలంబులం దెచ్చి యిచ్చెను. ఖానుఁడు వ్రణబంధ మొనర్చునప్పుడ నవసరోచితముగ నొకప్పుడు బుజమెత్తి పట్టియు నొకప్పుడు అరొమ్ముమీఁది గుడ్డ కదలకుండఁ బట్టియుఁ బెనిమిటికి సహాయము చేసెను.

మల్లికామంజరీ సమాన మార్దవంబైన యమీనా హస్తముయొక్క శీతలస్పర్శమునం గలిగిన సంప్రమోదాతిశయముచేఁ గాశిమాలి పరవశుఁ

డయ్యెను. మన్మథవికారం బగ్గలంబయి యనివార్యంబైన ప్రేమానుబంధంబు త్రెంపఁజాలక కాశిమాలి యప్పుడప్పు డా నారీతిలకంబు ముఖవికాసంబును కపోలవిలాసంబును బ్రగండమార్దవంబును బ్రకోష్ఠసౌకుమార్యంబును శరీర సౌందర్యంబును గచభారసౌభాగ్యంబును దలఁచి తలఁచి యవి తన మనోభీష్టంబు నెప్పుడు తీర్చునో యని యువ్విళ్లూరుచుఁ, దుద కవి గగనపుష్పంబులుగను నందనిమ్రానిపండ్లుగను విషధరఫణాంతర్మణులుగను నాదర్శాంతర్గ ప్రతిచంద్రకళలుగను భావించి నిరాశ చెందుచుండువాఁడు, కాని యామె కరస్పర్శనం బీతీరున నీకొలఁదిదినములలో ననుభవింపఁగల నని నెంచినవాఁడు కాఁడు. పౌరుషముకంటె దైవమే బలవత్తరమని చెప్పువారి కిట్టి యాదృచ్ఛికఫలంబులు ప్రమాణభూతంబు లనుటకు సందియములేదు. తన యొద్దఁ గూర్చుండి కట్టు కట్టినపు డామె వదనంబును గనులారఁ జూడవలె నని కాశిమాలి యిచ్చగించెను; గాని ముసుఁగులో నుండి స్ఫుటముగఁ గానరాదయ్యె. నల్లనికాంతులఁ గ్రక్కుచున్న కనుంగవమాత్ర మతని కంటఁబడెను.

ఖానుఁడు—అమీనా! ఇంకొక వెడల్పుగల గుడ్డపేలిక తెమ్ము. పైనివేసి బిగింపవలయును.

అమీనా—(తెచ్చి) ఇదిగో చాలునా? ఇంకొకటి కావలయునా?

ఖానుఁడు—చాలును.

కాశిమాలి—మీ ఋణము నే నెట్లు తీర్చికొనఁగలను! కడుపునఁ బుట్టిన కొడుకునకుఁ జేయునట్లు చేసితిరి. నేను మీ సేవకులలో నొకఁడను. మీవలన నిట్టి యుపచారము చేయించికొనుటకుఁ దగుదునా?

అమీనా—<br>ఖానుఁడు— } కాదు కాదు. అట్లనఁబోకు. నీవు మాకుఁ గుమారునివంటి వాఁడవు.

అనంతరము కాశిమాలి "ఛీ! నన్ను వారు కుమారునివలె భావించుచుండ వాయుభంగిఁ జంచలమైన నాబుద్ధికి దుర్మార్గపుఁ దలఁపును పుట్టు

చున్నవి. దీపమును జూచి భ్రమించి దానిచుట్టును దిరిగి తుదకు దానంబడి మడియు పురుగురీతి సంచరించుచున్నవాఁడను. జ్ఞానసుఖప్రాధాన్యంబైన సత్వగుణంబునకుఁ బ్రమాద మోహముఖ్యం బగు తమోగుణంబునకు నెంత యంతరంబు! ఇంద్రియార్థంబుల నన్వేషించు బుద్ధివిశేషంబునకు ధర్మసూక్ష్మ ములం జూరరాని స్థూలదృష్టియే యహంకారంబు గావున సాత్వికదృష్ట ధర్మ విశేషంబు లగోచరము లగుచున్నవి. అమీనాను గుఱించి నేను దలంచుట యవివేకంబు గాని వేఱుకాదు. కాని ప్రతినిమిషము కనులలో మెదలు చున్న యామె ముఖేందుబింబము నెట్లు మఱచిపోఁగలను?" అని పలువిధ ములం దలపోయుచుండ "నిద్దురపొమ్ము. కనులు మూయుము. నెత్తురు కాఱుట తగ్గును." అని ఖానుఁడు చెప్పి తుపాకిదెబ్బలచేఁ జచ్చినవారి శవము లేమైనవో చూచుటకు వెళ్లెను. కాశిమాలి యలసి సొలసి య
డగుటచేఁ గనులు మూసినతోడనే నిద్రపట్టెను. ు చాలించెను.

అమీనా యనతిదూరమునఁ గూర్చుండి యుండెను. దండును నిద్దురపట్టినదేకాని గాఢమైనది కాదు. గాయముయొక్క బాధచే నడఁగెను మాటిమాటికిఁ బొరలుచుండెను. ఖానుఁడు వచ్చుట కడవాయెలేకుండె. సమయమున మృత్యువక్త్రమునుండి మఱియొకపరి నుపద్రవంబులు, తనను రక్షించి తనకొఱకు ఖడ్గఘాతంబులం బొంది యెదుటఁ బడియున్నకాశి మాలిని వదలిపెట్టి పోలేక యమీనా యచటనే కూర్చుండి పలుతలంపులు బుద్ధికిఁ దట్టుచుండ మనస్సును బట్టలేక తుద కతని సమీపమునకు జరిగి యతని మోమును దిలకింప మొదలిడెను. ఆప్రక్కకు నీప్రక్కకు మసలు టలోఁ గాశిమాలి ముఖముపై దీపపు వెలుతురు పడినప్పు డతని పెదవులు కదలుచున్నట్లు కనంబడ నేమో మాటలాడుచున్నాఁ డని చెవియొగ్గి వినెను గాని శబ్దము కర్ణగోచరము కాకపోయెను.

కొన్ని నిమిషములు గడచినతరువాత "మరాటీలు-నిప్పు-తుపాకి-పడ". అను మాటలు వినవచ్చెను. తరువాత నఱగంటవఱకు నేమియు వినఁబడలేదు.

"కలవరింత యణఁగినది. ఇంతటఁ గంటినిండ నిద్రపోయిన బాగుగ నుండును. ఎంత యాయాసపడెనో" యని యమీనా యనుకొనెను గాని మరల నస్ఫుటధ్వని లక్షనినోటినుండి శ్రోత్రప్రాప్తము లాయెను. ఆమె యింకను సమీపమున కేఁగి చెవిదార్చి వినఁగా "అమీనా! అమీనా!" యని రెండు సారులు ప్రస్ఫుటము మృదుస్వరములు శ్రవణపుటంబులఁ బడియెను. పడిన తోడనే హృదయం బుత్క్షేపణాపక్షేపణగతుల సంచలించి యపస్మృతమైన యాత్మకాంత్యంబు పగులువడఁ గొంతవడి కిట్లు చింతించెను. "ఈయనకు నా పేరు కూడఁ దెలియును. పోరాడుచున్నను, బాధపడుచున్నను నన్ను మాత్రము మఱచినవాఁడు కాఁడు. కలలోఁగూడ నన్ను గుఱించి తలంచుచున్నాఁడు."

యొద్దఁ గొంత తలపోయుచుండ ఖానుని కంఠస్వరము వినఁబడెను. గాశి నని కాశీమాలిక లేచి యామె శీఘ్రముగఁ దెరచాటునకుఁ బోయెను. దయ్యో. నల్లనిక్కి నిద్రపోవుచున్న కాశిమాలిం జూచి యింపునకు 'డి యెవ

ఖానుఁడు— కేఁ దోఁడుండిరా యని వెంటవచ్చుచున్న దాదు నడిగెను.

బిగిఁయు తమవద్దనే యుంటిమి. అందువలన నిచట నెవరు నుండుటకు అమీన పోయె"నని యతఁడు చెప్పెను. "మనవంటవాఁడు పనిపాటలు లేక ఖా న్నాఁడు. వాఁడు కావలియుండునట్లు చేయుము" అని ఖానుఁ డాజ్ఞాపించెను. దాదు జుల్ఫుదగ్గఱకుఁ బోయి లేపి "కాశిమాలియొద్ద నీవు కావలి యుండవలసిన దని ఖానుఁడు చెప్పెను. కనుక నచ్చటఁ బరుండుము. నిద్రపోకుము. తెల్లవాఱుటకుఁ గదలఁగూడదు" అని వాక్రుచ్చెను.

జుల్ఫు— (మూల్గుచు లేచి కన్నులు నలుచుకొనుచు) నిద్రపోవువానిని లేపితివి. ఏమిటి? మరలఁ జెప్పు. కావలి యుండవలెనా?

దాదు— ఎన్నిసారులు చెప్పవలె? కాశిమాలియొద్దఁ దెల్లవాఱుదనుకఁ గావలి యుండవలె నని చెప్పలేదా?

జుల్ఫ—నే నక్కడ నొక్కడ నుండలేను. తెల్లవాఱ వచ్చినది. ఇంతలో నీవుమాత్ర మేమి నిద్రపోవుదువు? మన మిద్దఱ మొకరికొకరు తోడుగ నుండుదము రమ్ము.

దాదు—కనులు మూఁతపడుచున్నది. మరాటీల యల్లరి గడచి ఖానుఁడు, మేము, నిప్పుడే యిల్లు చేరితిమి. ఇంతవఱకు చెప్పవాల్ప లేదు. నీవు కాలైనఁ గదలించినవాఁడవు కావు. నీ కేమి తీపులు? అదిగాక యేమిభయము కలదు? నేను మీకు సమీపముననే పరుండెదను! ఉపద్రవము కలిగిన నన్నుఁ బిలువుము. మరాటీల ధ్వంసముచేసిన కాశీమాలియే యిచ్చట నుండ భయ మెందుకు ?

జుల్ఫ—ఇన్ని మాటలు చెప్పువాఁడవు నీవుందువా? నేనొక్కఁడనే యుండును లెమ్ము.

అంతటనిశ్శబ్దముగ నుండెను. కుక్కలుసైతము మొఱుఁగుట చాలించెను. ఖానుని పరిజనమంత గుడ్డలుకప్పుక మైమఱచి నిద్రించుచుండెను. వందును జూచి భయపడిన యూడువారి యఱపులును బిల్లలమొద్దులు నణఁగెను రోదసీకుహరంబునందు ధ్వనిజనితంబులైన వాయుతరంగంబులు లేకుండె. కాని సెగల్లోవేసి చుట్టును గూర్చుండిన మనుష్యుల పరస్పర సంభాషణంబులు, నింతకుముందే పట్టుకొనఁబడి యశ్వశాలలోఁ గట్టివేయఁబడిన మరాటీగుఱ్ఱము యొక్కసకిలింతలును మాత్ర మప్పుడప్పుడు వినవచ్చుచుండెను. కాశీమాలి కలవరించెను. జుల్ఫన క్రామాటలు స్పష్టముగ వినఁబడనందున యుద్ధమును గుఱించి, మరాటీలను గుఱించి కలవరించుచున్నాఁడని తలంచెను. కొన్ని నిమిషములు గడచినపిమ్మట 'అమీనా! అమీనా!' యని కాశీమాలి బిగ్గరగఁ గలవరించెను. అది జుల్ఫ విని "అమీనాను గూర్చి యతఁడు కలవరించుచున్నాఁడు. పాప మాపె కావృద్ధుఁడుకాక యుపఁడు పెనిమిటియైన నీడు జోడు కుదిరియుండును. అయ్యో ! కాశీమాలి యమీనాను దలఁచుటలేదే మో! అమీనా యను పేరుగలస్త్రీ యింకొకతె యుండఁగూడదా? అన్నెము

పుణ్యము జేవుఁ డెఱుఁగును. నాకీచింతయేల?" యని మనస్సులో ననుకొనెను. కాశిమాలి కొంతసేపటికి గన్నులు తెఱచి "ఓహో జుల్ఫా! నీవిచ్చట నుంటివా? నీకు నిద్రపట్టలేదా" యని యడిగెను.

జుల్ఫా—అయ్యా కాదు. మీ వద్దఁ గావలియుండు మని ఖాదరుఁడు నాకాజ్ఞ యిచ్చెను. కనుక నుంటిని. తమరేమో కలవరించుచున్నారు. నిద్రపట్ట లేదు కాఁబోలును.

కాశిమాలి—ఏవో స్వప్నములు వచ్చుచున్నవి. రహస్య మేమి లేదు. కలల కేమిగాని యీ బొమ్మమీఁది కట్టు మిక్కిలి బాధించుచున్నది. మంగలవానిని బిలువుము. కట్టువదలించి బాధ తగ్గించును.

జుల్ఫా—మంగలవాఁ డెందుకు? మీ సెలవైన నే నాపని చేయఁగలను. పంట నేర్వకముందు మంగలపని చేయుచుండెడువాఁడను.

కాశిమాలి—కానిమ్ము. ఈసమయమున మంగలవాఁడు దొరకఁడు. నీవే నేర్పు కొలఁది వదలింపుము.

జుల్ఫాకారుఁ డివివఱ కాపనులు చేసియున్నవాఁడు గావున మెల్లఁగఁ గట్టు వదలించెను. నెత్తురు కాఱుట యాగినది. కాశిమాలికి నొప్పి తగ్గినది. జుల్ఫా హుక్కాను దెచ్చి యొసఁగఁ ద్రావుచు నతఁ డామాటయీ మాట నాడుటలోఁ బ్రసంగవశమున "మీ యూరెయ్యది" యని మొదలగు విషయములను జుల్ఫా నడిగెను. అమీనానుగూర్చి ప్రశ్నింపవలయు నని కోరెను గాని యతఁ డేమి తలంచునో యని యూరకుండెను.

జుల్ఫా తన పూర్వోత్తరము లన్నింటిని జెప్పుచు నిజసహోదరీనామము కూడ నుపహరింప "అమీనా పుట్టినింటిలో వంటకత్తెగానున్న దని వెనుకఁ జెప్పితి. ఆమె పేరే యిదియా?" యని కాశిమాలి యడిగెను.

జుల్ఫా—ఆమెయే. ఆమె కొంతకాల మమీనాదాదిగ నుండెను. అమీనా కామెమీఁద నెంతయో ప్రాణము.

కాశిమాలి—అయితే యామె నమీనా యేల యిచటికిఁ దెచ్చినది కాదు?

జుల్ఫా—అమీనా రమ్మనినది కాని ఖానుఁ దక్కఱలే దనెను.

కాశిమాలి—అమీనా కిష్టము లేకపోయెను గాఁబోలు.

జుల్ఫా—ఇష్టము కాదు! మా అక్కను విడిచి రాలేక రాలేక అమీనా వచ్చినది. వచ్చినప్పు డిద్దఱము నొకరి నొకరు కౌఁగిలించికొని యేడ్చిరి.

కాశిమాలి—అయితే యమీనాను గూర్చి నీవు తఱచుగ వినియుందువు.

జుల్ఫా—తఱచేమి? లక్షసార్లు వినియుంటిని. లేచినది మొదలు మాయక్క యామెను వదలిపెట్టియుండునది కాదు. ఆమె నాకనేక పర్యాయములు చెప్పినది.

కాశిమాలి—మంచిది. అమీనాను ఖానుఁ డెట్లు వివాహమాడినది నీవు పూర్తిగ నెఱుఁగుదువు. ఖానుఁడు గొప్పవంశమువాఁడు కాఁ డని యొక పర్యాయము చెప్పితివి.

జుల్ఫా—మరలఁ జెప్పెదను వినుము. అమీనా తండ్రి నైజాము కచ్చేరిలో ముక్‌సబ్‌దారుగ నుండెడువాఁడు. నెలకు రెండువందల రూపాయలు జీతము గలవాఁడు. అతనికి రెండు మూఁడు గ్రామముల జాగీరుకూడఁ గలదు. నిజాము సర్కారునకుఁ గొన్నియిబ్బందులు కలుగుటవలన ధనము చాలక నౌకర్ల జీతములు కొన్నినెలలవఱకు నీయకపోయిరి. అప్పటినుండి యమీనాతండ్రికిఁ గష్టములు ప్రాప్తించెను. పైనుండి కాసువీసము రాక పోయినను, బాగుగ బ్రతికినవాఁడు గావున, మర్యాదకు హానివచ్చునేమో యని యప్పులుచేసి యథాప్రకారముగ గృహనిర్వహణ మొనర్చుచు వచ్చెను. వడ్డి యపరిమితముగఁ బెరుఁగ నప్పులవారు బాధింపసాగిరి. ఒక దాని వెంట నొకటి గుఱ్ఱములు నేనుఁగులు పోయెను. అతఁడు దాసదాసీ జనముల, వెలగల రత్నముల నమ్మివేసెను; భార్యయొడలిమీఁది సొమ్ములఁ గుదువపెట్టెను. రానురాను ఋణబాధ యధికమాయెను. చివఱకు జాగీరు గ్రామములుకూడఁ దాకట్టు వెట్టెను. ఈసమయముననే యమీనాకుఁ బెండ్లియీడు వచ్చెను. ఆమె చక్కఁదన మంచఱకుఁ దెలిసియుండినందున

మనువు లనేకములు వచ్చెను గాని యతఁ డిష్టపడలేదు. నబాబు పెద్దకొడుకే యామెను వివాహమాడుననియు, నందువలన తనకు లాభముకలుగుననియు, నతఁడు తలంచుచుండెను. ఇక్కాలమునఁ జక్కని పిల్లను పెండ్లాడవలయు నని ప్రయత్నించుచున్న ఖానుఁ డీమెను గుఱించి విని యతని నడుగ ధన వంతుఁ డగుటవలన వంశమును వయస్సును విచారింపకయే కూఁతు నొసఁగు టకు సమ్మతించెను. ఖానుఁడు వివాహమునకు లక్షరూప్యములు వ్యయము చేసెను. పెండ్లిమిక్కిలి వైభవముతో జరిగినది. కాని యామె—పాపము— దేశముకాని దేశములో నెంత కష్టపడుచున్నదో ! అప్పు డ ట్లేటిలోఁ బడినది. ఇప్పు డీమరాటిపందువచ్చినది. ఇఁకముం దెన్ని కడ గండ్లు రాఁగలవో. మీకడుపు చల్లగాను—మహారాజులు—మీ వంపుంటు వలన నామె ప్రాణము, మానము, దక్కినవి. ఈప్రాయములో నామె బయటికి వచ్చి యిక్కట్లఁబడవలసిన రోజులా ? జనానాఖానలో నీడు జోడు కుదిరిన మగనితో సుఖింపవలసిన రోజులు.

కాశిమాలి—(నిట్టూర్పువిడుచుచు) అంత చక్కని లేఁబ్రాయపుస్త్రీని నిట్టి ముసలివా నికిచ్చుట గొంతుకోయుట గాని వేఱు కాదు. (ఆత్మగతముగ) ధన మెంతపనియైనఁ జేయఁగలదు. తాను పెంచిన విషవృక్షమునైనను స్వయముగఁ గోయుటకు సత్పురుషులకుఁ జేతులు రావు. ఆహా! స్వసంతా నముపై జంతువునైసర్గికమైన ప్రేమను వీడి “నాయనా! నాయనా!” యని దగ్గఱకువచ్చి పైపైఁ బ్రక్కనఁ బడి బయట నెవరు కొట్టిన నెవరు తిట్టినఁ దమతోఁ జెప్పుచు, సుఖము లొసఁగను దుఃఖములు తీర్చను దలి దండ్రులు తప్ప నింక నెవ్వరు లేరని నమ్మియున్న బిడ్డల, పయూపాక్షిణ్య ములు లేక, ద్రవ్యాయత్తమనస్కులై యంగవైకల్యులకు, రోగపీడితు లకు, నీచవంశజులకు, షండులకు, వృద్ధులకు నిచ్చి వారిజీవితమును గడ గండ్లపా లొనర్చు క్రూరుల హృదయంబులు కర్కశపాషాణంబులో కర్కశతరలోహంబులో, కర్కశతమవజ్రంబులో తెలియరాదు. ఇట్లా

గుడ్డలంగైతము తీసికొనియ నుద్యమించిన వారందఱు నీకనుమలలో సాలువులు కంబళులు దుప్పటులు కప్పికొన మొదలిడిరి. ఇబ్భంగిఁ బ్రయాణము చేసిచేసి సైన్యరక్షితంబైన యొక గ్రామము చేరిరి. కాశిమాలి క్షతదేహుండై యుండి నందువలన విశ్రాంతికై యాయూర మూఁడుదినములు నిర్భయముగ నాగిరి. చుట్టుప్రక్కల నడవులలో మరాటీలు గలరేమో యను ననుమానముచే వారినిఁ దఱుముటకై రౌతులు కొందఱు నల్దిక్కులకుఁ బోయిరి కాని వారు కనఁబడరైరి.

---

## ఎనిమిదవ యధ్యాయము

ఖానునిఁ దత్పరివారమును శ్రీరంగపట్టమునకుఁ బోవుత్రోవలో విడిచిపెట్టి గ్రంథకర్త సామాన్యస్వాతంత్ర్యము వహించి మాచదువరులను హఠాత్తుగ ద్వీపాంతరమునకుఁ గొంపోవుచున్నాము.

ఈకథాక్రమము సుబోధముగ నుంటకై కొన్ని సంవత్సరములు వెనుకకుఁ బోయి యాంగ్లేయదేశ సందర్భములఁ దెలిసికొందము. 1785-వ సంవత్సరము డిసంబరు నెల శీతలసాయంకాలమున నింగ్లాండులో నొక గ్రామమునం దనుకూలురైన దంపతు లిద్దఱుకుమారులతోడను ముగ్గురుకూఁతులతోడను గలసి యుత్సాహకరమైన మంటచుట్టును గూర్చుండియుండిరి. ఆకుటుంబికుని పేరు కాంటను. కుమారు లిద్దఱిలో నెడ్వర్డను నతఁడు, సెలవుదినము లైనందునఁ గళాశాలనుండి యింటికి వచ్చియుండెను. రెండవకుమారుని పేరు చార్లెసు. ఈతఁడు చిన్నతరగతిలోఁ జదువుచుండెను. ఎడ్వర్డు చార్లెసుల మధ్యమున నొకకూఁతురు, నీమె తరువాత మఱియొకకూఁతురు, నొకచంటి పిల్లయును నుండెను. కొడుకులు కూఁతులు నీరీతి నొకచోటఁ గూర్చుండి సల్లాపములు జరుపుచుండునప్పుడా తలిదండ్రుల కానందబాష్పము లుత్పన్నములైన వని చెప్పుట యాశ్చర్యకరము గాదు. చిత్రలేఖనమునందున్న

సంగీతసాహిత్యములయందును బ్రవీణతగలకాంప్టను సంఘమునందు గౌరవింపఁబడుచు బంధుమిత్రులచేఁ బ్రేమింపఁబడుచుండెను. ఆంగ్లేయులలో నాఁడు వారినిఁ బిలుచునప్పుడు వివాహము కానియెడలఁ దండ్రి పేరునకు ముందు "మిస్" అనియు, విపరీతంబునఁ బెనిమిటి పేరునకు ముందు "మిసెస్" అనియుఁ జేర్చి పిలిచెదరు. ఈయాచారము ననుసరించి కాంప్టనుభార్య పేరు మిసెసుకాంటను.

ఈమె సంగీతమునందు మిన్నయై వ్రీడాభరసూచకంబైన ముఖవికాసంబు గలిగి స్త్రీసహజధర్మంబుల నొకింతయుఁ గొఱంతలేక పెనిమిటి హృదయము నాకర్షింపఁ గలిగియుండెను. పశ్చిమదేశములందు స్త్రీలందఱు సాధారణముగ విద్య నేర్చియుందురు. మిసెసుకాంటను విద్యావతి గనుక బిడ్డలయందు మిక్కుటముగ నపేక్ష కలిగియుండినను వారు తప్పుచేసినప్పుడును దుష్పథమునందు మెలఁగుచుండినప్పుడును దండించుటకు వెనుదీయునది కాదు. ఈతీరునఁ జెప్పినమాట వినునట్లుగ నొకరినొకరు ప్రేమించునట్లుగ జాగరూకతతో నామె పిల్లలఁ బెంచెను. ఆజ్ఞాశీలతతోడ నదుపుతోడఁ బెరిఁగిరని యాపిల్లలఁ జూచినపుడెల్ల నిరుగుపొరుగువారు ముచ్చటపడుచుందురు. మిసెసుకాంటను విద్యాగంధము గలది గనుకనే యీపథమునఁ బెంపఁ గలిగెను.

స్త్రీలకు విద్య లేకపోవుటవలనఁ గలుగు ననర్థము లసంఖ్యాకములు. విద్య లేనిచో జ్ఞానము శూన్యమగును. జ్ఞానంబు శూన్యంబగుడు నజ్ఞానాంధకారంబునఁ బడి యుక్తాయుక్తవివేకము లేక కేవల మోహపరీతచిత్తలై యువతులు తమవిధులఁ దమబిడ్డలవిధుల నెఱుఁగఁజాలక, వారిని నీతిపథంబునఁ బెట్టుమార్గములు గ్రహింపలేక, వారిని వర్ధిల్లఁజేయు తెఱఁగు పరికింపక మౌర్ఖ్యైకజీవనలై విద్యావంతులైన భర్తల నభిప్రాయముల ననుసరింపక యనేకకష్టములఁ గల్పించుచున్నారు.

పై నుదహరింపఁబడిన యనుకూలకుటుంబ మేకళంకమును లేక సంతోషముగ నుండె నని చదువరు లనుకొనియెదరు. పాప మింతకుఁ బూర్వమే. వారికి హఠాత్తుగ నొకపెట్టు వచ్చినది. వారి పెద్దకుమారుఁడు హార్బర్టు శౌర్యపరాక్రమములు గలవాఁడు. అతఁడు బాల్యమునుండి నిజగుణంబుల ననురూపోచితముగఁ బ్రకటించుచుఁ దదనుకూలంబైన యుద్యోగ మొనర్ప వలయు నని యభిలషించుచుండెను. ఆంగ్లేయదేశములో దేవాలయమునకు "చర్చి" అని పేరు. మనదేశములో దేవుని మాన్యములవలె నచ్చటఁ జర్చికి సంబంధించిన భూములు కొన్నియుండును. జనులు తమ వచ్చుఁబడిలో 10-వ వంతు ప్రతిసంవత్సరము చర్చికి నిత్తురు. ఆభూములమీఁద వచ్చు నాయము, జను లొసంగు ద్రవ్యము మొదలగువానితో జీవించుచు, నా చర్చినిఁ గనిపెట్టి కొని జనులకు మతమును బోధించుచు, నొకఁడు మతబోధకుఁడుగ నుండును. అట్లు మతబోధకుఁడుగ నుండువాఁ డీ కాంటను. హార్బర్టునుగూడ నాపని లోనే ప్రవేశపెట్టవలయు నని కావ్రును చేతనయినన్ని ప్రయత్నములు చేసెను; గాని హార్బర్టు విక్రమసంపన్నుఁడు గనుక, స్వబలపరాక్రమంబుల నెఱపి భవిష్యత్పురుషాంతరుల హృదయాంతరాళముల నాచంద్రతారార్కముగ వసింపఁగలుగు కీర్తి సంపాదించుటకు రణరంగమే యుచితస్థలం బని నమ్మి, యంతరాత్మశాసనము నతిక్రమింపక సైన్యమునందుఁ బ్రవేశింపవలయు నని దృఢనిశ్చయుఁడై యుండెను. "సైనికోద్యోగ మన్న సామాన్యము కాదు. నీప్రాణములైన నీవలయును; మఱియొకరిప్రాణములైనఁ దీయవలయుఁ గావున, నీ ప్రాణము లొకచేత, నితరుల ప్రాణములఁ దీయు నాయుధము మఱియొక చేత బట్టుకొని పని చేయవలసియుండును. ఇట్టి తలంపులు మనస్సునకుఁ దట్టినమాత్రమున నొడలు వడఁకుచున్నది. పెద్దకుమారుఁడవు. అక్కఱకు వచ్చెదవని ముచ్చటపడుచుంటిమి. నాయనా! మమ్ము విడిచిపెట్టి పోవఁ బోకు" అని అతనితల్లి బ్రతిమాలెను. తమ్ములు ప్రార్థించిరి. చెల్లెండ్రు వేడికొనిరి. కాని హార్బర్టుమనస్సు చలించినది కాదు. కావున నింక నేమియుఁ

జేయునది లేక, హర్బర్టునకుఁ బదునెనిమిదవయేటఁ బదాతిసైన్యమునం దొక యుద్యోగము సంపాదించిపెట్టెను. అప్పటినుండి హర్బర్టధికారుల ప్రేమకుఁ బాత్రుఁడై యుద్ధనీతిగ్రంథంబుల నవలోకించుచు, స్వవిధులఁ జక్కఁగ నెఱవేర్చుచుండెను. సైన్యస్థానము కొన్ని కారణములచేఁ గాంటను గృహసమీపప్రదేశమునకు మార్పఁబడెను. హర్బర్టును దఱచుగఁ జూడ నవకాశము కలిగెనని తలిదండ్రులు సంతోషించుచుండిరి. పదాతిసైన్యము నుండి హర్బర్టును రాహుత్తసైన్యమునకుఁ బోవునట్లు చేయవలెనని కాంటను ప్రయత్నించుచుండెను.

ఈసమయమున సైన్యము దేశాంతరయుద్ధమునకుఁ బోవలయు నని యుత్తరువు వచ్చెను. దేశాంతర మెద్దియో కాదు. భరతఖండమే. కుంఫిణివారి నూతన సంపాదితప్రదేశముల రక్షణార్థమై సేన కావలసియుండెను.

హర్బర్టు స్వగృహమునకు వచ్చుచుఁ బోవుచు నుండెను. ఇతఁ డుద్యోగములోఁ బ్రవేశించినప్పుడు కలిగిన దుఃఖము తలిదండ్రులకు నానాఁటికిఁ దగ్గెను. ఎప్పటివలె సంతోషముగ నుండిరి. హర్బర్టు హిందూ దేశమునకుఁ బంపఁబడు ననుతలంపే వారిబుద్ధి కెన్నఁడు దోఁపలేదు.

శాద్వల సంచరద్ధరిణంబునకు బృహన్నాళీకోద్ఘాతలోహగోల[illegible] బునుంబోలె నీవార్త చెవిం బడఁగనే హర్బర్టు తలిదండ్రులు [illegible] హృదయు లైరి. "తండ్రీ! ఉద్యోగము మార్చికొనుము; కాదా కమును గోరుము. అది యిది కాకపోయిన రాజీనామా యిమ్ము. దేశముకాన్నిఁ నాంధ పోయి పడరాని పాట్లు పడుటకు నీ కేమి జరుగకపోయెను? [illegible]రిత్తచిత్తనై నిమిష ముండలేను. నీవు గడియ కనఁబడకపోయినఁ గన్నులు పోయెనని తపింతు నని తల్లి మాతృప్రేమను గనఁబఱచుచుఁ జెప్పెను. కాంటను మూ[illegible] చెప్పినవాఁడు కాఁడు. కుమారుఁడు చేయుచున్నది యుక్త[illegible] యెఱుఁగును; గాన నిరోధింపఁ బూనక రహస్యప్రార్థనలయందును.

"ఈ విచారకరమైనవార్త హేవర్డుబిడ్డలకీదినము తెలియఁజేయవలయును. హార్బర్టన్న వారు ప్రాణములు విడుతురు. వారివలన వీరివలన నీవిషయము వారు వినుటకంటె మనము తెలియఁబఱచిననే మంచిది" అని కాప్టను నిజ భార్యతో ననెను. "సమ్ముఖమున రాయబార మేటికి? నేనే పోయి చెప్పెదను. అమ్మా యిట్టివార్త తెలియఁబఱచుట నీ కెంతో కష్టముగ నుండును. అదిగాక యీవేళ వచ్చెదనని యామెకుఁ జెప్పియుంటిని" అని హార్బర్టు వాక్రుచ్చెను.

"మాతండ్రివిగా! నా కొసంతాపము తప్పించితివి. లేకపోయిన నీ దుఃఖవార్త నాచేతిమీఁదుగ నెట్లు వ్రాయఁగలను. నీవైనను గుండె గట్టిచేసికొని పోవలయును. ఆమీ యీమాటలు విన్న దిగులుపడును" అని యామె "ఆమీ" యనుపదమునొత్తి పలికెను. "నిజమే. ఏమి చేయఁగలను? సాధ్యమైనంతవఱకు దుఃఖమును గనఁబఱుపకుండఁ బ్రవర్తించెద" నని చెప్పి చిలుకకొయ్యకుఁ దగిలింపఁబడియున్న బుట్టటోపి నందికొని శీఘ్రముగ మరల వచ్చెదనని తలుపుతీసి యొకయడుగు కడపయవతలఁ బెట్టి "పాప మిది వారికిఁ దలవని తలంపుగ నుండును" అని నిట్టూర్పు విడుచుచు నస్ఫుటముగ వక్కాణించు నశ్రుకణపూరితనయనయైన మిసెసుకాప్టను మిక్కిలి మాటాడలేక "కాదు నాయనా" యని మాత్రము ప్రత్యుత్తర మిచ్చెను.

---

# తొమ్మిదవ యధ్యాయము

కాంటను గృహమునకును హేవర్డు గృహమునకును మధ్యమున నున్న పొలములగుండఁ గంకరజాతితో రస్తా వేయఁబడియుండెను. కాంటను గృహము నుండి బయలుదేఱి రోడ్డునఁ గొంతదూర మేఁగిన తరువాత నొకచిన్న వాగు తగులును. వాగుదాఁటిన పిమ్మట బీచివృక్షపంక్తి వచ్చును. దానిపై హేవర్డు గృహము కలదు. హార్బర్టు కాలికోలఁదిఁ బోయి వాగుపైనున్న చిన్నవంతెన మీఁదుగ వనములోఁ బ్రవేశించెను. అతనిరాక గని యులికిపడి లేచి గొఱ్ఱెలు

హర్బర్టు—నిజమే. చెప్పియుండవచ్చును. హఠాత్తుగ నాకోరిక వదలవలసి వచ్చినది.

హేవర్డు—ఏమిటి? ఏమిటి?

హర్బర్టు—ఏమి లేదు. కాని—

హేవర్డు—ఆ కానియేమిటి? పూర్తిగఁ జెప్పుము. నేను జేయఁగలిగిన దేమైన నున్నఁ జేసెదను. మాకు మీ కీభేదము కలదా?

హర్బర్టు—నిజమే. ఈమాట నే నెఱుఁగనా? అయితే—

హేవర్డు—(సంభ్రమకంఠస్వరముతో) ఏదైన ముప్పు సంభవించినదా? "ఐతే" "కాని" యని నీళ్లు నములుచున్నావు.

హర్బర్టు—(డగ్గుత్తికతో) ఏమి లేదు. సైన్యము దేశాంతరమునకుఁ బోవలయు నని యుత్తరు వయినది. నేనుగూడఁ బోవలయును. ఆసంగతి మీకుఁ జెప్పుటకై వచ్చితిని.

హేవర్డు—ఇలాగా! అయితే మంచిదే. యూరోపుఖండములోని క్రొత్త దేశములను జూచెదవు. నీవు మమ్ము విడిచి వెళ్లుచున్నావని మాత్రము విచారముగ నున్నది.

హర్బర్టు—(విచారముతో) కాని మేము పోవలసినది యూరోపుఖండములోని దేశమునకుఁ గాదు. హిందూదేశమునకు.

హేవర్డు—అయ్యో! అయ్యో! ఇంతవఱకునుండి చెప్పవేమి! ఇండియా! నిజముగ విచారకరమైన విషయమే. పోకుండ మానలేవా? తప్పించుకొనలేవా?

హర్బర్టు—తప్పించుకొనుటకు వీలున్నను నే నట్లు చేయను. పోవుట నావిధి. ఈసమయమున నే నేదైన మిషచెప్పిన నాగౌరవమునకు హానికాదా? నా ప్రవర్తనమందు లోప మారోపింపరా?

హేవర్డు—రైట్. లోప మేమిటి? అనేకు లీతీరునఁ జేయుచున్నారు. ఆసంగతి మనసునఁ బెట్టవలదు.

హర్బర్టు—(తల యూఁచుచున్నాఁడు.)

హేవర్డు—నిజము! కావలయునన్న నీకు వేయిదృష్టాంతములఁ జూపెదను.

హర్బర్టు—చూపినఁ జూపఁగలుగుదువు గాక. హిందూదేశములో మనపరగణాలకుఁ దొందఱలు కలుగుచున్నవి. శౌర్యధైర్యములు చూపవలసిన సమయ మిది. మాసేనలో నొకబిడ్డయుమాత్రము తప్పించుకొనఁ బ్రయత్నించుచున్నారు. వారి నడవడులు జగద్విఖ్యాతములే. ఇట్టి సందర్భమున నే నడ్డుచెప్పఁజాలను.

హేవర్డు—(కన్నీటితో) నీ వన్నమాట సత్యము. అయితే పాపము! నీ తల్లిదండ్రులు దుఃఖముపాలగుదురు. అందులో మీతల్లికిఁ బాపుర మెక్కువ. ఆమెకు బిడ్డలమీఁద నెంతో ప్రేమ.

హర్బర్టు—మాఅమ్మ, మానాయన మొదలు మొదలు దుఃఖపడిరి గాని యిప్పుడు దుఃఖము నాపికొని నెమ్మదిగ నున్నారు.

హేవర్డు—బయలుదేఱవలసిన దెప్పుడు? సిద్ధపడుటకై ప్రభుత్వమువారు కొంతవ్యవధి యిత్తురు కాఁబోలు నే?

హర్బర్టు—వ్యవధి యిచ్చిరి గాని బహుస్వల్పకాలము. సోమవారమునాఁడు డోవరున కేఁగి యచ్చటినుండి పక్షముదినములలో వెళ్లుదుము.

హేవర్డు—సోమవారమునాఁడా? ఈవేళ గురువారము. ఇఁక మూఁడురోజులకుఁ బోదువు. అయ్యో! ఎంత విచారకరమైన విషయము? ఆమె విన్నచో నెట్లు సహింపఁగలదు?

హర్బర్టు—ఆమెకుఁ జెప్పుదునా వలదా యని సందేహముగ నున్నది. మీసలహా ననుసరించి చేసెదను. ఇప్పు డామెతో వనమున కేఁగుట నిశ్చయముగదా! మీరు చెప్పినప్రకార మొనర్చెదను.

హేవర్డు—మే మెవరము నీవిషయ మామెతోఁ జెప్పఁజాలము. నీవే సమయము కనిపెట్టి చల్లఁగఁ జెప్పుము.

పర్ణశాల కనతిదూరమునఁ బ్రవహించువాగులోని జలము త్రావుటకై యెడనెడ వచ్చు హరిణశాబకంబులును, పత్ప్రసరప్రదేశంబులఁ గుసుమశోభిత తరుగుల్మలతావిశేషంబులు నతిమనోజ్ఞంబు లయియుండెను. కావునఁ జనునో హర్షప్రసన్నుఁడయి యు పటమును లిఖింపు మని హర్బర్టు నామీ కోర నతఁడు "భగవత్సృష్టియందు నద్వితీయంబులైన స్వాభావికవైచిత్ర్యంబులెల్ల నొక్కటిగ గుమిగూడెనో యనఁదోఁచు నీప్రదేశప్రదర్శనంబు పటమున సంపూర్ణముగఁ జిత్రింప నెవరికి సాధ్యము? నాశక్తికొలఁది బ్రయత్నము చేసెదను. ఇట్టి సమయము మరల నింతలోఁ బటస్థింపదు గదా!" యని లిఖింప నుపక్రమించెను.

"ఇట్టి సమయము మరలఁ బటస్థింప దంటివి. ఇట్టి మధ్యాహ్నపువేళ కల మనోజ్ఞదినము మరల రాదనియా నీయభిప్రాయము? ఋతువులలో నిప్పుడు మార్పులు జరుగవు గనుక నిట్టిదినములు మనకుఁ జాలవచ్చును" అని యామీ వాక్రుచ్చెను గాని, హర్బర్టు ప్రత్యుత్తర మీయక పనిమీఁదనే దృష్టియుంచి పటమును లిఖించుచుండెను.

ఇంతకుఁ బూర్వ మెన్నఁడును హర్బర్టు తన హృదయానురాగ మామీకిఁ జెప్పినవాఁడు కాఁడు. ఆమీవంకఁ జూచినపుడెల్ల నిట్టిసుందర నారీరత్నము నెట్లు విడిచిపోవుదునా? యని చింతించును. తలవంచి పటము లిఖించుచుండెనే కాని మనస్సు పలువిధములఁ బోవుచుండెను. "నీ విదినము మాంద్యముగ నున్నావు. అయినను పర్ణశాలయెదుటి వృక్షపుంజంబును గడురమ్యముగఁ జిత్రించుచుంటివి గాన నిన్నుఁ గదలింపఁగూడదు" అని కొంచెముసేపూరకుండి, మరల సంభాషణము మొదలుపెట్టెను. అనేక వృత్తాంతములు చెప్పి సైన్యమునుగురించి, స్నేహితులగురించి, చదువునుగురించి, పలుప్రశ్నల నడిగెను గాని యడిగిన విషయములలోఁ గొన్నింటికిఁ [illegible], కొన్నిటికి "అంతే" యని మరికొన్నిటికి "మంచిది" యని యసంబద్ధ ప్రత్యుత్తరము లిచ్చెను.

ఏకవిషయాసక్తమనస్కు లన్యంబుల వినియు వినకుండుట, కనియుం గనకుండుట, యాఘ్రాణించియు నాఘ్రాణింపకుండుట, స్పృశించియు స్పృశింపకుండుట సహజంబు. "ఈవిధమున నీవెన్నఁడును లిఖింపలేవు. దాని నే నింటనుకనుండి చెప్పుచున్నమాటలలో నొక్కటియైన నీవెవినఁ బడినట్లు తోఁచదు. నే నడుగుప్రశ్న యొకటి. నీవు చెప్పుసమాధాన మొకటి గంట నుండినేను వదరుట వ్యర్థప్రయాసమే. నీవు జబ్బుగనున్నట్లు గనుపడుచున్నావు. శరీరమునకు నిజముగ స్వాస్థ్య లేదేనిఁ జాగరూకుండవు. నన్నింకొకసారి లిఖింప వచ్చును. మునిఁగిపోయిన దేమియు లేదు." అని యమీనా హార్బర్టు బుజముపైఁ దట్టెను.

"మరల నెన్నిదినములకో యిట్టి సమయము వచ్చును. చేయవలసినపట్టున కిప్పుడే సంపూర్ణముగ లిఖించెదను." అని హార్బర్టు దుఃఖపూరిత కంఠ స్వరముతో నుడివి మంఖాంబున దైన్యంబు చెలంగఁ బటమును జూచుచుండెను.

"నీ విట్టిసమయమున నీ పని చెప్పుట కిది రెండవసారి. మమ్ము వదలి యెచ్చటికిని బోవ ననుమాట నిశ్చయముగదా హార్బర్టూ! చెప్పుము. విపరీత మేమైన సంభవించెనా" అని యమీనా యడిగెను.

హార్బర్టు "దుఃఖకరమైనవార్త చెప్పవలసియున్నది. నీ వూహించి నట్లు మిమ్మువదలి విడిచిపోవలసివచ్చినది. మన మిద్దఱము చిన్నతనమునుండి యెడలేని పొందు కలిగియుంటిమి" అని యింకను జెప్పఁబోయి మాటరాక యూరకుండెను. అమీనాబుగ్గలు తెల్లబడినవి; పెదవులు వణఁకమొదలిడెను. దేశాంతరయుద్ధప్రవర్తక సేనాకష్టములన్ని యామెమనస్సున కొక్కసారి యాలోచన గోచరము లయ్యెను. మాటలాడఁ బ్రయత్నించెను గాని పోలేదు! నోరాడ లేదు. పటము క్రిందఁ బెట్టి యెప్పుడైనఁ జెప్పక తప్పదనుకొని "అమీనా! సైన్యము శ్రీరంగపట్టణమునకుఁ బోవుట కుద్యుక్తమైనది. నేనును సైన్యముతోడఁ బోవలసినది. బోయి యచ్చటనుండి పదుమూఁడురోజులలో నింటికిరాఁ బోవుదుము" అని యతఁడు వాక్రుచ్చెను. "ఇంటికిరారా" అనుమాట మాత్ర మమీనానోటినుండి వచ్చినది. వెంటనే మూర్ఛిల్లినదిగ నాపె క్రిందపడెను.

# పదియవ యధ్యాయము

హెర్బర్టు భయకంపితుఁడై యామిని లేవనెత్తి "యువతీ! ఒక్క మాటాడుము. నా పేరు చెప్పుము. నినుఁ బాసిపోవుట కెంత సంతాపము నొందుచుంటినో నాహృదయ మెఱుఁగును. భగవంతుఁ డెఱుఁగును. విధి తరింప నెవ్వరితరంబు? కనులెత్తి నావంకఁ జూడుము." అని దీనవాక్యంబులు పలికెను, గాని యామె కన్నులు తెఱచినది కాదు. బలవంతముగ నెత్తి నిలువఁ బెట్టినను మరలఁ బడిపోవుచుండెను. సహాయము చేయువారు లేరైరి. ఆమెను విడిచిపోయి యెవరినైనఁ బిలుచుటకు హెర్బర్టునకుఁ గాళ్లాడినవి కావు. ఏమి చేయుటకును దోఁపక యతఁ డామెను శిశువునుంబోలె నెత్తికొని వాఁగుగట్టునకుఁ బోయి తలమీఁద నున్న కుళ్లాయి తీసి మొగముమీఁదను శిరముమీఁదను నీళ్లు చల్లెను. కొంచెము స్పృహ వచ్చిన తరువాత మెల్లఁగ దోసెఁడునీళ్లు పట్టెను. తెలివివచ్చెను గాని దుఃఖభరంబున నోరాడక పోయెను. ఒకమాటయైన నాడు మని యనురాగపురస్సరంబుగ హెర్బర్టు బతిమాలెను. పాపము! కంఠము నడ్డగించు గాద్గద్యముచే మాటలాడఁజాలదయ్యె. కొంతసేపటికిఁ జిన్నఁగ లేవఁగలిగెను. పెన్నిధిఁ గన్న పేదచందంబున హెర్బర్టు నిర్భర సంతోషమునొంది యామెను కౌఁగిలించికొని చిన్నఁగఁ బష్ఠశాలకుఁ గొంపోయి తన కానించి కూర్చుండఁబెట్టికొని "నారీరత్నమా! ని న్నిట్టి కష్టములం బ్రాయ వలసివచ్చిన యీనిర్భాగ్యుని క్షమింపుము. నీ వాక్యామృతముచే మచ్ఛ్రోత్ర పర్వము కావింపుము. నిన్ను నేఁ బ్రేమింపలేదని తలంపకుము. నీపై నాకుఁగల యనురాగము వచింపుటకుఁ బదములు చాలవు. బాల్యమునుండియు నాట పాటలయందు మనకు మితిలేని మైత్రి కలదు. సగుణగుణంబులకుఁ గాలోచిత పరిణామంబులు స్వాభావికములు గావున, మనమైత్రి మన్మథానురాగముగ మాఱె నిన్ను వరించి చాలదినములైనను బయల్పఱుపకుంటిని. ప్రియసఖీ! నీచిత్తంబు నాకేల దాఁచెదవు? నీవిప్పుడొందు దుఃఖము నాయెడలి ప్రేమాతి

శయము చేతనే కలిగిన దని యూహించెదను. అన్యదేశంబున కేగి కష్టములఁ బడునప్పుడు, చిత్తంబు వ్యాకులపడినప్పుడు, దేహంబునకు స్వస్థతావస్థ తొలఁగినప్పుడు, శత్రుచాప విక్షిప్తశరంబు లురంబున నాటి జీవంబు కలఁగినప్పుడు, భవదీయప్రేమోత్సాహంబు స్మరింతును. ప్రాణవల్లభా! నీవు నాపైఁ జేయను దృఢనిశ్చయము నాకుఁ గలుగున ట్లొక్క వాక్యంబు నీనోటనుండి రానిమ్ము. నాహృదయఫలకంబునఁ బద్వాక్యాక్షరముల లిఖించి మన్మనోనేత్రంబుతో ననారతంబు పఠించుచుందును." అని యనురాగరసం బుట్టిపడఁ బలికెను. ఆవిూయొక్క నిమీలితనయనయుగళం బశ్రుపూరితం బయ్యెను. మొద లొక్కబొట్టు వెచ్చగ హార్బర్టుచేతిమీఁదఁ బడెను. పిమ్మట బొటబొటఁ గన్నీరు జాలై కాఱెను. ఆపె మాటాడనుంకించెనుగాని సాధ్యము కాదాయెను. దుఃఖము పట్టఁజాలక హార్బర్టు యొక్క మెడఁ గౌఁగిలించి వెక్కివెక్కి యేడువసాగెను. చేతిరుమాలుతోఁ గన్నీరు తుడిచి శోకసంతప్తస్వాంతయైన యాలలనారత్నమును హార్బర్టు తనవాక్యామృతధారలచే నోదార్చెను. భవిష్యద్విరహభావ సంజాతవేదనాదవానలంబున నాపె కేమియుఁ దోఁపదయ్యె. ఆహా! ప్రేమ! ప్రపంచమంతయు నీరెండక్షరముల నిమిడియున్నది. కాలమా! నీసామర్థ్యంబు గొనియాడ బ్రహ్మాదులకైనఁ దరంబే? భగవత్సృష్టియందు సర్వంబును గాలవశమైయున్నది. కాలవశంబునం దరువులు ఫలించును. కాలవశంబున లతలు పుష్పించును. కాలవశంబునం బ్రేమ బయల్పడును. కాలవశంబునం గార్యములు సిద్ధించును. సర్వచరాచర ప్రపంచం బవశానిష్టాగమనంబునం గాలచక్రంబునఁ బరిభ్రమించుచు, నూర్ధ్వాధోగతులం బొందుచుంట తత్త్వశోధన దృష్టికి గోచరంబే కదా! ప్రథమ పరస్పరాలింగనమువలన హార్బర్టునకు నామీకిఁ గలిగిన యానందంబు నూహింప బుద్ధికతీతంబుగఁ దోఁచును. వర్ణింప నిఘంటువులు దరిద్రాణంబులై కాన్పించును. ఏకాంతంబై మనోహరంబైన యాప్రదేశంబున ననురాగసంజనితసంతోషాంబుధిం దేలుచు భావివిరహంబు మఱచిరి. నిమేషంబులు గడచె. కాష్ఠలు సనె. కళలు

పోయెం. క్షణంబు లరిగె. గడియలు దాఁటె. జాము లతిక్రమించె. సంయత మానసుండై బ్రహ్మ సాక్షాత్కారంబునఁ గ్రీడించు యోగీంద్రుని భంగి సతి తాది వ్యవహారహేతు వైనకాలమును బరిగణింపకుండిరి. "ఆనందో బ్రహ్మ" యంటున్న ప్రయోజనము వారిపట్టున నన్వయించుచుండెను. వారిపద్దనున్న ఘటి కాయంత్రముగాని చిన్నము స్త్రైపవయుంకె మీఁదికి వచ్చియుండెనుగాని చూడరైరి. చెట్లనీడ లతిదీర్ఘములై చక్షురింద్రియగోచరంబులగుడు సాయం కాలమైనదని గ్రహించి యింటికిఁ బోవుట మనుకొనిరి.

హర్బర్టు లిఖించిన చిత్రపటము నేలపైఁబడి యుండెను. అమీ దానినిఁ దీసికొని "హర్బర్టూ ! నీవు దూరదేశమునం దున్నప్పు డీచిత్రపటమే యీనాఁటి స్మరణీయ విషయంబులగుఱించి నా కేకాంతసాక్షిగ నుండును. ఇదియే నాయమూల్యాభరణము. నిన్నింకొక్కటి వేఁడెదను. నేను భవద్భావి విరహభావజనితశోకపరీతచిత్తనై నేలపైఁబడియున్నప్పుడు నీవు నన్ను లేవనెత్తి సీ..నించికొని నీయెడమహస్తమును నావక్షంబు మీఁదుగఁజాచి నడిబుగ్గ పైనుంచి దక్షిణహస్తంబుతో నాసన్నిటినిఁ బట్టిచి యోదార్చినప్పటి పోఁడిమి చిత్రపటంబున లిఖించి యిమ్ము. నీవు తిరిగివచ్చువఱకు దానిఁజూచి తృప్తి బొందుచుందును. నాలుగుసంవత్సరములలో వచ్చెదనని వాక్రుచ్చియుంటివి. ప్రియమిత్రమా ! అవి యెంతలోఁ గడచిపోవును ? మగిడివచ్చి నీవార్చిన యుద్ధంబులు మనోహరముగఁ జెప్పుచుండ నీపర్ణశాలయందే నీపదసన్నిధిం గూర్చుండి విననగలను." అని కోమలస్వరంబునఁ బలికెను. హర్బర్టామీని గాఢముగ నాలింగనముచేసి కపోలద్వయంబు దక్షిణహస్తంబున నొత్తి "ప్రియసఖీ ! అంతకంటె నిష్టమైన కార్యమేదికలదు? తత్క్షణంబ కావించెద" ననికాగితమునందు యత్న్యంతమై పుణ్యముతో లిఖించెను. ఆ పటరామణీయక మింతింతయని చెప్పుటకు వీలులేదు. క్రొత్తవారికిఁగూడ దానిఁ జూచినతోడనే జరిగిన కథ స్పష్టముగఁ దెలియఁగలదు. "హర్బర్టూ! నరుని

కంటి కగపడనీయను. లుబ్ధుండు ద్రవ్యంబునుం బోలె భద్రంబుగ దాంచి ప్రతిదినము రాత్రికాలమున శయ్యంజేరి పవళింపంబోవునప్పు డేకాంతంబున నీపట సందర్శన మొనర్చి నిన్ను స్మరించి నిద్రించెదను. ఇంక దీనిని నాచేతి కిమ్ము." అని యామె యడిగెను.

"కావలసియున్న యున్న యెడల నీవే యుంచికొనవచ్చును. ఈ రాత్రికిమాత్రము నేను దీసికొనిపోయి దీనింజూచి యింకొకపటము లిఖించి దీనిని రేపుప్రొద్దునం దెచ్చి యిచ్చెదను." అని హార్బర్టు నుడివెను. "రేపటి కంటె నెక్కువకాల ముంచికొన నని వాగ్దానము చేసిన నిచ్చెదను. ఈ రాత్రికి మాయింటిలోనే యుండి పటమును లిఖించికొని పొమ్మని బల వంతపెట్టం దలంచితిని గాని పాపము ! మా తలిదండ్రు లెదురుచూచు చుందురు. కావున నెటుమాటలాడ వీలులేకున్నది" అని యామీ యను నయంబుగ సంభాషించెను.

ఒండొరుల బుజంబులపైం జేతు లిడుకొని యింటిదారిం బట్టిరి. మార్గంబునం గనంబడు పచ్చిక బయళ్లను, బరిమళ పుష్పోపేతంబు లగు వృక్షంబులను, సహితము వీక్షింపక బ్రతికియుండునంత కాలము మఱపునకు రాని ముచ్చటల నాడుచు గృహమును సమీపించిరి. "కామాతురాణాం న భయం న లజ్జా" యను న్యాయంబున జరిగిన వంతయుం దండ్రికిం జెప్పవలయు ననియు నేమియు దాంపంగూడ దనియు భయ పడం బని లేదనియు నామీ వాక్రుచ్చెను.

హార్బర్టు—సరే. అట్లే చెప్పుము.

అమీ—నేను మానాయనతో మాటలాడ లేను. నీవే చెప్పవలయును.

హార్బర్టు—నీవుకూడ నచ్చట నుండిన యెడలం జెప్పెదను.

అమీ—కాదు. కాదు. నేను దగ్గఱనుండిన యెడల మాటలాడుటకు మన కిద్దఱకు ధైర్యముండదు. నీ వొకండవే మెల్లంగం జెప్పుము. నీవు మా

నాయన నెఱుఁగుమవుగద దీనిలో దాఁపవలసినది లేదు. స్పష్టముగఁ జెప్పుము.

అంతట నామె గదిలోనికిఁ బోయి తలుపు మూసెను. ఆసుందరవిగ్రహము గదిలోనికిఁ బోయినదనుక హార్బర్టు ఱెప్పవాల్పక చూచి ధైర్యమవలంబించి హేవరున్న గదితలుపునెట్టి లోనికిఁజొచ్చెను. హేవరు చేతిలోని పుస్తకము బల్లమీఁదఁ బెట్టి సులోచనములజోడు ముక్కుమీఁదినుండి తీసి చేతఁబట్టి హార్బర్టువంకఁజూచి చిఱునవ్వుతో "వచ్చితివా? ఇంత యాలస్యమేల నాయెను? ఆఱుగంటలు కావచ్చినది. ఆమీ యేది?" అనియడుగ నిప్పుడేవచ్చెనని గదిలోనికిఁ బోయెనని యాతఁడు చెప్పెను.

"హార్బర్టూ! యీదినము మీరు లిఖించిన చిత్రపటములేవి? చూతము. నీవు లిఖించుటయందు నిపుణుఁడవని నేనెఱుఁగుదును. మీరీరోజు చాలసేపు పనిచేసితిరి. మిక్కిలిచిత్రముగనుండి తీరవలయును" అని సులోచనముల మరలఁ గన్నులకుఁ బెట్టికొనెను. ఆమీకోరినప్రకారమతఁడు లిఖించిన రెండవ పటమే యతనిచేతిలో నుండెను. హార్బర్టాపటమును జూపుటకుఁ ద్రొక్కులాడెను. మాటలయందుఁ దడఁబాటు గలిగెను. చివరకుఁ జూపక తప్పక పోయెను. హేవ ర్దాపటమును జూచి యనుమానపడుచుండ హార్బర్టులేచి విగతభయుండై యామీవాక్యముల జ్ఞప్తికిఁదెచ్చికొని జరిగినవంతయుఁ బూసగ్రుచ్చినట్లు ఋజుభావంబుతో వివరించి "ఆమీ నన్ను వరించినది. ఈయభిప్రాయమిఁకఁ దాఁచుట కామె కిష్టములేదు. మేము మాయనురాగమును బహిరంగముగ మీమ్రోలఁ జెప్పుకొనుచున్నాము. మాయందెద్దియైన దోషముండిన క్షమింపుఁడు" అనినిశ్శంకముగఁ బలికెను. హేవర్డతనిఁ జాల దినములనుండి యెఱింగి యతని సుగుణముల గ్రహియించినవాఁడు గనుక నొకక్షణము పరికించి విగ్గన నాసనమునుండి లేచి యతనిని గౌఁగిలించి "దేవుఁడు మిమ్ము నాశీర్వదించుఁ గాత. నీవు స్వల్పకాలములో మమ్మెడఁబాసి

దేశాంతరమునకుఁ బోవుదువను విచారమే లేకయుండిన నాజీవిత కాలము నందత్యంత సంతోషకరములైన దినములందు నీవన మొకటియై యుండును. నీవంటివాని నామీవతెంచినదని వినుటచే నాచెవులకుఁ బండువుగ నున్నది. మీరిద్దఱును జంటగనుండఁ జూడవలెనని నుత్సాహము పొంగి పొరలుచున్నది. తడవుసేయఁజాలను" అని గంటమ్రోయించెను. శబ్దమువిని సేవకుఁడు వచ్చెను. "సాధ్యమైనంత శీఘ్రముగ మీనాయన రమ్మనుచున్నాఁడని యామీకిఁ జెప్పుము" అని హోవర్డు సేవకుని కాజ్ఞయొసఁగెను. నాలుగు నిమిషములవఱకు రాలేదు. ఆనాలుగునిమిషములు హోవర్డు హార్బర్టులు నోరుకదల్పక యామీయాగమనము ప్రతీక్షించుచుండిరి. తాళ్లచప్పుడు వినఁబడెను గాని మరల నిశ్శబ్దముగనుండెను. తలుపువెనుక నుండి భయపడుచున్నదని తలంచి హార్బర్టు బయటికి వచ్చెను. అతని సన్నిధిముఖముజూచి యామీ నిర్భయురాలై వేగముగ లోనికిఁబోయి చేతులు చాచియున్న తండ్రిని కౌఁగిలించి ఆమ్మోముం బలుదాల్చి గదగదమనుచున్న కన్నీళ్లతో నిల్చెండ "దేవుఁడు మిమ్ము రక్షించుత, దేవుఁడు మిమ్ము రక్షించుత" యని మాత్రము హోవర్డు వాక్రువ్వఁ గలిగెను. ఔత్సుక్యాతిశయముచే మాటలాడఁ జాలఁడాయెను. కూఁతురువచ్చి ఆమ్ముద్దులఁ బలుదాల్చి నిగిడించునప్పుడు హృదయమునుండి యుప్పొంగివచ్చిన సంతోషభరం బాష్పమూర్తికే పొలుచుక. "నాయందు దోషమున్నయెడలఁ దండ్రీ! క్షమింపుము." అని యామీ పలికెను. "అమ్మా! క్షమించుటకు నీవేమి యపరాధము చేసితివి? నేనిట్టిదినము కొఱకుఁ జిరకాలమునుండి యెదురుచూచుచుంటిని. నామనోరథము సఫలంబయ్యెను. హార్బర్టూ! ప్రొద్దుపోవుచున్నది. ఆమీగాని నేనుగాని యింకనిన్నాపుట నాకు సమ్మతముగాదు. మీతలిదండ్రులు నీకొఱకు నెదురుచూచుచుందురు. ఉన్న రెండురోజులు వారికనులయెదుట లేకుండనుండుట యుచితము కాదు. నీవిప్పుడేఁగి రేపుప్రొద్దునఁ దప్పక రావలయును. సాయంకాలమువరకు నుండి మరలఁబోవచ్చును, గట్టిగ రావలయుఁజుమీ" యని హోవర్డు చెప్పెను.

"రేపు సరియైనవేళనే పెందలకడవచ్చి ప్రొద్దుగ్రుంకునవఱకు నుండెదను. నాకు దక్షతతో సమానురాలైన మిసెసు హేవర్డునకు నావందనములు చెప్పుము. నన్ను క్షమింపుమనుము. నేఁడు పోయి వచ్చెదను" అని హార్బర్టు నుడివెను.

"నీవు మనస్సులో సందియము పెట్టుకొనకుము. కూసంగతి విన్న నామె మిక్కిలి సంతోషించును. మంచిది పోయిరమ్ము" అని హేవర్డు [illegible]. హార్బర్టు పోయిన తరువాతఁ దలుపు వేయు మిషతో నామె వాకిటివఱకు నేఁగి దానిని దాఁటి యతనిని గలిసికొని "మఱవవుగదా! హార్బర్టూ! తప్పక రావలయును. నీకొఱకు నిరీక్షించుచుందును" అని యశ్రుకణములు కన్నులలో మెఱయుచుండ మెల్లఁగ ససులాపించెను.

"తప్పకవచ్చెదను. ప్రియసఖీ! తెల్లవాఱఁగనే వచ్చెదను." అనిచెప్పి మొగములో మొగముచేర్చి గాఢానురాగపురస్సరంబుగఁ బెదవినిఁ జుంబించెను. ఆమె మొగము చిట్లింపక చిఱునవ్వు నవ్వి యింటికేఁగి యద్దములోఁ బెదవిమీఁదనున్న పంటికాటుల వీక్షించి నాపై నాప్రియునికెంత మోహము కలదో యని యపరిమితానందభరిత యయ్యెను. హార్బర్టు గృహమును జేరి జరిగినవృత్తాంతము తలిదండ్రులకుఁ గొంచెమైనను దాఁపక విప్పి చెప్పెను. వారును సంతోషించిరి. ఆరాత్రి మొదలుకొని ప్రార్థనలయం దామీహార్బర్టుల రక్షింపుమని కాంటను మొదలగువారు సర్వాంతర్యామియైన దేవునికి విన్నవించుచుండిరి.

## పదునొకొండవ యధ్యాయము

తెల్లవాఱెను. చకితశాత్రవసైన్యంబును వీరుండుంబోలె, రోదసీకుహరంబున సాంద్రముగ వ్యాపించియున్న హిమంబును విచ్ఛిన్నముచేయుచు భానుఁ డుదయించెను. జనులకు మనోరంజకముగ నుండెను. ఆచలికాలంబున

సూర్యాగమంబుచే రంజింపఁబడని మానవుఁడుండునే? ఉండకేమి? దేహికి సుఖదుఃఖంబులు గుణానుసారంబులు కావున శోకకారణంబైన తమోగుణం బావరించియున్నప్పుడు, పువుపోయినకంటియందు వెలుంగునటుంబలె మానవ చిత్తంబులయం దానందమునకుఁ బ్రవృత్తిలేదుగదా? కాంటనుగృహమునం దందఱిముఖములు కళావిహీనములై యుండెను. సంతోష భాజనంబులై యుండిన హృదయంబులు దుఃఖపాత్రంబు లాయెను. కాంటనుహర్బర్టులు తమదుఃఖము నణఁచికొని తక్కినవారి నోదార్పఁ బ్రయత్నించిరికాని మిసెసు కాంటను వారి మాటల నాలింపదాయెను. ఆమెహృదయంబు శోకసంపూరితంబుగ నుండెను. కన్నులనుండి యశ్రుకణంబులురలి కపోలంబుల పైఁబడి జారిపోవుచుండెను. ఆమె యెవరినిఁ జూడ నోపకుండెను.

ఎడనెడ హర్బర్టునంకఁ గనులెత్తిచూచి దుఃఖం బినుమడింపఁగా దృష్టిని మరలించుచుండెను. చిన్నతనమునుండి ప్రక్కలలోఁ జెక్కలలోఁ బెట్టికొని ప్రాణ మొకయెత్తుగఁ బెంచి పెద్దవానిఁ జేసి తుదకు దేశాంతరమునఁ బ్రాణోపద్రవకరమైన యుద్ధకార్యమునకుఁ బోవుచుండఁ జూడవలసి వచ్చిన యాతల్లి శోకభరంబు చెప్పశక్యముగాదు.

హర్బర్టు వాగ్దానమొనర్చినప్రకారము హోవర్డునింటికి బయలుదేఱెను. బీచివుడుపార్కున కివతలనున్న వాఁగుమీఁది చిన్నవంతెన వద్దకుఁ బోవఁగనే యామిమీ యగపడెను. ఆమె యతనికొఱ కచ్చట నిరీక్షించుచుండెను. ఇద్దఱు కలిసి సుందరవిశాలశిలాఫలకంబుల విశ్రమించుచు నుద్యానవనంబున విహరించిరి.

గంటలు నిమేషంబుల భంగిఁ గడచెను. ఆంతరంగికానందమును వెలిపుచ్చుచు భావిదశనుగూర్చి ముచ్చటింపఁ దొడఁగిరి. నాలుగు సంవత్సరములు వారికొక దినముగఁదోఁచెను. వారివదనంబులందు దుఃఖచిహ్నము లేవియు లేకుండెను. హిందూదేశ మద్భుతముగ నుండునని చెప్పఁగ వినుమనియు,

నచ్చటి చిత్రప్రదేశములపటములు లిఖించి నీకుఁ బంపెదననియు, నింకఁ వ్రాయఁదగిన విశేషములుండిన నొక్కటియైన విడువక తెలిపెదననియు, హార్బర్టు చెప్పెను. తరువాత గృహమునకేఁగిరి. వీరివదనవికాసంబుచూచి హేవర్డు, మిసెసు హేవర్డు సంతోషించిరి. ఎవరిహృదయమునందును నాసమయమున దుఃఖమునకు నెడములేకపోయెను. ఆదినము సాయంత్రముదనుక హార్బర్టచ్చటనేయుండి వారితో నిష్టాగోష్ఠిగాఁ గాలము గడపెను. ప్రేమయు విశ్వాసమును గలిగిన ప్రియురాలు, ప్రియురాలితలిదండ్రులు కలిసియుండ వారితో నిట్టిగోష్ఠి యొకరికైన జీవయాత్రయందు సంభవించినచో నక్కాలము మఱవవలెనన్నను మఱపునకు రాదు. హార్బర్టు బయలుదేఱవలసిన సోమవారము సమీపించినది. రెండేండ్లనాఁటి నాదివారమునాఁడు సబ్బాతుపండువు కాంటను గృహమునందే కడుపవిత్రముగ జరపిరి.

ఆనాఁడు వారిమొగంబులు దీనాకారములు దాల్చియుండెను. హేవర్డు సహధర్మిణియు హార్బర్టుతలిదండ్రుల నోదార్చిరి. మిసెసు కాంటను శోకము భరింపలేక వరండాలోనుండి లేచి మఱియొక గదిలోనికిఁ బోయి విలపింప మొదలుపెట్టెను. ఆమీ యామెదగ్గఱకుఁ జని దుఃఖము నుపశమింపఁ జేయఁ జొచ్చెను. పాపము! ఆమెస్థితి మిక్కిలి శోచనీయమైనది. స్వదుఃఖము నణఁచికొనుట, యత్తదుఃఖమును దీర్చుట, రెండుపనులు చేయవలసి వచ్చెను. సాయంకాలమైనది. ప్రార్థనచేయు సమయములో దేశాంతరమున కేగుచున్న హార్బర్టును గాపాడుమని కాంటను ప్రార్థించెను. కాంటను గద్గదస్వరములోఁ బ్రార్థించుచుండ మిసెసుకాంటనుయొక్క దుఃఖజనిత నిశ్వాసంబులు స్ఫుటముగ వినవచ్చుచుండెను. ప్రార్థన ముగిసినది. హేవర్డుయొక్క గుఱ్ఱపుబండి వాకిటి దగ్గఱకు వచ్చెను. హేవర్డు మిసెసు హేవర్డును జెప్పవలసిన వారితోఁ జెప్పి హార్బర్టును దీవించి బండివద్దకుఁ బోయిరి. మిసెను హేవర్డు బండి యెక్కెను. హేవర్డెక్కఁ

ప్రయత్నించుచుండెను. హర్బర్టు మిసెసు హేవర్డును సమీపించి "నేనొక్కటి నిన్ను వేడదలంచితిని. ఆమీ నేను గలిసి నడచుచు మాటలాడుచు నాలస్యముగ వచ్చెదము. మీబండిని ముందు పోనిండు. ఇదియే నాయభీష్టము. దీని నంగీకరించినయెడల సంతోషింతును." అనిచెప్పెను. "నీకిష్టముచెప్పెదను. నీయిష్ట ప్రకారము చేయవచ్చును. నీపైని దానికిఁ బ్రేమ మిక్కుటము. ఉత్తరములు మాత్రము వారమున కొకసారియైనఁ దప్పక వ్రాయుచుండుము. నేను జెప్పవలసిన దింతకంటె మఱియేమియును లేదు. ఆలస్యము చేయక త్వరగ రండు. మంచులోఁ జాలసేపు తిరిగినయెడల జబ్బుచేయును." అని మిసెసు హేవర్డు నుడివి యాశీర్వదించెను. హర్బర్టు హేవర్డును జూచి "ఆమీ నేను గలిసిమాటలాడుచు వచ్చుటకు మిసెసు హేవర్డు సమ్మతించినది. అతిశీతాకర వెన్నెలకావునఁ బ్రోవతప్పము. నీవేమైన నడ్డుచెప్పెదవా" యని యడిగెను. హేవర్డు స్వసమ్మతము దెలిపి యాశీర్వదించి హర్బర్టు హస్తమును నిజ హస్తంబున నొత్తి బండియెక్కెను. అతిశీఘ్రగమనంబున గుఱ్ఱము బండిని లాగుకపోయెను.

"ఆమీ! ఇంకరమ్ము మనమిద్దఱము కలిసియుండు నిమిషములసంఖ్య స్వల్పముగ నున్నది. పోవుదము లెమ్ము" అని హర్బర్టును నొకరిబుజములపై నొకరు చేతులువేసికొని వనమార్గము బట్టిరి. వెన్నెల పిండియాఱబోసినట్లుండెను. ఆవెన్నెలయందుఁ జూచుటకుఁ బ్రతివస్తువు మనోహరముగ నుండెను. అంతటను సంపూర్ణనైశ్శబ్ద్యంబు రాజ్యము చేయుచుండెను. అప్పుడప్పుడు వినఁబడు గోష్ఠపిల్లలయఱపులు, గోష్ఠాలమెడలఁ గట్టిన చిఱుగంటలధ్వనులు, వారి మనంబుల కాహ్లాదకరంబులుగ నుండెను. అనేకసంవత్సరములు వృద్ధి నొంది నూతనముగ నుప్పొంగి పొరలివచ్చుచున్న యనురాగరసము వాక్కుల్యామార్గంబున నొకరి హృదయమునుండి యొకరిహృదయమునకుఁ బ్రవహించుచుండెను. వా రాడినముచ్చటలు దానినిగుఱించి దీనినిగుఱించి

యని చెప్పుటకు వీలులేదు. రాత్రి రెండుజాములు కావచ్చెను. ఇక గృహముల కేగవలెనను తలంపు బుద్ధికి పట్టెను.

గృహమునకేగు తలంపుదగ్గఱకు మాటిమాటికిఁ బోయెదరుగాని. వారి యొక్క ప్రేమతలంపు మనస్సునకు రాఁగా మరల మాటలాడుచు నిలువఁబడుదురు.

హార్బర్టు గౌఁగిలించి ఏమేమో ముచ్చట్లు చెప్పుచుండ గడియారము గంటలఁ గొట్టెనుగాని యామె లెక్కపెట్టఁజాలకపోయెను. “ఆలస్యము చేయవలదు. త్వరగ రమ్మని మీయమ్మ నాకుఁ జెప్పెను. ఇంకను నీవింటికిఁ బోయి పరుండకుండిన నామెకుఁ గోపము వచ్చును. ఆమెసమయమలనఁ గదా మనమిద్దఱ మింతవఱకు మాటలాడఁ గలిగితిమి.” అని హార్బర్టు లేఁ బోయెను. కాని యొకరి నొకరు విడిచి పోఁజాలరైరి. ఆమె కన్నులు బాష్పపూరితము లాయెను. నిట్టూర్పు లతిశయించెను. శరీరము కంపింపఁ దొడఁగెను. ప్రియురాలి నొకచేతఁ బెనఁగొనించికొని రెండవచేతఁ గన్నీరుదుడుచుచు సుందరవదనంబునెత్తి హార్బర్టు గాఢంబుగ భ్రాంతచుంబనంబు గావించెను. ఆమె యొక్క ముఖము నావరించియున్న దైన్యము హార్బర్టున కమిత దుఃఖము కలిగించెను. కంటికి నీరుమాత్రము రాలేదు. ఓదార్పు మాటలొకటిరెండు తడఁబడుచు నామెకుఁ జెప్పఁగలిగెను; కాని యామె చెవులఁబెట్టలేదు. ఆమెహస్తమును బట్టుకొని మెల్లఁగ హార్బర్టు వసారాలోనికిఁ దీసికొనిపోయెను. ఆమె గ్రహించినది. వీరికొఱకు రెండవయంతస్తులోని యొకగది తెఱవఁబడియుండెను. మేడమీఁదికిఁ బోవుటకు మెట్లు బయటనుండెను గావున నెవరిని లేపకుండ నిద్దఱును పైకెక్కి గదిలోఁ బ్రవేశించిరి. “ఆమె! నన్ను రక్షింపుమని దేవునిఁ బ్రార్థింపుము. నాయోదార్పు మాటలకంటెఁ బరమాత్మప్రార్థనయే నీ కెక్కువ మనశ్శాంతి నొసఁగఁగలదు. నేనుగూడ నీకొఱకుఁ బ్రార్థించెదను.” అని హార్బర్టు “స్వచ్ఛమై పవిత్రమైన,

స్వర్గలోకమునందుండి యెవ్వఁడు మనల సదా వీక్షించుచున్నాఁడో, యాభగవంతుఁడు నిన్నాశీర్వదించి రక్షించుఁగావుత" మని ప్రార్థించెను. అంతకంటె నెక్కువ ప్రార్థింపలేక పోయెను. నిర్భరమోహంబున నామీనాఁ గౌఁగిలించి రణశాస్త్రపారంగతుఁడో యన, ఫాలమును గనులను పెదవుల నదురాగపురస్సరంబుగ హార్బర్టు చుంబించెను. ఒకరిచేయి నొకరుపట్టికొని గదిలోఁ గొంతసేపు తిరిగిరి. ప్రొద్దుపోవుచున్నందున నిఁక విడిచిపోవక తప్పదని నిశ్చయించికొని హార్బర్టు మెల్లఁగఁ దలుపువద్దకుఁబోయి యామీనాఁ జూచిన సంతాపమెక్కువ యగునని తిరిగియైనఁ జూడక కడపటాఁటి తటాలునఁ దలుపువేసి యనివార్య దుఃఖంబుతో మెట్లుదిగి యింటిదారిం బట్టెను.

సంతాపము సహింపఁజాలఁ డాయెను. గుండెలు పగులునేమో యనున ట్లతివేగముగఁ గొట్టుకొనుచుండెను. ఉచ్ఛ్వాసనిశ్వాసము లాడుట కష్టమాయెను. నడవ నశక్తుఁడయ్యెను. తుదకు మార్గపార్శ్వమునఁ గూలఁబడెను. కొంతసేపటికినుక నతఁడుపొందిన వేదన సహింప శక్యముకానిదిగ నుండెను. అశ్రుకణములు నిరవధికముగ జాలై పాఱెను. కన్నీరు కాఱుటవలన వేదనకొంత తగ్గినది. హస్తతలవిన్యస్తశిరస్కుండై కొండొకవడి చింతించి ప్రకృతిసత్త్వంబయిన దుఃఖోపశమనంబునం దిన్నఁగ లేచి నడచుచు నిల్లు చేరెను.

తెల్లవాఱెను. హార్బర్టు డోవరునకుఁ బోవలసిన సోమవారము వచ్చినది. కాంటును, మిసెసుకాంటును, హార్బర్టుమొదలైన వారందఱు*భోజనపుబల్ల చుట్టుకూర్చుండిరిగాని యొకరికి నొకకణము లోనికిఁ బోయినది కాదు. వారి హృదయములు దుఃఖముతో నిండియుండెను. భోజనమైనపిమ్మటఁ దమ్ములను జెల్లెండ్రను హార్బర్టు తనపజ్జకుఁబిల్చి హిందూదేశమునందుగల చిత్రవస్తువులఁ

* భోజనపదార్థముల నొకబల్లమీదనుంచి యాబల్లచుట్టును కుర్చీలమీఁద గూర్చుండి భుజించునాచారము పాశ్చాత్యులలోఁ గలదు.

దెచ్చి యిచ్చెదననియు దిగులుపడవలదనియు నోదార్చి పోయి వచ్చెదనని చెప్పెను. మిసెసు కాంటను విషణ్ణహృదయయై మాటాడలేక యుండెను. శోకము నణఁపవలయునని యనేకవిధములఁ బ్రయత్నించెను గాని యాగినది కాదు. కన్నకడుపుగావున లోపలినుండి దుఃఖము పొంగిపొంగి వచ్చుచుండెను. హార్బర్టు పోయి యామెను గౌఁగిలించి యొడిలోఁ గూర్చుండెను. ఆమె కన్నీరు కాలువలై పాఱ నేడ్చుచుఁ జేతులతో హార్బర్టుదేహమంత తడవెనుగాని యొక్కమాటయైన నాడలేకపోయెను. తండ్రి వాకిటనుండి త్వరపెట్టుచున్నం దునఁ దల్లియొడినుండి బలవంతముగ లేచి బయట సిద్ధముగనున్న బండియొద్దకుఁ బోయెను. మిసెసుకాంటను శోకభరంబునఁ బడుచుఁబడుచుఁ గిటికీయొద్దకుఁ జనెను. కన్నులనిండ నీరు కమ్మియుండుటవలన నామె కేమి బాగుగ నగపడ లేదు. తండ్రి కొడుకును బండిలో నెక్కించుట మాత్రము లీలగఁ గనఁబడెను. అచ్చట బండివాఁడు గుఱ్ఱము నదలించెను. ఇచ్చట మిసెసుకాంటను మూర్ఛిల్లి క్రిందఁబడెను. తల్లులకుఁ గుమారుల యందుఁ గల యట్టిప్రేమను వర్ణింపఁ బూనుట వెఱ్ఱితనంబు. అది కేవల మంతరింద్రియానుభవనీయంబకాని శబ్దజ్ఞే యంబుకాదు.

ఆదినమున సైన్యము డోవరుపట్టణము చేరెను. తఱువాత నాఱవ దినమునఁ గాంటను డోవరునకేగి హార్బర్టును గలిసికొనెను. యుద్ధసంభారంబు పూర్తిగ సమకూర్చుకొనుటకై సైన్యమచ్చటఁ జాలదినము లుండెను. ఈయవ్య వధిలో నింటికిఁబోయి చూచిరావలయునని హార్బర్టు తలఁచెనుగాని తల్లి, అమీ, తాను వచ్చుచుండినప్పుడు పడినసంతాపము జ్ఞప్తికిరాఁగా నాయుద్దేశము విడలెను. హార్బర్టు తల్లినిఁదమ్ములఁ జెల్లెండ్ర జ్ఞప్తికిఁదెచ్చికొని యప్పుడప్పుడు దుఃఖించుచుండఁ గాంట నోదార్చి ధైర్యము చెప్పుచుండెడువాఁడు. సైన్యము డోవరునుండి హిందూదేశమునకుఁ బ్రయాణముకావలసిన రోజు వచ్చినది. ఆనాఁడు గృహముల విడిచి, బిడ్డల వదలి, భార్యల నెడఁబాసి, బంధువులఁ

ద్యజించి, తల్లిదండ్రులను దూరులై, సుఖంబులఁ బృష్ఠభాగంబునను దుఃఖంబులఁ బురోభాగంబునను బెట్టికొని, మాతృదేశకీర్తి స్థాపనమునకై రక్తసమర్పణంబు సేయ సమకట్టి, మహాసముద్రము దరింపఁ బవమానపాత్రములం బడుగిడఁ బోవుచున్న వీరవరుల ప్రస్థానము చూపఱకు భయోద్రేకంబులు కలిగించుచుండెను. జెండాలు పైకెత్తఁబడి వాయువేగంబున నాడుచుండెను. ఆశూరవరులలో నెవరిముఖంబునను దైన్యము కానరాదు. అందఱును స్వదేశౌన్నత్యసూచకంబులైన ధ్వజంబులఁ దిలకించి యోధులకుమాత్రము గోచరంబగు వీరోద్రేకముతో నిండియుండిరి.

జనులు కరతాళధ్వనులు చేయుచుండిరి. నావలు గట్టునకు దూరముగ నుండుటచే సైన్యము చిన్నపడవలలో నెక్కెను. పడవలనడుపుట కుత్తరువాయెను. తీరముననున్న యాంగ్లేయోద్యోగులు మూఁడుపర్యాయములు సంతోషపూర్వకములైన కరతాళధ్వనులు చేసిరి. బ్యాండు వాద్యము వాయింపఁబడెను. పడవలలోనున్న సైనికులు మర్యాదచొప్పునఁ దిరిగి మూఁడు పర్యాయములు కరతాళధ్వనులు సల్పి ప్రత్యుత్తర మిచ్చినవారైరి. పడవలు నడవసాగెను. కాంటను హార్బర్టును విడిచిపెట్టి పోలేక యతనితోఁబడవ యెక్కెను. పడవలు నావలవద్దకుఁ జేరెను. సైనికులందఱు పడవలుదిగి నావలలోఁ బ్రవేశించిరి. కాంటను ధైర్యమవలంబించి యెడఁబాసిపోవలసిన నిమిషము వచ్చినదని తలఁచి కుమారునిఁజూచి "నాయనా! సకలప్రపంచమును రక్షింపఁగలిగిన భగవంతుఁడు నిన్నుఁ గాపాడుఁగావుత. నీవపాయముల కెదురుగఁబోవుచున్నావు. మనము తిరిగి కలిసికొనెదమని దృఢముగ నమ్ముచున్నాను. నాయాశలన్ని నీమీఁదనే యుండును. నీదేహమును జాగరూకతతోఁ గాపాడుకొనుము. తండ్రీ! ఇఁక మాటలాడఁ జాలను" అని కౌఁగిలించియుండ హార్బర్టు గాద్గద్యముచే నేమియుఁ బలుకలేక నావబయలుదేఱుటకు సిద్ధముగ నున్నందున బడికిఁబోవు పిల్లవానివలెఁ దండ్రిని విడిచి నావలోఁ

గూర్చుండెను. కాంటు నెక్కియున్న పడవ వెనుకకు మరలినది. హార్బట్టెక్కిన నావ కదలం బ్రారంభించినది. సండ్రియున్న పడవ పృష్టియంతదై, గాఢమై, కడసకై, సుంతంతదై, పెడతంతదై, పెంకమై, సూక్ష్మమై, సూక్ష్మ తరమై, సూక్ష్మతమమై, యదృశ్యమైననుక హార్బట్టు వీక్షించెను. కష్టంబుల కైన సుఖంబులకైన నోర్వంగలంగి భరతఖండాభిముఖులై పోవుచున్న సైని కుల నావలయొక్క తెరచాప లత్యుచ్ఛ్రియములు గావున జాలసేపటి వఱకుం గాంటునకు దృగ్గోచరములగుచుం దుదకు సముద్రజలోపరి సీలకాశ్యం దలమున లీనంబులై పోయెను.

1785 సంవత్సరమున డిశంబరు నెల యందొక శీతలసాయంకాలమునం గాంటు సకుటుంబముగ నుత్సాహకరమైన మంటచుట్టును సంతోషముతోం గూర్చుండెనని చెప్పి యీసందర్భమును వదలితిమి. తిరిగి తత్కథాక్రమము నకు వత్తము.

అమంటచుట్టును గాంటుకుటుంబమేకాక యామియుగూడ నుండెను. హార్బట్టిండియాకుంబోయి యొకసంవత్సరమైనది. అతఁడు వారము తప్పక ఉండ నుత్తరములు వ్రాయుచుండుటవలన, నతని యోగక్షేమములు వారికిం దెలియుచుండెను. సురక్షితుఁడుగ నుటెననియు, సత్సాంగత్యము దొరకె ననియు, దేశ మసౌఖ్యకరముగ లేదనియు, శీతోష్ణస్థితి వికటించినదికాదనియు, నతఁ డుత్తరములలోం దెలియఁజేయుచుండువాఁడు గనుకం దలిదండ్రులు నామియు సంతోషముగ నుండిరి. మొదలు విడిచిపోయినప్పుడు కలిగినదుఃఖ ముపశమించెను. ఉత్తరము రాక చాలదినములైనందున నారోజు టప్పాకొఱ కెదురుచూచుచుండిరి. కాంటుచేం బ్రేరేపింపఁబడి యామియుం, గాంటును కూఁతురును గొంతసేపాడిరి. తరువాత నామినిం బిలిచి "ఇంక సంగీతము పాడుదము. నీవు హారుమణి వాయింపుము" అని కాంటు చెప్పంగ నామి హారుమణివద్దకుం బోయెను. ఏకీర్తనపాడుదమని యందఱు నాలోచించు

చుండిరి. "ఆఁ——నాకు జ్ఞప్తికివచ్చినది. 'మందమారుతము వీవఁగా' నను కీర్తన హార్బర్టునకు మిక్కిలిప్రియమైనది. దానిఁ బాడుదము" అని ఆమీ ప్రారంభించెను. దాని కందఱు సమ్మతించి పాడిరి. ఆమె హారుమణివాయించుచుఁ బాడెను. అందఱు నానందరసమగ్నులైరి. "ఆమీ! లెస్సగఁ బాడితివి. ఈ దినము బహుశః నీకొకయుత్తరము రావచ్చు" నని కాంట సాహెబు పల్కెను.

ఆమీ——ఉత్తరమా! ఎక్కడనుండి! హార్బర్టు వద్దనుండియా?

మిసెసుకాంటను——అవును. అచ్చటనుండియే రావలయును. క్రిందటితడవ కూడ రాలేదు. ఈపర్యాయము వచ్చితీరవలయును. బొంబాయినుండి బయలుదేఱిననావ వచ్చినదనియు, రేపుత్తరము లీఁబడుననియుఁ గాప్టనునకు వార్తవచ్చినది.

ఆమీ——ఇఁక నెంతసేపటికిఁ డప్పా వచ్చును? (అని యువ్విళ్లూరుచున్నది.)

మిసెసుకాన్టను——ఇప్పుడో, యింకఁ గొంచెముసేపటికో రావలయును. ఈవేళ నెందుకో యాలస్యమైనది.

ఆమీ——ఈదినము సుదినము. (ఎడ్వర్డును, జాన్లీసును జూచి) ఏమందురు? కాదూ? హార్బర్టువ్రాసిన యుత్తరమును మొదలు బిగ్గరగఁజదివి తరువాత నాకు మఱియొకరు వ్రాసినదానిని జదివికొనియెదను.

ఎడ్వర్డు——అదిగో టప్పా. (అని సంచితీసికొనివిప్పి) అయ్యో! ఒకటే. నాయనా! ఇదిగో నీకే యీయుత్తరము.

కాంటను——ఇది నా యేజంటుదగ్గఱనుండియై యుండవచ్చును. ఈదిన ముత్తరము లీయలేదు కాఁబోలును. అయిన నంతయును దెలియునుగద (అని యుత్తరము విప్పియిట్లుచదివెను) "ప్రియుండవైన అయ్యా! నీకుఁగాని మిస్ హోవర్డునకుఁగాని బొంబాయినుండి యుత్తరములు రాలేదు. అచ్చటి వార్తలు చూడఁ దృప్తికరముగ లేనియట్లు తోఁచుచున్నదని తెలుపుటకుఁ జింతిల్లుచున్నాఁడను."

ఆమినా—యీమాటలు వినివినకముందే మూర్ఛిల్లి క్రిందఁబడి కొంతసేపటికిఁ దెలివినొందెను. ఆమె ధృఢచిత్తముకలదియైనను వర్షాగమంబు ప్రతీక్షించు చకోరంబునోటఁ బిడుగుపడిన విధంబున నీవార్త వినవచ్చినతోడనే మనస్సు వికలమయ్యెను. ఇట్టియవస్థ ప్రాప్తించుట సంవత్సరములోనే యామినా కిది రెండవసారి. అందఱు ననుకొనుచున్న ప్రకారము హిందూ దేశములో గొప్పయుద్ధములు జరుగుననియు, నందులో హార్ట్లీయున్న సైన్యము యుద్ధమునకుఁ బోవలయుననియును వీ రూహించిరి. హేవస్టు, మిసెసుహేవర్డు నామినానోదార్పఁ బ్రయత్నించిరి కాని, వారిప్రయత్నములు వ్యర్థములయ్యెను. ఆటపాటలతోడను సంతోషముతోడను ప్రారంభమైన సాయంకాలము దుఃఖముతో ముగిసెను. పిమ్మట వార్తాపత్రికలలో వచ్చిన వృత్తాంతములుకూడ నీదుఃఖము నుపశమింపఁ జేయురీతిని గానుండెను.

---

## పండ్రెండవ యధ్యాయము

పెనుగొండకనుమలలో వదలిపెట్టఁబడిన యబ్దుల్ రహిమాన్ ఖానుఁడు, నతనిపరిజనులు నేమిసేయుచుండిరో చూతము. త్రోవలో నేవిధమైన కష్టమును లేక ప్రయాణముచేయుచుండిరి. యుద్ధములు జరుగనున్న వనియు సుల్తానుఁడు కుబుసమువిడిచిన త్రాచువలె రివరివ లాడుచున్నాఁ డనియుఁ, గింవదంతులుఁ బుట్టెను. అందువలన ఖానుఁడు ప్రయాణము మిక్కిలి త్వరగఁ జేసెను. ఇట్లు శీఘ్రగమనమున నడచినడచి యైదవనాఁటికి బాలా పురముచేరి యచ్చట నమీనాను గొంచెముసేపు విశ్రమింపనియమించి, ఖానుఁడు కాశిమాలిని వెంటఁబెట్టికొని నందిదుర్గమునకు ముందుగ బయలు దేఱెను. ఈనంది దుర్గములోఁ డిప్పుసుల్తానుని దుర్గముగలదు. దానిలో సైన్యముండెను.

ఖానుఁడు—కాశీం! అదిగో ఆ యగపడుచున్నగుట్టలు చూచితివా?

కాశీ——ఆఁ. చూచితిని. అయితే యేమిటక్కడ?

ఖానుడు——అది మాడఁపగినచోటు: హైదరాలికిఁ బ్రియమైనస్థలము.

కాశీ——హైదరాలి వేసవికాలములోఁ జల్లదనమున కిచ్చటనుండువాఁడా యేమి? అక్కడ నిల్లు కలదా?

ఖాను——ఇల్లునన్నమాట నిజమే. కాని హైదరాలివంటివారు మనవంటివారు నుండఁదగినదికాదు. ఆయింటిలోఁ జొచ్చుట నరకములోఁ జొచ్చుటయే.

కాశీ——అయితే యది చెఱసాల కాఁబోలును.

ఖాను——అవును. దానిలోనికిఁ బోయి తిరిగి ప్రాణముతో వచ్చువారు కొద్దిమంది.

కాశీ——వారిగొంతులుఁ గోయుదురా?

ఖాను——అన్నమాటె. దానిలోనికి మనవారి నెవరినిఁ బంపరు. అది పరంగీల కొఱకుఁ బ్రత్యేకముగ నేర్పఱుపఁబడినది. దీనిలోఁ జెఱపెట్టఁబడిన పరంగీలు సుల్తానునకు లొంగకపోయినయెడల మొదలు కొందఱ నీశిఖరము మీఁది కెక్కించి క్రిందికిఁబడ నెట్టుదురు. అవిగో అచ్చటఁ గాకులు, గ్రద్దలు గుంపులుకూడియున్నవి చూడు! పైనిఁజెప్పఁబడినతీరునఁ గ్రిందికిఁ ద్రోయఁబడి చచ్చిన యొకపరంగీశవము నవి తినుచున్నవి. ఈవిధమునఁజేసినఁ దక్కినవారు భయపడి చెప్పినమాట విందురే మోయని సుల్తానుని యభిప్రాయము. కాని వా రెంతమాత్రమును లోఁబడరు.

కాశిమాలి యీ ఘోరకృత్యమునుగూర్చి విని వణఁకెను. ఖానుఁ డాంగ్లేయుల పరాక్రమము ననేకవిధములఁ బ్రశంసించి తాను పెరంబాకం యుద్ధములో సుల్తానునకు సహాయముగఁ బోరి కనఁబఱచిన శౌర్యసాహసములకు మెచ్చి సుల్తానుఁడు తన కాపదవి నొసఁగెనని చెప్పెను.

కాశి——అయితే సుల్తానుఁడు చేసిన మేలు మఱవఁడని తలఁచెదను.

ఖాను——ఆమాట యెప్పుడు లేదు. మేలుచేసిన వారియెడలఁ గృతజ్ఞుఁడై యుండును. కాని యెవఁడైన నతనితో విరోధమువహించెనా? నిగ్గట

కష్టము. పరంగీలతనికిఁ బరమశత్రువులు. రాజ్యముకొఱకుఁ దంత్రములు పన్నుట, కుట్రలుచేయుట, మహమ్మదీయులవద్దనుండి కొన్నిదేశములు తీసికొనుట, బంగాళమునందు గలఁటలు రేపుట, మొదలగు పీకపనులన్ని సుల్తానుని కోపమును రగులఁజేయుచుండును. పరాసులు మనచేతిక్రింద నున్నను వారు పరంగీలంత యుక్తికలవారు కారు. మీఁదుమిక్కిలి మొన్న యొకమనుష్యుఁడు నెవరో రహస్యముగఁ జెప్పిన విషయము వినినప్పటినుండి సుల్తానుఁడు మిక్కిలి యాతురముతో నున్నాఁడు. బహుశః అది నీవు వినియే యుందువు.

కాశీ—లేదు. లేదు. ఏమిటది?

ఖాను—వినలేదా? సుల్తానుఁడు నిజసౌధములో నెవరికిఁ జొరరానిభాగమునఁ గూర్చుండి చదువుకొనుచుండఁగ నొక మనుష్యునివద్దనుండి వింతస్వరము వినఁబడెనఁట.

కాశీ—ఎవరు? ఎవరి దాస్వరము?

ఖాను—ఏమో. ఎవరికిఁ దెలియును? ఆపరమాత్ముఁ డెఱుఁగును. చూచుటకు సిద్ధపురుషునివలెఁ గనఁబడెనఁట. పరంగీలవలన సుల్తానునకు హాని కలుగఁబోవు దినము సమీపించినదనియు, వారినిగుఱించి మిక్కిలి జాగరూకతతో నుండవలెననియు, సుల్తానుఁడు రహస్యముగ విగ్రహారాధన మొనర్చుట వలనను మాయాకార్యములు చేయుటవలనను దేవుని యాగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెననియు, నాపురుషుఁడు చెప్పెనఁట.

కాశీ—అయితే యింతకు నాపురుషుఁ డెవఁడై నట్లు?

ఖాను—మనకుఁ దెలియదు. ఎవఁడో, యొకఫకీరు మాయగా సుల్తానుని దుర్గమసౌధములోనికిఁ జొచ్చెనని కొందఱు చెప్పుదురు. దయ్యమని కొందఱందురు. అన్నెము పున్నెము భగవంతుఁడెఱుఁగును. ఏది యెట్లున్నను మహమ్మదీయులకు విరుద్ధమైన కొన్నికర్మముల సుల్తానుఁడు చేయుచున్నాఁ డనుటమాత్రము వాస్తవము.

కాశీ—ఆసిద్ధపురుషునిఁ బట్టుట కెవరును బ్రయత్నింపలేదా?

ఖాను—చేయకేమి? అందఱిలోఁగుండఁ దప్పించుకొని దూరిపోయెనఁట. అప్పటినుండి యిప్పటివఱకు మరల నెవరికిఁ గనఁబడలేదు.

కాశీ—ఇదియంతయు మిక్కిలి యాశ్చర్యకరముగ నున్నది. పరంగీలన్న సుల్తానుఁ డెంతభయపడుచున్నాఁడు! వారితో యుద్ధము చేసిచూడవలె నని నామన స్సువ్విళ్లూరుచున్నది.

ఖానుఁడు—ఎందుకు నీ కాయాతురము! త్వరలోనే సమయము వచ్చును. నీకోరిక కొలఁదిదినములలో సిద్ధించును. ఇదిగో నందిదుర్గము చేరితే మన కన్నివిషయములు స్పష్టపడఁగలవు. అక్కడనున్న మన సైనికుల కెప్పటి వార్త లప్పుడు తెలియుచుండును.

ఇవ్విధమున సంభాషించుచు నందిదుర్గము చేరిరి. అచ్చట సైనికులు విడిసియుండిరి. గుఱ్ఱములు కొన్ని సకిలించుచుండెను. కొన్ని పండ్లతో మేఁత నెమకుచుండెను. ఏనుఁగులు తొండములు చాఁచి చెట్లకొమ్మలు విఱిచి పైబెరడు తినుచుండెను. ఒంటెలు కొన్ని లేచియుఁ గొన్ని పరుండియు నుండెను. అచ్చట నచ్చట గుడారములు వేయఁబడియుండెను. ఖానుఁడు, కాశిమాలి గుంపులోఁ జొచ్చిరి. జనులందఱు కలవరపడినట్లు లేచి సలాము లొసఁగిరి. కాశిమాలి సైన్యమును జూచి యాశ్చర్యపడుచుండెను. ఇమామసాహేబు వచ్చి ఖానునకు సలాముచేసి "దేవరవారు దయచేయుట మాకుఁ గన్నులపండువుగ నున్నది. ఆజ్ఞకై సేవకుఁడు వేచియున్నాఁడు" అని సవినయముగఁ బలికెను.

ఖాను—అయితే యిమాం! నీవుపోయి నేనిచ్చట నున్నానని చెప్పి జమాదారు సాహేబును బిలువుము. పొమ్ము.

ఇమా—చిత్తము. చిత్తము. మీరు వచ్చినారని విన్న జమాదారుఁడు పరుగిడుచు వచ్చును.

ఇమాము వెళ్లెను. ఖానుఁ డచ్చటిసైన్యమును జూచి యెచ్చటికో యుద్ధమునకుఁ బోవ నుద్దేశించిన ట్లున్నది యని యనుచుండ జమాదారుఁడు వచ్చి

నతనిఁ గౌరవించుకొని నిజశ్రేణికనుఁ గొంపోయి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టెను. కాశిమాలి యేమిచేయవలసినది తెలియక ఖానుని ప్రక్కన నిల్చుండ నతఁడు కూర్చుండు మని చెప్పెను. కాశిమాలి యతని పార్శ్వమున నాసీనుఁడయ్యెను.

క్రొత్తగ వచ్చిన కాశిమాలికి నింతయాదరణము ఖానుఁడు చూపుట జమాదారునకు నసూయాజనకముగ నుండెను. మొగము చిట్లించుకొని యీర్ష్యాసూచకదృష్టులు మాటిమాటికి నతఁడు కాశిమాలి వంక నిగుడ్చుచుండెను.

ఖానుఁడు కాశిమాలితో మాటలాడినప్పుడుగాని, యతనిపలుకుల విని సంతోషించినప్పుడుగాని, జమాదారుని యీర్ష్య మిక్కుటమగుచుండెను. కాశిమాలి జమాదారునిభావమును గనిపెట్టినవాఁడయ్యు నంతగ లక్ష్యముచేసి మనస్సునం దుంచుకొనినవాఁడు కాఁడు. అప్పుడు వారికి జరిగిన సంభాషణములలో సైన్యమునుగుఱించి ప్రస్తావించిరి. సేన ప్రయాణసన్నద్ధమైయున్న మాట వాస్తవము. మహారాష్ట్రమునకు సరిహద్దులలోనున్న రక్షణసైన్యము తప్పఁ దక్కినసైన్యమంత యొకచోటఁ జేరవలసినదని టిప్పుయొక్క యుత్తరువాయెను. చుట్టుప్రక్కల నున్నవారంద ఱిదివఱకు రెండుమూఁడువారముల క్రిందట నందిదుర్గములోఁ గూడిరి. మఱునటిరోజు ఫౌజు నందిదుర్గమునుండి శ్రీరంగపట్టణమునకు బయలుదేఱవలసియున్నది. ఇందుకుఁ గారణము జను లనేకవిధములఁ జెప్పుచుండిరి. ఆకస్మికముగఁ బరంగీలతో సంభవించిన కలహమే కారణమని జమాదారుఁ డనెను. కొడగుదేశపరిసరారణ్యములలో వేఁటాడుటకై సుల్తానుఁడు సేనను బ్రోగుచేయుచున్నాఁడని యొకకింవదంతి కలదు. కొన్నికోటల విషయమై సుల్తానునకుఁ దిరువాన్కూరురాజునకుఁ బోరాటము సంభవించిన దనియుఁ, దత్కారణమున నిప్డతఁడు యుద్ధసన్నద్ధుఁడై రనియు, మఱియొక వాడుక కలదు. ఈమూఁడవ సమాచారమే యందఱు నిజ మనుకొనుచుండిరి.

ఆరాత్రి ఖానకాశిమాలీలు జమాదారునియింటఁ గుడిచి గుడారములు వేయుటకుఁ దగినస్థలము బరీక్షించుటకై వెళ్లిరి. వీరు బయటికి వెడలినప్పుడు జను

లందఱు సలాములొనర్చి ఖానునియెడ మిక్కిలి గౌరవము చూపిరి. జమాదారునియందుఁ బరివారమునకుఁ గల యభిప్రాయములఁ గనిపెట్టి యతఁడు ప్రజాకంటకుఁడుగ నుండెనని కాశిమాలి గ్రహించెను.

నిజముగ జమాదారుఁడు జనప్రియుఁడు కాఁడు. నీచవంశమున జన్మించి సత్ప్రవర్తన మన నెట్టిదో యెఱుఁగనివాఁడు; ఘోరకృత్యములు చేయుటకు వెనుకడుగు వేయనివాఁడు; విగ్రహముల నాశము చేయుటయందును, దేవాలయములఁ బడఁగొట్టుటయందును, ముసల్మానులమగు మతలంబింపుఁడని హిందువుల బాధించుటయందును, సుల్తానునకుఁ గుడిభుజముగ నుండువాఁడు; చిత్రవధలు గావించుటయందు నేర్పరియైనట్టి జమాదారుఁడే యను ప్రత్యుత్తరమునకుఁ దప్పక తగినవాఁడు. ఇతఁడు హార్యాయుపుట్టువునఁ జన్మించి తత్పురజనుల కప్పుడు సహజమైయుండిన మూర్ఖత్వ, కఠినత్వ, క్రూరత్వ, కుటిలత్వములను బూర్ణముగఁ బొందియుండెను. పరంగీలన్న నుండి పటాటలో సుల్తానుని తరువాత నితనిని మించినవాఁడు లేఁడు.

కాశిమాలినిఁ జూచినప్పుడెల్ల నితనికి దుస్సహక్రోధము కలుగుచుండెను. ధైర్యము, శాంతి, సౌజన్యము, కృతజ్ఞత కాశిమాలియందుఁ గాంచి తత్సుగుణవిరహితుఁడైన జమాదారుఁ డతనిని మిక్కిలి ద్వేషించెను. ఖానునివద్ద నతఁడు చేరి పాదుకొనినచోఁ దనమాయోపాయములు నిర్వాగ్రహములు బయల్పడుననియుఁ, దత్కారణమున స్వకీయాధికారము క్షణములో భగ్నమగుననియు దృఢముగ నమ్మి, కాశిమాలి యెవరో, ఖానునివెంట నేల వచ్చెనో, యేయుద్యోగమునం దుండెనో, తెలిసికొన నాతురముతో వేత్రధారియైన మదారును బిలిచి సర్వవిషయములు రహస్యముగఁ గనుఁగొనిరమ్మని పంపెను.

మదారునకు జమదారునిలో నక్షరాల మహాప్రాతికయాంశము కలదు. ఎక్కడ డబ్బు వచ్చిన నిద్దఱును బంచికొనుచుండెడువారు. కాశిమాలి ఖానునికిఁ బ్రియుఁడుగ నుండుట జమాదారునికెంత దుస్సహముగ నుండెనో మదారుని కంత శిరోవేదనముగ నుండెను.

ఆరాత్రి ఖానుఁడు విశ్రమించుటకై యిమాంసాహేబు స్థలము నిశ్చయించి ప్రవర్థనై వెదకుచున్న ఖానునకు సనవిచేసి తా నేర్పఱచిన స్థలమునకుఁ గొంపోయి చూపెను. ఖానుఁ డా స్థలసౌందర్యమునకు మిక్కిలి సంతోషించెను. అది యొక హిందూదేవాలయము. దానిలో విగ్రహము మాత్రము లేదు. ఏమహాత్మునియొ ప్రభు వాపుణ్యము కట్టికొనెనో! తద్దేవాలయ స్తంభవిరాజమాన శిల్పకళాకౌశలమున కాశ్చర్యమంది "హిందువులు కుమతులైననేమి? విమతులైననేమి? వారిలో నా కెక్కుడుమంది హితులు గలరు. విగ్రహారాధనము నాకిష్టముకాకపోయినప్పటికి వారి యపార విద్యాచాతుర్యము, నిరుపమానవిజ్ఞానము శ్లాఘాపాత్రములు కాకమానవు. ఈదేవాలయము నే కబీరు నిర్మించెనో కాని యతఁడు మనకందఱకు గౌరవ నీయుఁడు. మన కిచ్చినవిధంబున వారికిఁగూడ భగవంతుఁ డపూర్వసుగుణముల నొసఁగియున్నాఁడు" అని కాశిమాలి ఖానునితో హృదయపూర్వకముగ ననెను.

ఖాను—కాశిమాలీ? ఈయభిప్రాయములు నీమనస్సులో నుంచుకొనవలయును గాని బయటికిఁ జెప్పఁగూడదు. సుల్తానునకు హిందువులన్నఁ బరమ ద్వేషము. ఈ నీమాట లతనిచెవిఁబడెనేని నీపురోవృద్ధికి భంగము రాఁగలదు. ఇమాంసాహెబూ! కాదా.

ఇమాం—మంచిమాట సెలవిచ్చితిరి. అక్కడమాట యిక్కడ, నిక్కడమాట యక్కడఁ జెప్పెడు దుర్మార్గులకొఱ కెచ్చటికొఁ బోనవసరము లేదు. ఇచ్చటనే కలరు. (కాశిమాలిం జూచి) నాయనా! నాకు 60 సంవత్సరములు దాఁటినవి. మీరు చిన్నవారు. అనుభవము లేదు. తెలియనిపనులు చేసి చెడిపోయిన చిన్నవాండ్ర ననేకుల నెఱుఁగుదును. నే నీమాటలు చెప్పినందుకు క్షమింపవలయును.

కాశీం—ఇమాం! నీవు నాకు హితవాక్యములు చెప్పినందునఁ గృతజ్ఞుఁడనై యుండెదను. నీస్నేహమును గాంక్షించుచున్నాను.

ఇమాం — ఖానుసాహెబు సుఖముగ విశ్రమించినతరువాత మీరు నా గుడారమునకు వచ్చినట్లయిన నుద్యోగముయొక్క లోటుపాటులు కష్టసుఖములు చెప్పెదను. ముందే నీకు దెలిసియుండినమంచిది గదా!

ఖాను — కాశిమాలీ! నీవు తప్పక యీరాత్రి యిమాంగుడారమునకుం బొమ్ము. ఇతఁడు సయ్యదుతెగవాఁడు. దైవభక్తి గలవాఁడు. నీకు హితమైన విషయము లెన్నో చెప్పఁగలఁడు.

ఇవ్విధమున వీరు మాటలాడుచుండ బోయీలచప్పుడు వినఁబడెను. అమీనాపాలకి వచ్చుచున్నది. ఖానుఁ డున్నస్థలమునకుఁ దీసికొనిపోవుటకై కాశిమాలి పాలకి కెదురుగఁ జనెను. పాలకీసందులోనుండ నెట్టులైన నమీనాను జూడవచ్చునని కాశిమాలి యత్యంతకుతూహలముతో నుండెను. ఆనాఁడు త్రోవయందుఁ బల్లెటూరిలో మరాటీదండు వచ్చినకాలమునఁ దప్ప మరల నమీనాను వీక్షించుట కతనికి వీలైనదికాదు. బోయీలు తెలియక తప్పుమార్గమునఁ బోవుచుండ "ఇటురానిండు. ఇటురానిండు" అని కాశిమాలి పెద్దకేక వేసెను. ఆకేక విని కాశిమాలి కంఠధ్వని యని యామె గ్రహించెను. అతనిముఖము నవలోకించుట కామెకుఁ గోరిక యుదయించెను. ఇంతకుఁ బూర్వము తలఁపునకు వచ్చినప్పుడెల్ల నతనిమనోహరాకారమును బ్రేమను జ్ఞప్తికిఁ దెచ్చుకొని దుస్సహమైనవలపుచేఁ గుందికుంది యెప్పుడు ముఖవీక్షణమైన నబ్బునోయని యువ్విళ్లూరుచున్న యమీనాకుఁ గాశిమాలికంఠస్వరము సమీపమున వినఁబడఁగనే జనించిన తత్తఱపాటున మనస్సును బట్టలేక ముఖము నావరించియున్న ముసుఁగును గొంచెము తొలఁగించెను. కాశిమాలి తనను జూచుటకుఁ బ్రయత్నించుచున్నాఁడని యెఱిఁగినచో నామె ముసుఁగు తీయుటకు సాహసించియుండదు. ఏదియో యడ్డమువచ్చినందునఁ బాలకి యాఁగవలసివచ్చెను. ఆయాఁగుటలో నతనికి మిక్కిలి సమీపమున నాఁగెను. అతఁడు నామె రహస్యము లాడఁగలుగునంత దగ్గఱగా నుండిరి. ఒకరి నొకరు చూడఁగలిగిరి. ఆమెమొగము కంటఁబడుడుఁ గాశిమాలి కనురాగ

ముసుగుతోనైన. అతఁడు తనను జూచుచున్నాఁడని యమీనా గ్రహించిన తోపులేకుండ స్వప్నే మొగమునిండ ముసుఁగు వేసికొనెను గాని, వేసికొనులోపల నాతఁడు—శ్రీ నతనిబొమ్మపై గాయమునకుఁ దానుగట్టినకట్టును వీక్షించి "నేను—అగొడ్డను శాశిమాలి తీసివేయలేదు" అని యనుకొనెను. పాలకీ మెల్లఁగ ఖానుఁడున్న స్థలమునకుఁ జేరెను. అతఁడు లేచివచ్చి చేయిపట్టుకొని యమీనాను ప్రేమపూర్వకముగ లోనికిఁ గొనిపోయి స్థలసౌందర్యమును జూపెను. ఆచిత్రములఁ జూచి యామె బాలికవలె నాశ్చర్యపడెను.

---

## పదుమూఁడవ యధ్యాయము

ఖానుని పరిజనమంత నందిదుర్గము చేరినదనుక వేచియుండి వారిని మదారు కలిసికొనెను.

మదారు—సలామాలేకుం! దాదూ.

దాదు—సలామాలేకుం.

మదారు—ఖానుఁడు నెమ్మదిగ వచ్చినాఁడుగదా.

దాదు—ఆఁ వచ్చినాఁడు.

మదారు—అయితే ఖానుఁడు పెండ్లాడివచ్చినాఁడా? ఇంకను వయస్సులోనే యున్నాఁడు. మంచిశక్తి కలవాఁడు.

దాదు—నిజమే.

మదారు—ఖానునిభార్య తమ్ముఁడు దిట్టమైనవాఁడుగఁ గాన్పించుచున్నాఁడు.

దాదు—(కోపదృష్టితో) ఎవఁడవురా నీవు? ఖానునిభార్య పేరెత్తుచున్నావు. పండ్లూడఁ గొట్టించెదను. సైతాన్, ఇక్కడనుండి తిన్నఁగఁ బొమ్ము. ఖానునకు పెండ్లి యేఁడి? అసలే లేఁడే? పిచ్చిమాట లాడెదవేని నీగడ్డి నీవు తిందువు. తిన్నఁగ వెళ్లుము.

దాదుతోఁ బ్రసంగించినయెడలఁ గాశిమాలిని గొంగెవ్వారు నాయఁ దెలిసికొనుట కవకాశము లేపని తలఁచి మదారుఁడు ఖానే స్వయముగా తన్నుపెగ్గ కేఁగెను. వాఁడు తనకుఁ దెలిసినవఱకు సవిస్తరముగఁ గరముతోఁ జెది గద్దారుఁడు తనపని పూర్తిచేసికొని పోఁబోవుచుండ నీవృత్తాంతమున్నట్టి గట్టినడుఁ బోఁ కాశి మాలియు, నిమాంసాహేబును బయటికి వచ్చిరి. మదారుని ప్రవర్తన యిమాం సాహేబు పూర్తిగ నెఱుఁగును. అతఁడు కాశిమాలిని గుఱించి జాడలుతీయు టకై వచ్చినాఁడని తెలిసికొనెను. ఇమాంసాహేబు కొంతసేనకు నాయకుఁడు, ఖానునకుఁ బ్రియుఁడు. కనుక మదారునిఁగాని, జమదారునిఁగాని, లక్ష్యము సేయక మదారుని నాసమయమున నవమానింప నిశ్చయించుకొనెను.

ఇమాం——ఓహో! మదారుసాహేబ్! ఏమి టది వాని నడుగుచున్నావు. నీవు చూడ శకునపక్షివలెఁ గనఁబడుచున్నావు. పీనుఁగుల భక్షించు నక్క మొగము పెట్టికొని నీవు వాని నేమడుగుచున్నావు? గుల్లాప్రవాఁడా? భయపడవలదు. నిజము చెప్పు. నిన్నాతఁడే రడిగిన దేమిటి?

గుల్ల——చిత్తము మహాప్రభూ! పటేలుసాహేబును గూర్చి యడిగినాఁడు.

కాశీ——గాడిద! నన్నుగుఱించి నీ కేమి కావలెనురా?

మదారు——అయ్యో అయ్యో! మఱేమిలేదు. ప్రార్థ్యవంతులైన తమ రెవరో యడిగిరమ్మని జమాదారు నన్నుఁ బంపినాఁడు. మీ ఱొమ్ముమీఁది గాయముచూచి త్రోవలో ఖానుసాహేబున కేదైన సహాయము సంభ వించెనేమో కనుఁగొని రమ్మనినాఁడు.

ఇమాం——నీమాటలు ప్రస్తుతము తప్పించుకొనుటకుఁ దగినవిగానే యున్నవి. నిన్ను నీజమాదారునిఁ బూర్తిగ నెఱుఁగుదును. ఇది మొదలుగ జాక రూకతో మెలఁగుము. నీజమాదారునకుఁగూడఁ జెప్పు. తెలిసినదా?

కాశిం——మదారుసాహేబ్. నే నిదే చెప్పుచున్నాను. ఇఁకముం దెప్పుడైన మాపరివారములోనికి నీవు వచ్చినట్లుగాని, లేక ఖానుని సేవకులతో నెవ

నీతో నైన మాటలాడినట్లుగాని, నాకంటఁ బడితివా సున్నముగాని తెలుక లేకుండ నుగ్గుచేసి విడిచిపెట్టెదను. తెలిసినదా ! ఆఁ.

మదారు—అయ్యా—;

కాశిం—అయ్యా లేదు గియ్యా లేదు. ఇంక నీమాటలు మాచెవులఁ బడఁ గూడదు. ఛీ! నీ మొగము చూడను. గొంతులు కోయువానివలె నున్నాఁడవు. విషము పెట్టి చంపువానివలె నున్నాఁడవు.

కాశిమాలి యువ్విధమునఁ బల్కుటవలనఁ జుట్టుప్రక్కలనున్న వారందఱకు సంగతి చిక్కెను. మదారువలన నిదివఱకు కష్టానము పొందినవారందఱు కసితీర్చుకొన సమయము దొరకిన దనుకొనిరి. వానిగడ్డి వాము తినెనని యొకఁ డనెను. కుక్కవలెఁ బోవుచున్నాఁడని యింకొక డఱచెను. పందివలెఁ బరుగెత్తుచున్నాఁడని మఱియొకఁడు గేలిచేసెను. అప్పుడు నొంటెలఁ దోలువానిభార్య యొకతె గలదు. మదారుఁ డామెకు గర్భశత్రువు. బ్రహ్మపొరపాటున "మర్మజాతసంఘాతము" లుంచినందున కనుఁగొనవలసినచోటని యన్నిలక్షణముల నామె పురుషుఁడని చెప్పవచ్చును. ఆమె యా సమయమునఁ బెద్దగొంతుతో "ఆపాఱుఁబోతును బట్టి గడ్డాలు మీసాలు కోసివేయవలెను. అటువంటి పిఱికి ముండకొడుకులకు మగటిమి యుండఁగూడదు. గొఱిగించి పెండ్లామువలె నంపుఁడు. ఓమదారూ! ఇటు రమ్ము, నీమొగాన! థూ! ఉమ్మివేయ." అని యఱచుచుఁ జేతులు చాచుచుఁ గేకలువేసెను. మదారుఁ డీమాటలు వినియు వెనుకకుఁ దిరిగిచూడకుండ మఱి యెక్కువవడిగఁ బోయెను.

కాశిం—ఇమామూ! చూచితివా? ఆదుర్మార్గుని చేష్టలు.

ఇమాం—నిజముగ దుర్మార్గుఁడే. అతనినిగుఱించి మీకుఁ గావలసినంత చెప్పెదను. కాని యతనిని దూషించితిమే యని కొంతచింతగ నున్నది.

కాశిం—నాకుఁ జింత లేదు. నేనన్నది యున్నట్టులు నిష్కపటముగఁ బలికెదను.

ఇమాం—వీఁడు పోయి యున్నవికొన్ని లేనివి కొన్ని చెప్పి జమాదారుగారితోఁ జెప్పును.

కాశీ—అయితే యేమి? ఇమాం! నాకు భయములేదు.

ఇమాం—ఇక్కడ మనము మాటలాడఁగూడదు గాని గుడారములోనికిఁ బోవుదము రమ్ము.

జమాదారుని మాయోపాయములను గుయుక్తులను దుశ్చరితములను భయజనకముగ నిమాంసాహేబు చెప్పెను గాని ప్రపంచానుభవము లేని కాశీమాలి లెక్కచేసినవాఁడు కాఁడు. జమాదారుని కథవిన్నచో మఱియొకఁ డైనయెడల భయకంపితుఁడు కాకమానఁడు.

కాశిం—అయితే యిమాం! ఇంతకు జమాదారుఁడు నాయెడ విరోధము పూనియున్నాఁడను గుఱుతేమిటి?

ఇమాం—వాని మొగమే చెప్పక చెప్పుచున్నది. ఖానుఁడు నీతో సంభాషించినప్పుడును, నీమాటలకు సంతోషించినప్పుడును, నీవంక నతఁ డేతీరునఁ జూచుచుండెనో నీ వెఱుఁగుదువా? నిన్నుఁ జూచినప్పటినుండి యతనికి గుఱ్ఱుగ నున్నది.

కాశిం—వాఁ డేమైనఁ జేయనీ. నేను భయపడను.

కాశీమాలి ధైర్యవాక్యములఁ బల్కెఁ గాని జమాదారుని చరిత్రము వినినప్పటినుండి మనస్సు కలవరపడుచుండెను. మదారుసాహెబు పరాభవవ్యాకులితచిత్తుఁడై తత్తఱపాటున జమాదారుని సమీపించెను. అతని కన్నులు చింతనిప్పులవలె నుండెను. హృదయములో నవమానసంజనితరోషము మంటయై మండుచుండెను. మొగము వికృతరూపము వహించియుండెను. పటపట పండ్లుకొఱుకుచు మదారుఁడు తలగుడ్డ తీసి విసిరి నేలకుఁగొట్టి శరీరము కంప మొందఁ నేమో చెప్పఁబోయెను.

జమా—ఏమి విశేషములు మదారూ! నిన్నేమిచేసినారు! చెప్పు! ఏమి సంభవించినది.

మదారు—ఏమిచెప్పుదును? పంది, కుక్క, లంజకొడుక, గాడిదకొడుక అని

ఇన్నన్నియూ తిట్టిన తిట్లు ? మిమ్మునో? కాఁచిపెట్టిరా ? వినరాని బూతు మాటలాడిరి. కాపున తీర్చుకోనని యెడల బ్రతుకు వ్యర్థము.

జమాదారు——ఎందుకు ? ఏమి సంభవించినది ?

మదారు——అయిమాం గాడిదకొడుకు, క్రొత్తపోలీసుగాఁడును నీగడ్డమును లాగెద మనిరి. దానిమీఁద వట్టి పోయుదు మనిరి. నీమీసాలు కోసెద మనిరి. సున్నములోని కెముక లేకుండ నుగ్గుచేసెదు మనిరి. ఒకరూఁడు దానిని బుర్రకొల్పి నన్నుఁ దిట్టించిరి. నాగడ్డాలు మీసాలు గొరిగించెద మనిరి. ఇది యే మన్యాయము ? తుచ్ఛ లంజకొడుకులు ! యాఅల్లా ! యాహుశేక్ ! యాహైదర్ (అని నేలమీఁదికలగుడ్డను దీసి తొడలు తొందరగా నెత్తికిఁ జుట్టుకొనెను.)

జమా——వా రీమాట లనిరా ? నీ వీచెవులతో వినఁగలిగితివా ? అల్లా ! అల్లా ! మనుష్యరక్తమును బీల్చు పెద్దపులివంటి నేను, గుక్కకంటె హీనుఁడనైతినే. ఎవరక్కడ——దఫేదార్ ! నీవుపోయి యిమాం సాహెబును జుట్టుపట్టుకొని లాగుకరమ్ము (ఆలోచించి) దఫేదార్ పోవద్దు. పోవద్దు. ఇమాంసాహెబువద్దకుఁ బోవుదము.

జమాదారుఁడు మదారును దప్పు నందఱను బయటికిఁ బంపెను.

జమా——మదారూ ! నన్నిట్లు ప్రకారము తిట్టుచుండఁగ విని నీ వూరకుంటివా ? ఒక్కబదులుమాటయైన ననలేకపోతివా ? వారిలో నొకనినైనఁ గొట్ట లేకుంటివా ? ఛీ ! నీ పిఱికిమొగముమీఁద నుమ్మివేయ !

మదా——చిత్తము. చిత్తము. కోపపడవలదు. అక్కడ నాకు దిక్కెవరును లేరు. ఆగుంపంత పైనిఁబడి కొట్టిన నే నేమి చేయఁగలను ? ఒక్కబదులు మాట నానోటినుండి వెడలియున్నయెడల నా యాఁడుముండ పైనిఁబడి ఏనేమి చేసియుండునో ! దేవుని కెఱుక.

జమా——అయితే యింతకు నద వారిరోజు. ఇష్టమువచ్చిన ట్లాడిరి. ఆ కుంకల

నెంగఁ ద్రొక్కక మానను. సమయ మింకను రాలేదు. కాసిమ్ము ఆపోటిగాఁ డెవఁడో చెప్పకపోతివి. ఎవఁడు వాఁడు ?

మదా—అయ్యా! వాఁ డొక పటేలఁట, వానితల్లి చెడ్డది.

జమా—అతనితల్లి యెవరైన నా కెందుకు ? వాఁ డెవఁడు ? ఖానునివెంట నెందుకు వచ్చినాఁడు ? సరియైన ప్రత్యుత్తరము చెప్పవేని చెప్పుతీసికొని మూతిమీఁదఁ గొట్టెదను.

మదా—మహాప్రభూ! దేవరవా రాగ్రహపడవలదు. దయచేసి వినవలయును. ఖానుఁడు నతనిభార్య త్రోవయం దొక గ్రామమునొద్ద వాఁగులలోఁ బడిరి. ఆ గ్రామపుఁ బటేలు కాశిమాలి. ఇతఁడు ఖానుని భార్యను బైటికిఁ దీసి రక్షించినాఁడు. ఖానుఁడు మకాముచేసిన మఱియొక గ్రామము మీఁదికి మరాటీదండు రాఁగా ధైర్యముతోఁ బోరాడి వారిని వెడలఁ గొట్టెను. ఆకలహములో నతనికి ఱొమ్మున దెబ్బతగిలినది.

జమా—ఇంతే ?

మదా—అయ్యా! ఇంతే. ఆపటేలు దిట్టరి. గొప్ప వీరుఁడు. ఒక్క చేతితోఁ బదునల్వురు మరాటీలఁ జంపెనఁట.

జమా—ఛుప్! ఈమాటలు నీవంటి యవివేకిగాని నమ్మఁడు. (కొంచె మాలోచించి) పటేలు ఖానునియొక్క భార్య మొగము చూచియుండును.

మదా—నిజముగఁ జూచినాఁడు. వాఁగుదగ్గఱనుండి యామె నింటికి మోసికొని పోయినాఁడు.

జమా—ఆమె చక్కనిదేనా?

మదారు—పున్నమచందురునివంటి మొగముకలది యఁట.

జమా—అటువిమ్మటఁ బటేలామెను మరల నెప్పుడైనఁ జూచినాఁడా? చూచి నట్లే నామనస్సునకుఁ దోఁచుచున్నది.

మదా—స్వామీ! మీసేవకుని కావిషయ మెట్లు తెలియును? బహుశః

చూచియే యుండవచ్చును. ప్రయాణము చేయునప్పుడు మొగము లెట్లు దాఁచికొనఁగలరు.

జమా—అదికాదు. అదికాదు. ఇప్పుడు జరిగిన దైవవిధి వానినిఁ దెలియనీకుము. వా రీవిషయము మఱతురు.

మహా—వినినవారు మఱపరు గద.

జమా—నన్నెవరైన నవమానించినప్పుడు వారికిఁ బ్రత్యపకారము చేయుదనుక నిద్రపట్టదు. ఇంక వెళ్లుము. నాదర్శన మిప్పుడు చేయవచ్చునని బయటివారికిఁ జెప్పుము.

ఇఁక ఖానుఁడేమి చేయుచుండెనో చూతము. చుట్టు తెరలు వేయఁబడి పరదాపట్టలు కట్టఁబడియున్న సుందరస్థలమునం దమర్పఁబడిన హంసతూలికాశయనముమీఁద నతఁడు మేను సేర్చెను. అతని పార్శ్వమున సెజ్జమీఁద నమీనా కూర్చుండి యతనియంగముల నొత్తుచు శృంగారకథ లమృతమొల్కఁ జెప్పుచుండెను. ఖానుఁ డారోజు పగలు ప్రయాణము చేయుటచే నలసినను, నందిదుర్గము చేరినతోడనే షడ్రసోపేతమైన భోజనము, మెత్తని పాన్పు, పల్లవసదృశమృదుహస్తంబులతో నవయవములను భార్య యొత్తుట యతనికి మితిలేని సుఖము నొసఁగెను.

కర్ణాటములోని యుష్ణమువలనను సంతతప్రయాణమువలనను గలిగిన శ్రమపోయెను. మహీశూర (మైసూరు) దేశమునకు వచ్చినతోడనే వీవ మొదలిడిన చల్లగాలి కమీనా యుత్సాహవతియయ్యెను. ఆరాత్రి మిక్కిలి చలిగాలి వీచినందువలనఁ బైనిఁ గప్పికొనిన నారింజపండువన్నెసాలువు వాయువతీమణి ముఖారవిందమున కొకవింతసోయగము కల్పించుచుండెను. ఆనాఁడామె యపరిమితానందభరితురాలుగ నుండెను. ఖానునిమీఁద నాప్రక్కకు నీప్రక్కకు నొఱగినప్పుడును, మందహాసము చేసినప్పుడును, జిల్కుపల్కుల వంటి మృదూక్తుల నాడినప్పుడును, నొక కథయైనపిమ్మట మఱియొకకథ ప్రారంభించినప్పుడును, దన్నారీతిలకంబు వహించిన మనోజ్ఞాకృతివర్ణింప బృహస్పతి గంటమునకైన సాధ్యముకాదు.

ఖానుఁడు——నిన్నుఁ జూచినప్పుడెల్ల నాకు విచారము కలుగుచున్నది. నేనిప్పటి కంటె నిరువది సంవత్సరములు చిన్నవాఁడనైనచో నీకు సుఖముగ నుండును. (గడ్డము నివురుచు) నరసిన గడ్డము తలవెండ్రుకలు చూచిన నేను నీకుఁ దండ్రివలెఁ గనఁబడుదునుగాని పెనిమిటివలె నగపడను. నీవైన నగపడను నింకఁ గొంచెము పెద్దదానవైనట్లయిన నింతచింత లేకుండును.

అమీనా——నే నింతకంటెఁ బెద్దదాననైన యెడల నింత చక్కఁదన ముండదు గదా.

ఖాను——ఉండకపోయినను జిక్కులేదు. మనమిద్దఱము నొక్కయీడువార మైన దాంపత్యము సరిగా నుండును. నీయౌవనసౌందర్యము జ్ఞప్తికిఁ దెచ్చి కొనిన మాత్రముననే యానందించుచుందును.

అమీనా నిట్టూర్పు విడిచెను. ఆమె తలంపులన్ని కాశిముని మీఁద నుండెను. ఖానుఁడు నిట్టూర్పు విని "నిజముగ నేను నడివయస్సులో నుండవలె నని నీవు కోరుచుండలేదా? అయిన నీమాటలవలన నేమి ప్రయోజనము కలదు? భగవంతుఁడు మనని ద్దఱిఁ గలిపినాఁడు అతఁడు లిఖించిన వ్రాలట్లు న్నది" అనెను.

అమీనా——నిజముగ మనవ్రాఁతయే.

ఖాను——భగవంతుఁడు మనలను వయస్సునందు సరిగఁ గూర్పకపోయినప్పటికి మనయభిప్రాయము లొక్కటిగ నున్నవి. ఇతరులవలె నీవు జాణవు కావు. శత్రువు లేమిచేసినను మన కిద్దఱకు భేదము కలుగకుండును గాక.

అమీనా——శత్రువు లెవ్వరు? నే నెన్నఁడు శత్రువుల నెఱుఁగను. దేశముకాని దేశములో మీరే దిక్కని నమ్మియున్నాను.

ఖాను——సుందరీ నీకు శత్రువులు లేకపోయినప్పటికి నీమీఁదఁ గొందఱకు విరోధ ముండవచ్చును.

అమీనా——నిజమే కాఁబోలు. మాతండ్రి చెప్పుచుండఁగ వినియుంటిని. మహాత్ముదునకుఁగూడ విరోధు లుండెడువారఁట. హసేను, హుసేనను వారు

శత్రువులచేతనే చచ్చిరఁట. జన్మమెత్తిన వారంపఱకుఁ బగవారుండురఁట. అయితే వారు మగవారు; నల్వురలో మెలఁగవలసినవారు. కనుక వారికి విరోధు లుందురు. నే నాడుదాననే. నాదాసీజనము తప్ప నితరుల నెఱుఁగనే. వారియెడలఁగూడ దయతో నుందును. నాకు విరోధు లెవరు?

ఖాను—ప్రియా! నీచక్కఁదనముచూచి సౌహార్ద్రలేక కొందఱు నీతో విరోధము పూనవచ్చును. నీ కపాయము చేయుటకుఁ బ్రయత్నింపవచ్చును.

అమీనా—నా కాభయము లేదు. నాసౌందర్యముచూచి యసూయపడు వారితోఁ గలియుట నా కెన్నఁడును సంభవింపదు. వారిమొగములు చూచుటకు నా కవకాశము లేదు. అటువంటి వేవైనఁ దటస్థించినఁ బ్రాణములు విడుతును.

ఖాను—కాదుకాదు. నేను బ్రతికియుండఁగ నట్టివి నీ కేవిరావు. నేను నిన్నెప్పుడు విడనాడను.

అమీనా—ప్రాణవల్లభా! తెలియఁజెప్పుము. నేను దప్ప మీకుఁ బ్రియురాండ్రు లేరుగదా! నా కిక్కడఁ దల్లిలేదు, తండ్రి లేఁడు. నిన్ను నమ్మి నీవే యాధార మనుకొనిన యీబాలిక నెట్లు మోసపుచ్చెదవు?

ఖాను—అమీనా! నిన్ను మోసపుచ్చను. నాచరిత్రము పూర్తిగఁ జెప్ప లేదు. సరసురాలై ప్రేమచూపఁగలభార్య కావలెనని నాకుఁ గోరికఁగలదు. దాని కిదివఱకుఁ జేసినప్రయత్నములు నిష్ఫలము లాయెను. తిట్టుతప్ప నే నేమి యనుభవింపలేదు. అత్తమామలవలన మర్యాదాహీనపుమాటలఁ బడితిని. కొల్లలుగాఁ గానుకలు కట్నము లీయలేదని బావలకు మఱఁదులకుఁ గోప మధికము. ఇంచుక సుఖమైన నేను బొందలేదు. కావుననే దూరదేశమున నున్న నిన్నభిలషించి పెండ్లియాడితిని. ఇప్పుడు నా కెంతయో యానందముగ నున్నది.

ఈమాటలు వినినతోడనే యమీనా కేమి చెప్పుటకుఁ దోఁపలేదు. ఇంతకాలమునుండి చెప్పక యాకస్మికముగ నిప్పుడు సవతులున్నారని వినఁగనే

యామె హృదయము తల్లడిల్లెను. భర్త తనయందే యెక్కువప్రేమ గలిగి యున్నాఁడను నోదార్పుమాత్రము కలదు. ఆమె కేటుమాటాడుటకు నోరు వచ్చినది కాదు.

అమీనా—అంత చెప్పలేను. ఎందుకు?

ఖాను—అమీనా! ఎందఱో లేరు. ఇద్దఱే. వారిని నే నెంత ప్రేమించినను దుదకు వ్యర్థమైనవి. వారిలో నెవతెవలనను నాకు సంతానము కలుగ లేదు. మొదటిభార్యయాశవలని రెండవభార్యను బెండ్లాడితిని. సంతానము లేకపోవుట యట్లుండఁ బెంకెతనమునకు మొదటిదానిత్రలలోనుండి వచ్చినది రెండవది. ఈనురవస్థ లేకపోయినచో నిన్ను నే నెఱుఁగకుందును. వీ రిద్దఱే నీయం దసూయ వహించువారలు. ఇందునుకనుండి వగవారు వగ వారని నేను జెప్పినవారు వీరే. నా ధనము, దేహము నీ కర్పించినాఁడను. నేను నీవాఁడను.

అమీనా—(కొంతసే పూరకుండి) ఇదివఱకే యీసంగతి చెప్పిన బాగుగ నుండును. నిరాతంకముగ మీయనురాగమునకుఁ బాత్రురాలనై యానం దింతు ననుకొంటిని. నే నిఁకముందు చేయఁబోవు ప్రతికార్యము జాగ రూకతతోఁ జేయుచు భయపడుచుండవలసియుండును. ఈచిక్కులు నే నెన్నఁడు నెఱిఁగినదానను గాను.

ఖాను—దేవుని కరుణవలన నీకపాయము సంభవింపకుండును గాక! నీకాభయ ముండ నవసరములేదు.

అమీనా—ఏమో యెవ రెఱుఁగుదురు. ఏనాఁ డేమి చేయుదురో! వారికి నాకుఁ జెలిమియుండు ననుమాట తీసిపెట్టు. మొదటమొదటఁ గృత్రిమ స్నేహము కనఁబఱచినఁ గనబఱతురేమో కాని చివర కనుకొన్నంత కాక మానదు.

అమీనా కంట నీరుపెట్టెను. తల్లి, తండ్రి, గృహము, గృహమునందలి స్వేచ్ఛ జ్ఞప్తికిఁ దెచ్చికొని నూతనదేశమునఁ బొందవలసిన యిక్కట్టులకు

మిక్కిలి కుందెను. ఖానుఁడు చేయునదిలేక యూరకుండెను. ఆమె పాన్పు మీఁదఁ బరుండి కొంచెముసేపు దుఃఖించి కన్నుమలుగఁగఁ జివరకు సుషుప్తి యందు నిర్మగ్నయయ్యెను. ఆమె నిద్రావస్థయందుఁగూడ దీర్ఘమైన నిట్టూర్పులు విడుచుచుండెను. ఖానుఁ డాసమయమునఁ దనలోఁ దానిట్లుఁ దలఁచెను. "భగవంతుఁడా! నాప్రియురాలి కాపద రాకుండఁ గాపాడుము. (పయ్యెదచెరఁగు మెల్లఁగఁ దొలఁగించి) ఇంకను నిట్టూర్పులు విడుచుచున్నది. ఈనారీతిలకంబు దుఃఖమునకు నేనేగద కారణుఁడను. ఏమి చేయుదును? తప్పకపోయెను. వారీమెను ద్వేషించుమాట వాస్తవము, చిక్కులఁబెట్టుటకుఁ దంత్రములు పన్నక మానరు. కానిమ్ము. వారుచేయు తంత్రముల లక్ష్యముచేయవలదని సాధ్యమైనంతవఱకు నాప్రియురాలికి బోధచేసెదను. వారును దమప్రయత్నము లొకటి రెండుసారులు నిష్ఫలములైనచో నాశ వదలెదరు."

---

## పదునాలుగవ యధ్యాయము

మఱునాఁడు ఖానునిసైన్యము బెంగుళూరులో నాగెను. అక్కడనుండి మందుగుండుసామానులను, ఖజానాలోఁ గొంతధనమును, నాంగ్లేయ కారాబద్ధులను శ్రీరంగపట్టణమునకుఁ దీసికొనిపోవలసియుండెను. కాశిమాలి యింకను సర్కారునౌకరీలోఁ బ్రవేశింపలేదు గనుక ఖానునిపనులనే చూచుచు నతని విశ్వాసమునకుఁ బాత్రుఁడైయుండెను. కాశిమాలియొక్క యనుగ్రహము సంపాదింపవలయునని కొందఱు కుతూహలులై యుండిరి కాని, కొంద ఱతనిపై నసూయవహించి యతని కెటులనైన హానిచేయవలయునని యత్నించుచుండిరి. వారిలో జమాదారుఁ డగ్రగణ్యుఁడు. ఈపక్షములోఁ జేరినవాఁడే నాజరుద్దీనని మఱియొకఁడు గలఁడు. ఇతనితండ్రి హైదరాలివద్ద గొప్పయుద్యోగములో నుండెను. ఇతఁడు సైన్యములోఁ బ్రధానలేఖకుఁడుగ నుండెను. గుఱ్ఱములు, ఏనుఁగులు, లొట్టిపిట్టలు, కాల్బలము వీనిసంఖ్యలను వ్రాసికొని కావలసినధాన్యము, భోజనవస్తువులు నిప్పించుట యితని పని.

వేయిగుఱ్ఱములన్న వేయియున్నూఱు గుఱ్ఱములని, రూప్యమునకుఁ దొమ్మిది మానికలధాన్య మిచ్చుచున్న నెనిమిది మానికలని, యేమయిచ్చి పండుమని వ్రాసి మాయోపాయము లొనర్చి సర్కారుద్రవ్యము నపహరించి జమాదారుఁడు నితఁడు పంచుకొనుచుండెడువారు. ఇట్లు కావించుట తాత తండ్రులవద్దనుండి వీరి కలవాటుగ నుండెను.

ఖానుఁ డీలెక్కలఁ గొన్నఁడు తనిఖీచేసి యెఱుఁగడు. నమ్మికమీఁద చేవ్రాలు చేయుచుండువాఁడు. ఏమియుఁ బనిలేకయున్నాఁడు గావునఁ గాశీమాలికి ఖానుఁడు లెక్కల నప్పగించి సరిచూడుమని చెప్పెను. అతఁడు పల్లెటూరిలోఁ బటేలుగ నుండివచ్చెను గనుక, ధాన్యపుధరలు చక్కఁగ నెఱిఁగి లెక్కలు విమర్శించునప్పు డడుగడుగునకుఁ దప్పులు పట్టుచుండెను. నాజరుద్దీను వేసినధరలు మిక్కిలి హెచ్చుగ నుండెను. కాని యతఁ డిదివఱకు గౌరవనీయుఁడుగ నల్వురిలో మెలఁగుచుండుటవలనఁ గాశీమాలి యతని మీఁద నేరము మోపుటకు జంకి, నిక్కము మఱియెక్కువ దృఢముగఁ దెలిసికొనుటకై బజారున కేఁగి వర్తకుల నడిగి ధరలజాబితా వేసికొనివచ్చెను. ఆజాబితాప్రకారము చూడఁగ ధరలలో మిక్కిలి భేద మగపడెను.

రైతులను, గుఱ్ఱపువాండ్రను నడిగి వారి కిచ్చినధాన్య మెంతయో తెలిసికొనఁగఁ బుట్టెడు ధాన్యమునకు రెండుపుట్లు లెక్కలో నగపడెను. మోస మిట్లు ప్రత్యక్షముగఁ గనులకుఁ గట్టినట్లు కానవచ్చునప్పు డూరకుండుట యుచితముకాదని కాశీమాలి నాజరుద్దీనును బిలిచి యవియన్నియును జూపి, యేమిసమాధానము సెప్పెదవని యడిగెను.

అతఁడు తనలెక్కలను సమర్థించుకొనుటకు సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నము చేసెను గాని, చివరకుఁ దప్పించుకొనక తప్పకపోయెను. నాజరుద్దీ నప్పటినుండి విచారమునొంది యేకాంతముగ నున్నప్పుడు జమాదారునొద్ద కేఁగెను.

నాజ—ఖానుఁ డాపిల్లవానిఁ దెచ్చినది మొదలు వ్యవహారములు మాఱినవి.

జమా—ఏమిటవి ! నీతోఁగూడఁ గలహించినాఁడా యేమి ?

నాజ—సందేహ మేమున్నది. లెక్కలన్ని పరీక్షించినాఁడు. ఆముసలిముండ కొడుకెప్పటివలె వ్రాలుచేయక తనిఖీచేయుమని వీనిచేతి కిచ్చినాఁడు. వీఁడు లెక్కలలో దక్షుఁడు.

జమా—అయితే కనుఁగొనినాఁడు.

నాజ—లేదులేదు. ధాన్యములధరలు మాత్రము హెచ్చుగ వేయఁబడిన వనుచున్నాఁడు. కొంచె మెచ్చుతక్కువగ వేసిన చిక్కులేకపోవును. జమాదారూ ! నీవు నిజముగ ధర లపరిమితముగ వేసితివి.

జమా—మన కాబాబుతుడబ్బు చేతికి వచ్చినతరువాత హెచ్చుగ వేయలేదే !

నాజ—వేసినమాట వాస్తవమే. ఆపిల్లవాఁ డినిపటు బటేలు గనుక ధరల విషయమై మనకంటె నెక్కువ యెఱుఁగును. బజారుధరల జాబితా స్వయముగ వేసికొనివచ్చినాఁడు. మనమువేసిన ధరలకు వానికి భేదము హెచ్చుగ నున్నది. నేను సాధ్యమైనంతమట్టునకుఁ జెప్పితిఁగాని యతుక లేదు. చివరకునేనే పొరపాటుపడితినని యొప్పుకొని లెక్కలుదిద్ది మరలఁ దయారుచేసి యిచ్చితిని.

జమా—ఓరీ ! బుద్ధిహీనుఁడా ! ఆపిల్లవానికి భయపడి గడ్డి తింటివా ? నీ కున్నంతగడ్డము నా కున్నట్లయిన నే నిపిపటును నవమానమునకుఁ గోసి వేసికొనియుండును.

నాజ—అయ్యా ! అయితే—

జమా—అయితేలేదు, గియితేలేదు. ఇఁక నీవు మాటాడఁబోకు. ఆపిల్లగాఁడిద మన గుట్టంత బయల్పఱచిన దనుక నూరకుండఁడు. మన కిఁక డబ్బు రానీయఁడు.

నాజ—సత్యము. సత్యము. మన కిప్పుడు చాల నష్టము చేసినాఁడు.

జమా—ఎంత!

నాజ—వగ్గఱ తగ్గఱ రెండువందలరూపాయలు.

జమా—అల్లా ! అల్లా ! ఇఁక మనపని యేమి యున్నది ? మనవ్యవహారములు సాగవు.

నాజ—నే నందులకే భయపడుచున్నాను. ధర లీప్రకారము ప్రతిదినము కనుఁగొనినచో మన కేమి రాఁగలదు ?

జమా—మునిషీ ! ఈలెక్కపని యాపిల్లవాని కిచ్చునుపాయ మాలోచింపుము. కొద్దిదినములలో నతనితప్పులు బయటఁ బెట్టుదము. తరువాత ఖానుఁడు లెక్కపని మనకే యిచ్చును. వానిరోగ మంతటితోఁ గుదురును.

నాజ—(నిట్టూర్పు విడిచి) ప్రయత్నముచేసి చూచెదను. ఈదినము నా కయినది రేపు మీ కగునేమో యని భయపడుచున్నాను.

జమా—నే నిది సహింపలేను. మనజీతములను నమ్మి యీయుద్యోగములు చేయుచున్నామా ? పైనివచ్చు రాఁబడిలేకపోయినట్లైన నీయుద్యోగముల వలన నేమిలాభము ? ఆపిల్లగాడిదను నేను లక్ష్యముసేయను. నా పేరు షేక్ జఫర్ జమాదారుసాహేబు.

నాజ—చిత్తము. వాస్తవము.

జమా—నేను నీకు మనసువిప్పి చెప్పుచున్నాను. కాశీమాలిమొగము చూచిన తోడనే యతనిపై నా కసహ్యము పుట్టినది. అతఁడు నన్నుఁ బలువురిలో దూషించినాఁడు. నే నందఱకుఁ జుల్కనైతిని. అందఱు నన్ను నిర్లక్ష్యము చేయుచున్నారు. ఇది యెట్లోర్వఁగలను ? కసితీర్చికొని కాని వదలి పెట్టను. తెలిసినదా ?

నాజ—అయ్యా ! తెలిసినది.

జమా—నీవు నాకు సహాయముచేయవలె.

నాజ—అభ్యంతరము చెప్పుదునా ? సలహామూలమునఁగాని వ్రాతమూలమునఁ గాని నాచేతనైనంత సహాయము చేసెదను.

జమా—తుష్! నీసలహా నాకెందుకు? ఎవరు కావలె నన్నారు? తనలెక్కలు

తాను సమర్థించికొనలేని మూర్ఖుఁడా నాకు స వారందఱు విక్ర
సమయమునుబట్టి చేయుమన్నపని చేయుము. అదిచాలు.

నాజ——చిత్తము. చిత్తము. స్వాములకుఁ గోపమువచ్చిన నే నేమిచే
యు

జమా——కోపమువచ్చుటకుఁ గారణము కలదు. కాని యిప్పుడిగఁ ద్రా
వచ్చినది. ఇఁక నీవు వెళ్లవచ్చును.

నాజరుద్దీను వెళ్లినతరువాతఁ గొంచెమునే పాలోచించి జమాదారుఁడు మదారును బిలిచెను.

జమా——మదారూ! లోపలికి రమ్ము. ఖానుని భార్యవిషయమై విశేషము లేవైనఁ గనుగొంటివా?

మదారు——అయ్యా! ఆమె సౌందర్యవతియఁట.

జమా——ఛీ! ఇందనుకఁ జెప్పినదే మరలఁ జెప్పెదవు. కాశీమాలికి నామెకు సంబంధము లేదా?

మదా——అతఁ డామెను జూచెనఁట.

జమా——సైతాన్! ఆదికూడ నాకిదివఱకే చెప్పితివి. ఇప్పు డతఁ డామె మొగమును జూచుచున్నాఁడా?

మదా——దేవుని కెఱుక.

జమా——ఆమె నతఁడు చూచుచుండునట్లయిన మన కనుకూలముగ నుండును.

మదా——అయితే దీని కేదైన నుపాయము చేయుమందురేని జేయుటకు సిద్ధముగ నున్నాను.

జమా——అదే యిందనుకనుండి యాలోచించుచున్నాను. ఆపిల్లగాడివ నెటులైన వంచింపవలయును. నాజరుద్దీను లెక్కలలోఁ గూడఁ దప్పులు పట్టినాఁడు. ఏదో యొకతంత్రముపన్ని వానిమీఁద నింప మోపవలయును. లేక పోయినవాఁడు మనల నిలువనీఁడు.

మదా——దేసరవారి కిదియే చెప్పుచున్నాను. ఏదో యొకమార్గము కనిపెట్టి కసిదీర్చుకొనుట కవకాశము కల్పించెదను.

ర్యములను గప్పిపుచ్చుటకై, యమాయకుఁడైన కాశీ
జమా—అల్లా! అల్లా యమీనాను హానిచేయ నుద్దేశించి, కుట్రలు పన్నుచుండిరి.
సాగవు. జమున సుస్వార్థుఁడై యవినీతికార్యములు చేయువాఁడగుటచే నితరు దోషముల చెప్పుడు బయల్పఱతురో యనుభీతిచే జమాదారుఁడు ఖానుని వలన గౌరవముపడయువారినెల్ల ద్వేషించి వంచింపవలయునని వెదకుచుండును. ఖానుఁడు జమాదారునియందు గౌరవము కలవాఁడు కాకున్నను దాను స్వయముగ లెక్కలుచూచి గ్రహింప నశక్తుఁడగుటవలన నేమియుచేయలేక యూరకుండెను. అందువలన ననివార్యముగఁ బనయాట సాగుచుండఁ గాశీమాలి ఖానునివద్దఁ జేరి మాయోపాయములఁ గనిపెట్టఁజొచ్చి నష్ట దశనిఁ గుత్సితుఁడైన జమాదారుఁడు ద్వేషించె నన నాశ్చర్య మేమికలదు? అనిగాక కాశీమాలి మదారును దూషించుట, రాబడికి భంగముకలుగఁజేయుట యతని హృదయమునఁ గ్రోధాగ్నిని బ్రజ్వలింపఁజేయుచుండెను.

ఆంగ్లేయకారాబద్ధులను, ఖజానాధనమును గొనిపోవుటకు బండ్లు సిద్ధముచేయుచు సైన్యము బెంగుళూరులోఁ గొన్నదినములాగి శ్రీరంగపట్టణమునకు బయలుదేఱెను. ఖజానా, మందుగుండుసామాను బండ్లకెత్తిరి. ఇవియంత చూచి కాశీమాలి యాశ్చర్యపడుచుండె. బెంగుళూరునందు సుల్తానుని సైన్యములోఁ గొందఱు పరాసు (ఫ్రెంచి) వారుండిరి. శ్వేతముఖుల నదివఱకెన్నఁడును గాశీమాలి చూచియుండలేదు. కాన ఱెప్పవేయక వారిని వీక్షింప మొదలిడి వారి శౌర్యస్థైర్యముల గుఱించి పూర్వము తాను వినిన విషయముల జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు ననేకవిధములఁ దలంచుచుండెను.

కారాగృహమునుండి పరంగీలు బయటికి వచ్చిరి. వారిలోఁ గొందఱడుగుదీసి యడుగుపెట్టుటకే శక్తులు కాకుండిరి. కొందఱి చేతులు భారంబులైన సంకెలలతోఁ గట్టఁబడియుండెను. అప్పుడప్పుడు స్వయముగ క్షాళనచేసికొనిన వస్త్రములు వదలుగ వారిదేహములమీఁద వ్రేలాడుచుండెను. వారి

మొగములు కళలేక చింతాముద్ర వహించియుండెను. వారందఱు వికృతా కారములు కలిగి ఛాయావిగ్రహములవలె నుండిరి.

1784-వ సంవత్సరపు మంగుళూరుసంధి నతిక్రమించినందుకై యీ దురదృష్టులు చెఱసాలలో సుల్తానుని చేఁ బెట్టఁబడిరి. వారు బయటికి వెడలి వచ్చునప్పుడు నైరాశ్యభావము కానుపుష్టులును ముఖవికాసంబును జెప్పక చెప్పుచుండెను. ఒక్కఁడును నోరెత్తి మాటాడలేదు. ఎన్నిదినముల క్రిందటనో యనుభవించిన స్వాతంత్ర్యము, గమనమును మరలఁ గలిగెనని యొడలు సంతో షించిరనుటకు రవంతయు సందియములేదు. పరంగీలను ద్వేషించి వారితోఁ బోరాడి విధ్వంసము కావింపవలయునని కాశీమాలి దృఢనిశ్చయుండై యుండినను, కారాగృహమునుండి వెడలిన యాయాంగ్లేయులఁ జూచినప్పు డతని హృదయము దయార్ద్రమయ్యెను. పరంగీఖైదీలు బాధనొందుచుండఁగఁ జూడ వలయునని కాశీమాలి యిదివఱకుఁ గోరియుండెను గాని, యాదీనులఁ జూచి నప్పుడు మాత్రము పట్టరాని జాలి చెందెను. శోకించెననుటకుఁ గన్నీ రొక్కటి తక్కువ. ఈకారాబద్ధులు బయటికి వచ్చినప్పు డచ్చటిజనులును బిల్లలును గేలిచేసి కేకలువేయ మొదలిడిరి. నక్కనుజూచినవాండ్లు వేటకాండ్రే యగు నట్లు ప్రతిపస్తుండును నా నిరపరాధకారాబద్ధులపైకిఁ బోవుచుండెను. వారినిఁ గొంద ఱూరకయే తిట్టుదురు. కొందఱు కొట్టుదురు. అక్కడ నల్లరి మూఁక లోనుండి యొకపిల్లవాఁడు రివ్వునవచ్చి యొకఱాయి ఖైదీలమీఁద నువ్వెను. తక్కిన పిల్లలందఱు నవ్వి చప్పటలుకొట్టిరి.

కాశీమాలి యిదిచూచి సహింపక రాయిఱువ్విన పిల్లవానింబట్టి గుఱ్ఱపు కొరడాతోఁ జుఱుకుగ నాలుగుదెబ్బలు కొట్టెను. ఆపిల్లవాఁడు కీచున నేడ్చుచు దూరమునకుఁ బాఱిపోయెను. తక్కినవారంతట నా దుండగములు మానిరి. ఱాయితగిలిన ఖైదీయొద్దకుఁ గాశీమాలి పోయి యతనితో సకరుణముగ మాట లాడి ఱువ్వినగొంటును శిక్షించితినని చెప్పెను. దయాసూచకమైన కాశీమాలి స్వర మాయాంగ్లేయుని కమృతతుల్యముగ నుండెను. చెఱసాలలోఁ బ్రవేశించి

నడిమొదలు క్రూరకిరాతులపరుషవాక్యములే వినఁబడుచుండెను. అప్పుడు కాశిమాలియొక్క మాటలకు సంతోషించి "అయ్యా నాకాఁకాలి దెబ్బ తగుల లేదు. ఒకవేళఁ దగిలినను మీయనుకంపావచనంబు లాబాధ నుపశమింపఁ జేయవే? మాతో నీవిధమున మాటలాడిన, మీవారికి నీమీఁద ననుమానము కలుగును. నాకొఱకు మీరు చెడిపోనేల? దేవుఁడు మిమ్ము రక్షించుఁగావుత" మని హిందూస్థానిభాషలో వాక్రుచ్చెను. కాశిమాలి యతని వివేకమునకు వినయమునకు వచోగరిమకు నాశ్చర్యంపడి యతఁడు సామాన్యుఁడైన ఖైదీ కాక గౌరవనీయవంశమున జనించినవాఁడై యుండునని తలంచెను. ఖైదీలు సాఁగిపోవుచుండిరి. ఇమాంసాహెబువచ్చి ఖానుఁడు బయలుదేఱుచున్నాఁడని కాశిమాలినిఁ బిలుచుకొనిపోయెను.

ఇమాం—అయితే నీ వీదినము పరంగీలను జూచితివి. వాండ్రెట్లాడుచుండిరి.

కాశి—ఇమామూ! చూచితిని. వారందఱు కదలుటకైన శక్తిలేకున్నవారు. ఎట్లుప్రయాణము చేయఁగలరు?

ఇమాం—ఏమి తెగులు? నడవలేనివాండ్రకు సవారులు బండ్లు మొదలగునవి యున్నవి. అధికారుల కేనుఁగు లీఁబడినవి.

కాశి—(ఇదివఱకు కాలిదెబ్బతినిన యాంగ్లేయుఁ డేనుఁగుమీఁద నెక్కు చుండఁజూచి) నేనిదివఱ కితఁడు గౌరవనీయవంశసంజాతుఁడని యను కొనినమాట యబద్ధముకాదు.

ఇమాం—అతనిని గుఱించి నీకేమి తెలియును?

కాశి—ఏమిలేదు. అతనితో సంభాషించితిని. ఆయన సంభాషించిన తీరును బట్టి కులీనుఁడని యెంచితిని.

ఇమాం—కాశిమాలీ! నీవు జాగరూకుఁడవై యుండుము. పరంగీలతో నట్లు సంభాషించుట సుల్తానున కిష్టముకాదు. నీ ముందుస్థితిని విచారించి కొనుము.

కాశి—నిజమేకాని నేను జేయరాని పని చేయలేదు.

తాను బరంగీలతో సంభాషించుటయుఁ బిల్లవానిని దండించుటయుఁ గాశి మాలి ఖానునకుఁ జెప్పెను.

ఖాను— భేష్! మంచిపని చేసితివి. ఆపిల్లవానికి బుద్ధివచ్చునట్లు చేసితివి పరంగీలు మనకు విరోధులైనను వాళ్లఁ ఉప్పవటు యన్యాయముకాదా!

కాశి—పరంగీలతో మాటలాడుటనే యిమాంసాహెబు తప్పనుచున్నాఁడు. ఆరాతిదెబ్బ తిన్న పరంగీ యధికారిదగ్గె నున్నాఁడు. ఆతనితో సంభాషింప వలయుననని సాక్షమము కలదు.

ఖాను—ఆపరంగీ క్షమింపుమని సుల్తానుని గోరెనట్లు తెలియుచున్నది. మన సైన్యములోఁ బనిసూడఁ జేయుదునని చెప్పినాఁడట. కాని నమ్మటకు వీలులేదు. పరంగీలు తలబిరుసు మనుష్యులు. ఇదివఱకు బుద్ధిపూర్వకముగ సుల్తానున కొక్కఁడును లోఁబడలేదు.

కాశి—మనసైన్యములోఁ గొందఱున్నారే! లోఁబడినవారు.

ఖాను—మహమ్మదీయ మతము నవలంబించినవారు కొలఁదిమంది మాత్రమే కలరు. వారును సర్వాంశజులు కారు. నీచులు. పైమజిలీలో నా పరంగీ యొద్దకు వెళ్లి సుల్తానునిసైన్యములోఁ బ్రవేశించునేమో యడుగుము. చూతము.

---

# పదునేనవ యధ్యాయము

తనకోరికకుఁదోడు ఖానునియాజ్ఞకూడ నైనది. కావునఁ బిమ్మట మకాములోఁ గాశిమాలి పరంగీల గుడారములయొద్దకు వెళ్లి రాతిదెబ్బతినినపరంగీతో సంభాషణము మొదలిడెను.

ఈపరంగీని నిఁకముందు "పరంగీ" యని యేకవచన రూపమునఁ జెప్పెదను. చదువరు లావిషయము మనస్సునం దుంచుకొందురుగాత.

పరంగీ—వి మ్మను మరల నింతస్వల్పకాలములోఁ జూతు ననుకొనలేదు.

మీదయనే మిమ్మిచటికి గొనివచ్చినది. మీరు మాకు విరోధులు గారని యిప్పుడు స్పష్టపడినది.

కాశీ——నాకు మీతో నెట్టి విరోధమును లేదు.

పరంగీ——అయితే తమరైనఁ జెప్పుఁడు. మమ్ము బెంగుళూరునుండి లేవఁదీసిన దెందుకు?

కాశీ——శ్రీరంగపట్టణమునకుఁ బోయి సుల్తానుని క్రింద మీరు నౌకరీ చేయవలె నని యందఱు చెప్పుకొనుచున్నారు.

పరంగీ——(క్రోధదృష్టితో) ఛీ! మా ప్రాణములు పోయినఁ బోవును గాక! మేమా ద్రోహుని సేవ చేయము. ఈవిషయము సుల్తానుఁడు మొదటినుండి యెఱుఁగును. మమ్మీ కారాగృహమున నుంచుట కంటెఁ జంపిన మేలుగ నుండును. ఏమి చేసిన ననుభవించుటకు సిద్ధముగ నున్నాము. అతని సేవ చేయుదుమని స్వప్నమందైనఁ దలంపము.

కాశీ——అయితే యతని సేవ కష్టమైనదా?

పరం——ఆయన యొద్దఁ గొల్వులోనుండి యీ విషయము నన్నడుగ నేల?

కాశీ——ఆయన కొలువులో నిఁకను ప్రవేశింపలేదు. మైసూరుశము నొక గొప్ప యుద్యోగస్థుని యనుగ్రహమునకుఁ బాత్రుండనై యతని వెంట నిప్పుడు శ్రీరంగపట్టణమున కరుగుచున్నాను. నా స్నేహితుల కోరిక ప్రకారము సుల్తానుని కొలువులోఁ బ్రవేశింపవలె ననియే యున్నది.

పరంగీ——(పెద్దగొంతుతో) దయారసపూర్ణులైన మీ దొరతనమునకు గొలువ లేదు. "నిర్దయుఁడు, కఠినుఁడు, క్రూరుఁడు" అని చెప్పుటయే యతనికి ఘనమైనకీర్తి. ఇవి గొప్ప యుత్తరములు తీసికొని చెన్నపట్టణమునకుఁ బొమ్ము. అచ్చట మావారు మీకుఁ గావలసినంత ధనమిచ్చెదరు. ఉన్నతపదవి నొసంగెదరు. నావంటి దురదృష్టునికి సహాయము చేసినవారగుదురు. మృతులమని యాశవదలుకొనిన మావారికిఁ బ్రాణములతో నుంటిమని మావార్త చెవులఁబడ వేసి పుణ్యముకట్టికొనినవా రగుదురు.

కాశి—పరంగీ ! నీధైర్యస్థైర్యములకు మెచ్చితిని. స్నేహభావము నీయందు నాకెల్లప్పుడు నుండఁగలదు. కాని మీది దుర్గాతి. యుద్ధరంగమునఁ బరంగీల నెదుర్కొని విధ్వంసము కావింపవలెనని నాయభీష్టము. సుల్తానునికొలువులోఁ బ్రవేశించుటకై శ్రీరంగపట్టణమునకు వెళ్లుచున్నాను. సుల్తానునకు విరుద్ధమైనకార్యములు చేయుమని యిఁక ముందు నన్నడుగకుము. నేను స్వామిద్రోహిసిఁగాను. మాసేనాధిపతితో మాటలాడి నీయుత్తరములు పంపఁబడునట్లొనర్చెదను.

పరంగీ—"అనేకసంవత్సరముల క్రిందటనే నన్నువదలి ఏమ దయావికాస వదనంబుతోఁ బొడసూపిన యాశాకిరణము మరల నాదృష్టిమార్గమునుండి యదృశ్యమైనది. మావార్త మావారికిఁ దెలియఁగలదని నే నెప్పుడును దలఁపలేదు. సంధిపత్రములలో వ్రాసిన యొడంబడికలే నిర్లక్ష్యముచేసి పలుబాధలఁ బెట్టుచున్న మీసేనాధిపతి మాయుత్తరములఁబంపునని నీ వెట్లు తలఁచెదవు ?

కాశి—పరంగీ ! నీవుచెప్పిన మాటవాస్తవమైన నైయుండవచ్చును. మీర లబద్ధమాడరని మావారు చెప్పుదురు. నీయుత్తరములఁ బంపుటకు సాధ్యమైన యెడలఁ బంపెదను. మీరు దుఃఖములోఁగాని విపత్తులోఁగాని యున్నప్పుడు కాశిమాలిపటేలు సాయముకావలెననితోఁచెనేని నడుగుఁడు. అతనికిఁ జేయుటకు వీలైనవఱకుఁ జేయును.

కాశీమాలి ఖానునివద్దకేఁగెను. అందఱును బెంగుళూరునుండి బయలు దేఱినతరువాత నైదవరోజున శ్రీరంగపట్టణ సమీపమునకు వచ్చిరి. ఉద్యోగములోఁ జేరఁబోవు కాలము సమీపించినదని కాశిమాలి యుత్సాహముతో నుండెను. ఖానునకు సంతోషము దుఃఖము రెండును బొడమెను. టిప్పుయొక్క దర్శన మబ్బుననియుఁ, బ్రాంతస్నేహితులఁ జూడవచ్చుననియు సంతోషమును, దనప్రియ భార్యయైన యమీనావార్త తక్కినభార్యలు వినినప్పుడు వా రెట్టి యగౌరవముచేసెదరో, యెట్టినీచవాక్యముల నాడెదరో.

యని దుఃఖము గలిగెను. "మువ్వురకుఁ బొత్తు కుదురనియెడల నమీనాను నావద్దనుంచికొని తక్కిన యిద్దఱకు నిల్లొకటి యేర్పాటుచేసెదను" అని ఖానుఁ డనుకొనెను.

శ్రీరంగపట్టణము చేరిరి. రాజమార్గమునఁ గొంతదూర మేఁగఁగనే యాయుధధారులైన జనులసమూహ మెదురుగవచ్చుచుండెను. ఆజనుల మధ్యమున దివ్యాలంకార విభూషితుండై, కాంచనచేల విభాసితుండై, వజ్రవైడూర్యాదిమణిగణవిరాజమానుండైన శూరుఁ డొకఁ డుండెను. ఖానుఁ డతనిఁ జూచినతోడనే గుఱ్ఱమును త్వరగఁ బరుగెత్తించి దగ్గఱకుఁబోయి యత్యంతవినయముతో సలామొనర్చి ప్రక్కకుఁ దొలఁగియుండెను. ఖానుని నమ్రభావమునుజూచి పైని వర్ణింపఁబడిన శూరుఁడు టిప్పుసుల్తానుఁడై యుండునని కాశీమాలి తలఁచెను. ఈసమయమున వీరిమార్గమున కడ్డముగ నాఁబోతొకటివచ్చెను. భక్తిగలహిందువులు పెట్టిన ప్రత్తివిత్తులు తినియుఁ, బొలములలో స్వేచ్ఛగ మేసియు నదిపొతరించి వారిని లక్ష్యపెట్టక తోఁక విసరుచు దేహభారంబున మెల్లఁగఁ బోవుచుండెను. సైనికులలోఁ గొంద ఱీఁటెలమొదళ్లతో నదలించిరి; కాని యది సరకుచేయక కొమ్ములతోఁ గ్రుమ్మఁ బోయెను. సుల్తానుఁ డిదియంతయుఁ జూచి దురాగ్రహగ్రస్తుఁడై "బాఁకు తెమ్ము, బాఁకు తెమ్ము. ఆనీచపుటాఁబోతు పొడువఁబోవుచున్నది. వేఁటాడుదము. క్రమ్ముఁడు. తఱుముఁడు. పట్టుఁడు. విగ్రహారాధకుల పరమదేవతనెత్తురు సూతము" అనియఱచుచు వెంటఁబడెను. ఆఁబోతు తనను దఱుముచు వచ్చుచున్న యాయుధధారులంజూచి పరుగెత్త నుపక్రమించెను గాని పాపము! టిప్పు పిడుగువలె మీఁదఁబడనే పడెను. పడి బాఁకుతో దానిపార్శ్వమున యావచ్ఛక్తిమైఁ బొడిచెను. రక్తము చిమ్మనగ్రోవిలోనుండి వచ్చు నీటిపోల్కి వేగముగ దానిదేహములోనుండి వచ్చుచుండెను. ఇద్దఱుముగ్గురు సైనికులు కూడఁ బొడువ మొదలిడిరి. సుల్తానుఁడు వ్యవధిలేకుండ బాఁకుతోఁ బొడిచెను. ఆఁబోతు రెండుమూఁడుగజములదూరము పరుగెత్తలేక పరుగెత్తి క్రిందఁ బడెను. పడినదాని నా క్రూరు లింకను బొడిచిరి.

పరమతద్వేషకర్కశులై, దయాశూన్యులై, జ్ఞానరహితులై, పాషాణ సదృశచిత్తస్కులైన యాముసల్మానులు తత్కార్యకరణమునకు సుల్తానుని పేరోల్లఁబొగడిరి. అచ్చటనున్నకొందఱు బ్రాహ్మణులా ఘోరహత్యనుజూచి సహింపలేక లోలోపల సుల్తానుని గర్హించుచు నేమియుఁ జేయఁజాలక విముఖులై భూ్రికౌటిల్యము వహించి యుండిరి. సుల్తానుఁడా బ్రాహ్మణులలో నొకనివదనంబున నసహ్యాభావము స్ఫుటముగఁ జూచి కోపోద్దీపితుఁడై "ఆబ్రాహ్మణునిఁ బట్టుఁడు. ఇచ్చటికి గుంజుకొనిరండు (అతనితో) ఏమీ! బ్రాహ్మణకుమతీ! నేను జేసినకార్యము నీకు సరిపడలేదా? సరిపడునట్లు చేయుదుము చూడుఁడు. (సైనికులఁ దిలకించి) చూచుచున్నారేమి? ఆ యాఁబోతు నెత్తురు తెచ్చి వీనిమొగమునఁ జల్లుఁడు. బాగుగ రుద్దుఁడు" అని యఱచెను. వెంటనే వా రాబ్రాహ్మణునిమీఁదఁబడి యాఁబోతునెత్తురు దేహమునిండఁ బూసి నోటిలోఁ గూడఁ గొంత బలవంతముగఁ గ్రుక్కిరి. కాండ్రించి నోటిలోనిదంత యుమ్మివేయుచు, నెత్తురు తుడిచికొనుచు, యజ్ఞోపవీతము తెగిపోవ ముడివేసికొనుచు, బట్టసవరించికొనుచు, దురవస్థలో నున్న యా యసహాయబ్రాహ్మణునిస్థితికి నవ్వుచు "చాలు. ఇఁక వానిని దగ్గఱకుఁ దెచ్చి నాచేతి కొక బాఁకునిండు" అని సుల్తానుఁడు వాక్రుచ్చి బ్రాహ్మణునివంకఁ జూచి "పొమ్ము, పరుగెత్తుము. ఐదునిమిషములు నిన్ను ముందు పరుగెత్తనిచ్చెదను. తరువాత నీ వెంటఁ బడియెదను. ఈయైదునిమిష ములలో నీవా యగపడుచున్న గొందిలోనికిఁ బోయితివా పోయినట్లు. లేక యీలోపల నిన్నుఁ గలిసికొంటినేని నీప్రాణ మీబాఁకున కర్పింపవలయును" అని పలికి "ఊఁ" యని పెద్దగ నఱచెను. ఆ బ్రాహ్మణుఁ డా యఱపు వినిన వెంటనే "చచ్చితి బ్రతికి"నని నిజజంఘాలత్వంబునకు భయప త్త వేగంబు తోడుగ వెనుకకుఁ దిరిగిచూడకుండఁ బరుగెత్తెను. ఐదునిమిషములకాల మాగి సుల్తానుఁడు గుఱ్ఱమునదలించి దుమికించుచుఁ బోయెను. బ్రాహ్మణుఁడంతకుఁ బూర్వమే గొందిలోఁ బ్రవేశించి కనఁబడకుండ నేఁగెను. సుల్తానుఁడొన్నచ్చిన

యావినోదమున కందఱు సంతోషించిరి. కానికాశీమాలిమాత్ర మిష్టియంతయుఁ జూచి మిక్కిలి ఖిన్నుఁడయ్యెను.

హిందువులచే నతిపవిత్రముగ నెంచఁబడు నాఁబోతును ఘోరముగఁ జంపుట యతఁడెన్నఁడును గాంచియుండలేదు. ఇదివఱకుఁ సుల్తానుని గుఱించి ఫరంగీ చెప్పిన వాక్యము లా సమయమున నతనికి జ్ఞప్తికివచ్చెను. ఈక్రూర వినోద మైనతరువాత నందఱు కదల మొదలుపెట్టిరి. శ్రీరంగపట్టణములోని వీథుల శృంగారము, సైనికులగీవి, మేడల సౌందర్యము, వేపండ తుండముల విలసనము కాశీమాలి కాశ్చర్యము గీల్కొల్పెను. సైన్యము కోటగోడచేఁ బరివేష్టింపఁబడిన పట్టణములోనికిఁ బోయెను. ఖానుని పరివారము కోటదాఁటి వెలుపలికిఁ జని యచ్చట నాఁగెను. అమీనా విశ్రమించుటకై గుడారములు వేయుట కేర్పాటుచేసి కాశీమాలిని గుడారములవద్దనుంచి దాదూసాహేబును వెంటఁబెట్టుకొని తనప్రాంత భార్యలఁ గలిసికొనుటకుఁ గోటలోనికిఁ బ్రవేశించి, యేమికలహము సంభవించునోయని భయపడుచు స్వగృహమునకుఁ బోయెను. ద్వార సమీపముచేరి యశ్వముదిగఁగనే యచటనున్న సేవకులు స్వాగత మొసఁగిరి. ఖానుఁడు వచ్చెననియింటిలో నందఱకుఁ దెలిసెను. త్రోవలోఁబడిన దుమ్ముపోవున ట్లతఁడు కాళ్లు, చేతులు, మొగము కడిగికొని జనానాలోఁ బ్రవేశించెను. భార్యాద్వయము ఖానుఁడువచ్చెనని తెలిసికొని సుఖాసనములపైఁ గూర్చుండి హుక్కా పీల్చుచుండెను. అతఁడు జనానాలోనికి వచ్చినప్పుడు [illegible]జనము సలాముచేసెను. భార్యలిరువురు లేచినవారు కారు. మఱింతగుడ చు శబ్దముతో హుక్కా పీల్వ మొదలిడిరి. అతని మొగమువంకనైనఁ జూడరైరి. తాను హైదరాబాదునకు బయలుదేఱునప్పుడు చిలుకగోరువంకవలెఁ గలహించెడు నిరువురుభార్యలు నిప్పుడు సఖ్యముతోనుంట చూచి యమీనాను గూర్చి వినిరనియుఁ, దనతోఁ బోరాడ సిద్ధులైరనియు ఖానుఁడు గ్రహించెను. స్వభార్యాకృతావమానము దుస్సహము కాఁగాఁ గ్రోధఘూర్ణిత మానసుండై "కుమ్మాబీ! హుర్మత్ బీ! మీకుఁ గన్నులు కానవచ్చుట లేదా? మీ కింతలో

నీమద మెచ్చటినుండి వచ్చినది? పోవుకాలము సమీపించినదా? మొద్దుల వలెఁ గూర్చుండి యాసనములనుండి కదలవేల?" అని యనెను.

ఫమ్మూ—గతిమాలినవాఁడ! నీసిగ్గు చితక! తా నొక మనుష్యుఁడు, తవు డొకరొట్టె! గొప్పయింటి యాఁడుబిడ్డలము. మాయొద్దకు వచ్చుటకు నీకు మొగ మెట్లు చెల్లినది? ఘనకార్యము చేసితినని మాకుఁ జెప్పవచ్చితివా? సిగ్గులేక యొక తెగినదానిని దెచ్చికొంటివి. తెచ్చికొంటివేని దానినె నెత్తినఁ బెట్టికొనుము. దించికొనుము. మాతో నేమిపని?

ఖాను.—(ఉగ్రుఁడై ముచ్చెనండి) ఏమీ! తెగినదానా! ఏదీ మరల నామాట యను. మూతిపండ్లు రాలఁగొట్టెదను.

భార్యలు—కొట్టుకొట్టు. మా కింతకంటె నెక్కువ యవమానము రాదు. మా వంటి యాఁడువారినిఁ గొట్టు శూరుఁడవే నీవు. క్రొత్తగ వచ్చినరాణికి సంతోషముగా మమ్ము గొట్టు (అని దగ్గఱదగ్గఱకుఁ బోయిరి.)

ఫమ్మూ—అల్లా! అల్లా! గడ్డాలు మీసాలు నరసినవి. వీని మొగమునకు మూఁడవభార్య కావలసివచ్చినది. దాని నీయింటిలోనికిఁ దీసికొని రా వచ్చినాఁడు. ఛీ! ఛీ! మనుష్యుఁడై పుట్టినందుకు సిగ్గుండవలెనా లేదా?

ఖాను—మీ రెన్ని వాగిననేమి? అది నాప్రియురాలు. నాభార్య. మీరు దానిని గౌరవించి తీరవలయును. మీపెంకెతనములు మానరేని మీ యిండ్లకు మిమ్ముఁ బంపివేసెదను. ఇది నాయిల్లు. నేను యజమానుఁడను. నాయింటిలో నున్నంతవఱకు నేను జెప్పినట్లు చేయవలయును. ఒక

ఖానుఁ డీతీరున వికలమనస్కుఁడై కేకలువేసి శీఘ్రగమనమున" గృహమునుండి వెడలిపోయెను.

---

## పదునాఱవ యధ్యాయము

హర్బర్టాంగ్లేయదేశమునఁ జనతలిడుంప్రఁబడిన నైదుమాసములకు హిందూదేశము చేరెను. ఈతనివెంట వచ్చిన సైనికులందఱు చిత్తములు కలతరపడఁ దొలిసారి భరతఖండంబున మెట్టిరి.

హార్బర్టుకాక వీరిలో ముఖ్యులు చార్లెసు, ఫేలి ప్పనువా రిస్టలు గలరు. 1782-వ సంవత్సరాంతము కుంభిణీవారి కెన్నఁదగిన కాలముగ నుండెను. చెన్నపట్టణములో బండారమునఁ బైక మైపోయెను. దేశమున క్షామము సంభ వించెను. ఆత్మరక్షణ మొనర్చుకొనుటయే వీరికి ఘనకార్యముగ నుండెను.

ఇట్టిసమయమునఁ బరంగీలకు గుండెలలో గాలమై సమరరంగంబుల ననిరుద్ధుఁడై జయములఁ గాంచుచు దక్షిణాపథమున కంతటికి నేకచ్ఛత్రాధిపతి యగుటకు సిద్ధముగనున్న హైదరాలి చిత్తూరిలోఁ గాలధర్మ మొందెను.

పశ్చిమమున విజయయాత్ర సల్పుచున్న టిప్పుసుల్తానుఁ డీవార్త విని తత్క్షణమే చిత్తూరునకుఁ జని ప్రజానురంజకముగ సింహాసన మధిష్ఠించెను. సుల్తానుఁడు చిత్తూరునకు వెళ్లిన సమయమున నాంగ్లేయులు మైసూరు రాజ్యముమీఁదికి దండెత్త నిశ్చయించిరి. టిప్పు సమీపములో నుండుటవలనఁ జెన్నపట్టణమునందలిసైన్యము కదలుటకు వీలులేకుండెను. బొంబాయిసైన్యమే యిప్పుడు దాడి వెడలవలసినదిగ నుండెను. మైసూరును జయింపవలెనన్నఁ గొలఁదిసైన్యము చాలదు. ఈసమయమున హార్బర్టు మొదలగువారు వచ్చి యుండిరి గాన వీరిని బొంబాయిసైన్యమునకు సహాయార్థ మంపిరి.

బొంబాయిరాజధానినుండి మైసూరునకుఁ బోవలయునన్న రెండు దారులు గలవు. కాళిగట్టునుండి తూర్పుగనున్న డొంకయొకటి. పడమటి కనుమలగుండనున్న బాట మఱియొకటి. వీరు కనుమలమార్గమునఁ బోవుటకు నిశ్చయించికొని సంసిద్ధులైరి. మైసూరుదేశములోని బెదనూరు దుర్గాధిపతి సుల్తానుని ద్వేషించి యతని శత్రులకు సహాయముచేయ నుద్యుక్తుఁడై యున్నాఁడని వేగులవాండ్రు చెప్పిరి. ఈదుర్గాధిపతి యిప్పుడు మహమ్మ దీయుఁడైనను మొదలు హిందూమతస్థుఁడే యైయుండెను. సుల్తానుఁడు బల వంతపెట్టినందున మతభ్రష్టుఁడాయెను. అకారణ మతనిమనస్సున నాటి యుండెను గనుక నతఁడు సుల్తానునిశత్రువులకు సహాయముచేయ సమకట్టెను. అత్యంతోత్సాహముతో నాంగ్లేయసేనాధిపతి కొంతసైన్యమును గనుమల

క్రిందనున్నదేశమును స్వాధీనముచేసికొనుటకుఁ బంపి తక్కినదానిని బెదనూరు దుర్గముపైకి నంపెను. తద్దుర్గమునకుఁ బోవుదారిలో హానూరుదుర్గ ముండెను. దొమ్మిగ ముట్టడించి దానిలోఁ జొరఁబడి సైనికులు కొల్లపెట్టిరి. దుర్మార్గకార్యము లొనర్చిరి. కొందఱు తప్పఁద్రావి చనిపోయిరి. తా నదివఱకు గౌరవించుచున్నవారి ప్రవర్తనము నిజముగ హార్బర్టా నాఁడు గనుఁగొనెను.

సేనాధిపతి పాపభీతి కలవాఁడు. దైవభక్తియుక్తుఁడు. కాని యితఁడు మూఢభక్తిపరాయణుఁడని చెప్పవచ్చును. హార్బర్టు ఫిలిప్పులు ధర్మపక్షమున మెలఁగు సేనాధిపతియొక్క ప్రీతికి బాత్రులైయుండిరి. హానూరుదుర్గము తరువాత హుశేనుఘురుదుర్గము స్వాధీనము చేసికొనవలసియుండెను.

సైనికులు దుర్గోపత్యకా ప్రదేశములకుఁ జేరిరి. సూర్యుఁ డపరాంబుధిలోఁ గ్రుంకెను. సైన్య ముచితస్థలంబుల విడిసెను. చార్లెసు శిబిరమును గాచుచుండెను. హార్బర్టు ఫిలిప్పులు తమలో నెవరికి విపత్తు సంభవించినను దమ వారికిఁ బంపవలయునని యుత్తరములు వ్రాసి యొకరి కొక రిచ్చికొనిరి. హార్బర్టు శిబిరశూన్యమునుండి బయలుదేఱి చార్లెసువద్దకు వెళ్ళి వివిధవిషయములఁగూర్చి మాటలాడెను. మైసూరుపైకి దాడివెడలుట ప్రభుత్వమువా రొనర్చిన యవివేకకార్యమనియు, బెదనూరి నొకవేళ సాధించినను గనుమల నన్నిటి రక్షించి యుద్ధతిమైనున్న సుల్తానునిసైన్యముతోఁ బ్రతిఘటించుటకుఁ దగిన బలము లేదనియు నైనను బైవారు విధించినట్లు చేయకతప్పదనియు వా రనుకొనిరి. తన కేదైన నపాయము సంభవించినప్పుడు తల్లి కంపుమని యొకయుత్తరము హార్బర్టు చేతికిచ్చి చార్లెసు ముందురాఁబోవు భయంకరయుద్ధము, దూరదేశమందుండి ప్రాణములన్ని తనమీఁద నుంచియున్నతల్లి తలంపునను రాఁగ ననివార్యంబైన యశ్రుబిందువులు జొటజొటఁ గాఱ్చెను.

అప్పటికిఁ జీఁకటిపడి చాల ప్రొద్దుపోయినందున హార్బర్టు తిరిగి స్వస్థానము చేరుటకై వెనుకకు మరలెను. జనమంత గాఢనిద్రయం దుండెను. వాని

ద్రొక్కకుండ హార్బర్టడుగుతీసి యడుగు మెల్లఁగఁబెట్టుచు దన ప్రదేశమునకుఁ బోయి నర్దక్కులఁజూచెను. అంతట నిశ్శబ్దముగ నుండెను.

శిబిరరక్షకుల యీలలు నట్టులు మాత్ర మప్పుడప్పుడు వినవచ్చుచుండెను. బ్రహ్మాండాకారమైన హుళేనుసురుదుర్గము నిశ్చలవాయ్వాంతరాళమున సుషుప్త్యవస్థం జెందినట్లుండెను. దూరదూరముగ మిన్కుమిన్కు మని మంట లగపడుచుండెను. శిబిరమధ్యమున నప్పుడప్పుడు కుక్కలు మొఱుఁగుచు వెంటనే చాలించుచుండెను. ఘేరవంబుల రవంబు లెడనెడఁ గర్ణగోచరములై పర్వతములఁ బ్రతిధ్వని లీనఁజేయుచుండెను. యుద్ధసామగ్రి మోయుటకుఁ దేఁబడిన యెద్దులు తలలఁగదలించినప్పుడెల్లఁ జిఱుగంటల నినాదములు వాయువులో వ్యాపించి నమసిపోవుచుండెను. ఝిల్లీనామకారణ్యకీటకముల కీఁచుధ్వనులు నిరంతరము చెవులఁబడుచుండెను. ఇవియన్నియు శ్రుతికంటకములుగాక యధ్వగమనముచేఁ బడలిన హార్బర్టుయొక్క నిద్రకుఁ దోడ్పడినవై యూయెను.

---

## పదునేడవ యధ్యాయము

తెల్లవాఱినది. పెద్దపులుల గోండ్రింతలకు భల్లూకముల యఱపులకు సివంగుల దీర్ఘనిస్వనంబులకు నలవాటుపడిన కొండగుహలు యుద్ధసన్నాహయంత్రనినాదములకుఁ బ్రతిధ్వని లీనెను. అందఱు సన్నద్ధులైరి. వీరు కనుమల మార్గము నెఱుఁగకపోవుటచేఁ ద్రోవచూపుట కిద్దఱ నేర్పఱచికొనిరి. వీరిలో నొకఁడు నాయరు. ఇతఁడు బలవంతపఱుపఁబడి ముసల్మానయ్యెను. మఱి యొకఁడు మహమ్మదీయుఁడు. టిప్పుచేసిన యపకారము సహింపలేక కసితీర్చికొనుటకై నాయ రాంగ్లేయులను జేరెను. మహమ్మదీయుఁడు ధనాశాబద్ధచేతస్కుఁడై యెట్టికార్యములకైన నొడఁబడువాఁడు. బహుమానము లొసంగెద మన్నప్పుడు నాయరు నిరాకరించెనుగాని మహమ్మదీయుఁడు పేరాసతో జేరమాడెను. శత్రుజాతిలోనివారు గనుక నమ్మఁజాలక హార్బర్టు వీరినిఁ బరీక్షించెను.

హార్బ—నీ కేమి కావలయును? నాయర్.

నాయ—సుల్తానునిమీఁదఁ గసితీర్చికొనవలయును. నేనిప్పుడు తురకవేషముతో నున్నను మొదలు నాయరను. మతము నపవిత్రము చేసినందువలనఁ గలిగిన రోషము మనస్సులో రగులుచున్నది. ఇంక నేమి చెప్పవలయును? పైవిషయములతో మీకుఁ బనిలేదు.

హార్బ—నీవు తలబిరుసువానివలెఁ గనఁబడుచున్నావు.

నాయరు—నీవలెనే.

హార్బ—(తనలో) ఇతఁడు నిష్కపటిగ నున్నాఁడు. ఇట్టివాఁడు మనయొద్ద నుండవలయును. (తురకవానిం జూచి) నీ కేమి కావలయును?

తురక—నాకు రెండువందలరూపాయ లిచ్చెదమని వాగ్దానము చేసితిరి. అవి ముట్టఁజేయ వేఁడుచున్నాను.

హార్బ—అదినీప్రవర్తనమును బట్టియుండును. నీయందు ద్రోహ మేమాత్రము కనఁబడినను గుక్కనుబోలె నిన్నుఁ దుపాకితోఁ గాల్చెదను. నీముఖము చూడ నసహ్యముగ నున్నది.

తురక—సేవకుని ప్రాణములు మీ చేతిలో నున్నవి. త్రోవ సరిగఁ జూపెదను. అవిగో యతని నడుగుఁడు. నే నెట్టివాఁడనైనది తెలియును.

నాయ—ఇతఁ డెట్టివాఁడైనది నే నెఱుఁగను. డబ్బుకొఱకు వచ్చినవాఁడు నిజముగఁ బనిచేయునా? చావునకైన నొప్పి ముందుండి మీకుఁ ద్రోవ చూపెదను. ఇతనిని వెనుక నుంపుఁడు. పిఱికివలెఁ గనఁబడుచున్నాఁడు.

ఈరీతి మాటలాడుచుండఁ గదలవలసినకాలము వచ్చెను. పామువలె సైన్యమంత కొండమీఁది కెక్క మొదలుపెట్టెను. నాయరు ముందుండి త్రోవ తీసెను. సైన్యము దుర్గమును సమీపించెను. దుర్గములోనున్న శత్రువులు పరంగీలమీఁదఁ దుపాకులు కాల్చిరి. వీరు తురకలమీఁదఁ గాల్చిరి. అతిధైర్యముతో వేగముగఁ బోవుచుఁ గాలుజారి యగాధమైన యొకలోయలోఁ బడి

నాయ రదృశ్యుఁడయ్యెను. చార్లెసునకు మఱికొందఱకు శత్రువుల దెబ్బలు తగిలెను. నాయరుయొక్క దుర్మరణమునకు హార్బర్టు మిక్కిలి చింతించి చార్లెసుకడ కేఁగెను.

చార్లె—భయంకరారణ్యంబున నీచెట్టుక్రిందఁ బడి నిన్నుఁ జూడకుండఁ బ్రాణములు విడిచెద ననుకొంటిని. హార్బర్టూ! కృతార్థుఁడనైతిని. ఈభూమ్యాకాశములు నాకుఁ గొన్నినిమిషములవఱకుమాత్రమేయగపడును. ఉత్తరము వ్రాయుదువుగదా. మా—

హార్బ—వ్రాయుదును లెమ్ము. నీవు మాటాడలేవు. ఊరకుండుము.

చార్లెసు—హార్బర్టూ! నాకు బాధలేదు. ప్రాణ మింకఁ గొంతకాలము మాత్రమే యుండును. అన్ని తగ్గిపోవుచున్నవి. ఈనాలుగునిమిషములైన నీతో మాటలాడెదను. పౌరుషముతోఁ బోరాడి చచ్చితి నని మాత్రము మాయమ్మకుఁ జెప్పుము. న న్నెవరును మించలేవనికూడఁ జెప్పుము. హార్బర్టూ! ఇదియే చివరచూపు.

హార్బ—(ఏమి మాటాడలేక కరస్పర్శనము చేసెను.)

చార్లె—మంచిది. నాకొఱకుఁ బ్రార్థింపుము. నేనుఁగూడఁ బ్రార్థించెదను.

హార్బర్టు నెత్తిమీఁది టోపీనిఁ దీసి నిశ్చలభక్తితో దేవునిఁ బ్రార్థించి చార్లెసువంకఁ జూచెను. కన్నులు మూఁతపడెను. శరీరము చల్లపడినది. కట్టా! గుండె కొట్టుకొనుట యాగెను. చావనిన జంకని వీరుఁడైనను, సమరమే శూరుడుగాఁగల శూరుఁడైనను, హార్బర్టు మనసుపట్టలేక దూరదేశమున జననీజనకుల విడిచి బంధువుల కెడమై, దేశముకాని దేశమున నరణ్యమధ్యమున దిక్కులేని చావు చచ్చిన చార్లెసుయొక్క శవమునుజూచి వెక్కి వెక్కి యేడ్చి, కన్నీరు తుడిచికొని శవమును గాపాడఁ గొందఱ నియమించి, మరల సేనలోఁ గలిసెను.

# పదునెనిమిదవ యధ్యాయము

హాజీమలంగుదుర్గముపై కెక్కి దక్షిణపార్శ్వమునకు దృష్టి మరల్చితి
మేని జెట్టిపొదలలోఁ గొన్నిగోరీలు కాలముద్రాంకితంబులై స్వస్వపారా
తన్త్యంబును జెప్పక చెప్పుచు మన కిప్పటికిఁ గానవచ్చుచుండును. సహజకవులు
నేఁటికిని నిర్లక్షణంబైనను భావద్యోతకములైన వాఙ్నిచయముచేఁ బ్రశాంత
భక్తులఁ బ్రబోధించుచుఁ గథారూపమునఁ గీర్తించుచున్న హాజీమలంగుల
సర్గపుముట్టడియందుఁ బ్రాణములఁగోల్పోయిన దేవాంశసంభూతులగు వీరుల
గోరీలే యివి. వీనికిఁ గొంచెము దూరముగ ఛాయామనోజ్ఞంబైన సాంద్రనింబ
వృక్షము క్రింద మఱియొకగోరీ లక్కినవానికంటె నెక్కుడు సురక్షితంబై
వీక్షితంబగును.

దినివిష్ట శీతలచ్ఛాయం బట్టశాల కావించికొని కాపురముండు పక్షి
లోకముల పర్వతారోహణాయాసంబున డస్సి పిపాసార్తులైన పాంథులకుఁ
బానీయంబు కడుపార నిచ్చి విశ్రాంతి యొసఁగుచుండును. పూర్వకాలము
నుండి యొకపకీరు పోయిన మఱియొకపకీ రచ్చట వసించుచుండును. పూజ్యం
బైన నింబపాదపచ్ఛాయ పైనిఁ బ్రసరించుటచేతనో, ప్రవృత్తిమార్గవిరక్తిం
జెంది సమాధిస్థులైన యోగీంద్రునివలె దుఃఖజనకంబైనను గౌరవభాజనం
బగు మృత్యుకల్పితోపధానుండై భూమ్యంతరాళమున విశ్రమించుచున్న
శూరుని పుణ్యవశముననో, చిరకాలమునుండి యనుశ్రుతములైన గాథల
వలననో, లక్కినవానితోఁ గలియక దూరముగ నుండుటచేతనో, యాగోరీ
జనహృదయముల నాకర్షించి పవిత్రముగ నెంచఁబడుచున్నది.

అలబ్ధప్రియసంయోగయైన పూఁబోఁడియో, రోగపీడితసంతానయైన
తల్లియో, ప్రోషితభర్తృకయైన యిల్లాలో, రాత్రులయం దాగోరీమీఁద
దీపములు వెలిఁగించి నిజాభీష్టంబులఁ బ్రతిపాదింపుమని ప్రార్థించి పోవు
చుండును. ఆహా! మానసికభాగధేయంబు వీరుల నిర్మలాంతరాత్మలకు
సమర్పించుట దైవప్రేరితముగదా!

ఈగోరీ యెవరిది? ఎవరిదో కాదు. చార్లెసుదే. ఫెలిప్సు హార్వర్డులు చార్లెసుయొక్క సమాధి కాష్ఠలమును నిర్దేశించిరి. దుఃఖితమిత్రవదనులై శవమును గోరీకి మోసికొనిపోయిరి. వందికృత స్తోత్రపాఠంబులకంటెను, వపుర్ధృత విజయచిహ్నంబులకంటెను, బ్రోద్రేకాహత భేరీరావంబులకంటెను, నాంగ్లేయాచారప్రకారము శవవాహనముపై నుంపఁబడిన శిరస్త్రఖడ్గసారసన కవచాకృతు లాపీరునిచరిత్రము నెక్కుడు హృదయాకర్షణముగ వివరించుచుండెను. శీర్షణ్యము ధరించిన యుత్తమాంగమును, ఖడ్గమును బట్టిన హస్తమును నిశ్చలములై యుద్ధరహితముగ నుండెను. వీనిని భూదేవి తనలోఁ దాఁచుకొన నాసించినది. జీవించియుండుకాలమున నశ్వహేషితంబులు, గజఘీంకారంబులు, సైనికాట్టహాసంబులు చెలరేఁగఁ దన్మధ్యమున మెలఁగు శరీరము శోకనిర్విణ్ణమానసులై నిశ్శబ్దముగఁ గదలుచున్న యోధులచే వహింపఁబడుచుండెను. అక్కటా! యుద్ధరంగప్రస్థానమునకు శ్మశానాభినిర్యాణమునకు నెంత యంతరంబు! వీరోచితమర్యాదలు సక్రమంబుగ జరపి చార్లెసును జివరకు భూస్థాపితుఁ జేసిరి.

అప్పటికి సాయంకాలమైనది. అందఱు నిజనివాసంబులకు మరలిరి. ఎల్లెడఁ బ్రబలాంధకారంబు నిండెను. గొల్లవాండ్రు మందలలో వేసిన నెగళ్ల దీప్తులును, గట్టెలఁ గొట్టి జీవించు బీదజనులు మాపటియన్నము వండుకొనుటకై యేర్పఱచిన రాళ్లసందుల వెలుఁగు మంటలును గనఁబడుచుండెను.

తెల్లవాఱినది. సైన్యము బేదనూరున కభిముఖమై బయలుదేఱెను. బేదనూరునకు మంగుళూరునకు మధ్యమున రెండుదుర్గములు కలవు. అవి హైదర్ఘడు ననంతపురదుర్గములు. హైదరుఘడుదుర్గాధిపతి పరాజితుఁడై శీఘ్రముగ దుర్గమును, దాని క్రిందిదేశమును నాంగ్లేయుల కప్పగించెను. అనంతపురదుర్గ మనాయాసముగ లోఁబడెను. ఈరెండుదుర్గముల క్రిందిదేశములోఁ జిన్నచిన్న సైన్యములనుంచి బేదనూరుసమీపించి ముట్టడించి సాధించిరి. అచ్చటనున్న ఖజానా స్వాధీనము చేసికొనిరి.

బెదనూరులోఁ బ్రవేశింపఁగనే సైనికులు జీతము లిమ్మని యడిగిరి. దుర్గములో దొరకిన ధనమంత పంచియిమ్మని కోరిరి. సేనాధిపతి సమ్మతింపలేదు. భోజనపదార్థములమాత్ర మిచ్చెదననియు, ధనమును బంచుటకు వీలులేదనియు నతఁడు చెప్పెను. జీతము లిచ్చినదనుకఁ గదలమని సైనికులు తిరుగఁబాటొనర్చిరి. సేనాధిపతి జీతములీయక యిబ్బంది పెట్టుచున్నాఁడనియు, నసమర్థుఁడనియుఁ, బ్రభుత్వమువారికి మనవిచేయుటకై ఫలిప్సును బొంబాయికిఁ బంప సైనికులు ప్రయత్నించిరి. సేనాధిపతి దానికి సమ్మతించెను. తాను జేయుచున్నపని యుక్తమేయని నమ్మి భగవంతునిపై భారమువైచి ప్రభుత్వమువారికుత్తరములు వ్రాసి ఫలిప్సును బొంబాయి కంపెను.

ఫలిప్సు హార్బర్టువద్దకేఁగి బొంబాయికిఁ బోవుచున్నానని చెప్పఁగ నతఁడింగ్లాండునకుఁ బంపుమని యిచ్చినయుత్తరములును 'నేను మృతినొందినట్లైన నామీకి ముట్టఁజేయు'మని యొక లకోటాయు నిచ్చెను. వానిలోఁ జార్లెసు తనతల్లికి వ్రాసినయుత్తరముకూడఁ గలదు. వానిని దీసికొని ఫలిప్సు బయలుదేఱి పోయెను. ధనము పంచియిమ్మని సేనాధిపతికి హార్బర్టు పలువిధములఁ జెప్పెను గాని, యాపల్కు లరణ్యరోదనము లయ్యెను. దుర్గరక్షణమునకు వలయు నేర్పాటులైనను జేసినవాఁడు కాఁడు. త్రోవచూపుట కిద్దఱును వీరు నైకొనిరని యిదివఱకుఁ జెప్పఁబడెను. మొదటివానిగతి చదువరు లెఱిఁగియున్నారు. రెండవవాఁడు మహమ్మదీయుఁడని చెప్పియుంటిమి. అతఁడు జమాదారుఁడు. నాయరు చచ్చినతరువాత నితఁడు మార్గదర్శకుఁడై నిరపాయముగ గమ్యస్థానమునకు వారినిఁ జేర్చెను. ఇతఁడు సేనాధిపతికిఁ బ్రియుఁడయ్యెను. ఆంగ్లేయులనిన సుల్తానుఁడు గడగడ వణఁకుచున్నాఁడనియు, బెదనూరుదుర్గములో రహస్యస్థలములయం దింకను ధనము గలదనియు, భయపడ నవసరమేమాత్రము లేదనియు, హైందవుల కలవాటైన యుపమానోత్ప్రేక్షలతో నతి విశ్వాసముగ జమాదారుఁడు సేనాధిపతికిఁ జెప్పుచుండెను. అమాయకుఁడైన సేనాధిపతి యతఁడు చెప్పినమాటలు నిజమైనవని నమ్మి శత్రుభీతి యావంతయు

లేక యుండెను. హార్బర్టు జమాదారునిచర్యల వీక్షించి యతఁడు మోసకాఁడని కనిపెట్టెనుగాని, సేనాధిపతి తనమాటల వినువాఁడు గామి నేమియుఁజేయలేక యూరకుండెను. ఫిలిప్పు బొంబాయికి ఫిబ్రవరినెల ప్రారంభమునఁ బోయెను. ఏప్రియలు మూఁడవతారీఖు వచ్చెను. తమమనవికి జబాబువచ్చునని సైనికులు కుతూహలులై యుండిరి. ప్రస్తుతసేనాధిపతి యెప్పుడు పోవునా? యని వేచి యుండిరి. కాని బొంబాయినుండి యేజాడయు లేదు. అందఱు నిరాశులైరి. సైనికులకు సైన్యాధిపతికి నంతఃకలహము మెండయ్యెను.

సుల్తానుఁడు ధ్వజినీసమేతుఁడై వచ్చుచున్నాఁడని యేప్రియలు 4-వ తారీఖునఁ గింవదంతులు పుట్టెను. ఈవార్త వినినది మొదలు హార్బర్టునకు జమాదారునిమీఁద ననుమాన మెక్కువై సేనాధిపతియొద్దకుఁ బరుగెత్తి సుల్తానుఁడు వచ్చుచున్నాఁడనువార్త తెలిపెను.

సేనాధి—ఎవఁ డీవెఱ్ఱిమాట చెప్పినవాఁడు? టిప్పు శ్రీరంగపట్టణములో నున్నాఁడు. చెన్నపట్టణసైన్యముమీఁది కేఁగుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు. శ్రీరంగపట్టణములోనివార్త లెప్పటి కప్పుడు నాకుఁ దెలియుచున్నవి.

హార్బ—సుల్తానుఁడు వచ్చునని యందఱు ననుకొనుచున్నారు.

సేనాధి—ఇది నీలివార్త. ధాన్యమునకు ధర హెచ్చించుటకై వర్తకులు కల్పించిరి. జమాదారునివలననే మన మింతవఱకు నిరపాయముగ నుంటిమి. ఇతఁడు మనకు మిక్కిలి సహాయము చేసెను. అట్టి వేవైన నున్న యెడలఁ జెప్పఁడా? హార్బర్టూ! అతని నడుగుము.

హార్బ—సాహెబూ! సుల్తానుఁడు వచ్చుచున్నాఁ డనుమాట వాస్తవమా కాదా? నిజము చెప్పు ధొంగవలెఁ గనఁబడుచున్నావు. ద్రోహము చేయు చున్నట్లు తెలిసినయెడల నిన్నుచెట్టునకు వ్రేలాడఁదీసెదను.

జమా—(నవ్వి) అయ్యో స్వాములు! ఎవఁడు మీకుఁ జెప్పినవాఁడు? ఇవిగో శ్రీరంగపట్టణమునుండి ప్రతిదినము వచ్చుచున్న యుత్తరములు. ఉపదు

చదువఁగలరు కాఁబోలును చదువుఁడు. శ్రీరంగపట్టణమునం దేది చిటుక్కన్న నాకుఁ దెలియును. ఒకఁడు ప్రతిదినము రహస్యముగ నుత్తరములు తెచ్చియిచ్చును. తమకొఱకు నాప్రాణములైన సమర్పించుటకు సిద్ధముగ నున్నాను.

హార్బ—(సేనాధిపతినిఁ జూచి) అయ్యా! యీయుత్తరములు లేఖకునిచేఁ జదివించెదను. లేఖకుఁడా! చదువు.

లేఖ—(ఉత్తరముచూచి తడవి తడవి) సేన శ్రీరంగపట్టణములో నున్నది. సుల్తానుఁ డచ్చటనే యున్నాఁడు. చెన్నపట్టణముపైకిఁ బోవఁ బ్రయత్నించుచున్నట్లు కనఁబడుచున్నది.

జమా—అయ్యా! నేను జెప్పలేదా? ఇప్పుడైనను దేవరవారికి నమ్మిక కుదిరినదా? ఈయుత్తరమీదినమే వచ్చినది. నాలుగుదినముల క్రిందట శ్రీరంగపట్టణమునుండి బయలుదేఱినది. కనుక నిజవార్తల నమ్ముఁడు. మీకిప్పుడు రానున్న భయము లేదు.

సేనాధి—జమాదారుఁడా! నీకిచ్చెదమన్న రెండువందల రూపాయల నిచ్చితిమి! ఇంకను మమ్మనుసరించి యెప్పటివలె మంచి గొప్ప బహుమానము పడయుదువు.

జమా—మహా ప్రభూ! సేవకుని ప్రాణములు మీవి.

సేనాధి—హార్బర్టూ! నీవు తొందఱపడి వారువీరు చెప్పు మాటలు నమ్మకుము. మనకు భయములేదు. మనము భగవంతుని స్మరించుచు నతనియందు నిశ్చలమైన భక్తి గలిగి యుంటిమేని మనకొకవేళ నపాయము సంభవించి నను దొలఁగిపోవును. సర్వశక్తుఁడైన యీశ్వరుఁడు శత్రువుల యాలోచనముల భంగముచేసి మనలను గాపాడును. అతనిని సదా ప్రార్థింపుము.

మఱునాఁడు తెల్లవాఱెను. కరకర ప్రొద్దు పొడిచెను. పురబాహ్య ప్రదేశంబున ననతిదూరంబున సముద్రంబట్లు ధ్వనిపురస్సరంబుగ సైన్యము వచ్చుచుంట దృగ్గోచరమయ్యెను. జమాదారుఁడేడి యేఁడియని సేనాధిపతి,

ఘూరసేను జమాదారుఁ డెచ్చటనున్నాఁడు? అప్పుడే పోయెను. ఆత్మరక్షణమునకీ సేనాధిపతి యేమేర్పాటును జేయలేదు. కోటగోడ లరక్షితములై యుండెను. మధ్యాహ్నము దనుకఁ బరంగీలు పెనఁగిరి కాని చివరకు సుల్తానుని సైన్యము కోటపైఁబడెను. ఆంగ్లేయసేనాధిపతి తన యవివేక కార్యముల నప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. ఏమి లాభము? భోజనసామగ్రి యైపోవచ్చెను. మందుగుండు సామాను తక్కువాయెను. సైనికులు మాత్రము కలహములు మఱచిపోరాడ సమకట్టిరి గాని వారి పూనిక నిష్ఫలమయ్యెను. బాహ్యప్రాకారములన్ని సుల్తానుని యధీనములాయెను. సైన్యము క్రిక్కిరిసి మీఁదికి వచ్చుచుండెను. ఆంగ్లేయులు చేయునది యేమిలేక సంధికి వచ్చిరి. సుల్తానుఁ డొడంబడెను.

దుర్గము విడిచి యాంగ్లేయులు సముద్రతీరమునకుఁ బోవుట కేప్రియలు 30-వ తారీఖు నిశ్చయింపఁబడినది. స్వద్రవ్యము తప్ప దగ్గఱనున్న ఖజానా యంత సుల్తానునకిచ్చుట సంధి యొడంబడిక. ఉన్న ద్రవ్యమంత టిప్పునకిచ్చినట్లయినఁ దమ కాధారములేదని భయపడి యాంగ్లేయసైనికులు, దొమ్మిగ సేనాధిపతి గుడారమును ముట్టడించి కొల్లగొన్న ధనము పంచియిమ్మని యడిగిరి. సుల్తానున కిచ్చెదమని వాగ్దానముచేసిన సొమ్ములోఁ గాసైన ముట్టఁగూడదని హార్బర్టెంతచెప్పినను లక్ష్యపెట్టినవారు కారు.

“మాప్రాణములు పోవుచున్నవి. అన్నములేదు. అదిగో ధనమిమ్ము” అని యొక్కపెట్టున నఱచిరి.

ఒక్క నెలజీతముమాత్ర మిచ్చెదనని సేనాధిపతి వారిని నెమ్మదిపఱచి ఖజానాబీగముల నిష్టముతో నొసఁగెను. డబ్బు కంటఁబడిన వెంటనే యందఱు “ఒక్కనెలజీతమేమి? ద్రవ్యమంత తీసికొందము. శత్రువులకుఁ బోసియనేల?” అని కేకలువేసి యనివారితులై ఖజానా పెట్టెల నుత్తవిగ నొనర్చిరి. హార్బర్టుసేనాధిపతు లీ దుండగము చూచి సంతాపపడిరి గాని యేమిచేయఁ

గలరు ? ధనముచూపకున్న సుల్తానుఁడు కోపోగ్రీపితుఁడై యందఱను గారా గారబద్ధులఁ జేయునని నమ్మి చింతను దిగఁద్రావి యూరకుండిరి.

ఏప్రియలు 30-వ తారీఖు వచ్చినది. దీనవదనంబులతో నాంగ్లేయు లందఱు దుర్గమునుండి బయలువెడలిరి. టిప్పుయొక్క సైనికులు కోటలోఁ జొరఁబడిరి. కొంతసైన్య మాంగ్లేయసైన్యము నావరించి యుండెను.

బీగములు సుల్తానుఁడు తీసికొని ఖజానాపెట్టెలన్ని వెదకెను. జమా దారుఁడువచ్చి తానిదివఱకు మార్గదర్శకుఁడుగనుండి కనిపెట్టిన యాంగ్లేయుల చర్యలన్ని టిప్పునకుఁ జెప్పెను. ఆంగ్లేయులకడ జమాదారుఁడు రెండువందల రూపాయలు తీసికొనిన సంగతి యతనికిని వారికిఁ దప్ప మఱియొకనరునకుఁ దెలియదు. రహస్యస్థలములన్నిటిలో సుల్తానుఁడు దేవులాడెను. కాని ధనము కనఁబడలేదు. అప్పుడతఁ డాంగ్లేయుల శోధించెను. వారివద్దఁ గొంత దొరకెను. సంధియొడంబడికప్రకారము నడువలేదని సుల్తానుఁడు దురాగ్రహాగ్రస్తుఁడై యందఱ నొక్క పర్యాయము చెఱసాలలోఁ బెట్టెను. ఆకారాగృహావాసము కంటెను నిరయనివాసము మేలని చదువరు లెఱుంగఁగలరు.

---

## పందొమ్మిదవ యధ్యాయము

అబ్దుల్ రహిమాన్ ఖానుఁడు వికలమనస్కుఁడై భార్యలవద్దనుండి పోయెనని యింతకుఁ బూర్వము చెప్పియుంటిమి. ఆయన గుఱ్ఱమునెక్కి కోట ద్వారముదాఁటి మైదానములోనికిఁ బోయి భార్యాకృతావమానము మన స్సులో రగులుచుండఁ బలువిధములఁదలంచుచు నేమి తోఁపక గుఱ్ఱము నటు నిటు బరుగెత్తించి చివరకు గుడారమును సమీపించెను. సమీపింపఁగనే యీ క్రింది సంభాషణము వినవచ్చెను.

"నాజరుద్దీన్ ! నీవు పరమ దుర్మార్గుఁడవు. ఛీ! ఛీ! నీమొగము చూడఁగూడదు. ఇది రెండవపర్యాయము. లెక్కలు సవరించి డబ్బు ముజరాయిమ్ము. లేదా ఖానునితోఁ జెప్పెదను ?

"గాడిదకొడుకా! నీవాదుర్మార్గుఁడవు నేనా? నిన్నకాక మొన్నవచ్చి తప్పులు పట్టుచున్నావు? పటేలుకుంక."

"ఓరి సన్నాసి! నన్నుఁ దిట్టెదవురా? నీకుఁ బోవుకాలము సమీపించినది"

"ఛీ లంజకొడుక"

"ఛీ ముండకొడుక"

"అదిగో నోటిమీఁదఁ గొట్టెదను"

"ఇదుగో ముచ్చుతీసికొని బాదెదను"

"ఏదిరాకొట్టు ముండమోపి"

"ముండమోపినిరా? అక్కడనేయుందుము" (అని పైకిఁ బోయెను.)

ఖానుఁ డడ్డమువచ్చి యిద్దఱను విడఁదీసి,

"ఏమి యీగందరగోళము? చేతులు చేతులు కలుపుచున్నారు. నాజరుద్దీను నీవు పెద్దవాఁడవు సిగ్గులేదా? కాశిమాలి! నీవుకూడఁ గలహములలోనికి దిగితివా?" అని పలికెను.

నాజ—మహాప్రభూ! మనవి. ఈచిన్నవాఁడు లేపకు "మోసకాఁడవు దుర్మార్గుఁడవు" అని తిట్టుచున్నాఁడు. నామర్యాదకు భంగముకలుగఁ జేయుచున్నాఁడు. కోపము వచ్చినదన్న రాదా? పెద్దలు సెలవిండు.

ఖాను—కాశిమాలి! పెద్దవానిఁ బట్టికొని యిట్టి యగౌరవవాక్యము లేల పల్కితివి? నీవంటి చిన్నవానికిఁ దగునా?

కాశి—అయ్యా! ఇదివఱకు నన్నుమీరు నమ్మియున్నారు. నామీఁద ననుమానము లేదుగదా?

ఖాను—లేదు లెమ్ము. చెప్పు.

కాశి—మీరు నన్ను లెక్కలు తనిఖీచేయవలసినదని యాజ్ఞాపించితిరి. బెంగుళూరిలో బజారుధరలు విచారింప నతఁడువేసిన వానికంటె నధికముగ నుండెను. అప్పుడు పొరపాటని లెక్కలు సవరించెను. ఇప్పుడు మరల నాపనియే చేసెను. నేను దమశ్రేయోభివృద్ధికే యీపనులు చేయు

చున్నారు. దేవుఁడే సాక్షి. తప్పులుచూపి సవరింపు మన బూతులు దిట్టుచున్నాఁడు.

ఖాను—నిజమే. బూతులు వింటిని. లెక్కలు తప్పని ఋజువుచేయఁగలవా?

కా—ఇవిగో ధరల జాబితాలు. ఊరూరు, బజారు బజారు తిరిగి వేసికొని వచ్చితిని. మనకు ధాన్యమిచ్చినవర్తకులేచెప్పిరి. పిలిచి యడుగుఁడు.

ఖాను—నాజరుద్దీనూ! ఇంతటి మోసకాఁడవా! అల్లా! అల్లా! నాకిదియా నీవు చేసిన యుపకారము. కాశిమాలీ! అపహరించిన ధనమెంత యుండును.

కాశి—ఈవారముమట్టునకు నూఱురూపాయలకు హెచ్చుగనుండును. లెక్క వేసిగాని మొత్తము సరిగఁ జెప్పలేను.

ఖాను—వారమునకే యింతయుండిన నితఁడీపనిచేయుటకుఁ బ్రారంభించినది మొదలెంత ధనమపహరించి యుండును. హా! దుర్మార్గుఁడా!

నాజ—(వడఁకుచు) స్వామీ! స్వామీ! ఏపాపము నెఱుఁగను? వట్టి యన్యాయము నామీఁదఁ బెట్టినాఁడు. భగవంతుఁడే సాక్షి.

మాటలయందలి తడఁబాటు, కాళ్లవణఁకు ముఖనైల్యము నతని దోషిత్వమును వెల్లడిచేయుచుండెను.

ఖాను—దాదూ! కొరడాపట్టుకొని రమ్ము.

ఈమాట వినినంతోడనే నాజరుద్దీను భయకంపితుఁడై ఖానుని పాదముల మీఁద సాగిలఁబడి "అయ్యా! అపరాధిని. తీసికొనిన ధనమంత చెల్లించెదను. రక్షింపుము, రక్షింపుము" అని విలపించెను.

ఖాను—మీరందఱు వినుచున్నారుగదా. తప్పు నొప్పికొనినాఁడు. కాశిమాలి వాక్యము లీహీనుని మర్యాదకు భంగము కలుగఁజేసె నఁట. యామహాలా! దాదూ! నీవునింకఁ గొందఱు కలిసి యితనిని గొంపోయి మొగమున మసిపూసి గాడిదమీఁద నెక్కించి తోఁకవైపు మరలించి వీథులలో నూరేగింపుఁడు. ఎవరైన నాజరుద్దీనుని గుర్తించి యిదియేమని యడిగిన ఖానుని మోసపుచ్చి విహరించుచున్నాఁడని తెలుపుఁడు.

ఖానుని యాజ్ఞ నిర్వర్తింపఁబడెను. నాజరుద్దీను గాడిద నెక్కి తోఁకవైపు మరలి మసి మొగముతోఁ బురజనుల కన్నులఁబడెను. ఇతని కిది తగినశిక్ష. నాజరుద్దీనువంటి పరమతాంత్రికు లిప్పటికినిఁ గలరు. వారంచఱకు దేవుఁ డుచితశిక్ష నొసఁగఁ గాత. ఖానుఁడు కాళిమాలియొక్క కార్యమునకు మెచ్చి తగటు వస్త్రంబులతో బహూకరించి శ్లాఘించి "రేపు నన్నుఁగలిసి కొనుము. సుల్తానునిదగ్గఱకుఁ గొంపోయెదను" అనిచెప్పి గుడారములోనికిఁ బోయి యమీనాను సమీపించెను.

అమీనా గుడారపుగవాక్షముగుండఁ బ్రోవఁబోవు సైనికుల, సరదార్ల, రౌతుల నిరంతరము కుతూహలముతోఁ జూచుచుండును గాని బయటనుండి చూచువారి కమీనా యగపడదు.

ఖాను——ప్రియసఖీ! చూచితివా? నాయజమానుఁడైన సుల్తానుఁడెంతటి శూరుఁడో! ఎంతవైభవము కలవాఁడో! మీహైదరాబాదీలీరున నుండునా?

అమీనా——(లేచి) ప్రాణనాయకా లేదులేదు. ఇంతసొగసైనపట్టణ మెచ్చటను లేదు. హైదరాబాదులో మాయింటిముందీవిధమునఁ దఱచుగఁ గానరారుకాని, యప్పుడప్పుడు రౌతులుపోవుచుండఁ జూచితిని. ఇట్టివీర పురుషులఁ జూచుచుండుట నాకు సంతోషదాయకముగ నుండును.

ఖాను——ఇక్కడ మనగృహము కోటలోనున్నది. ఇంతసందడి లేదు గాని, మనుష్యులు మనయింటిమ్రోల నడచుచునే యుందురు. నీవు చూచుచుండ వచ్చును.

అమీనా——నాథా! యెప్పుడు గృహప్రవేశము? నాకిక్కడనే హాయిగ నున్నది. గుడారములలో నుండుట యలవాటైనది. ఇండ్లలోఁబడినఁ జెఱ సాలలోఁబడినట్లే కదలుటకా, మెదలుటకా?

ఖాను——సుందరీ! నీయింటికి నీవురాణివై యుండవలెనని నాకోరిక. మధ్యాహ్నము ప్రవేశింతము. సాయంత్రమునకు జుల్ఫచ్చుటనే వంటచేయును.

అమీ—(భార్యలని చెప్పలేక) వారో.

ఖాను—భయపడఁబోకు. నిన్ను గౌరవించి స్వాగతమిమ్మని యుత్తరువు చేసి వచ్చితిని.

అమీ—(కన్నీరు విడుచుచు) నామీఁద వారికి దయకలుగునా? నాగతి యేమికానున్నదో. మీరే నాకు దిక్కనుకొంటిని.

ఖాను—భయపడ నవసరములేదు. మీరు మువ్వురు నక్కసెల్లెండ్రవలె నుండఁగలరు. లతాంగీ! నా దేహము నీది.

ఖానుఁ డీవిధమునఁ జెప్పెనుగాని ధైర్యములేదు. వారిపై నేమిచేయుదురో యనిడోలాయమానమానసుఁడై యుండెను. ఇప్పు డితని భార్య లేమి చేయుచున్నారో చూతము. కుమ్మూహుర్మత్బీలు కలసి యాలోచించి కుమ్మూబీయొక్క తల్లిసలహా ననుసరించి నడుతమని నిశ్చయించికొని, యామెకొఱకు దాసినంపి తదాగమనమును నిరీక్షించుచుండిరి. కాళ్లచప్పుడు సొమ్ముల కలకల ధ్వని వినఁబడెను. ఎదురుగఁబోయి తోడ్కొనివచ్చి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి, హుక్కా యిచ్చిరి. ఇదివఱకుఁ బ్రొయ్యిలో నుప్పుపోసి నట్లుండిన సవతులిద్దఱు నన్యోన్యమైత్రిమై నుండుట కాశ్చర్యపడి యొక్క గ్రుక్క హుక్కాపీల్చి పొగ బయటికి విడుచుచు "నన్నెందుకుఁ బిలిచితిరే" యనియడిగెను.

కుమ్మూ—అమ్మా నీకుఁ జాల చెప్పవలె.

తల్లి—ఏమిటూ చెప్పవలసినది, చెప్పరాదూ? హుర్మత్! నీవైన బైటఁబెట్ట రాదే! ఏమిజరిగినది.

కుమ్మూ—మా ఆయన—

తల్లి—ఓసి నీ సిగ్గుచితుక. ఆసాంతము చెప్పు. మీ యాయన యేమైనాఁడు! చచ్చినాఁడా?

కుమ్మూ—అయ్యో బ్రతుకా! అంతపుణ్యమా. పోయిన మనయందఱపీడ తొలఁగిపోవును. మొద్దువలె నున్నాఁడు.

తల్లి—అయితే యెందుకు నన్ను రమ్మన్నది? ఇంటివద్దఁ గల పనులన్ని విడిచి పెట్టి వచ్చితిని. కమసాలివాఁడు వంకీలు తీసికొని వచ్చినాఁడు. దండ కడియాం లోకభాగ్యశాలిని తెచ్చినది. వారిని నిలువఁబెట్టి వచ్చితిని. ఈసంబరమున కేనా? ఇఁకఁ బోవుచున్నాను.

కుమ్మా—అమ్మా! ఏమి చెప్పుమందువే? వాని ముసలినోటిలో మన్నుపడ. హైదరాబాదునుండి యొకపాదుముండను వెంటఁబెట్టుకొని వచ్చినాఁడు.

తల్లి—అయ్యో! అయ్యో! వీనికేమి పోకతల వచ్చినదే. దాని నుంచుకొన్నాఁడా? పెండ్లాడినాఁడా?

హుర్మ—పెండ్లాడినాఁడఁట. ఎంత మాయలపకీరే వీఁడు! మాకెవ్వరికిఁ దెలియకుండ ముడిపెట్టుకొని వచ్చినాఁడు. నందిదుర్గమునుండి మాచిననాయన యుత్తరమువ్రాసిన దనుక మే మెఱుఁగము.

తల్లి—ఓరి వీనిదుంప తెగ! వీని మొగమున మొద్దులుపెట్ట! మీరీయవమాన మెట్లోర్వఁగలరే! ఒకవేళఁ జక్కనిదే యనుకొందము. అయితేమాత్రము శాస్త్రములేదా? ధర్మములేదా? మనవంశమున కెంత యమర్యాద? మనకెంత యపకీర్తి? లోకులనోళ్లు మూయ నెవ్వరితరము? వానితాత దండ్రులవద్దనుండి కూడ నందఱు నీచులే. అయినను గావలసినంత భాగ్యమున్నది. బిడ్డ సుఖపడఁగలదని యాసపడితిని. కాని వీని కీమాయ తెవులు పుట్టునని నాకేమి తెలియును? ఆయన మీతోఁ గాపురము సరిగ వెలుఁగఁ బెట్టిన దెప్పుడే.

కుమ్మా—అమ్మా! అంతటితోఁ బోలేదు. ఆపోటినిఁ దెచ్చి మానెత్తినిఁ బెట్టఁ బోవుచున్నాఁడు. ఇంతకు ముందువచ్చి యడ్డమైనపాటు పడిపోయినాఁడు.

తల్లి—ఛీ! ఈమాయమాటలు నేను నమ్మను. ఆముసలివాని కేమైనఁ బిచ్చి పట్టినదా?

హుర్మ—అయ్యో! నిజముగ నన్నాఁడు. మేమాపోటి కుపచారాలు చేయవలెనఁట. లేకపోయిన మమ్మింటినుండి వెడలఁగొట్టెదనని కేకలు వేసినాఁడు.

కుమ్మా—వాఁడు వెడలఁగొట్టినను నాకు భయములేదు. మాతల్లిగారియింటిలో విలక్షణముగ నుందును. అన్నవస్త్రములకు లోపములేదుగదా!

హుర్మ—అన్నవస్త్రములు లేనిజీవనికి? తెలియక యడుగుచున్నాను. నీయెత్తిపొడుపు మాటలింకను చాలింపవు. నీపుట్టినింటివారు భాగ్యవంతులైతే పదిసారులు—తేవలేవకు మాపుట్టినింటివారు పేదవారని యెగతాళి చేయుచున్నావు. నే నోర్వనమ్మ. చెప్పవలదు?

తల్లి—మీరిద్దఱిప్పు డెందుకుఁ గీచట్లాడెదరు? ఇంకను మునలివాఁడేమన్నాఁడో చెప్పుఁడు.

కుమ్మా—అమ్మా! కేకలువేసి వెళ్లినాఁడు. అంతకు మిక్కిలి యేమి యన్నలేదు. భయపడి నిన్ను రప్పించితిమి. ఇంక మాదేమి బ్రదుకు (అని కన్నీరు చెఱఁగుతోఁ దుడుచుకొనెను.)

తల్లి—(హుకాకుఁబిల్చి ముక్కలగుండఁ బొగవిడుచుచు) అమ్మా! ఏడువఁబోకు. నీకువచ్చిన చిక్కులేదు. ఆపిల్ల చక్కనిదేనా?

హుర్మ—చక్కనిదనియే యనుచున్నారు.

తల్లి—ఇఁక మీరు పెనఁగిన లాభములేదు. వాఁడు దానిఁజూచి భ్రమించినాఁడు. సమయము వచ్చినప్పుడు కసి తీర్చికొనవలె. ఇప్పుడు త్వరపడఁగూడదు. కసి తీర్చికొనకుండ వదలినట్లైన మీరు నాకూఁతులు గారు. నాయెదుట మీతండ్రి రెండవ యాఁడుదానితో మాటలాడి యెఱుఁగునా?

కుమ్మా—అమ్మా మే మెట్లు సహింపఁగలము? దానిమొగమున మొద్దులు పెట్ట. ఆముండ రేపీవేళకు నెత్తిమీఁదికెక్కి కూర్చుండును. మంచిమంచి చీరలు, రవికెలు దానికే సింగారించి యాయన దానితోనే యుండును. ఆపోటి కట్టివిడిచిన చీరలు, తొడిగి పాఱవేసిన రవికెలు, పెట్టి తీసిన

సొమ్ములు మాపాలిటఁబడును. దాసీజనము మేముచెప్పినమాట వినదు. ఈయఘమపు బ్రతుకుకంటెఁ జావుమేలు.

తల్లి—అమ్మా! త్వరపడకు. ఓర్పుండవలె. అన్నిరోజు లొకతీరున జరుగవు. మీరు ముసలివారా? ముదుకవారా? చక్కఁదనమున మీకేలోపమును లేదు. క్రొత్తయొకవింత ప్రాఁత యొకరోఁత. ఈమురిపెము నాలుగు రోజులు సాగనీ. మరల మీదగ్గఱకే రాఁగలఁడు. మీరుండఁగ మూఁడవ పెండ్లి చేసికొనుట తప్పో కాదో, మీనాయన నడిగి చెప్పెదను. అందనుక నిచ్చటనుండి కదలకుఁడు. అతని నెదిరింపకుఁడు. కోపమువచ్చి వెడలఁగొట్టి నట్లైన బ్రతికినన్నిదినములు కష్టములపాలుకారా? లోకులుమాత్ర మేమం దురు? "కుమ్మాహుర్మ స్త్రీలు పతివ్రతలుకారు కాఁబోలును. రహస్యముగఁ గనిపెట్టి వెడలఁగొట్టినాఁడు" అనియందురు. ప్రజలనోళ్లు మూయ నెవరి తరము? నాబొందిలోఁ బ్రాణములుండఁగఁ గసితీర్పక వదలను. మంత్ర ములో, మాయలో, యేవియో మనచేతనైన పాట్లుపడుదము.

కుమ్మా—ఏదో యొకతంత్రము త్వరగఁ బన్నవలయును. అందనుక మాగతి దుర్గతి. నీవేమిచేయుఁడన్న నది చేయుదుము.

హుర్మ—నాకు నీవే తల్లివి. మాతల్లి లేదుగదా! అన్నిటికి నిన్నే నమ్మి యున్నాను. దురదృష్టురాలను (అనియేడ్చెను).

తల్లి—అమ్మా? ఏడువకుము. ఊరకుండు. నీకేమి భయములేదు. మనమంత్ర కత్తెను రేపిచ్చటికిఁ బంపెదను. జరిగినదంత దానితోఁ జెప్పుడు. తగిన తంత్రము పన్నఁగలదు.

ఆయవ్వ వారిని వీడ్కొనిపోయెను. వారిరువురు తల్లియాలోచన నంగీకరించి ఖానుని క్లిష్టముగఁ బ్రవర్తింప నిశ్చయించుకొనిరి; సాయంత్ర మగునప్పటికి గృహమునలంకరించి దాసదాసీజనంబులకు హెచ్చరికచెప్పి సిద్ధ ముగనుండిరి. ఏమిసంభవించునో యని యలుకుచు ఖానుఁ డమీనాసహి తుఁడై గృహమునకుఁబోయి లోపలఁజేయఁబడిన యేర్పాటులఁజూచి సంతోష భరితహృదయుఁడయ్యెను. సగౌరవముగ ఖానునకు నమీనాకును భార్యాద్వ

యము స్వాగతమొసఁగెను. వస్త్రస్థగితవదనారవిందయై యమీనా యుచితాసనమునఁ గూర్చుండెను. కుష్మూబీ ప్రార్థింపఁగ మొగముముసుఁగు నమీనా తీసెను. "ఆహా ఎంత సౌందర్యవతి! ఎంత సౌందర్యవతి" యని యందఱు నాశ్చర్యపడిరి. కుష్మూబీకూడఁ జక్కనిదే కాని విగ్రహము పొడుగుగనుండి చామనచాయ గలిగి కన్నులంతపెద్దవి కాకయుంటచే నమీనాకు సరిరాదయ్యెను.

ఆమెను జూచినది మొదలసూయాజనితక్రోధము కుష్మూబీ కధికమయ్యెను.

ఖాను—కుష్మూ! చూచితివా? చక్కఁదనమునకుఁదోడమీనా కెంత శాంతమున్నదో! నీవు దానిఁ బ్రేమించి స్వాగతమిచ్చినందుకు సంతోషించితిని. మీరుమువ్వురక్కచెల్లెండ్రవలె నుండవలయు నని నాయభీష్టము.

కుష్మూ—మాతోఁబుట్టువుకంటె నెక్కువగ గౌరవించెదము. నాకు మీరిన్ని చెప్పవలెనా?

అమీనా—అక్కలారా! మీరు నాయందుఁ జూపిన దయకుఁ గృతజ్ఞురాలనై యుండెదను. నా కిచ్చట నెవ్వరులేరు. మీరే అక్కలు. మీరే చెల్లెండ్రు. ఎల్లప్పుడునన్ను మీరిట్లే ప్రేమింపవలయునని కోరుచున్నాను. మా తలిదండ్రులు దూరదేశమందున్నారు.

కుష్మూ—అమీనా! మేమే నీవు, నీవే మేము. పాటకత్తెలు వచ్చి సిద్ధముగ నున్నారు. సంగీతము విందము రమ్ము. నీకొఱకే రప్పించితిమి.

అందఱు గానశ్రవణసంజనితానందవార్ధి నోలలాడిరి. సంగీతము ముగిసినవెనుక నందఱు స్వస్వస్థానంబులకుఁ జనిరి. సవతులు విరోధముచూపక ప్రేమకలిగి యున్నారని సంతోషించి యమీనా తనగదిలోనికిఁ బోయెను. భార్యలమీనాను నిజముగఁ బ్రేమించిరాయను సందేహము ఖానునకుఁ దీఱక పోయినను నావిషయ మతఁడమీనాకుఁ జెప్పనందున నామె నిర్మలహృదయముతో సుఖముగ నారాత్రి నిద్రించెను.

---

## ఇరువదియవ యధ్యాయము

మఱునాఁడు ఖానుని యాజ్ఞాప్రకారము కాశీమాలి వస్త్రాద్యలంకార భూషితుండై యశ్వము నారోహించి యతనిని గలియుటకై గృహమున కేఁగెను. త్రోవలో నితని సుందరవిగ్రహమును, శూరతాద్యోతకమైన ముఖవర్చస్సును జూచి విభ్రాంతి నొందని మనుజుఁడు లేఁడు. కుసుమకోమలులై చూపులచేతన యావనుల భ్రమింపఁజేయఁజాలు వారనారీమణులు సల్తానుని దర్బారునకుఁ బోవుచు నితనిని వీక్షించిరి.

“ఎంత చక్కనివాఁడే! దర్బారునకు మనతోవచ్చిన బాగుగ నుండును.” అని యొకతె వాక్రుచ్చెను.

“ఒకముద్దిచ్చిపోరా! అబ్బ! నీతో మాటలాడినను జాలురా” అని యిద్దఱు వినఁబడి వినఁబడకుండఁ బల్కిరి.

“ఏమిగుఱ్ఱమే, ఏమివస్త్రములే, ఏమిముఖమే, ఆకన్నులు చూడవే” అని మఱియొకతె మన్మథరసంబు చెలరేఁగ నిట్టూర్పు విడిచెను.

కాశీమాలి వీరినిదాఁటి ఖానుని గృహము సమీపించెను; తన రాకను సేవకునితోఁ జెప్పి పుచ్చి వాకిటిమ్రోల నటునిటు మెలఁగుచుండెను. ఖానుని గృహమును జూచినతోడనే యమీనా నివసించునది యచ్చటనేగదా, యని తలఁచి కొలఁదిదినములక్రిందట నాకస్మికముగఁ జూచిన యాపె వదనారవిందవిలసనమును జ్ఞప్తికిఁ దెచ్చికొని యుబ్బిళ్లూరెను. గుడారములోనున్న కాలమున నమీనాముఖసందర్శనము కాదాచిత్కముగా నగుచుండెడిది. ఆమె యగపడకపోయినను గుడారములోఁ దిరుగునప్పు డాపెబంగారు పంకీల గజ్జెల ధ్వనులు, నందెలచప్పుడు వినియైన సంతృప్తిఁ జెందుచుండువాఁడు. ఇప్పుడట్టి యవకాశములేదని చదువరు లెఱింగియుందురు. “అమీనా! నీసుందరవదనము నాకనులలో మెదలుచున్నది. నీదయ నీప్రేమ నే నెప్పుడును మఱవను. నాగాయముమానినను నీవు కట్టిన కట్టుఁ దీసివేయలేక యిప్పటికి నుంచికొంటిని. నీసవతులు నిన్ను బాధించినప్పు డీ కాశీమాలి యనురాగశూన్యుఁడై యూరక

కుండఁడు" అని యతఁ డాత్మలోఁ జింతించుచు నేమైనఁ గానవచ్చునేమో యని యప్పుడప్పు డినుపకమ్ములు నిలువుగ నడ్డముగ వేసిన కిటికీలపై పునకు దృష్టి మరల్చుచుండెను. కాని యేమియుఁ గనఁబడలేదు.

ఇంతలో ఖానుఁ డుచితవేషధారియై బయటికి వచ్చెను. కాశిమాలి మనసులోనున్న విచారమునణఁచికొని సలాముచేసి ఖానునితో సంభాషించెను. సుల్తానునివద్దకుఁ బోవుటకై సిద్ధులైరి. ఖానుఁడు గుఱ్ఱమును జేతితోఁ దట్టుచు నెక్కుడు ప్రయత్నములో నుండఁగఁ గాశిమాలి మఱియొకసారి కిటికీలకై పు చూచెను. ఒకయువతీవదన మస్ఫుటముగఁ గనఁబడెను. అమీనాముఖమే యని యతఁడు స్పష్టముగఁ దలఁచెను. మనోజ్ఞవస్త్రధారియై, కళాకౌశలమును జూపుచుఁ గులీనాశ్వము నారోహించినప్పు డమీనా తనను జూచినదని కాశిమాలి యత్యంతానందభరితుఁడయ్యెను. ఒకక్షణమాగి మరల గవాక్షము వంకఁ జూచెను. సవరించు మిషతో నామెగవాక్షముమీఁది దోమతెర నొక ప్రక్కకుఁ దొలఁగించెను. తన్నారీ తిలకంబునాస్యము స్ఫుటముగఁ గాశిమాలి చూడఁగలిగెను. అతఁడు మొదట భ్రమచేత నమీనాయని తలఁచెను గాని పాపము! ఆమె యమీనా గాదు. తద్వదనబింబము చామన చాయగలిగి సోగలు కాకపోయినను నల్లగనున్నకనుగవతో మిక్కిలి సుందరముగ నుండెను. ఆవదనము నింకొకసారి కనుఁగొన నుత్సుకుఁడై కాశిమాలి మరల గవాక్షము మీఁదికి దృష్టిమరల్చెను గాని ఖానుఁడు రమ్మని పిలిచెను. అందఱును బయలు దేఱిరి; సుల్తానుని సభాభవనమునకు వెళ్లిరి. ఖానుఁడు సవినయముగఁ డిప్పును సందర్శించి కాశిమాలిని జూపి యతని కుద్యోగమిప్పింప వలయునని మనవి చేసెను. కాశిమాలిని వలయురీతిఁ బ్రశ్నించి సుల్తానుఁ డతనికి సేవలో నుద్యోగ మొసఁగెను.

---

## ఇరువదియొకటవ యధ్యాయము

బెంగుళూరునుండి ఖానుఁడు పరంగీ ఖైదీలను దెచ్చినాఁడని సుల్తాను నకు విజ్ఞాపనముచేయఁగ వారిని సభకుఁదోడ్కొనిరమ్మని యతఁడు త్తరు విచ్చెను.

తత్క్షణమే యందఱను వెంటఁబెట్టికొని వచ్చిరి. మొనకానినిమాత్రమే సభ లోనికిఁ దెమ్మని సుల్తానుఁ డాజ్ఞాపించెను. సేవకులట్లే యొనర్చిరి. బెంగుళూరులో ఖయిదులు దేఱినప్పుడు కొంటెపిల్లవాఁడొకఁడు తాయిరువ్వినదీ మొనకాని మీఁదనే. ఇతనితో నిదివఱకుఁ గాశిమాలి సంభాషించెను. కాన సభాస్థానము నకు వచ్చినతోడనే యతఁడు గుఱుతు పట్టెను. తనసైన్యములో నుండవలసిన దని, గొప్పజీతమిచ్చెదనని, యున్నతపదవి నొసఁగెదనని సుల్తానుఁ డతనికి వేయి విధములఁ జెప్పెను. కాని యాతఁడు దేశద్రోహి కాక సుల్తానుఁడిచ్చెద నన్న యీవుల సంపూర్ణస్వాతంత్ర్యముతో నిరాకరించి శూరవాక్యములు పలికెను. సుల్తానుఁడు క్రోధఘూర్ణిత మానసుండై చూచెదరేమి యని యఱచెను. వెంటనే తళతళదీప్తులు కనులను భ్రమింపఁజేయుచుండ సుమారు నూరుకత్తులొఱలలోనుండి దూయఁబడి మొనకాని కంఠముపైఁబడ సిద్ధముగ నుండెను. కాశిమాలి లేచి "ఓశూరులారా! నిరాయుధుండైన వీనిని జంపుట భీరుకార్యంబు. ధర్మవిరుద్ధము." అని యుచ్చైస్స్వనముతో నఱచెను. శిర చ్ఛేదము చేయఁబూనిన వారందఱు కాశిమాలిమాట విని కత్తుల నొఱలలోఁ దోపిరి. సుల్తానుఁడు కాశిమాలినిఁజూచి "ఓరీ రాజద్రోహి ! నామాటల కెదురు పల్కెదవురా ? నీకుద్యోగమిచ్చినందుకు నీవు ప్రత్యక్షమమునఁ జేసిన సేవ యిదియా ? ఛీ ! (కోపముచల్లాఱఁగా) సరి. నీవుచేసిన కార్య మొకవిధమున నాకుఁ దోడుపడినది. వీనినొక్కసారి తలనఱికి చంపుటకంటె ఘోరవధ చేయుట యుచితము. నీవు లేక పోయిన నిదివఱ కితని శిరస్సు కంఠమునకు దూరమై యుండును. అయినను నీవు నామాట కడ్డముపల్కితివి గాన నీజీతము తగ్గించితిని" అని వాక్రుచ్చి ఖైదీనిజూచి యిట్లనియెను; "పరంగీ ! నీవు సమర్థుఁడవని విని నిన్ను రక్షించి నీకు మాసైన్యములోఁ బని యీనెంచితిని. మూర్ఖుఁడవై నిరాకరించితివి. నీపేరుహార్బర్టని ఖిల్లాదారుఁడు వ్రాసినాఁడు. అదియేనా నీపేరు? "

ఖైదీ—అవును. నాపేరు హార్బర్టే.

సుల్తా—నీవదృష్టవంతుఁడ వైనచో ననాయాసముగ వారిప్పుడు నిన్నుఁజంపి యుందురు. నీకు ఘోరమరణము విధించితిని.

హార్బ—దుస్సహబాధాకరమైన కారాగృహ నివాసముకంటె మరణమే మేలు.

సుల్తా—ఛీ! విమతుఁడ! నోరెత్తకు. వీని నిక్కడనుండి తత్క్షణము దుర్గమునకు గొంపొండు. వధింపుఁడు.

ఆయాంగ్లేయుని వెంటనే యచ్చటనుండి తీసికొనిపోయిరి.

సుల్తా—ఖానుఁడా! నీవు హైదరాబాదునుండి వచ్చితివి. అచ్చటి విశేషములు సవిస్తరముగఁ జెప్పుము.

ఖాను—ఇక్కడ నలుగురిలోఁ జెప్పుటకు సెలవా? రహస్యముగా మనవి చేయుదునా?

సుల్తా—అందఱు వినవచ్చును. రహస్య మేమిలేదు. వీరందఱు మనవారే.

ఖాను—చిత్తము. చిత్తము. మహాప్రభూ! నైజాము దేవరవారియెడల స్నేహముతో నున్నాఁడు. 1768-వ సంవత్సరపు సంధిపత్రమునందలి యొడంబడిక ప్రకారము గుంటూరు పరగణా యీవలసినదని పరంగీలు నైజామును నిర్బంధపఱచుచున్నారు. గుంటూరును నొప్పగించుటకు నైజామున కిష్టములేదు. నేఁడో రేపో పరంగీలపై యుద్ధమునకు వెడల సిద్ధముగ నున్నాఁడు. ఇస్లాంధ్వజముక్రింద రెండుసర్కారులును గలిసి విమతులతోఁ గలహించి తన్నాశ మొనర్చుట కిది యుక్తసమయము. దేవర వారియొద్దకు నైజాము రాయబారినిఁ బంపఁబోవుచున్నాఁడని యొకనిశ్చయమైన వార్తకూడఁ దెలిసినది.

సుల్తా—ఖానుఁడా! ఏమి? రాయబారమా? ఆశ్చర్యకరము. అంత యాతురుఁడై యున్నాఁడా? అతని సహాయముతో నెట్టికార్యమైన నిఁక సాధింపవచ్చును. లక్షమంది రౌతులఁదీసికొని రాఁగలఁడు. కాల్బలమగణ్యము. మొదట నీవిమతులైన నాయరులరూపు మాపవలయును. సరి. ఇప్పటికి దర్బారు చాలింతము.

---

## ఇరువదిరెండవ యధ్యాయము

సుల్తానునియాజ్ఞ వెంటనే నిర్వర్తింపఁబడెను. ఆనాఁడు సాయంత్రము తక్కినపరంగీ ఖైదీలను గూడ సభకుఁగొనివచ్చి కొలువున కొప్పుకొనియెదరా మరణమున కొప్పుకొనియెదరా? యని యడుగ నలువురైదుగురు మాత్రము కొలువున కొడంబడిరి. మిగిలినవారు హర్బర్టువలెనే నిరాకరించిరి. ఘోరమరణ దండనము వారికిఁగూడ విధింపఁబడెను. వీరిని ఘోరముగఁ జంపుటకు నియమింపఁబడినవాఁడు జమాదారుఁడు. వీఁడుహర్బర్ట్ మొదలయిన వారినిఁ దోడ్కొని నందిదుర్గమునకు బయలుదేఱెను. పోవుచు మధ్యమున బెంగుళూరిలో నాగిరి. అచ్చటి మండలాధిపతి సుల్తానుని యుత్తరువు ప్రకారము హర్బర్టుమనసు త్రిప్పి కొలువులోనికిఁ దీసికొనవలయునని ప్రయత్నించెను గాని హర్బర్టు నిశ్చంచల హృదయుఁడై యుండెను. బెంగుళూరినుండి మరల బయలుదేఱి నందిదుర్గమును సమీపించిరి. త్రోవలో జమాదారుఁడు ఖైదీలతో సంభాషించి వారినిఁ దమకొలువులోనుండుఁడని వాదించుచుఁ బోయెను. కాని యతఁడు హర్బర్టునకుఁ జాలదూరమునుండి మొగముగపడనీక మెలఁగెను.

ఆకస్మికముగ జమాదారుని మొగము కనఁబడినపుడెల్ల నిదివఱ కెచ్చటనో యీమొగమును జూచితినని హర్బర్టు తలంచుచు నిది భ్రమకాని నేనెందు కితని మొగముచూచితినని సంశయించుచు నుండెను. నందిదుర్గమును సమీపించినప్పు డదివఱకు దూరముగనుండు జమాదారుఁడు దగ్గఱకువచ్చి "పర్గంగీ! అదిగో! ఆదిబ్బచూడు. దానిమీఁద సుల్తానుని ధ్వజము వ్రేలాడు చున్నది." అని యనెను.

హర్బ—చూచు చున్నాను.

జమా—మీవంటి వివమతులు, రాజద్రోహులైన హిందువులు, ముసల్మానులు దానిమీఁదినుండి క్రిందికిఁద్రోయఁబడుదురు.

హర్బ—దానిని నేను సంతోషముతోఁ జూచుచున్నాను. అచ్చటనుండి కలిగినమరణమును నేను గోరుచున్నాను.

జమా—నీసంతోషము చాలింపుము. నీమరణస్థాన మదికాదు. దాని కవతల నగపడుచున్నది చూడు కొండబోడు. అదిగో అది.

హర్బ—కనఁబడుచున్నది.

జమా—దానిక్రింద నొక బ్రహ్మాండమైన లోయయున్నది. రేపు చూచెదవు లెమ్ము. సాయంకాలమైనది. నేనూరిలోనికిఁ బోవుచున్నాను.

హర్బ—ఇంకొక్కమాట. ఇంతకు నీవెవరు? నీమొగమిదివఱకుఁ జూచినట్లు జ్ఞాపకము కలదు.

జమా—రేపు చెప్పెదను లెమ్ము.

ఖైదీలందఱు నంతదుర్గములోఁ జొచ్చిరి. వెనుక ఖానుఁడు సమీపాయము విశ్రమించిన హిందూదేవాలయమే వీరికిప్పుడు విడియుచోటయ్యెను. చీఁకటి పడినది. ఈఁదరగాలి వీచుచుండెను. ఖైదీలందఱు వారికీఁబడిన ముదుక రొట్టెలు తిని పులిమజ్జిగ త్రావిరి. జమాదారుని గుఱ్ఱపువాఁడు జాలిచే విసరివేసిన గుఱ్ఱపుగుడ్డలు కప్పుకొని ఱాలు తలగడలుగఁ బెట్టికొని పరుండి వారు నిద్రావివశులైరి. హర్బర్టునకుఁ గంటినిండ నిద్దురపట్టలేదు. పలువిధములైన కలలు రాసాగెను. చివరకతఁడు జ్వరబాధచే డప్పిగొని దగ్గఱనున్న కుండలోనినీళ్లను ద్రావి నిద్రపట్టనందున నొక విఱిగిన స్తంభముపైఁ గూర్చుండెను. కావలివాండ్రు తప్ప నాసమయమున నెవ్వరును మెసలుటలేదు. వారేమేమో మాటలాడుకొనుచుండిరి. హర్బర్టా సంభాషణము వినఁ బ్రయత్నించెను. "అయితే ధన మెక్కడనున్నది వీనికిఁ దెలియునా? బెదునూరుదుర్గము ముట్టడించినప్పుడు పరంగీలు పాతిపెట్టిరనివాడుక" అని యొకఁ డనెను. "దేవునికెఱుక. పరంగీలు పాతిపెట్టిన మాట వాస్తవమే. యని జమాదారుఁ డనుచున్నాఁడు. ఆజాడ తీసినతరువాతఁ బరంగీని-" అని మఱియొకఁ డనెను. తరువాత హర్బర్టున కేమియు వినరాలేదు.

చలిగాలి మొదలాయెను. వాయువేగమున నచ్చటి యెఱ్ఱనుమ్ము పైకి లేచి ఖైదీలమొగములమీఁదఁ బడుచుండెను. పాడుపడిన దేవాలయకుడ్య ద్వారములగుండను నికటస్థశాఖాబహుళవృక్షములమీఁదిగను వాయువు వీచి నప్పుడు జనించిన "బుంయ్" మను దీర్ఘధ్వని వినువారికి భయము నాపాదించు చుండెను. హార్బర్టెప్పుడు తెల్లవాఱునా యని కనిపెట్టుకొని యుండెను. నిద్ర పట్టనివారికి రాత్రియందును, బనిలేనివారికిఁ బగటియందును, గాలచక్రము తిరుగక నిలిచినదేమోయని తోఁచుట సహజము. కొంతసేపటి కొక కోడికూఁత వినఁబడెను. వెంటనే మఱికొన్ని కోళ్లు కూసెను. హార్బర్టు కుతూహలముతోఁ ప్రాగ్దిశకు దృష్టిమరల్పఁ దూర్పు రేఖలు కాన్పించెను. నిజకష్టములు కడతేఱు రోజు వచ్చినదని హార్బర్టు సంతోషించెను.

తెల్లవాఱినది. తక్కినఖైదీలును లేచిరి. అందఱిమనస్సులు రాఁగల మరణమునుగూర్చిన తలంపులతో నిండియుండెను. విస్తారముగ నల్లమందు తినినవారివలెఁ గొందఱు నిశ్చేష్టితులైరి. కొందఱు బిగ్గఱగ దేవునిఁ బ్రార్థించిరి. కొందఱు చావుధైర్యముతో నవ్వులాడిరి. కొందఱు విషయరహితముగ దూషణవాక్యములాడిరి. సూర్యుఁడు నిప్పులచెండువలె దిఙ్మండలమునఁ దోఁచెను. అంతకంతకు నరుణకాంతి తగ్గి తీక్ష్ణత హెచ్చుచుండెను. ఖడ్గముల మొలలలోఁ దోపి యిత్తడికట్లువేసిన తుపాకులఁ బట్టి మొలచుట్టును మందు కొమ్ములు తోలుసంచులు వ్రేలాడఁ గొందఱు ఖైదీలవద్దకు వచ్చిరి. జమాదారుని సెలవుచొప్పున ఖైదీలను బోటిమీఁదికెక్కించి పడనెట్టునది వీరే. శ్రీరంగ పట్టణమునుండి వెంటవచ్చినవా రీ ఘోరకార్యమును జేయరు. ఏతాదృశ క్రూరకార్యము లవలీలగఁ జేయఁగలవా రిప్పుడు వచ్చిననాయకులు. వీరు కులమువలనఁ జెంచులు. సుల్తానుని ఘోరాజ్ఞల నిర్వర్తించుటకు యమదూత సదృశులైన వీరికక్షలను జను లిప్పటికిఁ జెప్పికొందురు.

జమాదారుఁడు వచ్చి బయలుదేఱుఁడని చెప్పెను. అందఱును గమ్య స్థానము చేరిరి. త్రోవలోఁ గొంద ఱేడ్చిరి కాని యిట్టియేడ్పు లాచెంచు లిడి

పఱ కెన్నో వినియున్నవారు కావునఁ గర్కశులై జాలినొందక బలవంతముగ నీడ్చుకొనిపోయిరి. హార్బర్టునే మొదటఁ జంపవలెనని చూచిరి గాని జమాదారుఁడు వలదని చెప్పినందున మఱియొకనినిఁ బట్టికొని బోటిపై కెక్కించిరి. కసాయివాని శాలకుఁ గొంపోఁబడు గొఱ్ఱెకుంబోలె నతనికిఁ బైప్రాణములు పైనిఁబోయెను. అక్రూరకిరాతులు వానినిఁ బడఁద్రోసి చచ్చెనో లేదోయని వంగి వంగిచూచి చచ్చెనని తెలిసికొనిరి. ఆహా! ఈచెంచులస్థితి నేమని వర్ణింతుము! పరప్రాణాపహరణంబులు క్రీడాతుల్యంబులు. శోకస్వరంబులు నిరంతరశ్రుతి వినోదకరంబులు. శమదమాదయారసంబులు మరీచికాజలప్రవాహంబులు. ఐహికాముష్మికచింతనంబులు గగనారవిందములు. అకటా! నిర్మలాంతఃకరణంబు లవిద్యామలినావృతంబులై యుండునంతవఱకు జనులు పశుప్రాయులు గదా? పశుప్రాయు లననేల? పశువులే యనుటకు సందేహింపఁబనిలేదు. మొదటివాని నట్లు చంపినతరువాత హార్బర్టును గొనివచ్చిరి.

జమా——హార్బర్టూ! మీవాని చావుచూచితివా? నీగతికూడ నదే.

హార్బ——నేను దేనికైన సిద్ధముగనున్నాను. మరణముకొఱకు వేచియున్నాను. మీయిష్టము వచ్చినట్లు చేయుఁడు.

జమా——నిన్నిప్పుడే చంపము. నీతో మాటలాడవలసియున్నది. (నాయకునిఁ జూచి) నాయకుఁడా! ఇక్కడనుండి యుంపఱను దూరముగఁ దీసికొని పొమ్ము. హార్బర్టూ! ఇఁక విను. ఇక్కడ నెవరును లేరు లెమ్ము. నన్ను నీవు గుఱుతుపట్టితివా?

హార్బ——నిన్నుఁ జూచినట్లున్నదని యిదివఱకే మీతోఁజెప్పితిని. అయిన నిప్పుడావిషయ మేల? త్వరగఁ జంపుఁడు.

జమా——చంపుట కెంతో కాలము పట్టదు. నీతోఁ జాల వ్యవహారము చేయవలసియున్నది.

హార్బ——నాతో నేమివ్యవహారము? నీ కెన్న డేమి యపకారము చేసితిని?

జమా——జ్ఞప్తికిఁ దెచ్చికొనుము. మీరందఱు బెదునూరిలో నున్నప్పుడు టిప్పుసుల్తానుఁడు వచ్చుచున్నాఁడని తెలిసి మీరు మీసేనాధిపతికిఁ జెప్పితిరి

ఆనాడు నన్నేమంటివో యాలోచించుకొనుము. చెట్టునకు ప్రేలాడఁ గీసెదనంటివి. జ్ఞప్తికి వచ్చినదా ?

హార్బర్టు—ఓహో ! జమాదారు సాహేబవా ! సరిసరి. జ్ఞప్తికి వచ్చినది. మాకు మార్గదర్శకుఁడవై ద్రోహము చేసినవాఁడవా ?

జమా—మీరు మూర్ఖులు. కనుఁగొనలేక వలలోఁ బడితిరి.

హార్బ—అప్పటినుండి నీమనస్సులో నామీఁదఁ గ్రోధము రగులుచున్నదా ! నిన్నుఁజూడ నాకుఁ జింతగ నున్నది. నీయంతరాత్మ ని న్నెట్లు బాధించుచున్నదో యాదేవుఁ డెఱుఁగును.

జమా—ఛీ ! నోరెత్తఁబోకు. నీమొగముమీఁద నుమ్మివేసెదను.

హార్బ—నీయిష్టము వచ్చినట్లు చేయుము. నేను మాటలాడను.

జమా—మీసేనాధిపతి నీవు కలిసి బెదనూరిలో ద్రవ్యము దాచిన దెక్కడ? నాకుఁ జూపుము. నీప్రాణము రక్షించెదను. సముద్రతీరము దగ్గఱలో నున్నది. నీవు మీవారిలోఁ గలియవచ్చును. భయపడఁ బోకుము. చెప్పు. మనమాట లీనాయకులకుఁ దెలియవు లెమ్ము.

హార్బ—ధనము చూపుమని సేనాధిపతిని బలవంతపఱచి, లేదని యతఁడు నొక్కిచెప్ప నతనికి విషము పెట్టి చంపితిరి. మరల న న్నడుగుచున్నారు. ధనములేదు. లేదు. లేదు. ముమ్మాటికి లేదు. లేని దెక్కడఁ జూపఁగలను ? న న్నేల బాధించెదవు ? శీఘ్రముగఁ జంపుము.

జమా—నాలుగురోజులు గడువిచ్చెదను. ఈలోపల జ్ఞప్తికిఁ దెచ్చికొని చెప్పుము. ఇఁకఁ బొమ్ము.

నాఁటితోఁ గష్టములు కడముట్టునని హార్బర్టు సంతోషించెను గాని మరణకాలమింకను రాకపోయెను. అతనిని మిగిలినవారిని నచ్చటనున్న గదిలోఁ బెట్టి తలుపువేసిరి. సాయంకాలమైనది. చీఁకటులు క్రమ్మెను. హార్బర్టు నిరాశ చెంది చింతించుచుండెను. ఆరాత్రి హార్బర్టునకుఁగాని తక్కినవారికిఁగాని కూరుకు పట్టలేదు. నాలుగురోజులు నీతీరునఁ గడచినవి. ఈ నాలుగుదిన

ములలోఁ బ్రతిప్రాతఃకాలమున నొక యాంగ్లేయునిఁ గొండమీఁది కెక్కించి క్రిందికిఁద్రోసి చంపుచువచ్చిరి. నాలుగవదినమున జమాదారుఁడు హార్బర్టు కడ కేఁగెను.

జమా—మూర్ఖుఁడా! ధనమున్నచో టిప్పుడైన జ్ఞప్తికి వచ్చినదా, లేదా? ఆలోచించి చెప్పుము.

హార్బ—నన్ను మాటిమాటికి నేల యడిగెదరు? నిజముగ ధన ముండినట్లైన నాప్రాణములఁ దక్కించికొనుటకేనిఁ జెప్పనా? త్వరగఁ జంపుఁడు. నాకు వరము లొసఁగినంత ఫలము.

జమా—చావన నేమో నీకుఁ దెలియునా? తెలిసికొనెదవు లెమ్ము. నిక్కఁ బోకు.

జమాదారుఁడు నాయకులఁ బిలిచి హార్బర్టును గొండమీఁదికిఁ దెండని చెప్పెను. బోటిమీఁదికిఁ బోవుచు "నాప్రాణసఖీ! అమీ! పోవుచున్నాను. పోవుచున్నాను. భగవంతుఁడా దగ్గఱకుఁ దీయుము." అని బిగ్గఱగ వాక్రుచ్చెను. శిఖరముపై కతని నెక్కించిరి. పార్శ్వమున నాయకులు నిల్చుండి గట్టిగ నతనినిఁ బట్టియుండిరి. అప్పుడు జమాదారుఁడు "హార్బర్టూ! చూడుము. మీవారిగతి యేమైనదో, అగపడుచున్నదా? ఇప్పటికైన బుద్ధి తెచ్చుకొనుము" అనిపలికెను. హార్బర్టు శిఖరముమీఁదనుండి క్రిందికిఁజూచెను. తీక్ష్ణంబులగు సూర్యకిరణంబులు దిక్కులేని యాంగ్లేయ శవంబులపైఁ బ్రసరించుచుండెను. పక్షులు తండోపతండములుగ మూగి ఱెక్కలుకొట్టుకొనుచు నెగిరి మరల వ్రాలుచుచుండెను. ఎముకలు చెల్లాచెదరై పడియుండెను. చొక్కాలు లాగులు రక్తమయంబులై చినిఁగి కొన్ని క్రిందఁబడి కొన్ని ముండ్లపొదల కంటుకొని వ్రేలాడుచుండెను. పక్షులు మాంసపేశి నొకదాని నొకటిమించి ముక్కులతోఁ బొడిచినందున శవములు విచ్ఛిన్నంబులై యుండెను. దగ్గఱ నున్న రాళ్లమీఁదను జిన్నచెట్లమాకులమీఁదను నెత్తురుపడి యెండి కరుడుకట్టి

యుండెను. జమాదారుఁ డున్నట్లుండి యొక పెద్దరాతిగుండును క్రిందికి నెట్టి వది డొల్లుచుఁబోయి యాశవములమీఁదఁ బడెను. పక్షులన్ని యఱచుచులేచి మరల వ్రాలెను. పక్షులమధ్యమున నున్న రెండునక్కలు పొదలలో దూరెను. హార్బర్టున కిదియంత కనఁబడలేదు. అతఁడు శిఖరమునుండి క్రిందికిఁ జూచిన వెంటనే కన్నులు తిరిగి శవములపైనుండి వచ్చిన దుర్వాసన తోఁడుకాఁగ నిదివఱకు దుర్బలుఁడై యుండెఁ గావున మూర్ఛిల్లెను.

---

## ఇరువదిమూఁడవ యధ్యాయము

"చచ్చినాఁడు. లేదులేదు. ఊపిరియున్నది. మూర్ఛిల్లెను. క్రిందికిఁ బడఁద్రోయు మందురా లేదా?" అని నాయకుఁ డనెను.

జమా—కూడదు, కూడదు. ఇటు తీసికొనిరండు. ఎట్లున్నాఁడో చూతము.

హార్బర్టును దెచ్చి రాతిమీఁదఁ బరుండఁబెట్టిరి. చేతితోఁ బట్టిచూచి "వీఁడు దొంగవేషము వేయుచున్నాఁడు. కాదే! నిజముగఁ జచ్చినట్లే యున్నది. మరల శ్వాసమాడుచున్నది. మూర్ఛిల్లెను. వీఁడు మొనకాఁడట. శవమును జూచినవెంటనే పడిపోయెను. ఈపరాక్రమమునకే సుల్తానుఁడు మెచ్చి వీనినిఁ దనకొలువులోనుంచికొనఁ బెనఁగులాడుచున్నాఁడు. ఛూ! (అని మొగమున నుమ్మివేసి) పాఱుఁబోతులు" అని వాక్రుచ్చెను.

"చేయి యంతకంతకుఁ జల్లపడుచున్నది. ఇఁకఁ బ్రతుకఁడు" అని యొకనాయకుఁడు పలికెను.

"చావఁగూడదు. సుల్తానునివలన మనకు మాటవచ్చును. నీళ్లు తెండు. త్వరగఁ దెండు" అని జమాదారుఁ డఱచెను. నీళ్లు తెచ్చి హార్బర్టు మొగము మీఁదఁ జల్లి నోరుపగులఁదీసి బలవంతముగఁ బోసిరి. కాని యతనికిఁ దెలివి రాలేదు. బ్రతుకునాశలేదని యందఱు తలంచుచుండిరి. కొంతసేపటికి యతఁడు నిశ్వాసమొనరించి కన్నులు తెఱచెను. అందఱును సంతోషించిరి. కాని మరల

నతఁడు కన్నులుమూసికొని తెలివి తప్పియుండెను. చుట్టునున్నవారు శక్తి కొలఁది నుపచారములు చేసిరి. కొన్నిగంటలు గడచినతరువాత నతనిదేహము వణఁక మొదలుపెట్టెను. చివర కతితీవ్రముగ సెగలు పొగలు వెడలుభంగి జ్వరము వచ్చెను. జ్వరతాపముచే నెవ్వియో యస్ఫుటవాక్యము లొండు రెండు హార్బర్టునోటినుండి వెడలినవి కాని యెవరికినిఁ దెలియలేదు. తాపము పట్టలేక యతఁ డొక్కసారి బిగ్గఱఁ నఱచెను. ప్రొద్దుగ్రుంకుసమయమైనందున నాంగ్లేయకారాబద్ధులలోనే యొకని నితని నుపచరించుట కుంచి వారు నిజనివాసముల కేగిరి.

వీరు నియమించినవాఁడు బోల్టను. ఆనాఁడు వేఁగినది. మఱునాఁటి దినము హార్బర్టును ఘోరదుర్గమునుండి దూరముగ మఱియొక స్థలమునకుఁ జేర్చిరి. బోల్టను హార్బర్టు ననుగమించెను. తక్కిన ఖైదీలు నిర్దయులచే శిఖరమునుండి త్రోయఁబడి చచ్చిరి. నాలుగుదినము లిట్లు గడచినవి. ఐదవనాఁటి చల్లని సాయంకాలమున హార్బర్టునకుఁ దెలివివచ్చి ఱెప్పలెత్తి చూచెను. ఘోరమర్గమే యింకను మనస్సులో నుండెను. చుట్టును జూచి తాను క్రొత్తస్థలమున నుంటకు విస్మయమందెను.

ఇది యొక విశాలసమప్రదేశము. దీనిలో నొకగోరీచుట్టు కట్టఁబడిన యరుగుపై నితఁడు పరుండఁబెట్టఁబడియుండెను. ఈగోరీపైనున్న పూలదండలిది యొక మహాత్ముని సమాధియని చెప్పకచెప్పుచుండెను. గోరీ కనతిదూరమున శ్యామాధవళితనభోమండలమై యొక మసీదు కనఁబడుచుండెను. ఆమసీదున కన్నివైపులఁ దింత్రిణీతరువులు కదళీపాదపములు నారికేళవృక్షంబులు జొంపము లలరార విరాజిల్లుచుండెను. నానావర్ణ సుమనోశోభితంబులైన లతావిశేషంబులు పూర్వోదాహృతశాఖిశాఖానిచయంబుల నల్లిబిల్లిగఁ బెనఁగొనియుండెను. ఇతర ఫలవృక్షంబులు విచ్చలవిడిగఁ బెరిఁగి యొండొంటితోఁ గలిసి సూర్యాతపంబును జొరనీక భాసమానంబులై యుండెను. శుకశారికలు కిచకిచ ధ్వనులు నిరంతరము సల్పుచు ఖుర్రుమను ననుకరణనాదము సెలంగ,

నొకచెట్టునుండి మఱియొకచెట్టున కెగురుచుండెను. ఆసుందరవనంబునం దాసమయంబునఁ బక్షుల సంకుల ధ్వానంబులు తప్ప మఱియేశబ్దము లేకుండెను, గాని మోటదోలుచు నిర్హేతుకజాయమానానందంబునఁ బదములు పాడుచున్న మనుష్యుని గీతము కర్ణపుటంబుల బడుచు, బొక్కెనలోని నీరు తొట్టిలో వంపఁబడినప్పుడు తజ్జలపాతసంజనితారావంబున నశ్రుతమగుచుండెను. హార్బర్టు జ్వరతాపవిశేషంబునఁ గదలలేక యుండెను. సూర్యుఁడు ప్రతీచీగామియయ్యెను. సాంధ్యరాగంబు వృక్షములపైఁ బ్రసరించి క్షణక్షణమునకుఁ దగ్గుచుండెను. మసీదునుండి యొక పెద్ద యెలుఁగు హార్బర్టునకు వినవచ్చెను. అది ప్రార్థనసేయుటకై ముల్లాను వేయుకేక. ఆచారప్రకారము మహమ్మదీయు లందఱు వచ్చి సాగిలఁబడి, నిల్చుండి, ప్రార్థనలు సల్పినతరువాత నిద్దఱు హార్బర్టును సమీపించిరి. ఒకఁడు ఫకీరుదుస్తులును, మఱియొకఁడు ఖడ్గపాణియై శూరవేషమును దాల్చియుండెను.

శూరు——బహుశః యితఁడు చచ్చియుండును. మన మిదివఱకుఁ జూచినప్పుడు ప్రాణము విడుచునట్లు కనఁబడెను. శవముపైని గప్పుగుడ్డను దెచ్చుట కితని వద్దనుండిన బోట్లను జమాదారునితోఁ బజారున కేఁగెను. జమాదారుఁడు బలవంతపఱచి యతనినిఁ గొంపోయెను.

ఫకీరు——చావలేదు. దేవునిదయవలన నే నిచ్చినమం దిదివఱ కెన్నఁడును వ్యర్థముకాలేదు. ఇతఁడు బ్రతుకును.

హార్బర్టీవాక్యములు విని మాటలాడ నుంకించెను గాని శక్తుఁడుకాక పెదవులుమాత్రము కదలించెను. ఫకీ రతని కాళ్లుచేతులు పట్టిచూడఁగఁ జల్లపడియుండెను. హార్బర్టు ప్రక్కకుఁదిరిగి కన్నులు తెఱచి తన కృతజ్ఞతదృష్టుల చేతనే చూపఁ బ్రయత్నించెను. అతఁడు కన్నులు తెఱవఁగనే ఫకీరు సంతోష నిమగ్నుఁడై యీతీరునఁ జెప్పెను: "యారహీంమాన్! యాసలాం మనుష్యులలోఁ బడినాఁడు. ఇఁక భయములేదు. పరంగీ! నీవు జీవించెదవు. ఆఱుదినముల

నుండి యీవిధమున నుంటివి. శ్వాసము నాసికారంధ్రములయొద్దనే యుండెను కాని, యిప్పుడు హృదయమునకు వచ్చినది. కనుక విశ్వాసివై యుండుము.

హార్బ—షాసాహేబ్ (ఇది మర్యాదావాచకము) మీరు నాయందుఁ జూపిన దయకుఁ గృతజ్ఞుఁడనై యున్నాను. దేవుఁడు మీకు మేలుచేయుంగాక. మీ రెవ్వరో ? నే నెచ్చట నున్నానో, దయయుంచి తెలుపుఁడు.

ఫకీరు—నీబుద్ధి నిప్పుడు కష్టపెట్టకుము. నెమ్మదితో నుండుము. బాలాపుర నివాసియై దైవభక్తుఁడగు షేకుఫరీదుసాహేబుతోఁటలో నున్నావు.

ఖాఁరు—ఫకీరన మిమ్మే చెప్పవలయును. ఈదుష్కాలమున మీవంటి యోగ్యులు కానరారు.

ఫకీ—ఖానుసాహేబ్ ! నాకు వైద్యముమాత్రము తెలియును. లేని పోని మాహాత్మ్యము లున్నవని చెప్పిన నేమికార్యము ? మన మీపరంగినిఁ గద లింపఁగూడదు. నెమ్మదిగ నుండనిచ్చినఁ జెప్పఁగలఁడు.

వారిద్దఱు హార్బర్టును విడిచిపోయిరి. కొంతసేపటికి యెడుగులచప్పు డతఁడు వినెను. ఒకమనుష్యుఁ డతనివైపునకుఁ బరుగెత్తుచు వచ్చుచుండెను. అతఁ డెవ్వఁడు ? బోల్టను. హార్బర్టు బ్రతికి మాటాడునని యతఁడు తలంపలేదు.

బోల్ట—హార్బర్టూ ! ని న్నిన్నిరోజులనుండి భుజములమీఁద మోసి త్రిప్పితిని. ఇప్పు డీనీడక్రిందఁ జేర్చితిని.

హార్బర్టు దుఃఖభరితహృదయుఁడై మాటాడలేక కరసంస్పర్శనము కావించెను. ఆనాఁటిరాత్రి హార్బర్టునకుఁ గొంచెము గంజి యిచ్చిరి. అతఁడు దానిఁ ద్రావి పరుండి నానాస్వప్నములు కనెను. ఆమీ, యిల్లు, వనము, కలల యందు వతనికిఁ గనఁబడెను. తెల్లవాఱుడు లేచి సంభాషింపఁ గలిగినందున నిద్దఱు మాటలాడిరి.

బోల్ట—నీవు మూర్ఛిల్లిపడితివి. నన్ను నీకుపచారము చేయుటకు నియమించిరి. తక్కిన మనవారందఱు చంపఁబడినారఁట. ని న్నిక్కడకు మోసికొనివచ్చి

దిగవిడిచిరి. మొదలు నీచాయ నెవ్వరు చూడలేదు. కాని యిక్కడ నివసించుచున్న ఫకీరు దగ్గఱకుఁదీసి తగినమందు లిచ్చినాఁడు.

హార్బ—అయితే మనవారందఱు వచ్చిరా?

బోల్ట—వారందఱును వాస్తవముగఁ జచ్చిరి. నీ కిప్పు డావిషయ మేల? బుద్ధి చెడిపోవును. దుఃఖము కలుగును.

హార్బ—నాకు భయములేదు. దేవుఁ డనుకూలముగ నున్నప్పు డెట్టిత్రొందఱలు నుండవు.

హార్బర్టు దినదిన మారోగ్యాభివృద్ధి చెందుచుండెను. ఫకీరుదగ్గఱఁ గూర్చుండి పూర్వవీరుల చరిత్రంబులు కథలు వినుచు నతఁడు కాలము పుచ్చుచుండెను. కాని యాతీరునఁ జాలకాలము జరుగలేదు. ఒకనాఁడు జమాదారుఁడు ఫకీరుతోఁగూడి హార్బర్టునొద్దకు వచ్చెను.

ఫకీరు—నాయనా! జమాదారుఁడు నీతో మాటలాడుటకు వచ్చినాఁడు. ఆయనకు సుల్తానుఁడు వ్రాసినయుత్తరము చూచితిని. నీకు హానిచేయఁడు.

జమా—పరంగీ! విను. నీ కేవిధమైన యపకారము మేము చేయఁబూనలేదు. ద్రవ్య మెచ్చటఁ బాఁతిపెట్టిరో చెప్పుమని సుల్తానుఁ డడుగుచున్నాఁడు.

హార్బ—షాసాహెబ్! నీవుసాక్షి. నేను చెప్పుమాటల నాలకింపుము. నామనోగతము దేవుఁ డెఱుఁగును. బెదునూరుముట్టడిలో మాసైనికులు ధనమును గొల్లగొనిరి. కాని నేను మఱికొందఱుమాత్ర మా నీచకార్యమునకు దొరకొనలేదు. నమ్ముఁడు. నమ్మకపొండు. ఎఱిఁగియున్నయెడలఁ బ్రాణము రక్షించికొనుటకైనఁ జెప్పనా?

ఫకీ—నాయనా! నిజము.

జమా—లక్షలకొలఁది నున్నసొమ్మేమైనది? నాకసులతో నిదివఱకు మీదగ్గఱఁ జూచినదానిలో సగమైనఁ గోటలో దొరకలేదే?

ఫకీ—జమాదారుఁడా! ఇదివఱకు వారివద్ద నుండఁగ నీ వెట్లు చూచితివి? (హార్బర్టును జూచి) నాయనా! నీవైనఁ జెప్పుము.

హార్బ — ఆ లజ్జాకరమైనవిషయము నతఁడే చెప్పవలయును. నాకితఁడు విరోధి యైనను నే నారహస్యముల బయల్పఱుపను.

జమా — నీ వేవియో మూర్ఖవాక్యములు పల్కుచున్నావు. పరంగీ! ఇఁకఁ జాలింపుము. ఇదిగో సుల్తానుని యుత్తరము. పాఁతిపెట్టిన స్థలముచూపుము. లేదా, మరలఁ జెఱసాలలోనికిఁ బద. చెప్పితివా, మావారిలోఁ గలియఁ గలవు. చెప్పవా? దుర్గతియే. నీయిష్టము. విచారించికొనుము.

హార్బ — అయ్యో. ఎఱుఁగనని యెన్నిసారులు చెప్పితిని. మావారిలోఁ గలియుట యీజన్మమున నిఁక లేదని నాఁడే నిశ్చయించికొంటిని. నాకు లేనిపోని యాశల నేల పెట్టెదవు? షాసాహేబ్! నీయెదుటనే వాక్రుచ్చితిని. ఇంతకంటెఁ జెప్పవలసిన పనిలేదు.

ఫకీరు — నాయనా! నీ వ్రాఁత ఫల మిటులున్నవి. బెంగుళూరునందలి కారాగృహము నీకొఱకు నిరీక్షించుచున్నది. భగవంతుని దయ చక్కఁగనుండిన నదృష్టవంతుఁడవు. లేనిచో నచిరకాలములోనే మృత్యువువాతఁ బడఁ గలవు.

హార్బ — నేను దానికి సిద్ధముగ నున్నాను. నాప్రాణ ముండువఱకు నిన్ను మఱవను. సాహేబ్! అందఱు నన్నుఁ ద్యజించినప్పుడు నీవు తోడ్పడితివి. నేను బెంగుళూరున కెప్పుడు బయలుదేఱవలెను?

జమా — నీవు నడుపశక్తుఁడవైన రేపే.

ఫకీ — పాప మతఁడు కడుబలహీనుఁడుగ నున్నాఁడు. తప్పునను శిక్ష నేనొందుదునుగాని యతని నింకను గొంతకాల మిచ్చటనుంపుఁడు.

హార్బ — నేను బలహీనుఁడనేకాని సుల్తానుని యాజ్ఞ నిరాకరింపఁ గూడదు. నాకొఱకు నీవేల సుల్తానుని కోపమునకుఁ బాత్రుఁడవయ్యెదవు? నేను బోయెదను. నన్ను జ్ఞప్తియందుంచుము. పరంగీల నెవ్వరైన దూషించినచో నట్టిదూషణమున కర్హులు పరంగీలు కారని తెలుపుము. నాశరీరములో

నసువులుండువఱకు నిన్ను మఱవను. దేవుఁడు కరుణించి నట్లైన మరలఁ కలిసెదముగాక.

ఫకీరు—దేవుఁడు తప్పక నిన్ను రక్షించును.

ఫకీరు సహాయమునఁ గలము కాగితము సిరాబుడ్డి సంపాదించి హార్బర్టు మద్రాసుగవర్నరున కుత్తరము వ్రాసి వీలైనప్పుడు రహస్యముగఁ బంపుమని యతనికిచ్చి వియోగజనితదుఃఖంబుతో బెంగుళూరునకుఁ బ్రయాణమయ్యెను. బోల్టు ననుగమించెను.

జమాదారుఁడు వెంటఁ జనియెను. హార్బర్టువిషయమై సుల్తానుఁడు కడియకొక యుత్తరువు చేయుచుండెను. చివరకు హార్బర్టును మహీశూర (మైసూరు) దేశమునకావలనున్న విపిక్తదుర్గముల యందుంచుట కాజ్ఞ యిచ్చెను. బెంగుళూరిలో మూఁడుదినము లాగి విపిక్తదుర్గముదారి పట్టిరి. బెంగుళూరిలో బోల్టను నిలువఁబడెను. ఈమిత్రవిరహము హార్బర్టునకు దుస్సహముగ నుండెను. జమాదారుహార్బర్టులు శ్రీరంగపట్టణ సమీపమునకు వచ్చిరి. జమాదారుఁ డచ్చట నాగి హార్బర్టువెంట మఱియొకనినిఁ బంపెను. అసహ్యబాధాకరుఁడై యంత్యనిమిషముదనుక దురాశలఁ బురికొల్పుచుండిన జమాదారుఁడును తనకు వదలిపోయినందుకు హార్బర్టు సంతోషించెను. కొన్ని దినములు ప్రయాణముచేసి హార్బర్ట్వాదులు మైసూరుపీఠభూమి దిగి కోయంబుత్తూరు జిల్లాలోని పర్వతములకుఁ బోయిరి. ఈపర్వతములోని దుర్గమే హార్బర్టు యొక్క నివాసమునకు నిశ్చయింపఁబడినది. హార్బర్టు దుర్గముపై కెక్కెను. అచ్చట శీతలవాయువులు మెల్లఁగ వీచుచుండెను. నలుప్రక్కలనుండి సౌరభము వచ్చుచుండెను. లతాగృహములు సొంపైయుండెను. ఆమీఁదఁ బ్రియమైన పుష్ప విశేషంబులఁ గాంచి యుప్పొంగి యచ్చటి నైసర్గికవిలాసమునకు నిర్భరానంద మొంది పరవశుఁడై యుండెను.

---

# ఇరువదినాలుగవ యధ్యాయము

బెదనూరిలో హర్బర్టును విడిచి ఫిలిప్సు బొంబాయికిఁ బోయినవిష యము చదువరుల హృదయములలో నిలిచియుండును. గవర్నమెంటుసభ యందు సేనాధిపతిచర్యలఁ జర్చించిరి. కొందఱు భిన్నాభిప్రాయులైనను మొత్తముమీఁద సేనాధిపతిని దోషిగ నిర్ణయించి యతనినిఁ దత్పదభ్రష్టునిఁ గావించి మఱియొకని నాపనికి నియోగించిరి. నూతన సేనాధిపతి కొద్దిసైన్యము తో బయలుదేఱెను. ఘిరయాకోటకు దగ్గఱగఁబోవుచుండ మహారాష్ట్రులెదిరించి యాంగ్లేయుల నోడించి కారాబద్ధులఁజేసి చాలకాలమునకు వారిని విడిచి పెట్టిరి. ఈవిపత్తు, బెదనూరిలోనైన యాపద, జయమునకుఁ బునఃప్రయత్న ములు సల్పుచున్న బొంబాయిగవర్నమెంటునకు నిరాశ కలుగఁజేసెను. హర్బర్టు తనచేతికిచ్చిన యుత్తరమును ఫిలిప్సు కాంటనునకుఁ బంపెను. కుమా రునియోగక్షేమములు తెలియక దుఃఖితులైయున్న యతనితలిదండ్రులకు నాయుత్తరము కొంతశాంతి నొసఁగెనుగాని, యుద్ధ్యత్సైన్య మధ్యమున హర్బర్టున్నాఁడని, దానివలనఁ దేలుటచే, నామీఁది వ్యాకుల మధికమయ్యెను. తరువాత వచ్చిన వార్తాపత్రికలవలన హర్బర్టు కారాబద్ధుఁడయ్యెనని తెలిసెను. సంధిజరుగుననియు, ఖైదీలు విడిచిపెట్టఁబడుదురనియు నందఱు ననుకొను చుండిరి. 1784-వ సంవత్సరమున మంగుళూరు సంధి కావింపఁబడినది. విముక్తులైన వారి పేరులు ప్రకటింపఁబడెను. అక్కటా! హర్బర్టునామ మా పట్టికయందుఁ గానరాదయ్యె. హర్బర్టు బ్రతికియుండినచోఁ దక్కినవారివలె విడిచిపెట్టఁబడియుండుననియు, నేదో ఘోరవిపత్తు సంభవించి మృతినొందె ననియు, నాశ వదలికొనిరి. తల్లిదండ్రుల సంతాపము చెప్ప శక్యముగాదు గదా! ఆమీమనోవేదన వర్ణింప నేరితరంబు?

ఈశ్వరప్రేరితంబై కాలపరిపక్వంబైన ప్రేమ కేవలకర్మేంద్రియ సంబంధి గాక, యాధ్యాత్మికముగఁ బరిణమించి సన్నిహితాసన్నిహితాది స్థలవ్యవస్థల

కతిరిక్తంబై, యామరణాంతము నిశ్చంచలముగనుండుట యుత్తమపురుషాను భవగోచరంబు. మనోహరపుష్పములఁ జూచినప్పుడును, బ్రమదావనమందు వృక్షాగ్రంబులపై సంచరించు శకుంతకంబులఁ దిలకించినప్పుడును, మఱియు నేత్రానందకర మనోజ్ఞప్రదర్శనంబులు కంటఁబడినప్పు డెల్లను, హార్బర్టును స్మరియించి యామియా విలపించుచుండును. ఫిలిప్పుమాత్రము హార్బర్టు జీవించి యున్నట్టే తెలియుచున్నదని యనుమానముగ మాటిమాటికి నుత్తరములు వ్రాయుచుండెను. నిజము స్పష్టముగఁ దెలిసికొనుటకై యిద్దఱ ఫిలిప్పు పంపెను గాని, వారెంత శ్రమపడినను హార్బర్టుజాడ కనుఁగొనఁజాలరైరి. ఫిలిప్పువ్రాసిన సందేహాస్పదలేఖలు విచారసాగరనిమగ్నులై యున్న హార్బర్టు తలిదండ్రుల యొక్కయు, నామియాయొక్కయు, సుఖము నుపశమింపఁజేయజాలక పోయెను. నాలుగుసంవత్సరములు గడచినతరువాత సెలవుమీఁద వచ్చుచున్నానని ఫిలిప్పు కాప్టనున కొకయుత్తరము వ్రాసెను.

తమ కుమారుని ప్రాణస్నేహితునివలన నతనినిగుఱించి వినుటకు హార్బర్టు తలిదండ్రులు మిక్కిలి యాతురముతో నుండిరి. వ్రాసినప్రకారము ఫిలిప్పింగ్లాండునకుఁ బోయెను. హార్బర్టు జీవించియున్నాఁడనియే ఫిలిప్పున కనేకవిధముల ననుమానముగ నుండెను. శరదృతువునందు మనోహరసాయంకాలమున బీచివుడువనమునకు ఫిలిప్పు బయలుదేఱెను. ఆకాశమునందును వృక్షములపై నరుణకాంతి ప్రసరించుచుండెను. నీడలతిదీర్ఘములగుచుండెను. పండుటాకులు పచ్చగ మార్గమున రాలియుండెను. నానావిధపక్షులు గుంపులు కట్టి యెగురుచు నాచెట్టుపై నాచెట్టుపై వ్రాలుచు నఱచుచుండెను. ఆయుద్యానవాటికయందుఁ గొంచెముదూరము నడువఁగనే యెలిజబెత్తురాణికాలపు శిల్పముకలిగి యెఱ్ఱని యిటుకతోఁ గట్టఁబడిన యొకభవనము దృగ్గోచరంబయ్యె. దానిలోఁ బిల్లలు పెద్దలు పలువురుండిరి. సంగీతయంత్రనాదములు శ్రోత్రపేయములుగ వినఁబడుచుండెను. వయోవృద్ధయై చిక్కిపోయిన యొకస్త్రీ పడకకుర్చీపైఁ గూర్చుండి యుండెను. ఈమె హార్బర్టుతల్లియైన మిసెసుకాంటనై యుండునని ఫిలిప్పు

తలంచి గానస్వరములు శ్రావ్యతరములుగ వినఁబడుచుంటచేఁ గొంచెముసేపు కదలక నిల్చుండి యాలకించెను. ఇఁక నాలస్యముచేయఁగూడదని ప్రఘాణము చేరి గంట నాయించెను. వెంటనే సేవకుఁడు వచ్చెను. "ఎవరో యొక పెద్ద మనుష్యుఁడు మీతో మాటలాడవచ్చినాఁడని యజమానునికిఁ దెలియఁ జేయుము" అని ఫిలిప్పు చెప్పిపంపెను. ఆవిషయము సేవకుఁడు కాంటునకుఁ జెప్పినంతనే యాతఁ డెవ్వఁడై యుండునని యాలోచించి పిల్లలనందఱ మఱి యొక గదిలోనికిఁబంపి భార్యను జూచి "నీవు దుఃఖము నణఁచికొని ఫిలిప్పుతో వర్తింప నోపుదువేని నిచ్చట నుండుము. లేనియెడల నంతర్హితవు కమ్ము" అని పలికెను. మిసెసుకాంటును సహించెద నని మెల్లఁగఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఫిలిప్పునకు స్వాగత మొసఁగుటకై కాంటును బహిర్ద్వారము వద్దకు శీఘ్రముగఁ బోయెను. సేవకుఁడు గుఱ్ఱమును బట్టికొనియుండ ఫిలిప్పు కాంటునున కెదురుగ వచ్చెను. ప్రేమపూర్వకముగ ఫిలిప్పుయొక్క చేయిపట్టికొని "నీపేరు చెప్ప నవసరములేదు. నీకొఱకుఁ బ్రతిదినము నెదురుచూచుచున్నాము. నా కుమారుని ప్రియస్నేహితుఁడైన ఫిలిప్పునకు స్వాగత మిచ్చుచున్నా నని యెఱుఁగుదును. నీవలనఁగదా మాకు హర్బర్టును గుఱించి తెలియుచున్నది" అని వాక్రుచ్చెను. ఫిలిప్పు సంతోషించి "మిసెసుకాంటును నాతో మాటలాడుట కోర్చునా" యని యడిగెను. ఓర్చునని కాంటుచెప్పినందున నిద్దఱు నింటి లోనికిఁ బ్రవేశించి యుచితాసనాసీనులైన తరువాత ఫిలిప్పితఁడేయని చెప్ప మిసెసుకాంటును లేచి, కుమారునిఁబలెఁ గౌఁగిలించి, హర్బర్టుదుఃఖంబున నేడ్చెను. ఫిలిప్పునకుఁగూడ దుఃఖమధికమై వానియంతట నవియే యశ్రుకణములుజారి మిసెసుకాంటును నెత్తఁబోవునప్పు డామె బుగ్గలపైఁ బడెను. కొంతసేపటికి శోక మణఁగినది. ఏడుపును మ్రింగి యామె మెల్లఁగ మాటాడఁ జొచ్చెను. అప్పుడు కాంటును పిలువఁగఁ బిల్లలందఱువచ్చి హర్బర్టును గుఱించి వేలకొలఁదిఁ బ్రశ్నలు వేసిరి. వానికన్నిటికి ఫిలిప్పుచితరీతి సమాధానము చెప్పి హర్బర్టు జీవముతోడనే యున్నాఁడని తనయాశయమును వెలిపుచ్చెను.

రాత్రియైనందున నందఱు భుజించి శయనములం జేరిరి. మిసెసుకాంట నున శోకవిధముగ బరువుదించినట్లుండుటవలన వ్యాకులముతగ్గిన హృదయ ముతో నిద్రించెను.

---

## ఇరువదియైదవ యధ్యాయము

మఱునాఁడు ఫెలిప్పు హేవర్డుగృహమునకు మిసెసుకాంటునుతోఁ బోయి, హేవర్డును మిసెసుహేవర్డును సందర్శించి, సంభాషించి, హర్బర్టు బ్రతికియున్నాఁ డను తనయభిప్రాయమును దెలిపెను. హేవర్డు మొదట నమ్మ లేదు గాని, ఫెలిప్పు కారణముల వివరించినతరువాత బహుశః జీవించియుండిన నుండవచ్చునని తలఁచెను. ఇఁక ఫెలిప్పు నామీనిఁ జూడవలసియుండెను. ఫెలిప్పు వచ్చెనని విని, యతనివలన నెట్టికఠినమైన వార్త వినవలసివచ్చునో యని యామె యతనినిఁ జూడజాలక యుండెను. చివర కామె సమాధానముమీఁద నామె యున్న గదియొద్దకుఁ బోయి మెల్లఁగఁ దలుపుతీసి నగుచువచ్చినందున ముఖ వికాసము హెచ్చి కన్నులసోయగ మధికమై యౌవనవిలాసముతో నలరారు చున్న యా నారీరత్నముం గాంచి 'అమీా! హర్బర్టు నీకుఁ బంపిన లకోటాను దెచ్చితిని. దీనిని నే నతిపవిత్రముగ నెంచి నీ కందఁజేసెదనని వాగ్దానము చేసి యున్నాను. కరుణించి దీనినిఁ బుచ్చుకొంటివేని నాకు సంతుష్టికలుగును' అని ఫెలిప్పు వాక్రుచ్చెను.

అతఁ డుపక్రమించి సంభాషించినతోడనే భగ్నాశయై మొగముమీఁదఁ జేతులు వేసికొని తలవంచి యామె దుఃఖింపసాగెను. ఫెలిప్పుయొక్క వాక్యములన్ని చెవులఁ బడినతరువాత నామీా గాద్గద్యభరంబున మాటాడలేక, తలయెత్తకయే చేయిచాచి లకోటానంది మఱిమఱి యేడువ మొదలిడెను బుజ్జగింపువాక్యములు సాధ్యమైనవఱకు ఫెలిప్పు పలికెను. కొంతసేపటికి శోక ముపశమింపఁగ నామీా తలవంచియే "ఫెలిప్పూ! నీవు చూపినదయకు వంద

నము లాచరించుచున్నాను. సహించి యిఁక నీవు చెప్పుమాటల విందును. ఆల స్యముచేయక పలుకుము." అని కష్టముతో వాక్రుచ్చెను.

ఫిలిప్పు ప్రారంభించి హార్బర్టునుగుఱించిన విషయములన్ని పూసగ్రుచ్చి నట్లు చెప్పెను. శాంతముతో నామీ వినెను. ఫిలిప్పు మెయొక్క ముఖవికా సమును జూడ నిచ్ఛగించెను గాని యతఁడు సమీపించినది మొదలు మొగ ముపైఁ జేతులువేసి తలయెత్తకుండుటచేఁ గాంచఁ జాలఁడయ్యెను. ఫిలిప్పు యొక్కమాటల వినినతరువాత నామెకంటినుండి యొక యశ్రుకణము జారి చేతివ్రేళ్లసందుగుండ బయటికివచ్చి మీఁజేతిపైఁ బ్రసరించెను. వెంటనే మఱి కొన్ని బాష్పములు జొటజొట కారెను. ఆమె నిశ్చలచిత్తయై దేనినో ధ్యానించుచున్నట్లు కనఁబడెను. ఆమె పెదవు లల్లనల్లనఁ గదలెను. ఈమె భగ వంతునిఁ బ్రార్థించుచున్నదని ఫిలిప్పు గ్రహించి నిశ్శబ్దముగ లేచి చప్పుడు కాకుండఁ దలుపుతీసి బయటికిఁ బోయెను. ఆమీనిఁ జూచి నాలుగుమాటలైన నాడితినని సంతృప్తి యతని కుండెను.

ఆమీ యెట్లుప్రవర్తించునో కనిపెట్టి సహాయమొనర్చుటకై తలుపు వద్ద వేచియున్న మిసెసుకాంటను ఫిలిప్పును గలిసికొనెను. ఇద్దఱును హేవర్డు కూర్చుండిన గదిలోనికిఁ బోయి హార్బర్టు జీవించియున్న విషయములనుగూర్చి మాటలాడుచుండిరి. హేవర్డునకుఁ దట్టినసంశయములఁ జాలవఱకు ఫిలిప్పు తీర్చుచుండెను. ఆమీ గడియనే పాతీరున నన్యవిషయపరాఙ్ముఖయై చింతించి చింతించి ఫిలిప్పింకను దనగదిలో నున్నాఁడనుతలంపుతోఁ గన్నులు తెఱవక యతనిని సంబోధించి హార్బర్టునుగుఱించి మఱికొన్నివిషయము లడిగెను. కాని ప్రత్యుత్తరము రానందున విస్మయంబంది కన్నులమీఁది చేతులుతీసి తల యెత్తఁగ ఫిలిప్పు కానరాఁడాయెను. అతఁడు శ్రమపడి తనకు లకోటాయం దిచ్చినందు కామీ కృతజ్ఞురాలై యుండెను. మఱి తనప్రియునివ్రాలు వీక్షింప వలయునని లకోటాను విప్ప సాహసించెను గాని, చేతులు వచ్చినవికావు. విప్పఁబోవునప్పుడు శరీరము కంపించెను. భయము హెచ్చెను. మృతినొందిన

యతనిలిఖితములఁ దిలకించినప్పుడు మనమనస్సుల నెట్టితలంపులు పుట్టవు? “అక్కటా! ఈయక్షరములు వ్రాసినహస్తము శీతలమై నశించి పృథివీ భూతంబునం దైక్యమై యదృశ్యంబయ్యెఁగదా? కటకటా! ఈసంకల్పంబులఁ గలిగియుండిన మన స్సాత్మేంద్రియావచ్ఛిన్నమై వాయ్వంతరాళంబున లీనం బయ్యెఁగదా” అని చిత్తము పరితపింపక మానదు. అమృతుఁడే పరమాత్మం డయ్యెనేని యెన్ని పూర్వకృతంబులు! ఎన్ని సంభాషణంబులు! ఎన్ని యనురాగచిహ్నంబులు! జ్ఞప్తికివచ్చి విషాదాంబుధి ముంచివేయును? ఆస్మృతి యెంత పవిత్రముగ భావింపఁబడును? ఆమెకి ఫిలిప్పిచ్చిన లకోటా యమూల్యమైనది. దానిలోఁ జిన్నబరిణయు నొకయుత్తరము నుండెను. బరిణిలో హార్బర్టుయొక్క ముద్రిక యుండెను. ఉత్తరము సాభిప్రాయముగాను సధైర్యముగను సకారణముగను సానురాగముగను సపవిత్రతగను వ్రాయఁబడినది. వ్రాయునప్పు డాయన యెంత వ్యాకులపడెనో, చదువునప్పు డీమె యంత విహస్తము నొందెను.

“పొందుమని పలువురు నిన్నుఁగోరు నుచితావస్థను నీవు నిరాకరింపవలదు” అని యుత్తరమున నొక్కి వక్కాణింపఁబడిన వాక్యములయందలి యభిప్రాయమును న్యాయైకబుద్ధితో గ్రహించి యాధ్యాత్మికమైన యనురాగబంధము మఱియెక్కువ దృఢముకాఁగఁ గన్నీరువిడుచుచు లేచి నిలువంబడి సాంద్రోద్యానవనంబు కనులంబడఁజేయు విశాలగవాక్షమునొద్దకుఁ బోయెను. అట్లశ్రుపూరితనయనయై నిర్మలాంతఃకరణయై పవిత్రతాధిష్ఠాన రమణీయవదనయై గవాక్షముదగ్గఱ కేఁగునప్పుడు ఫిలిప్పు చూచియుండినచో, నా యువతీతిలకము స్వర్గమునుండి దిగివచ్చి మర్త్యసంసర్గముచేఁ బ్రాపంచిక దుఃఖములకు లోనైన దేవకన్యకయో యని నిజహృదయ పీఠి న్నెలకొల్పి యారాధింపకమానఁడు. ఆనాఁడు వారియొద్ద సెలవుతీసికొని ఫిలిప్పు తనయన్న యింటికేఁగెను. (ఈతఁడు హిందూదేశములో నుండఁగనే తల్లి మృతినొందెను.

తండ్రి యంగసంబంధార్థ్వమే చనిపోయెను. అందువలన నన్ను గృహాధిపతి యాయెను.)

---

## ఇరువదియాఱవ యధ్యాయము

ఫెలిప్పాదినము మొదలుకొని హార్బ్రుస్ పేషన్ల గృహంబులకు మాటి మాటికి వచ్చుచుండెను. ఒకనాఁడశ్వమున నారోహించి హార్బ్రుస్ యొక్క గృహమును సమీపించుచుండఁ గన్గృహముపుండి యత్యంత శ్రావ్యంబై మాధురీధుర్యంబైన కలస్వనంబు వినంబడెను. అది స్త్రీస్వరమని యతఁడు గ్రహించెను. తదాకర్ణనమునఁ బరవశుండై యాపాటకత్తెపై మిగుల నాదరణము కలవాఁడయ్యెను. హార్బ్రస్టుయొక్క పోలిక గలిగి నాతిహ్రస్వయై నీలనేత్రంబులు శోభిల్ల, ధూసరకేశంబు లంసభాగంబుపైఁ బడి సుందరవదనం బున కొకవింతసోయగము నొసఁగ, విలాసవతియైన యొకకన్య నతఁ డంతకుఁ బూర్వము హార్బ్రస్టుగృహమునందుఁ జూచియుండెను. ఆమెయో లేక యామెయో, యీపాటకత్తెగా నుండునని తలఁచి యచ్చటికిఁ ద్వరగఁ బోయెను. ఔవురే! హార్బ్రస్టుయొక్క పోలికగల విలాసవతియే యా గాయనీ మణిగ నుండెను.

వస్తువులు సందేహాస్పదములగుచుండ సత్పురుషులయంతఃకరణప్రవృత్తులు ప్రమాణమని కాళిదాసుఁడు చెప్పినవాక్యములు యథార్థములు. ఫెలిప్పచ్చటఁ గూర్చుండి యాకంఠనాదమును గుతూహలముతో వినెను. హార్బ్రస్టు యొక్క పోలికగలిగిన విలాసవతియని చెప్పుటచే నాయువతి హార్బ్రస్టుయొక్క సోదరియని వేఱుగఁ జెప్పఁబనిలేదు. ఫెలిప్పానిమిషమునుండి యామెయందుఁ బ్రీతికలవాఁడై పిలంచేసికొని పలుమాఱామెగానమును వినుచుండెను. ఆమెయుఁ దనమీఁద ఫెలిప్పునకుఁ గల ప్రేమను గ్రహించి యతఁడు పాడుమని కోరినప్పుడెల్లఁ బాడుచు నతనిని సంతోషపఱచుచుండెను.

వీ రెద్దఱిమనస్సులయందు జనించిన యనురాగాంకురము నామెతలిదండ్రులు త్రుంపక వర్ధిల్లఁజేసిరి. ఇవ్విధమునఁ గొన్ని దినములు జరుగఁ దన మనోమార్గములు నామె మనోమార్గమును జాలమట్టున కేకీభవించినట్లు ఫెలిప్పు కనుఁగొనెను. ఆమె పేరు "ఎలీనా". ఆమీ, ఎలీనా, ఫెలిప్పు వీరు మువ్వురు కలిసి యనేకపర్యాయములు బీచివృడువనములో విహరించిరి. హిందూదేశములోని యుద్ధవిషయములను దా నొనరించిన సాహసకార్యములను ఫెలిప్పు చెప్పునప్పు డందఱికంటె నెలీనా యెక్కువ యాసక్తితో వినుచుండెను.

కాలము జరిగినకొలఁదిఁ, ఫెలిప్పు ధైర్యశీలము లెలీనాకు, నెలీనాసద్గుణములు ఫెలిప్పునకు విదితము లయ్యెను. దినములు వారములు నెలలు గడిచినవి. సంవత్సరము దాఁటినది. ఎలీనా ఫెలిప్పుల యనురాగాంకురము పెద్దదై పల్లవితమై, కుసుమితమై, ఫలితమైనది. ఫెలిప్పు నిజాభీష్టము లెలీనాయొక్క తలిదండ్రుల కెఱిఁగించెను. వా రెలీనామనోవృత్తి మొదటినుండి కనిపెట్టియున్నవారు కావునఁ బరమానందముతో ఫెలిప్పుయొక్క కోరిక నంగీకరించిరి. ఎలీనా ఫెలిప్పులకు వారి యాచారప్రకారము వివాహము జరగెను. హిందూదేశ యుద్ధరంగములయందు సంపూర్ణఖ్యాతినిఁ బొందవలయునను నభిలాష ఫెలిప్పునకు మిక్కిలిగ నుండెను.

ఈవిషయ మతఁడు కొంటనునకు నతని భార్యకు నప్పుడప్పుడు చెప్పుచు వచ్చెను. వివాహమైన తరువాతఁ గొలఁదిదినములలోనే చెన్నపురి రాజధాని యందలి సైన్యములో "మేజరు"అనుబిరుదము నింగ్లాండునందుండియే ధనవ్యయముతో సంపాదించెను. మేజరు బిరుదము ప్రకటింపఁబడినతోడనే పత్నీసమేతుఁడై ఫెలిప్పు భరతఖండమునకు బయలుదేఱెను.

హిందూదేశము, నచ్చటి యుద్ధములు, జానపదులు, కాననములు, వన్యమృగములు, మృగయావిహారములు, పవిత్రనదీప్రవాహంబులు వీనిని గుఱించి ఫెలిప్పు సంవత్సరమునుండి చెప్పినకథల వినివిని యాదేశరంగమున

నటింపవలయునని ప్రజ్వలితమనస్కుఁడైన వీఁడొక్కఁడు హేవర్డు కుటుంబమున నుండెను.

ఇతఁడు హేవర్డు కుమారుఁడు. ఆమీసోదరుఁడు; ఇతని పేరు చార్లెసు హేవర్డు. వలదని తలిదండ్రు లెంత బ్రతిమాలినను నిజసంకల్పము వదలక ఫిలిప్పువెంటఁ జన నతఁడు కృతనిశ్చయుఁడయ్యెను. చార్లెసువిషయమై శ్రద్ధ వహించి కాపాడెదనని ఫిలిప్పు చెప్పినందున హేవర్డు మిసెసు హేవర్డులకు మనస్తాపము కొంత తగ్గెను. సోదరవియోగమున కామీదుఃఖించి హార్బర్టునకు వలెనే, చార్లెసునకుఁగూడ భరతఖండమే శ్మశానభూమి యగునని తలఁచెను గాని, ఫిలిప్పుయొక్క వాక్యములవలన ధైర్యము తెచ్చికొనియెను. అశ్రుపూరితనయనములతోడ, గద్గదస్వరంబులతోడ, విషాదముద్రాంకితముఖంబులతోడ వెంటవచ్చిన స్వజనంబుల వెనుకకంపి మాతృదేశతీరంబు వదలి యెలీసా, ఫిలిప్పు, చార్లెసులు భరతఖండాభిముఖులై పోయిరి.

ఇఁక శ్రీరంగపట్టణవార్తలఁ జూతము. కాశీమాలి యుద్యోగములోఁ బ్రవేశించి యాఱుమాసములయ్యెను. ఆయాఱుమాసములలో నుద్యోగవిధుల ననుసరించి శ్రీరంగపట్టణమువిడిచి యనేకప్రదేశములకుఁ బోయి శ్లాఘాపాత్రముగఁ గార్యములు నిర్వర్తించెను.

నైజాము సుల్తానునికి రాయబారముంపునని ఖానుఁడు దర్బారులోఁ జెప్పిన విషయమును జదువరులు జ్ఞప్తియందుంచుకొనియుందురు. ఇంతవఱకును రాయబారము రాలేదు. సుల్తానుఁడు కాలవిలంబనాసహిష్ణుఁడై హైదరాబాదులోని వార్తల నరసిరమ్మని కాశీమాలినిఁ బంపెను. తనకంటె నెక్కువ యనుభవముకలిగినవృద్ధు లుండఁ దన నాపనికి నియోగించి నందుకు సంతుష్టుఁడై సుల్తానుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడనైతినని తలఁచి యత్యంతకుతూహలముతో హైదరాబాదునకు బయలుదేఱెను. త్రోవలో నున్న స్వగ్రామమునం దొకదిన మాగి తల్లియొక్క యోగక్షేమములారసి మరల బయలుదేఱి గమ్యస్థానము చేరెను.

అచ్చట మూఁడుమాసములుండి నైజాముయొక్క యభిప్రాయములను గ్రహింపఁగడఁగెను. ఒక పెద్దమనుష్యుఁడు రాయబారిగ నేర్పఱుపఁబడియెనని యొకదినమునను, నాంగ్లేయులతో సంధి కొడంబడెనని మఱియొకనాఁడును బరస్పరవిరుద్ధవార్తల వినివిని "అలీరీజా" యనునతఁడు రాయబారిగ నియమింపఁబడెనని చివరకు నిజము కనుఁగొనెను. కనుఁగొని యతనివద్దకుఁ బోయి తాను వచ్చినకార్యమును, సుల్తానునియభీష్టము నతనికిఁ జెప్పెను. నైజాము రాయబారము సుల్తానుఁడు కోరినప్రకారమే యున్నదని 'యాలీరీజా' నుడివెను.

కాశిమాలి తిరిగి బయలుదేఱి స్వగ్రామమునకు వచ్చెను; తాను నాఁటిన చెట్లను, దంద్రి గోరీని వీక్షించి యానందమునొందెను. అమీనాఖానుల గుఱించి తల్లియడిగిన ప్రశ్నలకన్నిటికి వారు సురక్షితులుగ నున్నారని మాత్రము ప్రత్యుత్తరము చెప్పెను. తరువాత నతఁడు శ్రీరంగపట్టణము చేరి హైదరాబాదులోఁ దా నరసివచ్చిన వార్తల సుల్తానునకు విన్నవించెను.

---

## ఇరువదియేడవ యధ్యాయము

కాశిమాలి తెచ్చినవార్తకు సుల్తానుఁ డత్యుత్సాహమునొంది 1788-వ సంవత్సరములోఁ బ్రావృట్కాలావసానమున మలబారు నాయరులమీఁదికిఁ గొంతసైన్యమును బంపెను. ఆసైన్యము నాయరులఁ జక్కాడుచుండఁ దాను గూడ 1789-వ సంవత్సరము జనవరినెలలో యుద్ధసన్నద్ధుఁడై పోయి వారిని మూలముట్టుగ మర్దించి శరణాగతుల ముసల్మానులుగ నొనర్చి స్వసైన్యంబుగఁ గోయంబుత్తూరున కేఁగెను. హైదరాబాదునుండి రాయబారి వచ్చి "పరంగీల నాశమునకు టిప్పుసుల్తానునకు నైజాము యావత్సైన్యముతో సహాయము చేయును" అని వ్రాయఁబడిన ఖోరాను సుల్తానుని కిచ్చెను. సంధిపొసఁగినందుకు సుల్తానుఁడు పరమానందముచెంది సంధియొడంబడికలనుగుఱించి మంత్రులతో నాలోచించెను.

నైజాముతో వివాహసంబంధము కలుగఁజేసికొనవలయునని సుల్తానున కొక కోరిక కలదు. సమయమునకై వేచియుండెను. మహారాష్ట్రులచేతను బరంగీలచేతను బాధితుఁడై యిప్పుడు సంధికి వచ్చినందున నభిలాషతీర్చికొనుటకు యుక్తకాల మిదియే యని తలఁచి మంత్రులలోఁ గొందఱు వారించినను వినక స్వాభిప్రాయమును నతఁడు రాయబారికిఁ జెలిపెను. హీనవంశసంజాతుఁడై గర్వసంస్తంభుఁడైన యితనికి రాయబార మంపుటయే నైజాముయొక్క లోప మనియు నితనికోరికవినిన నుత్తమాన్వయుఁడైననైజాము సంధినుండి విముఖుఁడగు ననియు నతఁడు గ్రహించినవాఁడయ్యు, నప్పుడు ప్రత్యుత్తరముచెప్పక సుల్తానునియాజ్ఞ నైకొని హైదరాబాదునకుఁ బోయెను. నైజా మీవిషయము విని క్రోధగ్రస్తమానసుండై సుల్తానుఁడు తిరిగి రాయబారముపంప దానిని నిరాకరించి యాంగ్లేయులతో సంపూర్ణమైత్రి వాటించి 1768-వ సంవత్సరపు సంధిప్రకారము మైసూరును జయింప వారినిఁ దర్వరపెట్టెను.

రాయబారులు తిరిగివచ్చి నైజామునయొక్క నిరాకరణమును దెల్పిరి. సుల్తానుఁడు మదాంధుఁడై "కొజ్జావలె జనానాలోఁ గూర్చుండి హుంకార మిచ్చెడు నైజాము మనశౌర్యమును జూచి యాశ్చర్యమందునుగాక. అభీరువు తోఁడు మన కవసరములేదు." అని సరోషముగఁ బలికి సైన్యమున కుద్రేకము కలుగఁజేసెను. ఆసమయమునఁ బరమోత్సాహముతో నుండినసైన్యము చెన్న పట్టణముమీఁదనో హైదరాబాదుమీఁదనో పడి ధ్వంసముచేయుటకు సమకట్టి యుండును గాని, సుల్తానుని యభిప్రాయ మదికాదు.

మలబారు నాయరులలోఁ గొందఱు పాఱిపోయి తిరువాన్కూరు రాజునొద్దఁ జేరిరి. వారినిఁ దన కప్పగింపుమని టిప్పూ కోరెను. తిరువాన్కూరు రాజు తిరస్కరించెను. సుల్తానుఁడు గ్రుద్ధుఁడై కోయంబుత్తూరినుండి ధ్వజినీసమేతుఁడై తిరువాన్కూరుపైని వెడలెను. శ్రీరంగపట్టణములో మిగిలినసైన్యమును దీసికొని ఖానుఁడు భార్యాసహితుఁడై వచ్చి సుల్తానునిఁ గలిసికొనెను.

అన్యోన్యముఖావలోకనము చేయుటకును, బరస్పరశ్రావ్యకంఠస్వరంబులు వినుటకును, సమయముదొరకక మోహాసహిష్ణులై యున్న యమీనా గాళిమాలుల స్వస్వాభీష్టము లనేకపర్యాయము లీయుద్ధయాత్రయందు సిద్ధించెను. ఇద్దఱహృదయముల నధివసించిన యనురాగము నానాటి కధికమయ్యెను. కోరిక హెచ్చెను. సంతాపం బగ్గలంబాయెను. అహోరాత్రములు వారికి దీర్ఘములుగఁ గన్పట్టెను. సుషుప్త్యవస్థయందుఁ దప్ప తక్కినసమయముల నెల్లప్పుడు నొకరినొకరు తలఁచుచుఁ గృశించుచుండిరి.

సైన్యము తిరువాన్కూరు దగ్గఱకు వచ్చినది. సుల్తానుని దేశమునకును దిరువాన్కూరురాజు దేశమునకు సరిహద్దుగఁ దిరువాన్కూరు మహీపాలునిచేఁ గట్టఁబడిన మహాకుడ్యమును ముట్టడించుట సుల్తానుఁడు చేయవలసిన పనియైయుండెను. ఆంగ్లేయులతోడను దిరువాన్కూరు ప్రభుత్వముతోడను వ్యవహరించుచు గోడను ముట్టడింపక సుల్తానుఁడు కాలము గడుపుచుండెను. ఆంగ్లేయులు, నైజాము, మహారాష్ట్రులు కలిసి మైసూరుమీఁదికి వచ్చెదరని కింవదంతులు పుట్టినవి. యుద్ధము సాగియుండినచోఁ గార్యభరంబునఁ గాళిమాలి యమీనాను మఱచియుండు నేమో కాని, యిప్పుడు పనిలేక యూరకుండుటవలన నెల్లప్పుడామెనుగుఱించియే కలవరించుచుండెను.

వంటవాఁడు క్రమముగఁ బనిచేయనందున శ్రీరంగపట్టణమునుండి ఖానుఁడు జుల్ఫను పిలిపించెను. అతనితో నతనిసోదరికూడ వచ్చెను. జుల్ఫయొక్క సోదరి నమీనా యుదివఱ కెఱుఁగునని చదువరులు జ్ఞప్తియందుంచి కొనియెదరు. ఆమెరాక కమీనాప్రాణములు లేచివచ్చెను. తన రహస్యములు చెప్పఁదగిన పరిచారకురా లమీనా కామెతప్ప నెవ్వతెయును లేదు. ఆమెకు స్వవృత్తాంతమంత యమీనా నివేదించెను. ఆమె హైదరాబాదు వంటి పట్టణములోనుండి జాణతనముగల యువతి గావున, నమీనాహృదయము దుఃఖభాజనముగ నున్నదని యామె సంభాషణవలన గ్రహించెను. వంటకత్తె యెదుటఁ (జుల్ఫసోదరికి) గాళిమాలియొక్క శౌర్యసౌందర్య

కాలము గడచినది. సుల్తానుఁడు సపరివారముగ మహోద్యమును సమీ
పించి యొకచోట విడిసి తత్కోట్యపరీక్షార్థము కాశిమాలినిఁ బంపెను. అతఁ
డుత్సాహముతోఁ గార్యము నెఱవేర్చి గోడయొక్క దుర్బలభాగమును గనుఁ
గొని వచ్చిచెప్పెను. ముట్టడి కాజ్ఞయిచ్చి సుల్తానుఁ డశ్వారూఢుఁడై కాశీ
మాల్యాదియోధులు వెంటరా శౌర్యంబుమీఱ సైన్యపురోభాగంబునఁ బోవఁ
దొడంగెను.

---

## ఇరువదియెనిమిదవ యధ్యాయము

సైన్యము గోడను ముట్టడించెను. ప్రాతఃకాలము మొదలుకొని సాయం
త్రమువఱకుఁ బెనఁగి గోడదాఁటుటకుఁ బ్రయత్నించిరి కాని శత్రునిరోధము
మెండయ్యెను. సుల్తానుని సైన్యమునందనేకులు మడిసిరి. పెక్కురు క్షతదేహు
లైరి. టిప్పునకుఁ జీలమండయందు గాయముపడెను. సైనికులు పరాఙ్ముఖులు
కాఁదొడఁగిరి. గోడను విడిచి యందఱు పాఱిపోయిరి. సుల్తానునకుఁ బూర్ణ
మైన యపజయము సంభవించెను. ఒకయేనుఁగుపై నెక్కించి యతనిని విడిసిన
చోటునకుఁ జేర్చిరి.

నగారా వాయింపఁబడెను. ఈనగారాధ్వనియొక్క గుఱుతు దర్బారున
కందఱు రావలయునని. వ్రణబాధచేతను, బరాభవజనితరోషముచేతను
మాటలు గ్రక్కుచున్న యాసుల్తానుని నెవ్వరు డాయలేరైరి. నగారా
వాయించి నప్పటికి నొక్కఁడైన రాలేదని యతఁడు మఱిమఱి మధ్యందిన
సూర్యునిమాడ్కి నుగ్రుఁడై యుండెను. తప్పదని యధికారు లొకరివెంట
నొకరు నిశ్శబ్దముగ దర్బారులోఁ బ్రవేశించి యేమిముప్పు సంభవించునో
యని యఱచేతిలోఁ బ్రాణములు పెట్టుకొని యథాస్థానముల నొదిగికూర్చుండిరి.

సుల్తానుని కన్నులెఱ్ఱఁగఁ జింతనిప్పులవలె నుండెను; మంటగ నెగయు
చుండఁ గారణముకోఱకో యనఁ బరిభ్రమించుచుండెను. యథాపూర్వముగ

సంపూర్ణనైశ్శబ్ద్యంబు దర్బారు నధివసించియుండెను. సేవకుల గుసగుసలం మాత్ర మప్పుడప్పుడు వినఁబడుచుండెను. ప్రాణబాధ యగ్గలముకాఁగ క్షణ క్షణమునకు సుల్తానుఁడు మడిమను జేతితో రుద్దుచుఁ బొర్లుగీటుచుండెను. అతనికన్నులు దర్బారులోఁ గూర్చుండినవారలపైఁ దిరుగుచుండెను. అతని క్రోధాధిదేవత కొక్కఁడెవఁడో బలికానున్నాఁడని నిశ్చయము చేసికొనిరి గాని, యెవఁడగునో యని తెలియక యెల్లవారును గజగజవణఁకుచుండిరి. బద్ధ సేతువైన ప్రవాహజలంబుంబోలెఁ గోపంబు నిర్గమనములేక ప్రతినిమిషము నకు హెచ్చుచుండెను. ఇంకను మౌనమువహించి యుండినచోఁ గోపము మఱిమఱి హెచ్చి చివరకొక్కపెట్టున బయటికివచ్చి మహాక్షోభము కలుగఁ జేయునని భయముచేనతనిని మాటలాడింపనధికారు లుంకించిరి గాని యెవరికిని ధైర్యముచాలక పోయెను.

ఎట్టకేలకు నాదర్షా నను నతఁడు సాహసించి నిల్వఁబడి "మహాప్రభూ! మీకాలిబాధ దేవుఁడు తగ్గించుఁగాక. యేమైన నాజ్ఞాపించెద రేని సేవకుఁడు సిద్ధముగనున్నాఁడు." అని సవినయముగ వాక్రుచ్చెను.

సుల్తా—నాదర్! మాటలాడుటకుఁ దెగించిన నీధైర్యమును మెచ్చితిని. ఈదిన మధికారులకు దేహము తెలియుటలేదా? కాశిమాలీ! ఏఁడి? ఏల యింకను రాలేదు? లాలాఖానుఁ డెక్కడ?

లాలా—(పడుచుఁ బడుచు వచ్చి) స్వామీ! సేవకుఁడిచ్చటనే యున్నాఁడు. కాశిమాలి కనఁబడలేదు.

సుల్తా—కనఁబడలేదని చెప్పవచ్చితివా? బుద్ధిహీనుఁడ! నీవింకొక నిమిష మగపడకపోయిన నీ వీపుమీఁది తోట నొలిచియుందును. వెదకి కాశి మాలినిఁ బట్టికొనిరమ్ము. చచ్చినను సరే. బ్రతికినను సరే.

లాలా—మహాప్రభూ! గోడవద్దఁ జచ్చిపడియున్నాఁడేమో. ఆగోడ విరోధుల యధీనమునందున్నది. కాశిమాలి నెట్లు తేఁగలను?

సుల్తా—మూర్ఖుఁడ ! నోరు మూయుము. క్షణమైన నిచ్చటనుండకుము. కాళిమాలి నరక లోకమందున్న నూ పట్టుకరావలయును. పిఱికి గాడిదవలె నున్నావు.

ఖానుఁడు—(కన్నీరు ... జార) ఆజ్ఞయేని లాలా వెంట నేను గూడ నేఁగె దను. ఇద్దఱము ...

సుల్తా—రహీమూ ... ! వెళ్లుము. మీయన్వేషణము సఫలమగుఁగాక.

... రహీమూఖానుఁడు లాలాయును గాళిమాలిని వెదకుటకు వెళ్ళిరి. సభ నిశ్శబ్దముగనుండెను. మహాక్రోధసమ్మిళితుఁడైన సుల్తానుఁడు రక్తము కనులఁజూచిన దనుక నీదినమునా ... నోడఁడని యక్కడనున్నవార లెల్ల ననుకొనుచుండిరి.

ఈసమయమందు ... నొక శబ్దము వినఁబడెను. వెంటనే యొకమను ష్యుఁడు నోటిమీఁద ... పెట్టుకొని లబలబ కొట్టుకొనుచు గట్టిగలతో వచ్చి సింహా సనమున కెదురుగ ... మోకరిల్లి నిశ్చేష్టుఁడై యుండెను.

అతని యజ్ఞోపవీతము, మడికట్టుదని పీచువెండ్రుకలు, మొగముమీఁది నిడదలై యెనబొట్టు, ... ఱంక్షోరణి, బట్టకట్టు చూచి యతఁడు శ్రోత్రియుఁడని వారు తెలిసికొనిరి.

సుల్తాను—(గర్జించుచు) ... ఎవరక్కడ బయట? నిద్రపోవుచున్నారా? పశు ప్రాయులై దేహము ... మఱచితిరా? ఈహిందూమతస్థుని మనదర్బారులోని కెందుకు రానిచ్చిరి? దర్బారు వీనివలన నపవిత్రమగునని మీరెఱుఁగరా! (బ్రాహ్మణునిఁ జూచి) నీ వెవ్వడవు? మొద్దువలె నడ్డముగఁ బడితివి. వణఁకు చున్నావు. త్రాగితివా? మాదర్బారులోని కేల వచ్చితివి?

బ్రాహ్మ—మహాప్రభూ! ... మాలకింపుఁడు. మీరు మాతలిదండ్రులు. మీరు మాప్రభువులు. మీరే మాదైవము. నే నొక బీదబ్రాహ్మణుఁడను. నేను ద్రావువాఁడను గాను. రక్షస్సువలె నొకసాహెబువచ్చి మాయిం టిలోఁ జొరఁబడి దోచుకొనుచున్నాఁడు. అతనిపేరు జమాదారుఁడఁట. నన్నుఁ జంప సిద్ధుఁడై యున్నాఁడు. ఏలినవారు కటాక్షించినఁగాని బ్రతుకఁ జాలను.

సుల్తా—(చిఱునవ్వుతో) కటాక్షమా ? వచ్చును లెమ్ము. (అధికారులం జూచి) తక్షణమే వీని నిచ్చటనుండి తొలంగింపుడు. అదిగో ! అయగపడుచున్న యేనుఁగుకాలికి వీని నంటఁగట్టి యపవిత్రముచేయఁబడిన యీస్థలమున నీడ్పింపుడు."

నిరపరాధియైన బ్రాహ్మణునిమీఁద విధింపఁబడిన యాఘోరశిక్షను వినఁగనే యందఱకు నాడులయందు రక్తము తీవ్రముగఁ బాఱెను. నిశ్చేష్టితులై యుండిరి. వారందఱు మహమ్మదీయులే యైనప్పటికి నట్టిశిక్ష విధించుట యన్యాయమని తలంచిరి. "నావాక్యములు చెవులఁబడలేదా ?" యని సుల్తానుఁడు మఱియొకసారి గర్జిల్లెను.

కటా ! దిగ్భ్రమచెందియున్న యావిప్రుని బలవంతముగ లాగుకొని పోయి యేనుఁగుకాలికిఁగట్టి యదలించిరి. కాని స్వామిభక్తమైనదో యామనుష్యుని ప్రాణముతీయుట కిష్టములేకయో యది కదలకపోయెను. అంకుశముతోఁ గట్టిగఁ బొడిచిరి. ఆబాధకుఁ దాళఁజాలక గజము ఘీంకారమొనర్చుచుఁ బరుగెత్తెను. బ్రాహ్మణుని శరీరము రక్తమయమై భగ్నమయ్యెను.

చిత్తము. సత్త్వేతరగుణావృతమై యున్నంతకాలము నిమ్నప్రదేశమునకు జలంబుంబోలె, హింసాది క్రూరకార్యంబులకు నిర్నిరోధముగఁ బోవుచుండును గదా ! అంతటితో నాఁటిదర్బారు ముగిసెను. సుల్తానుని క్రోధానల మాబ్రాహ్మణునిమీఁదుగఁ బోయెను. "అతఁడు రాకయున్న మనలో నెవరిపైఁ బడి యుండునో ! ఆయన కట్లు భగవంతుఁడు వ్రాసిపెట్టెను గాఁబోలును. ఎవరు తప్పింపఁగలరు ?" అని యనుకొనుచు నధికారులందఱు కొలువుకూటము విడిచి స్వస్వస్థానములకు సురక్షితముగఁ బోయిరి. దర్బారు ముగిసినదనుక వారికిఁ బ్రాణములలోఁ బ్రాణములు లేవు.

సాయంకాలము కావచ్చెను. తీక్ష్ణముగ నుండినయెండ క్రమక్రమముగఁ దగ్గిపోయెను. కాశీమాలి మహాకుడ్యసమీపమున నాదినము మధ్యాహ్నమునందు గాయములు తగిలి మూర్ఛిల్లి యచ్చటనే పడియుండెను. కొంతసేపటికిఁ

గన్నులు తెఱచి చూడఁగ శత్రువులు నాతిదూరముననుండి చచ్చినసైనికుల యాయుధములను, వస్త్రాద్యలంకారములను దీసికొనుచుంట కనఁబడెను. స్వీయ ఖడ్గఖేటకశిరస్త్రాణాదులు స్మృతికిరాఁగఁ బార్శ్వములయం దతఁడు చూచెను, గాని కానవచ్చినవి కావు. శత్రువు లిదివఱకే యవియన్నీ తీసికొని యతఁడు మృతుఁడని తలఁచి వదలిపెట్టిపోయిరి. తలపైని నేమియు లేకపోవుటచే సూర్యాతపతైక్ష్ణ్యము కాశిమాలికి దుస్సహమాయెను.

"నీళ్లు! నీళ్లు! దప్పిగొంటిని. ప్రాణములు పోవుచున్నవి" అని యతఁ డఱచెను. అతని మాటల నాలించువా రెవ్వరు? కొంచెముదూరమున శత్రువు లుండిరి గాని వారీ వాక్యముల వినలేదు. విన్నచో వచ్చి పానీయమిచ్చుటకు బదులుగఁ గుంతముతోఁ జచ్చినదనుకఁ బొడిచి పోయియుందురు. ఆకాలమునఁ దద్బాధకంటె నారీతిని మరణమే కాశిమాలికి మేలుగ నుండియుండు నేమో, దగ్గఱ నొకపొదచూచి యతఁడు దానినీడకుఁ జేరఁ బ్రయత్నించెను గాని కదల లేకపోయెను; మాటిమాటికి లేవనుంకించి శక్తిలేక క్రిందఁబడుచుఁ జివరకు మూర్ఛిల్లెను.

అట్లు మూర్ఛనొందిన కాలముననే యతఁడు బాధారహితుఁడుగ నుండెను గాని వెంటనే మరలఁ దెలివిరాఁగ సంకటపడుచుండెను. ఒక్కొక్క ప్పుడు తల్లి, అమీనా, సుల్తానుఁడు, మహాకుడ్యము, శవములు నతనికనులో దృష్టికి గోచరమగుచు, నేవియో యస్ఫుటవాక్యములు పలుకుచుండెను.

అటుపొరలి యిటుపొరలి తెలియకుండఁగనే యెట్టకేల కతఁడు పొద నీడకుఁ జేరెను. ఎండవేడిమి పోయి చల్లగాలి పైని సోకుటచే నతని మస్తిష్కము నందు వేఱుతలంపులు పుట్టెను. సాంద్రచ్ఛాయావంతంబులైన యుద్యాన వనంబులు, శిలాపాతసంజనిత శీకరమనోజ్ఞంబులైన జలప్రవాహంబులు, మధు పానమత్త షట్పదసంయోగవిభాసమానంబులైన కుసుమంబులు, నతనికిఁ గనఁ బడెను. స్వప్నప్రపంచమునం దతనిమన స్సీవిధమునఁ జాలసేపు సంచారమొన

ర్చెను. నికుంజచ్ఛాయాశైత్యంబునఁ దాప ముపశమించుడు స్పృహవచ్చి యతఁడు చుట్టుప్రక్కలఁ దిలకించెను.

ఎచ్చటఁ జూచినను బొతులు రాపులుఁగులు గ్రద్దలు శవములఁ జించి భక్షించుచు నఱచుచు లేచుచు వ్రాలుచు నుండెను. నానావిధ బలిష్ఠవిహంగంబులు సంకులధ్వానంబులు సల్పుచుండెను. వేలకొలఁది కాకంబులు గుమిగూడి వాయుపథంబునఁ దిరుగాడుచు సమయము దొరకినప్పుడెల్ల మాంసశకలంబులఁ గొనిపోవుచుండెను. ఫేరవంబు లారావంబులు గావించుచు మాటిమాటికిఁ బొదలలోనుండి బయటికివచ్చుచు మరల నదృశ్యములగుచుండెను.

సూర్యుఁ డపరాంబుధిం గ్రుంకెను. చీఁకటిపడఁజొచ్చెను. హంసతూలికాతల్పంబుల మేనులు సేర్చి నానావిధ పరిమళద్రవ్యంబులు ఘ్రాణేంద్రియతర్పణం బొనర్చుచుండ, నారీజనంబుల మృదుస్పర్శనంబులును మనోజ్ఞప్రదర్శనంబులును మంజుమంజీరారావంబులును నిర్భరానంద మొసంగ, యౌవనులు గడుపురాత్రి నానాఁడు కాళిమాలి ఘోరాకృతి గలిగి భయావహములగు శవముల మధ్యమున నిస్తులవిషాదంబుతోఁ గడుపవలసివచ్చెను.

బూరలధ్వనులు, భేరీనినాదములు, శత్రువులు కుడ్యరక్షణ మొనర్చుచున్నారని తెలియఁజేయుచు వినవచ్చెను. అంధకారము హెచ్చెను. నగౌకసములు మాంసభక్షణము చాలించి మఱునాఁడు మరలఁ బ్రారంభింపవచ్చు నను నాశతో స్వాశ్రయములందుఁ బ్రవేశించెను. శవములు భక్షింపఁబడుటమాత్ర మాగలేదు. పక్షులు విరమింపఁగనే రాత్రియైనందున నక్కలు బయలుదేఱెను. పొదలలోనుండి నిర్గమించి యటునిటు చూచి మోరపైకెత్తి కీచున నొకటివెంట నొకటి యఱవఁగ నాధ్వని చెవులఁబడుడుఁ గాళిమాలిగుండె నీరయ్యెను చంద్రుఁ డుదయించినందున వెన్నెలలో గుంపులు గుంపులుగఁ బరుగెత్తుచున్న సృగాలంబులను గాళిమాలి స్ఫుటముగఁ జూడఁగలిగెను. వాని యఱపులు మెండయ్యెను. మెదడంతవికలమైయుండెఁ గాన నతనిబుద్ధి కాప్రదేశము నరకలోకమువలెఁ గన్పట్టెను. అచ్చటఁ గర్ణగోచరమగుచున్న యఱపులు

పాపాత్ముల యాక్రందనధ్వనులవలె నుండెను. క్రూరమృగమృగాదనములు స్వేచ్ఛావిహారములు సల్పుచుండెను. కటా! కాళిమాలి యాసమయమున మరణము నభిలషించెనన్న నబ్రమేమి? ఆయుధము దగ్గఱనుండినచో నొక్క వ్రేటున బాధ నివృత్తిచేసికొనియుండును. అట్టిసాధన మేమి లేకపోవుటచే నాకష్టముల కోర్వవలసినవాఁడయ్యెను; దుష్టజంతువులకు భయపడి వీలున్నంత వఱకుఁ బొదలోనికి దూఱెను. అప్పటికినిఁ గొన్నినక్కలు వచ్చి మూచూచి బ్రతికియున్నాఁడని గ్రహించి పోయెను.

నైరాశ్యభావంబునఁ గుంఠితచేతస్కుఁడై పడియుండఁగ హఠాత్తుగఁ బల్యంకికావాహకుల యఱపులును గజకంఠఘంటారావంబులును వినఁబడెను. కాని నిజమో కలయోయని యతఁడు నమ్మలేకయుండెను. వికలమనస్కుఁడగుట నానావిషయంబులం బరిభ్రమించుచున్న యింద్రియములు మాయాసంకలితంబులయ్యెనేమో, యని మనసు సందియము పొందెను. కొన్ని నిమిషములవఱకు నాశబ్దము మరల వినఁబడలేదు. ఆరావాకర్ణనజనితమైన యాశాకిరణ మదృశ్యముకా నారంభించెను. అంధకారబంధురమై నిశ్శబ్దముగనుండిన యారాత్రియం దతిమందముగ వీచుచుండిన వాయువులోఁ దిరిగి పూర్వశబ్దంబులు శవంబులపై విజృంభించుచున్న వృకసృగాలాదిమృగధ్వానంబుల నతిక్రమించి కర్ణగోచరంబులాయెను.

ధ్వని సమీపించినకొలఁది నాతనియాతుర మేమని వర్ణింపవచ్చును? తా నెఱుఁగని బాటసారులో, తన నెఱుఁగని పాంథులోయై యుందురని యతనిమనస్సునకుఁ దోఁపఁ బూర్వోత్సాహంబు క్షీణించుచుం, మరల దుఃఖించుచుండెను. వారిలోఁ గలియవలయునని కోరి లేచుటకు మాటిమాటికిఁ బ్రయత్నములు చేసెను, గాని లేచినపుడెల్లఁ గ్రిందఁబడెను. కటా! ఎట్టి సంకట సమయము! "అయ్యో వారు నన్ను దాఁటిపోవుదురు. నాకు సహాయము చేయువారెవరు? సూర్యకాంతి కాళిమాలిపైఁ బ్రకాశింపదు." అని యతఁడు విలపించెను. నిర్జనంబై భయాధిదేవతా నివాసంబో యననున్న యాప్రదేశం

బున స్వకీయకంఠస్వరమే యతనికి ఘోరముగనుండెను. చివరికైనను శక్తి కొలఁది బెద్దయార్తనాదము వారు సమీపమునకు వచ్చినప్పుడు చేసెదనని యతఁడు నిశ్చయించికొని, లోలోనఁ గుందుచుండెను. గుఱ్ఱముల సకిలింతలును, మాతంగఘంటాని నాదంబులు విస్ఫుటముగ వినవయ్యెను. "నిజముగ వచ్చుచున్నారు. ఖానుఁడో, సుల్తానుఁడో, లేక చంపుటకు వచ్చుచున్న శత్రువులో" యని యతఁ డలుకసాగెను.

అశ్వహేషారావంబులు కడుబిగ్గఱగఁ గర్ణగోచరంబు లాయెను. చెట్లసందున మిణుకుమిణుకుమని వెల్తురుకానవచ్చి వెంటనే పెద్దమంట యయ్యెను. "యాఅల్లా! దగ్గఱకు వచ్చుచున్నారు. వచ్చుచున్నారు. అదిగో కాగడా వెలుఁగుచున్నది." యనియతఁడు తలఁచెను. మనుష్యకంఠస్వరంబులు, ద్విపబృంహితంబులు, తురంగహేషానినాదంబులు, విసిమృత కళేబరములఁ జించి మాంసభక్షణ మొనర్చుచుండిన మృగములు పొదలలో దూరెను. కాగడా వెలుతురును బట్టి వారు వచ్చుచున్నమార్గము కాశిమాలి కనిపెట్టెను. కొన్నినిమిషములైన తరువాత వెలుతురు మిక్కిలి సమీపమునకు వచ్చెను. పల్లకి, యేనుఁగు, కాగడాలు, రౌతులు, బాగుగ గానవచ్చిరి. తనవైపునకు రాక కుడ్యము దారినేఁగుచుండ నావద్దకు రారుకాఁబోలు నని యతఁడను కొనెను. పోవువారు కాశిమాలికి సమీపమున నొకచోనాగి "కాశిం ! కాశిం! హోకాశిం" అని కేకలువేసిరి. ఈకేకలు విని ప్రత్యుత్తరము చెప్పుట కుంకించెనుగాని యతఁడు శక్తుఁడు కాలేదు. "ఇదిగో శవములగపడుచున్నవి. నూఱు విధముల నిచ్చటనే యుండును" అని యొకఁడఱచెను. ఈశబ్దమతని వీనులకు వింతైవినఁబడెను. ఏల ? స్పష్టముగ నది ఖానునిస్వరమే. కాశిమాలి దానిని గుర్తించెను. కాగడాపట్టికొని యొకఁడు దాపునకువచ్చి వెదకుచుండెను. కాశిమాలి కృతనిశ్చయుఁడై "ఓహో" యని యఱచెను. అది దీనస్వరమైనను దగ్గఱనుంటచే వెదుకునతఁడు విని యెవరో ప్రత్యుత్తరము చెప్పుచున్నారని కేకవేసెను. "ఎచ్చట నెచ్చట" నని యందఱు కూడిరి. కాగడాలవెలుంగునఁ

గాశిమాలి స్పష్టముగఁ జూడఁబడెను. ఖానుఁడు గుఱ్ఱము నచటికిఁ బరుగెత్తించెను. గాశిమాలి మాటాడలేక చేయిమాత్ర మాడించెను.

అతనిశరీరమంత రక్తమయమై యుండెను. ఖానుఁడు సుఖమును బట్టఁజాలక యతని పార్శ్వమున స్వకీయజానువులపైఁబడి రోదనముకావించి యెట్టకేలకు శోకభరము తగ్గుడు "మాలోఅలీ! నీకృపవలనఁ గాశిమాలి బ్రతికియున్నాఁడు. ఈదినము నూఱుగురు ఫకీరుల కన్నము పెట్టించెద" నని నొక్కచ్చెను. కాశిమాలి చేయియెత్తఁబోవ "మాటలాడకుము. కాశిమాలీ! ఆయాసపడెదవు. నిన్ను మక్కువతోఁ జూచెదము. కాలుసేతులఁ గదలింపకుము. (బోయీలఁజూచి) తిన్నగ లేవనెత్తి పల్లకిలోఁ బరుండఁబెట్టుఁడు. ఇది అమీనాపాలకి గనుక మెత్తగనుండును లెమ్ము. (పరుండఁబెట్టిన తరువాత) కాశీం! ప్రక్క కుదిరినదా? దిండు తలకుసరిగా నున్నదా? ఏమీ? ఇంకఁ గొంచె మెత్తుమందువా? ఆఁ. ఇప్పుడు సరిపోయినదా? వలదు.వలదు మాటలాడఁబోకుము. నీచిఱునవ్వు నీభావమును జెప్పకచెప్పుచున్నది." అనిఖానుఁడు పలికెను. కాశిమాలి మరల నోరుతెఱువ యత్నింపఁగ "నీళ్లా! యాఅల్లా! ఊదయమునుండి నాలుకయెండి యున్నాఁడు కాఁబోలు. తెండు. తెండు. చల్లనివి" అని ఖానుఁడు కేకలువేసెను. నిర్మలశీతలోదకమును దెచ్చియిచ్చిరి. గిన్నెవెంట గిన్నె యాఱుగిన్నెల నీరతఁడు త్రావెను. దప్పి తీరెను. ప్రాణమునకు హాయికలిగెను. నెమ్మదిగ మోసికొని పోయినయెడల నొకగొట్టె నిప్పించెదనని ఖానుఁడు బోయీల కాసపెట్టెను. "తమదయ" యని పల్యాంకికావాహకులు చెప్పికడుజాగరూకతతో మోసికొనిపోయిరి; అవ్యవధానముగఁ బ్రయాణముచేసినచో వ్రణబాధితుఁడైన కాశిమాలికాయాసము కలుగునని యచ్చటచ్చట నాగుచుఁ బోయిరి.

మహాకుడ్యము నొద్దనుండి శత్రువులు వీరిమీఁదఁ దుపాకులు కాల్చిరి గాని దూరముగనుంటచేఁ దాఁకలేదు. శీఘ్రగమనంబునవీరు శిబిరముచేరిరి. ఖానునిగొల్లెనలోఁ బఱవఁబడిన తల్పంబునఁ గాశిమాలినిం బరుండఁబెట్టిరి.

## ఇరువదితొమ్మిదవ యధ్యాయము

గుంపుగఁజూడవచ్చిన వారందఱు వెనుకకుఁ దిరిగిపోయిరి. మసకలు క్రమ్మిం టచే నతఁడు చక్కఁగఁ జూడలేకపోయినను మొగములమీఁద ముసుఁగులు వేసి కొని తనచుట్టునుండిన యాకారములును దేహమంతట గడ్డకట్టియున్న రక్త మును మెల్లనఁగడుగు మృదుహస్తములును సమీనాపరిచారికలవే యని యతఁడు గ్రహించెను.

---

## ఇరువదితొమ్మిదవ యధ్యాయము

సుల్తానునికిఁ జీలమండయందుఁ దాఁకిన గాయముబాధ హెచ్చెను. కాని దాని నణఁచికొని తనకై కష్టములపాలైన కాళీమాలిం జూచుటకు సుల్తానుఁడు స్వయముగ ఖానుని గుడారమునకుఁ బోయెను. వ్రణవైద్యులు వచ్చిరి. అందఱు నతని బ్రతుకువిషయమై నిరాశ చేసికొనిరి. కాని యిదివఱకు మంగలపని చేసి గాయములకుఁ గట్టులు కట్టుటయందు సమర్థుఁడైన జుల్ఫి దాను మాన్పెదనని చెప్పెను. తక్కినవైద్యులు శక్తికొలఁది సహాయము చేసిరి. కాళీమాలి మాటలాడునేమో యని యించుకసేపు సుల్తానుఁడు వేచి యుండెను. అతఁడు కష్టనిశ్వాసములు విడుచుచు నొక్కమాటయైన నాడ నశక్తుఁడై యున్నందున భగవంతునిపై భారమువేసి సుల్తానుఁడు దర్బారు చేయుటకై ఖానునిఁబిలిచికొని స్వస్థానము సేరెను. సుల్తానుఁడు రాణి లోపలి కేఁగిన పరిచారికలఁ బిలిచి కాళీమాలి కుపచరింప నియమించి ఖానుఁడు వెడలెను. తుపాకులను ఫిరంగీలను శ్రీరంగపట్టణమునుండి యితర ప్రదేశముల నుండి తెప్పించి కుద్యమును మఱియొకసారి ముట్టడింప దర్బారులోఁ గృత నిశ్చయులైరి. మలబారులోనున్న సైన్యమును, శ్రీరంగపట్టణములోనున్న యుద్ధసామగ్రిని, దెప్పింపవలయునని సుల్తానుఁ డుత్తరువుచేసెను. అందఱును యుద్ధసన్నద్ధులైయుండిరి. కాళీమాలికి దాసీజనము నానావిధోపచారములు సల్పుచుండెను. ప్రాణోపద్రవకరమైన గాయములు తగిలి కాళీమాలి యింటికిఁ

చేఁబడెనని వినినప్పటినుండి యమీనాపొందిన సంతాప మింతింతయని చెప్ప శక్యముకాదు. కాని ఖానునియెదుట నాపరితాపము వెలిపుచ్చుట కామె సాహసింపలేదు. ముఖ్యపరిచారకుఁడైన మీరాను సాధ్యమైనంత మట్టున కోదార్ప యత్నించెనుగాని యామెపలుకులు బధిరశంఖారావము లాయెను. ఖానుఁడు గుడారమును వదలి సుల్తానునివెంట నేఁగెనని తెలిసినతోడనే లోపల నుండి పొంగిపొరలివచ్చుచున్న దుఃఖమును బట్టలేక యమీనా వెక్కివెక్కి యేడువసాగెను. కాశిమాలియం దామెకుఁ గల ప్రేమ మీరా నెఱుఁగును గాన, మాటలాడక యూరకుండెను. కట్టకడ కమీనా కన్నుల నీరుతుడిచికొని యివ్విధముగఁ బల్కెను: "మీరాన్! ఖానుఁడు లేఁడు గదా! ఏదియో యుపాయముచేసి కాశిమాలిని నాకుఁజూపవే. నా ప్రాణము కొట్టుకొను చున్నది. ఆలస్యముచేయకుము."

మీరాన్—అమ్మా! నీమాటకు నేనడ్డుచెప్పను. ఆయన కుపచారము చేయు చున్నవారిని బంపివేసి మెల్లఁగ దగ్గెదను. దగ్గువినినవెంటనే నీవు రావల యును. అమ్మా! ఆయన యెప్పుడు కన్నులు మూసికొనియుండును. లేవలేఁడు.

అమీనా—యా అల్లా? నేను జూచునంతలోఁ బ్రాణములు విడుచునేమో కదే? ఆచక్కఁదనము! ఆధైర్యము కలవాఁడు మరలఁ బుట్టునే? ఆహా! ఆటువంటివానినిఁ గొనిపోవ భగవంతునికిఁ జేతులెట్లాడునే?

మీరాన్—త్వరపడుము. క్షణమైనఁ దాళఁజాలను.

గొల్లెన లోనికి మీరానువెళ్లి కాశిమాలి నిద్రించుచున్నాఁడను మిషతోఁ బరిచారికలనంపి యల్లనదగ్గెను. వెంటనే తెరయెత్తి గుండె దడదడ గొట్టుకొను చుండ నమీనా గుడారములోఁ బ్రవేశించెను. కాశిమాలిమరణమును, స్వదుర్దశయును మనస్సునకు వివిధములుగఁ దట్టినందున నింద్రియముల నామె స్వాధీనమం దుంచికొనలేకపోయెను. కాశిమాలిని జూచినయెడల దుఃఖము కొంతతగ్గు ననుకొనెను గాని యది యినుమడించెను. ఆతనికన్నులు మూఁతలుపడి

యుండెను. ఉచ్ఛ్వాసనిశ్శ్వాసము లుండి లేని యట్లుండెను. ముఖమునందు జీవకళక్షీణించి యుండెను. అమీనాకుఁ బరితాపము నిర్భరమగుడు గుండె నీరై యామె క్రిందఁబడెను.

కొంతతడవునకు లేచి యామె మొగముపైఁబడిన వెండ్రుకలు సవరించి కొని దాదియైన మీరానుదాపునఁ గూర్చుండెను. మీరాను కాశిమాలికి విసన కఱ్ఱతో విసరుచు నామెతో రహస్యముగ నిట్లనియెను: "అమ్మా! నిద్రపోవు చున్నాఁడు. మా జుల్ఫు కట్టుకట్టినాఁడు. అతనిహస్తము మంచిదని యెఱిఁగిన వారందఱు ననుచున్నారు. తప్పక గాయము మానును."

అమీనా—అయ్యో! మీరానూ! నాకు బొత్తిగ నాశ లేదు. అయ్యయ్యో!
చూడవే! ఎంతబాధపడుచున్నాఁడే. ఇఁక బ్రతుకఁడు (అని కన్నీరు విడిచెను.)

మీరాన్—కాదు. అది బాధకాదు. ఏమో కలవరపడుచున్నాఁడు. అదిగో చూడు చిఱునవ్వు.

నిజముగఁ గాశిమాలిముఖమున మందస్మితకళిక వికాసము నొందినది. పార్శ్వమున నమీనా మెలఁగుచుండ నుద్యానవనములో విహరించుచుండి నట్లును, జలయంత్రనాళికోద్గతశీకరంబుల శైత్యమనుభవించుచుండినట్లును, గాశి మాలి కలగనుచుండెను. అతని పెదవులు కదలెను గాని శబ్దము బయటికి రాలేదు. అనన్యవిషయాసక్తయై యతనినిఁ జూచుచున్న యమీనాకుఁ దననామమును గాశిమాలి యుచ్చరించినట్లు వినఁబడెను. ఆసమయమున నామెకుఁ గలిగిన లజ్జాసంతోషము లేమని వచింపవలయును? కాశిమాలి ముఖవికాసము మరలఁ దగ్గెను. బొమముడి యాకుంచితం బాయెను. పెద వులు కదల నారంభించెను. అమీనా కాశిమాలిని లేపి మాటలాడింప నెంచెను గాని యేదో యొక్కతలంపు బుద్ధికిఁ దట్టుడు సాహసింపకపోయెను.

నీళ్లు నీళ్లని కాశిమాలి మెల్లఁగ ననెను. మిగిలినమాటలు వినఁబడలేదు. తత్క్షణమే యమీనా శీతలోదకమును రజతపాత్రమునఁ బోసికొనివచ్చి కాశి

మాలి పెదవులకు గిన్నె సానించి యల్లన నీరు నోటిలోనికిఁ బోవునట్లు చేసెను. ఎండియున్న పెదవులకుఁ జల్లనివెండిగిన్నె తగిలి చేరెడునీరు లోనికిఁ బోయినందున బాధ తగ్గెను. భ్రుకుటి, ప్రసారణము నొందెను. ఇంకఁ జేరెడు నీళ్లుపోయుటకు యత్నించుచుండఁ గాశిమాలి కన్నులు తెఱచి యానారీ తిలకంబును తెప్పవాల్పక చూచెను. స్వర్గమున సంచరించు నప్సరశ్శిరోమణి యమృతపాన మొసఁగుచున్నదని యాక్షణమున నతఁడు తలఁచెను. కాని చూచిచూచి యామనోజ్ఞాకృతి దృష్టపూర్వంబగుట జ్ఞప్తికిఁ దెచ్చికొనెను. ఆమెయొక్క మృదుద్రవనేత్రంబులు దయానురాగముల సూచించుచు నతనిపైఁ బ్రసరించెను. "అమీనా" యని యతఁడు పిలువ యత్నించెను గాని యుచ్చరింపలేక పోయెను. హఠాత్తుగ లేవ నుంకించి కొంచెము లేచునప్పటికి దగ్గువచ్చి నోటినుండి నెత్తురు పడుడు, నుడ్డుకుడిచి మరలఁ బరుండెను. అమీనా యాబాధలఁ జూడలేక దిగ్భ్రమచెంది మూర్ఛిల్లిపడెను. మీరాను లేవఁదీసి జుల్ఫును బిలిచి కాశిమాలినిఁ జూచుచుండుమని యామెను లోనికిఁ గొంపోయి యిట్లనెను: "అమ్మా నీవు ధైర్యముతో నుండవలయును. దుఃఖము నొంది మనస్సును కష్టపెట్టికొనఁగూడదు. నీవు మూర్ఛిల్లిపడితివి గదా! ఖానుఁడాసమయమున వచ్చినచో నేమి సంభవించియుండును! ఇట్లే నీవు చేయుదువేని కాశిమాలి నిఁకఁ జూడనీయను.

అమీనా——మీరానూ! కాశిమాలి యిఁక మనలోఁ గలియఁడుగదా! ప్రాణము పోవుచుఁ బోవుచు నున్నది. ఇప్పుడో, మాపో రేపో చచ్చిపోవును. ఇఁక నా బ్రతుకు, చక్కఁదనము——అయ్యో! నన్నుఁ బ్రేమించువా రెవ్వరు? అని విలపించెను.

మీరాను——అమ్మా! అధైర్యపడకుము. భగవంతునియందు భారముంపుము. ఆయనయదృష్టమే నీభాగ్యమైనచో మీకు ముందు చాలసంతోషకరము లైన దినము లుండఁగలవు.

ఈమాట లమీనాఖేదము సహసయింప నశక్తము లాయెను. దినములు గడచినవి. కాళిమాలిగాయము మాన నారంభించెను. స్వకీయపటకుటీరమునకుఁ దీసికొనిపొమ్మని యతఁడు కోరెంగాని ఖానుఁడు వలదని, తన గుడారమునందే యుంచికొనెను. జుల్ఫు, మీరాను, దాదు వీరు ముప్వురు కాళిమాలికి ముఖ్యముగ నుపచారములు సల్పువారు. శక్తియున్నపుడెల్ల వీరితో నతఁడు సంభాషించుచుండెను. గాయములు తగిలిన మొదటినాఁ డమీనా పానీయ మిచ్చుటను గుఱించియు, నామె యోగక్షేమములఁ గూర్చియు, నతఁడు మీరానుతో నప్పుడప్పుడు ప్రసంగించుచుండెను.

అమీనాకు రోజులు కష్టతరముగఁ గడచినవి. ఖానుఁడు కాళిమాలి విషయములు చెప్పునప్పు డామె కుతూహలముమెయి వినుచుండెను. వ్రణములు మానుచున్నవనియు, శీఘ్రముగఁ గుదురుననియు జుల్ఫు చెప్పుచుంటచే నామె మనస్సునకు స్వస్థత కలుగుచుండెను. ఆమె యప్పుడప్పుడు నిశ్శబ్దముగ మునివ్రేళ్లమీఁద నడచి నిద్రపోవునప్పుడు కాళిమాలినిఁ జూచి దారికి వచ్చున్నాఁడని సంతృప్తి చెందుచుండునది. ఈమె రాకపోకలు కాళిమాలి యెఱుఁగడు. నీవు వచ్చితివని యతనికిఁ జెప్పినచో నతఁ డానంద మొంది నీతో మాటలాడుటవలన నుత్సాహము కలవాఁడగును, గాన నీవిషయము చెవుల వేసెద నని మీరా నమీనాతో ననెను. ఆమె కోపపడి "మీరాను! నాకార్యము చెడిపోవును. రోజు రోజు వచ్చి యతనినిఁ గన్నులారఁ జూచుట వలనఁ గలుగుచున్న సంతోషము నాకుఁ దప్ప నితరులకుఁ దెలియదు. సిగ్గు వదలి చెప్పుచున్నాను. విను. ఆతని మనస్సును నే నెఱిఁగియుండియు, నిప్పుడు మాటలాడుట నా చెఱుపునకే. నేను రహిమాన్ ఖానుని భార్యను గానా? ఆతఁడు ముసలివాఁడు గనుక నతనిమీఁద నాకుఁ బ్రేమలేదు గాని గౌరవము లేదా? ఆయన బ్రతికియుండునంతవఱ కతని భార్యనే" అని పలికెను.

మీరా—అమ్మా! నీవు చిన్నదానవు కాని నీబుద్ధి పెద్దది. భగవంతుఁడు నిన్ను రక్షించుఁగాక.

నిశ్శబ్దముగ రహస్యనిరీక్షణ మొనరించుచునప్పు డొక్కొకపర్యాయమమీనాకు బుద్ధి చలించి కాశిమాలియొక్క పార్శ్వమునఁ గూర్చుండవలెనని, యల్లన సంభాషింపవలెనని కోరిక వొడముచుండెడిది. కాని యేదో తలఁపునకు రాఁగ నామె మరలిపోవుచుండును. కాశిమాలి స్థితియు నిట్లేయుండెను. అతఁడు సద్వంశసంజాతుఁడు. గౌరవము ప్రధానముగఁ గలవాఁడు. ఖానుఁడు ప్రతిక్షణము తనకుఁ జూపుచున్నదయ యతనిమనస్సులోఁ నాటియుండెను. కనుక ఖానునికి గౌరవభంగముగ నమీనాతో సరససల్లాపములాడుట కిష్టములేనివాఁడుగ నుండెను. ఒక్కొకసమయమున మనస్సు తిరిగినను ద్రిప్పుకొనుచుండెను. వారములు దాఁటినవి. నెల లతిక్రమించినవి. కాశిమాలి వ్రణములు పూర్తిగ మానలేదు. లేచి కూర్చుండుటకును బ్రాఁకులాడుచు నాలుగడుగులు వేయుటకును శక్తుఁడయ్యెను.

ఎల్లరు నతనియెడల జాలికలిగి యుండిరి. సుల్తానుఁ డప్పుడప్పుడు వచ్చి చూచిపోవుచుండెను. మహాకుడ్యసమీపమునఁ గాల్పఁబడు తుపాకుల మ్రోఁతలు, ఫిరంగుల ధ్వనులు విని కాశిమాలి తానుగూడఁ గలహమధ్యమున నుండవలయు నని యభిలషించుఁ గాని పాపము ! నిల్చుండుటకే దార్ఢ్యము లేదాయెను.

---

## ముప్పదియవ యధ్యాయము

సుల్తానునికిఁ జీలమండయందుఁ దగిలిన గాయము మానలేదు; బాధఁ గలుగఁజేయుచుండెను. తురుష్కదేశమున కితఁడు రాయబారము పంపెను. తద్దేశరాజధానియైన కాన్‌స్టాంటినోపిలునకు రాయబారు లేఁగిరి. అచ్చటి సుల్తానుఁడు శుభలేఖమాత్రము వ్రాసియిచ్చెను; సహాయముచేయుట కొప్పుకొనలేదు. రాయబారు లీనిస్సంతోష వార్తను దెచ్చిరి. ఆంగ్లేయులు, మహారాష్ట్రులు, నైజాము కలిసి సేయుచున్న ప్రయత్నములు టిప్పునకుఁ

గలిసెను. అతని చిత్తము నివియన్ని మిక్కిలి వ్యాకులపఱచెను. ఆజ్ఞాపింపఁబడిన ప్రకారము శ్రీరంగపట్టణమునుండి శతఘ్ని ప్రముఖయుద్ధసాధనములు వచ్చెను. సహాయసైన్య మేతెంచెను. అంతట వారు దుర్గముమీఁదఁ బడి ముట్టడిలుచేసిరి. శత్రునిరోధము లేకపోయెను. సుల్తానుని సైన్యము తిరువాన్కూరురాజ్యమునందు స్వేచ్ఛగఁ బ్రవేశించెను. స్త్రీలనక బిడ్డలనక జను లను సైనికులు చంపిరి; గృహములఁ గాల్చిరి. వేలకొలఁది మనష్యులను నిర్బంధ మొనర్చి ముసల్మానులఁ జేసి మాంసములు తినిపించిరి; యదివఱకుఁ బూజించిన హస్తములచేత గోవుల నప్పుడు నఱికించిరి; నిరయంబునకంటె హేయమైన కారాగృహంబులఁ బడఁద్రోయుటకుఁ గొందఱఁ బట్టికొనిరి. కోపాగ్నియంబు మూర్తీభవించి వేయిచేతులతోఁ బనిచేయుచున్న ట్లుండెను.

అచ్చటి కార్యము పూర్తియైనతరువాత సుల్తానుఁడు దుర్గము నడుగంటఁ బడఁగొట్ట నిశ్చయించెను. గడ్డపాఱలు మొదలగు సాధనములఁ దీసికొని సైన్యము బయలుదేఱెను. శిబిరమునందున్న ప్రతిమనుష్యుఁడు నుత్సాహముతో వెడలెను. అందఱు దుర్గము చేరిరి. సుల్తానుఁడు చిత్రాయుధము గైకొని గోడపై కెక్కెను. క్రింద జ్యోతిష్కుఁడు గణనము చేయుచుండెను.

సుల్తా—షేకూ! (ఇది జ్యోతిష్కునిపేరు) గోడమీఁద దెబ్బ వేయుదునా?

షేకు—స్వామీ! నిమిష మాగుఁడు.

నిమిషమగుదనుక నందఱు నిశ్శబ్దముగ నుండిరి.

షేకు—బిసిమిల్లా-ఇర్-రహ్మాన్-ఇర్ రహీం! మహాప్రభూ! సమయమైనది.

సుల్తానుఁడెత్తియున్న హస్తమును బలముకొలఁది దించి యాయుధముతో గోడనుగొట్టి దిగివచ్చెను. తత్క్షణమే నేలయీనినట్లున్న యాజను లందఱు ప్రారంభించిరి; ఇరువదిమైళ్ల పొడుగునను న్న యామహాదుర్గము నాలుదినములలో నేలమట్టమునకు సరిగఁ జేసిరి. ఈయాపైనతము నెఱవేఱుడు సుల్తానుఁడు నిజరాజధానియైన శ్రీరంగపట్టణమునకు ససైన్యముగ బయలుదేఱి పోయెను.

---

## ముప్పదియొకటవ యధ్యాయము

సైన్యము శ్రీరంగపట్టణము చేరెను. తదాగమనం బిక్రిందఁ జెప్పఁబడు, నొకతెరుఁదప్పఁ దక్కినవారి కందఱకు సానందకరముగ నుండెను. ఖానుని భార్యలలో నొకర్తయగు కుమ్మాబీ జిత్తులమారి మొగమును, గన్నులార్పు నభ్యాసమును గలిగిన యొకదాసితో నిట్లనియెను "సోజక్! (దాసీనామము) చూచి వచ్చితివిగదా. గాయములు పడినవా రున్నారు. ఇప్పటికిఁ జిక్కి యున్నాఁడఁట. నిజమా యబద్ధమా?

సోజక్—అమ్మా! ఆమాట వాస్తవమే. బిచ్చపువేషము వేసికొని యతని యింటిదగ్గఱకుఁ బోయి హైదరాబాదు వలి ఆలీ, బీబీ మరియాం పేరుచెప్పి బిచ్చ మడిగితిని, నీది హైదరాబాదా? యని యడిగి నాఁడు. ఔనని నేను జెప్పఁగ నాలుగు డబ్బులు నామీఁద విసరివేసి నాఁడు; సాలిపోయి యున్నాఁడు. బ్రతుకఁ డనుకొనుచున్నారు.

కుమ్మా—అయ్యో! అయ్యో! నేను వెనుకఁ జూచినప్పు డెంతో ముచ్చటగ నున్నాఁడే. ఎంతలోని కెంతవచ్చెనే. మా ఆయనతోఁ గలిసి సుల్తానుని దర్బారునకుఁ బోవుచుండెను; గవాక్షములోనుండఁ జూచినప్పుడు గుఱ్ఱము మీఁద నెక్కియుండెను. చంద్రబింబము వలె మొగముకళకళ లాడు చున్నదే. అప్పటినుండి యతఁడు నాకన్నులలో మెదలుచున్నాఁడు. సోజక్! కలలలోనైన నతఁడే కానవచ్చుచున్నాఁడు. నా మన స్సతనిమీఁదనే యున్నది.

సోజక్—బీబీ! మగనాలివి గదా! అట్లు మాటలాడుట నీతియా? ఛీ!

కుమ్మా—(మోహోద్రేకముతో) సోజక్! అన్ని చూచుచునే యట్లందు వేమో నాకుఁ బెండ్లి పెట్టాకులైనదని పేరేగాని యేమనుభవించుచున్నాను? నాకు మగఁడేఁడే? ఒక్క ముద్దుమాట చెప్పువాఁడేఁడే? పిల్లలకు మొగము వాచిపోవుచున్నానా లేదా? సంతోషమా చట్టా! ప్రేమ

యెక్కడఁ జేలాలు వేగుచున్నది? ఒకనాఁడైన మగఁడని, నవ్వుమాటలని, నోచుకొని యెఱుఁగనే, ఏనాఁడును సుఖమన్న మాటలేకపోయెను. నిన్నుఁ జూచిన నెంతో ముచ్చటగును. ఇంత చక్కనిమగఁడు. నలుగురు పిల్లలు, నీవు సంతోషముగనున్నారు. బీదదానవే. నిజము. అయితే మాత్రమేమి? సుఖపడుచున్నావు. కావలసినది లేకపోయినతరువాత నెంత భాగ్యముండిన నేమి ఫలము? నాకు నిండనిరువదియైదేండ్లు లేవు. చక్కనిదాననో కాదో, నీవే యెఱుఁగుదువుగదా! నా వ్రాత! చూడు. నావయస్సు నాచక్కఁదనము వ్యర్థము. ఆ ముసలివాఁడు నన్నుఁ జూడనే చూడఁడు. చూచినమాత్ర మేమిలాభము? ఆయనమీఁద నాకుఁ బ్రేమ యెట్లుండును? ఎటు గౌరవింతును? నన్ను దగ్గఱకుఁదీసి ముద్దుపెట్టుకొనువారు లేరైరి.

సోజర్—నీమగఁడే నిన్ను ముద్దుపెట్టుకొనును.

కుమ్మూ—మగఁడా! మొద్దులు. నెరసినగడ్డము వాఁడు: వాని ముద్దు ముక్కలైనట్లే యున్నది, ఇఁక దాఁపను. రహస్యము మాత్రము నైదవచెవి వానికిఁ దెలియనీకుము. బయటఁబడెనా నీ ప్రాణము పోయిన దనుకొనుము. దగ్గఱకు రమ్ము. చెప్పెదను. నా మనస్సతనిమీఁద నున్నది. చక్కనివాఁడు. అతనికన్నులేమే! వానిని ముద్దిడక నిలువఁజాలను. ఇఁకనీకుఁ జెప్పవలసినది లేదు. తెలిసినదా? అపకీర్తికి వెఱవను. ప్రాణమునకైనఁ దెగించితిని. నీవిదియంత యతనికిఁ జెప్పి యిక్కడకుఁ దీసికొనిరమ్ము. లేదా నన్నక్కడకుఁ దీసికొనిపొమ్ము. నీవన్న నాకు స్వతంత్రము గనుక నిన్ని మాటలు చెప్పితిని.

సోజర్—అమ్మా. ఏమి ముప్పు సంభవించునో గదా?

కుమ్మూ—ఇదిగో, ఈమాటలే నాకుఁ జెప్పవల దన్నది. ముప్పులేదు. గిప్పు లేదు. నిమిషమైనను దాళలేకున్నాను. అన్నముముందఱకేఁగినఁ దినబుద్ధి పుట్టదు. ఏదియో పాఱవేసికొని నట్లుండును. కంటినిండ నిద్ర లేదు. ఏమి తోఁపదు పిచ్చిపట్టిన విధముననుండును. అద్దమునఁ జూచినప్పుడెల్ల నీచక్కఁ

దనమడవిలోఁ గాసిన వెన్నెలయయ్యెనని చింత యధికమగుచుండును. ఆయ ననుగుఱించి యెవరేమాట చెప్పినను నాతాపము హెచ్చుచుండును. ఎప్పు డామనోహరుని, జూతునా యని ప్రాణము కొట్టుకొనుచున్నది. ఒక్కొ క్కప్పుడు జీవితము వదలఁదలంపు కలుగును. సోజనూ! ఇంతకంటె నెక్కువ చెప్పలేను. పొమ్ము. ఈబాధ నీవెన్నఁడు పడినదానవు కావు.

సోజన్—అయ్యో! నేనుగూడ నెఱుఁగుదునమ్మ. (అని కన్నులుమూయుచు నిట్టూర్పు విడిచెను.

కుమ్మా—నీవా?

సోజన్—అమ్మా నిజము. ఐయితే యతఁ డిప్పుడు లేడు. యుద్ధములోఁ జచ్చినాఁడఁట.

కుమ్మా—ఇంతకు నొకసారియైనఁ గలిసితిరా?

సోజన్—అమ్మా. దాఁపఱిక మెందుకు. నేనన్నఁ బ్రాణములు విడిచెడు వాఁడు. నేను నతనినిఁ జూడక గడియయైన నుండెడుదానను గాను.

కుమ్మా—సోజన్! నీవన్ని యెఱిఁగినదానవే కనుక, మఱిమఱిచెప్పఁ బనిలేదు. త్వరగఁబోయి యెటులనైనఁ దీసికొనిరమ్ము. నిన్ను మఱవను.

సోజన్—తల్లీ! సెలవిచ్చిన ప్రకారము చేసెదను. ఒంటరిగానున్నప్పుడు సమయము కనిపెట్టిపోదును.

కుమ్మా—ఈలవంగములు మిరియాలు తీసుకొనిపోయి యతనికిమ్ము. చదువు కొనినవాఁడు కనుక వీనియర్థమెఱుఁగును. లవంగములు నేను మోహించితి నని, మిరిములు శీఘ్రముగఁ బ్రత్యుత్తర మిమ్మని తెల్పును. నీవు మిక్కిలి మాటలాడ నవసరము లేదు.

సోజను కుమ్మాబీయొద్ద సెలవుతీసికొనివెళ్లెను. “నన్నుఁ బ్రేమింపఁడా! వలదనునా? అనఁడు. నాచక్కఁదనమును గూర్చి యింతకుఁ బూర్వమే విని యుబ్బిపొంగారుచుండును. మేమిద్దఱము కలిసి యెచ్చటికైనఁ బోవుదుము. ఆఁడువారి మోహమననేమో యతని కప్పుడు తెలియును.” అని కుమ్మా

యాత్మగతముగ ననుకొనుచుండ వెనుకనుండి "అక్కా! కుమ్మాబీ!" యని మెల్లని శబ్దము వినఁబడెను. తిరిగిచూచి "హుర్మత్ బీవా? నేనెవరోయని యులికిపడితిని. కూర్చుండు" మని కుమ్మా వాక్రుచ్చెను. హుర్మత్బీ యుచితాసనాసీనురా లాయెను.

హుర్మ—ఇక్కడకు వచ్చినప్పటినుండి యమీనాను జూచితివా? అక్కా.

కుమ్మా—దాని విషయము నన్నెందు కడిగెదవే. ఆగతిమాలిన ముండను నేను జూడఁ బోదునా?

హుర్మ—నిజమేనే, అక్కా నీవుపోవని యెఱుఁగుదును. ఆ ముసలిముండ కొడుకు మంచిమంచి వస్తువులు తెచ్చి యామెకిచ్చినాఁడని విని చూడఁ బోయితిని. ఏమిచెప్పుదును? అక్కా నీ వేమైన ననుగాని అవి యెంత బాగుగ నున్నవే. ఆ నగలేమే. ఆ చీరలేమే. దాని కులుకు, దాని పగులఁ బాటు. చెప్ప శక్యముకాదు. మన మటువంటి చీరకుఁగాని నగకుఁగాని నోచుకొనకపోయితిమి గదే. ఇట్టె పోయి, యట్టె తెచ్చుకొని దానికేమి సింగారించుచున్నాఁడే, ఆ ముసలివాఁడు?

కుమ్మా—దానిమాటలు చెప్పకువే. నా కడుపులో మండుచున్నది. మనకు రవికలు, చీరలైన ననువైనవి లేవు. ముసలివాని కిదేమి వల్లడే. ఆముండ యేవో మందులు మ్రాఁకులు పెట్టినది.

హుర్మ—ఏమి చెప్పుదునే అక్కా! సొమ్ములు, బంగారు జరీయంచు చీరలు, రవికలునే నన్ని చెప్పలేను. చూచి తీరవలె, బయటి యరుగుమీఁదఁ గూర్చుండి కంసాలివాఁడు బంగారపు టంటలు చేయుచున్నాఁడు.

కుమ్మా—మనము నిజముగఁ జెలివి తక్కువవారము. ఇఁక సహింపఁ గూడదు. కసి తీర్చికొనవలయును.

హుర్మ—మీ అమ్మ యేమేమో చెప్పినదికాని, చేసినది కాదు.

కుమ్మా—న్యాయప్రకారము మగవాని కైదుగురుభార్య లుండవచ్చునఁట. అందువలన నిది యధర్మ మనుటకు మా అమ్మకు వీలు లేకున్నది. అయినను

మీ అమ్మ మఱియొక్కవిధమున సాధించి తీరును. వదలిపెట్టదు. హుర్మత్! అదిగో గవాక్షము గుండఁ జూడుము. పల్లకి వచ్చుచున్నది. మాతల్లియే యై యుండవచ్చును. చూచితివా, మనవాకిటి యెదుటనే యాగినది. ఎదురుగఁ బోవుదము రమ్ము.

ఘల్లు ఘల్లున నందెలు కడియాలు మ్రోఁగ ముసలమ్మ నింటిలోనికిఁ దీసికొనిపోయిరి. ఆమె యుచితాసనాసీనురాలయ్యెను. కుమ్మూబీ హుక్కా యిచ్చెను. అది పీల్చి పొగవిడుచుచుండి "అమ్మాయీ చిక్కియున్నావేమే. నీవు కృశించుచున్నావని నోజను చెప్పఁగఁ జూచిపో వచ్చితిని." అని యవ్వ యనెను.

కుమ్మూ—అమ్మా! కృశింపక యేమున్నది. సవతి తలపై కెక్కి కూర్చున్నది. కంటికి నిద్రరాదు. అన్నము రుచింపదు. నిన్నగాక మొన్న యిట్టెవచ్చిన పోఁటి సమస్త సౌఖ్యము లనుభవించుచుండ మేము దిక్కుమాలినవారివలె నుంటిమి.

హుర్మ—దాని కిప్పు డెన్నో వెలగల వస్తువులు సింగారించినాఁడు. మా మొగముచూడఁడు. మాది చచ్చినచావు, బ్రతికిన బ్రతుకును గాకున్నది. నీవు సహాయముచేసెద నంటివి. మమ్ముఁ గడతేర్చు నుపాయము చూడుము.

కుమ్మూ—దాని చక్కఁదనమునకు ముసలివాఁడు వలఁచినాఁడు. ఏమి చేయుదుము ?

హుర్మ—అమ్మా ! యెవతెయో మంత్రకత్తె యున్నదని యిదివఱకుఁ జెప్పితివి. ఆమె నిప్పుడు రప్పింపుము.

ముసలమ్మ—ఆమె కీవిషయ మింతకుమున్నే చెప్పితిని. ఖానుఁడు పట్టణమును వదలఁగనే యామె తంత్రములు మొదలుపెట్టినది కాని మొన్న జబ్బుగ నున్నదని యెవరో చెప్పిరి.

కుమ్మూ—ఆమె నిప్పు డిచటికి వచ్చునట్లు చేయుము.

ముస — జబ్బుగ నున్నదని వింటిని. వినను వచ్చును. ఇదిగో యీ యుంగర మానవాలుగ నిచ్చి పల్లకి పంపుము. ఎక్కి వచ్చును.

తత్క్షణంబ పల్లకి పంపబడెను. అందఱు మాంత్రికీ సమాగమంబు నిరీక్షించుచు నిశ్శబ్దముగ నుండిరి. పల్లకీవాహక స్వరంబులు వినవచ్చెను. సంభ్రమంబున బహిర్ద్వారమున కేగి యామెను గొనివచ్చి కూర్చుండిరి.

"ఇశక్కో. అల్లా. ఇవి బయటికి రావలసిన రోజులు కావు. పెత్తనము వచ్చినది. ఆయాసము, వగ్గ — అమ్మా, ఏమిచెప్పను? ఒకటా? అయితే కుమ్మాబీ క్షేమమా? హూర్మత్! బాగుగ నున్నావా?

కుమ్మా — ఇదిగో యిట్లున్నాము, పతి ప్రేమలేక, మందులు, మంత్రములు పెట్టి మగవానిని లోబఱచుకొను నుపాయములు లేవా?

మాంత్రికి — ఇంతకే, నాదర్శనము. కష్టములలో గురీనా (మాంత్రికీ నామము) జ్ఞప్తికి వచ్చునుగాని తక్కిన సమయముల రాదు కాబోలు. అమ్మా! నవ్వులకంటిని గాని యేమి కాదు.

కుమ్మా — ఆసాంతము చెప్పెదను వినుము. నా అమ్మ యిదివఱకే చెప్పియుండును. నేననుభవించుచున్న యవమానము, నిరాదరణము, దుఃఖము, భగవంతుని కెఱుక. తలలోనుండి జాఱి క్రిందబడిన పువ్వులవలె వాడిపోవుచున్నాము.

మాంత్రికి — (బుగ్గలనొత్తి, చేయిపట్టిచూచి) అమ్మా నీయందచేయి మిక్కిలి మృదువుగనున్నది. నీ చెక్కిళ్లు మనోహరముగ పద్మములవలె నున్నవి. నీ కాటుకకన్నులు ప్రకాశించుచున్నవి. నీ సౌందర్యమునకు గొఱత లేదు. నీవు వాడిపోవుచుండలేదు.

కుమ్మా — (మొగము గిఱ్ఱున త్రిప్పి) ఈమాటల కేమిగాని సహాయము చేయుదువా? చేయవా? మా సవతిపోటి కృశించిపోవునట్లు మంత్రము పెట్టవలయును.

ఫూర్మ—ఇఁక కాలస్యము చేయఁగూడ దవ్వా, అలా ! అల్లా ! నే నెచ్చటికిఁ బోయినను దలవంపులుగా నున్నది. అమీనా చక్కనిదని యొకరు, ఖానుఁ డమీనామీఁదఁ బ్రాణములు విడుచుచున్నాఁ డని మఱియొకరు, చెప్పుచుండ వినలేక చెవులు చిల్లులు పోవుచున్నవి.

ముస—కరీనా ! మా అమ్మాయిఁ జూచితివి గదా ! నీచేతనైనంతసహాయము చేయక తప్పదు.

మాంత్రికి—చేయుదునుగాని, యొకదాని కనుమానించుచున్నాను. నావలె వీరుకూడ నుపవాసములుచేసి జపములుచేసినం గాని మంత్రము పాఱదు. నడురాత్రియందు యంత్రమువేసి మంత్రోచ్చాటనము చేసినప్పుడు శక్తులు వచ్చి చుట్టును దిరుగుచుండఁ జూచి భయపడకుండ నుందురా ?

కుమ్మా—(అమ్మ గుద్దికొనుచు) నేనుందును. నాకావంతకూడ భయము లేదు. నీ వెక్కడకు రమ్మన్న నక్కడకు వచ్చెదను. గోరీలభూమికిఁగూడ రాఁగలను. లక్షశక్తు లుండనీ.

మాంత్రికి:—నీవు నాకంటె ధైర్యము హెచ్చుగఁ గలదానవు. మంచిది మాటలు చెప్పినట్లుగాదు. చిన్నదానవు. అనుభవములేదు. ఇంతకు భయ పడవు గదా.

కుమ్మా:—అసలు భయములేదు.

ఫూర్మ:—నాకుఁగూడ లేదు. ఎచ్చటికి రమ్మన్న నచ్చటికి వచ్చెదను.

మాంత్రికి:—నా యనుమానము తీఱినది. దీనికి రహస్యస్థలము కావలయును. ఈ యిల్లుపనికివచ్చునా ? ఎవరు రాకుండ నుందురా ?

కుమ్మా:—ఈ యిల్లే మనకుఁ బనికివచ్చును. ఎవరును రారు.

మాంత్రికి:—ఒకవేళ ఖానుఁడు వచ్చునేమో ! ఎవ రెఱుఁగుదురు? ఈ యిల్లు పనికిరాదు. మీ తల్లిగారి యిల్లనుకూలముగ నున్నది.

ముస:—నిజమే మన యింటివెనుకనున్న గదిలో రహస్యముగఁ జేయవలసిన పనులన్ని చేయవచ్చును. అయితే కరీనా ! ఎప్పుడు ? ఇదియంత ?

మాంత్రి:—ఒక నెలదినములు పట్టును. దీనికిఁ జేయవలసిన తంతు విశేషముగ నున్నది. ఆలోచించి నెమ్మదితోఁ బొల్లుపోకుండఁ జేయవలయును. కుమ్మాబీ! హుర్మత్‌బీ! మీరు నెలరోజులు ఫకీర్లకు భోజనము పెట్టుచుండవలయును. మాంసము తినఁగూడదు. చలువ పదార్థములు భుజింపవలయును. నానియమములు సరేకదా! నే నన్నము ముట్టుకొనఁగూడదు. పాలు, పండ్లు తిని జపము చేయవలెను. ఏండ్లు పైనిఁబడినవి. కనుక నిప్పుడింతకష్టపుఁబనులు చేయలేకపోయినప్పటికి మీరు చిక్కులలో నుండుటచేఁ దప్పదని యొడంబడితిని. మీ గంజి త్రావి మిమ్ము మఱతునా? అమ్మా! పోయివచ్చెదను. ఇంటివద్దఁ బనులు నున్నవి.

కుమ్మా:—పోవచ్చును. భోజనముచేసి పొమ్ము.

మాంత్రికి:—అమ్మా! ఒక మెతుకైనఁ దినను. ఈ నిమిషము మొదలుకొని నెలదినములు తంతు పూర్తియగుదాఁక నిరాహారులుండినది యేది పనికిరాదు. పోవలయును.

"మఱచిపోకు. నిన్ను నమ్మినాము" అని చెప్పి ద్వారముదనుకఁ గరీనాను గుమ్మా హుర్మత్బీలు పంపిరి. ఆమె పల్లకియెక్కి నిజగృహముం జేరెను.

ముస:—అన్నమాట కరీనాతప్పదు. మీకు దృష్టితగిలి వేఁకి సంభవించినప్పుడెన్ని తడవలో మంత్రము పెట్టినది. ఆమెకు మహామంత్రాలు తుచ్ఛాలు కూడ వచ్చును. మీనాయన నాతో ననిష్టముగ నున్నప్పు డనేకపర్యాయములు కరీనా మంత్రించి నామీఁదఁ బ్రేమ కలుగునట్లు చేసినది.

కుమ్మా:—అమ్మా! అమీనాను బట్టి రెండుచేతుల నడుమ నొత్తివేయవలయునని బుద్ధిపుట్టుచున్నదే. గొంతు పిసికివేయవలె నని కోరిక యున్నది.

ముస:—అమ్మాయీ! అట్లనరాదమ్మా.

కుమ్మా:—ఏమిచేయుదునే కడుపులో మండుచున్నది. కరీనా నింటిలో దింపి బోయీలు మరలఁ బల్లకినిఁ దెచ్చిరి. పోయివచ్చెదనని కూతులకుఁ జెప్పి యా ముసలమ్మ దానిలో నెక్కి నిజనివేశమున కరిగెను.

---

## ముప్పదిరెండవ యధ్యాయము

ఖానుఁడమీనాతో సుఖముగఁ గాలము గడపుచుండెను. కాశిమాలి యుద్యోగముచేయుట కింకను దుర్బలుఁడుగ నున్నందున ఖానుని వర్తించుచు నతనిచే నియుక్తుఁడై యుత్తరములు వ్రాసి, లెక్కలు పరిశీలించి, దినములు పుచ్చుచుండెను. మీరాసు కాశిమాలి కప్పుడప్పు డమీనా యొద్దనుండి పండ్లు పక్ష్యపదార్థములు తెచ్చియిచ్చుచు నాపె యనురాగమును జతురవాక్యములచే సూచించుచుండెను.

కాశిమాలి కమీనాయొక్క యనురాగ మమూల్యమైనది. అమీనా వలెఁ గాశిమాలినిఁ బ్రేమించినవా రచటి వారలలో నెవరు లేరు. స్నేహమును బ్రకటించువా రనేకు లుండిరిగాని వారు స్వార్థపరులగుటచే హృదయము విప్పి యేమాట చెప్పఁదగినవారు కాకుండిరి. ఖానుని మిత్రులు వృద్ధులు. వీరు కాశిమాలియం దభిమానము కలవారైనను గాశిమాలి పిన్నవాఁడని, యనుభవశాలి కాఁడని, యతనితోఁ గలసిమెలసి యుండుట యగౌరవకరమని తలఁచినవారగుట నతని రహస్యములు తెల్ప నర్హులుకాకుండిరి. కావునఁ బ్రాణముకంటె నెక్కుడుగఁ బ్రేమించిన యమీనా కాశిమాలికిఁ బ్రియతమయై యుండెనన నబ్బురమేమి? ఖానుని కొల్వునందే యుండి యుదివఱకున్న ముసద్దీలకన్న నెక్కువ నమ్మకముగ నతఁడు పనిచేయుచుండెను. జమాదారుఁడు మోసముచేసి సర్కారుద్రవ్యము నపహరించుట కొనర్చు నుపాయముల నింతకుఁ బూర్వము పేర్కొనియుంటిమి. ఇప్పుడితఁడు కోయంబుత్తూరు బయళ్లలోనుండి మైసూరు పీఠభూమిలోనికిఁ బోవు కనుమలను గాచుచుండెను.

ఇతని దుర్మార్గములు నానాఁటికి హెచ్చుచుండెను. కాశిమాలి సహింపలేక వాని నణఁపఁ బ్రయత్నములు సేయుచుండెను. ఈ సమయమున జమాదారుని లెక్కలలోఁ దప్పు దొరకినదని బక్షీ (జీతములిచ్చునతఁడు)

దొంగయుత్తరమువ్రాసెను. అతఁడీ యుత్తరము ఖానునకుఁ జూపఁగా వాఁడు భగ్గున మండిపడి యేమిచేయుదుమని కాశిమాలి నాలోచన యడిగెను. బుక్షీవద్దకు వెళ్లి మొదటినుండి జమాదారుఁడు పంపిన లెక్కలఁ బరీక్షించినయెడల మోసము తేలునని యతఁ డుపాయము చెప్పెను. ఇద్దఱుకలిసి బుక్షీకడకుఁ బోయిరి. లెక్కల నెదుటవేసికొని యొకరోజు శ్రమపడి కాశిమాలి పరీక్షించెను. పర్తారి యచ్చటచ్చట పొరబడి యున్నప్పటికి నిజముగఁ గాకితము లన్ని జమాదారుని మున్షీ వ్రాసెనని యతఁడు స్పష్టము చేసికొనెను. జమాదారుఁడు నిశానీదారుఁడనియు, మున్షీయే పనులన్ని చేసెననియు వీరు తెలిసికొని మున్షీని లోబఱచికొనినఁగాని మోసము బయల్పడనేరదని యతనిని రహస్యముగఁ గొనివచ్చుటకై యిమాము సాహేబునకు మఱి నల్వుర మనుష్యుల నిచ్చిపంపిరి.

ఇమాంసాహేబు వెళ్లెను. మున్షీ యెప్పుడు జమాదారునివెంట నుండును. అతనికిఁ దెలియకుండ మున్షీనిఁ బట్టుకొని రావలయును. తనతో వచ్చినవారిలో నొకనికిఁ బకీరువేషము వేసి యేదోయొక మిషచేత నతని నీవటికిఁ గొనిరమ్మని పంపి యిమాము తోవలోనుండెను. అతఁడు పకీరువలెఁ బోయి మున్షీని సందర్శించి మతవిషయములలో దింపి సంభాషించుచుఁ బురబాహ్యప్రదేశమునకుం దీసికొనిపోయెను. దగ్గఱకురానిచ్చి సిద్ధముగనున్న యిమాము మొదలగువారు మున్షీని బలజంతముగఁ బట్టికొని యేడ్చుచున్న కొలఁదిఁ గొనిపోయిరి.

పిమ్మట జమాదారుఁడు మున్షీయని పిల్వ మున్షీ లేఁడాయెను. ఆతఁడు వెదకఁ బంపెనుగాని యెచ్చటను గానరాలేదు. ఒకపకీరుతో మాటలాడుచుండఁ జూచితిమని కొందఱు చెప్పిరి. నాసరహస్యము బూర్ణముగ నెఱిఁగిన యతఁడు చెప్పుటకిఁబోయెనో యెవరిచెవులఁ బెనగుట్టు వేయునో, యని జమాదారుఁడు దోదూయమానమానసుఁడై యుండెను. ఇమామునాహేబు మున్షీని ఖానుని యొద్దకుఁ జేర్చెను. ఖానుఁడును గాశిమాలియు సంతోషించి యతనిని లెక్కల

విషయమై ప్రశ్నించెను. నేనా లెక్కలన్న నేమో యెఱుఁగనని మున్షి నిర్దోషివలె నటించెను. నిజమొప్పుకొను దనుక నితనికి మంచినీళ్ళయిన వలదని ఖానుఁ డుత్తరువుచేసెను. ఆవిధమునఁ ద్రాగుటకు నీరులేకుండ మున్షి యొక దినముండెను. కఠినశిక్ష కోర్వలేక భయపడి యున్నదంతయు నతఁడు పూసగ్రుచ్చినట్లు చెప్పెను. అంతట జమాదారునిమీఁద నేరము మోపి చూచిన వెంటనే వచ్చి సమాధానము చెప్పవలసినదని యతని కొకయుత్తరము వ్రాసి ఖానుఁడు పంపెను.

---

## ముప్పదిమూఁడవ యధ్యాయము

ఉత్తరము చూచినప్పుడు జమాదారుఁడు నిర్భిన్నహృదయుండయ్యెను. తత్క్షణంబ శ్రీరంగపట్టణమునకు వెళ్ళి ఖానునియొద్దకుఁబోవ, నతఁడు దర్శన మీయనని నిరాకరించెను. కాశిమాలిగుండ ఖానునియనుగ్రహము సంపాదింప వచ్చునని తలఁచి యతనియింటికేగి కాశిమాలి పాదములపైఁబడి రక్షింపుమని జమాదారుఁడు వేఁడుకొనెను. కాని కాశిమాలి యతనిప్రార్థన నంగీకరింపలేదు. లంచమిచ్చెదనని జమాదారుఁడు చెప్పెను. లంచమను మాటవినినతోడనే కాశిమాలి దండతాడితభుజంగంబు భంగిఁ గ్రుద్ధుఁడై యతనిని దూషించెను. జమాదారుఁడు విఫలమనోరథుఁడై యేమితోఁపక నిల్చుండి యొకతలంపు మనస్సునకు రాఁ గత్తి దూయఁబోయెను. కాశిమాలి యది కనిపెట్టి "జమాదారుఁడా! నీచుఁడ! నీదురభిప్రాయము కనుఁగొంటిని. కత్తి దూయుచున్నావు. ఇదిగో ఖడ్గము! చూచితివా? ఒకయడుగుదాఁటి రమ్ము. నీతల కంఠమునుండి వేఱగును. ఇప్పుడే నీయసువులు గొనఁగలనుగాని పిఱికిరక్తము నాఖడ్గమునకు రుచింపదు. పొమ్ము. క్షణమైన నిచ్చటనుండకుము" అని కఠోరవాక్యము లాడెను. జమాదారుఁడు కడఁబడి తనకాతలంపు లేదని బొంకి పరాభూతుఁడై బయటికి వచ్చెను.

కాశిమాలియొక్క యిల్లుదాఁటి రెండుగజముల దూరమేగుసరి నొక స్త్రీవచ్చి యతనిం గౌఁగిలించికొని "జమాదారుఁడా! నీవు యుద్ధములోఁ జచ్చితివని వింటిని. ఇన్నిదినములకు సెలవుగ నేఁటికి మరల నిన్నుఁ గలిసికొంటిని" అని సానురాగముగఁ బలికెను. "పొమ్ము. నీవెవతెవో యెఱుఁగను. కాశిమాలి దాసివలె నున్నావు. దొంగవేషములు నాయొద్దసాగవు. విడువుము" అని యామెను విదల్చివేసి యతఁడు పోయెను. ఆమె యాత్రోపునకుఁ గ్రిందఁబడిలేచి యొడలిదుమ్ము దులిపికొనెను. "ఇంటికిఁ బోయి నాపేరుచెప్పి వెనుకటివిషయముల వివరించెదను. అప్పుడునన్ను గుఱుతుపట్టఁగలఁడు" అని యామె తలంచెను.

జమాదారుఁడు నిరాశచెందెను. ఖానుఁ డనుగ్రహింపఁడు. కాశిమాలి రక్షింపఁడు. ఎవరిఁక దిక్కు? సుల్తానుఁడొక్కఁడు కన్పట్టెను. "నా యదృష్టము చక్కఁగనుండిన సుల్తానుఁడే కటాక్షించు" నని యతఁడు రాజసౌధమునకుఁ బోయెను. జమాదారుని నందఱెఱిఁగినవారు గావున బయటనున్న బందోబస్తు లడ్డగింపలేదు. బహిర్ద్వారము దాఁటెను. సుల్తానుఁడు పూర్ణయ్య (మంత్రి) తోఁగాని కృష్ణరావు (ఖజానాదారు) తోఁగాని మాటలాడుచునుండు నేమోయని యతఁడుతలఁచి టిప్పూ కూర్చుండిన గది వాకిటనున్న సేవకుని సైగచేసి పిల్చెను.

జమా—అబ్దుల్ హుసేనూ! (సేవకునిపేరు) సుల్తానుఁ డొంటరిగ నున్నాఁడా?

అబ్దుల్—వ్రాయుచున్నాఁడు. ఎక్కడనుండియో యుత్తరములు వచ్చినవి. అవిచూచి విచారపడుచున్నాఁడు. ఆయనను జూచుట కిది సమయము కాదు. కదలించిన సింహమువలె మీఁదఁబడును.

జమా—నేను దర్శనముచేయవలయును. మిక్కిలి యవసరముగ నున్నది.

అబ్దుల్—కాగితముమీఁద వ్రాసియిమ్ము. తీసికొనిపోయి చూపుదును. అంతియ కానినోరెత్తి మాటలాడుటకు వీలులేదు. అబ్బో! పైనిఁబడును.

జమా—(చేయిపట్టుకొని యీడ్చి నొకప్రక్కకుఁ గొనిపోవుచు) అబ్దుల్ హుసేన్! మన మిద్దఱము స్నేహితులము. ఆస్నేహమే యెప్పుడుండ వలయును. నేను మనవిచేయవలసినదేకాని వ్రాయలేను. ఇదిగో చేయిపట్టు (అని ఒకవరహా చేతిలో వేసెను.)

అబ్దుల్—నాకు వద్దు వద్దు. ఒకటి నేమిచేసికొందును? నీది నీవె తీసికొనుము. నీలంచముతో నాకుఁ బనిలేదు.

జమా—త్వరపడకు. పట్టు. సరిపోయినదా?

అబ్దుల్—(రెండువరహాలు క్రిందఁబడవేసి) నీవరహాలు నాకవసరములేదు. సుల్తానుఁడు కోపముతో నున్నాఁడు. వేయి వరహాలిచ్చినను బోనీయను. అన్యాయముగ నాజీవనమునకు హానివచ్చును. ఏమో స్నేహితుఁడవని యెఱిఁగినవాఁడవని సహాయపడవలెనని యనుకొంటిని. అది నీవు గ్రహింపలేకున్నాఁడవు.

జమా—సరే నీయిష్టప్రకారమే సరిపుచ్చుకొందును. సరే. ఇదిగో తీసికొను. ఇఁకఁబోయి జమాదారుఁడు దర్శనమునకు వచ్చినాఁడని చెప్పు.

అబ్దుల్—నీవు సెలవుతీసికొనివచ్చితివా? పనివిడిచి రాఁగూడదను కాఁబోలును.

జమా—ఆయేడుపులు నీకెందుకు నీయేడుపు నీవేడ్వుము. ఈవ్యర్థపుమాటలతో నేమి ప్రయోజనము?

అబ్దుల్ హుసేను లోనికిఁబోయి వచ్చి సుల్తానుఁడు రమ్మనుచున్నాఁడని చెప్ప, జమాదారుఁడేగి భయవినయంబులు ముప్పిరిగొన సాష్టాంగదండప్రణామం బాచరించెను.

సుల్తా—ఏమి సంభవించినది? సెలవులేకుండ సైన్యమువిడచి యేలవచ్చితివి? ఉత్తరువు లేల యతిక్రమించితివి?

జమా—(సాగిలఁబడియుండి) సేవకుఁడు తప్పుచేసినాఁడు. క్షమింపఁ బ్రార్థించుచున్నాఁడు.

సుల్తా——లెమ్ము. నిలువఁబడిచెప్పు. మొద్దువలెఁ బడియున్నావు. నిన్నుఁజూడఁగ, మొన్న వచ్చిన బ్రాహ్మణుఁడు జ్ఞప్తికి వచ్చుచున్నాఁడు. ఆబ్రాహ్మణుని యిల్లు నీవు దోఁచితివఁట. జరిగిన దిప్పుడేల ? నీవిషయము తెలియఁ జేయుము.

జమా——మహాప్రభూ !

సుల్తా——(కత్తిదూసి) ఇదిగో పొడిచివేసెదను. గాడిద! లేచి మనవిచేయుము.

జమా——(లేచి చేతులుజోడించి) చిత్తము ! మహారాజా ! మీకుకూడ న న్నాదరింపనియెడల నాకు దిక్కులేదు. నిజము విన్నవించెను. అబద్ధము చెప్పను.

సుల్తా——ఓరీ చండాలుఁడ ! నీప్రేలుడు చాలించి చెప్పవలసినది చెప్పు. నీ వ్యర్థవాక్యములు వినుటతప్ప మాకు వేఱుపనిలేదా ?

జమా——స్వామీ ! నేను జెప్పినది సత్యముకానియెడలఁ దుపాకితోఁ గాల్పుము.

సుల్తా——ఛీ ! మూర్ఖుఁడ ! నీమాటలువినుట కవకాశములేదు పొమ్ము. ఇక్కడ నుండకుము.

జమా——అయ్యో ! అయ్యో ! మహాప్రభూ ! మనవిచేసెదను.

సుల్తా——ఏడువుము.

జమా——నామర్యాద పోయినది. అవమానము చేసినారు. ఖానుఁడు కాశిమాలి కలిసి నన్నుఁ జెఱప సమకట్టినారు.

సుల్తా——ఖానుఁడు నామిత్రుఁడు. కాశిమాలి నాప్రాణరక్షకుఁడు. వారి పేరు లుదహరింప నీకు నోరెట్లాడెనురా ?

జమా——అబద్ధమైన నన్నురిదీయుఁడు. నతుకుఁడు. కాల్చుఁడు, సైన్యములో నుండఁగ నామునిషీ యగపడలేదు. ఎవరో చంపిరనుకొంటిని. ఖానుని మనుష్యులువచ్చి మునిషీనిఁ బట్టికొని పోయిరని తరువాతఁ దెలిసినది. అప్పటినుండి ఖానుఁడు, కాశిమాలి, మునిషీని బాధించి లెక్కలలో మోసమున్నదని యతనిచేత వ్రాయించినారు.

సుల్తా—చెప్పు.

జమా—మీయుప్పుదిని తప్పు లెక్కలు వేయుదునా? ఏలినవారు నన్ను మొదటినుండి యెఱుఁగుదురు.

సుల్తా—నీ మొగమే నీవు దొంగవని చెప్పుచున్నది. న్యాయాన్యాయములు కనుఁగొనుటకు భగవంతుఁడు నాకు శక్తి ననుగ్రహించినాఁడు. నడివీథిలో నున్నశిభూమిపై నిన్ను నిల్చుండఁబెట్టి దొంగదొంగయని ప్రకటించిన నీకు సిగ్గువచ్చును. హిందువులను దోచికొనుటగాక సర్కారుద్రవ్యము కూడ నపహరించితివా? దొంగ గాడిద!

జమా—స్వామీ! స్వామీ! సేవకుని క్షమింపవలెను. ఎన్నిదినములనుండియో మీకొలువులో నున్నాఁడను. మీకాలిదుమ్ము నాకుఁ బ్రసాదము.

కృష్ణరావు—(ప్రవేశించి) ఎవఁడీ నీచుఁడు?

సుల్తా—వీఁడా? దొంగ. సర్కారుసొమ్ము దొంగిలించితినని యొప్పుకొనుచున్నాఁడు. క్షమింపవలయునఁట.

జమా—అల్లా! అల్లా! ఈయవమానము మరణముకంటె నెక్కువగనున్నది. జేపరవారి ఖడ్గమును నాకంఠముమీఁద వేయుఁడు.

సుల్తా—అప్పుడే కాదు. నీవు దొంగలించిన ధనము తిరిగి యిమ్ము. నిన్ను క్షమించి కొలువులో నుండనిత్తును. కిషన్ రావ్ నీవేమందువు?

కృష్ణ—సైన్యపులెక్కలలో మోసమున్నదని యేలినవారిసేవకుఁడు విని చింతిల్లి దానినిగుఱించి మనవిచేయుటకు సిద్ధముగనున్నాఁడు. చూడఁగ వీఁడే యిక్కడనున్నాఁడు. తగినశిక్ష విధింపవలయును. తక్కినవారికి భయముండును.

సుల్తా—కిషన్ రావ్; వీనిని క్షమింతము. చాలకాలమునుండి కొల్చుచున్నాఁడు. జమాదార్! వింటివా? నిన్ను క్షమించితిని. రెండువేలవరహాలు రేపుసాయంత్రములోపలఁ జెల్లింపుము. ఇంతకంటె నీవెక్కువ

దౌంగిలించియుండవచ్చునుగాని, రెండువేలే నాబుద్ధికిఁ దోఁచెను. ఇఁకఁ బోమ్ము.

జమా—మహాప్రభూ! ఆమొత్తములో నిరుపదవవంతైన సేవకునివద్దలేదు. 500 వరహాలైన నీయఁగలను.

సుల్తా—అసత్యమాడ నెట్లుసాహసించితివిరా? దుర్మార్గుఁడ!

జమా—కాదు. కాదు. స్వామీ. నాయొద్దలేవు. ఎక్కడఁ దేఁగలను?

సుల్తా—లుచ్ఛా! మాటలాడకుము. నీవద్దలేకపోయినఁ జచ్చియైనఁ దీసికొని రావలయును. ఆలస్యముచేసితివేనిఁ జావు నిక్కమే యగును.

జమాదారుఁ డంతట ననుజ్ఞగైకొని మెల్లఁగ బయటికివచ్చి యెచ్చట నాగక బసచేరెను. అతని యప్పటిరీతి భగవంతుని కెఱుక. సుల్తానుఁ డొక్కఁడే యుండినచో నంత చింతలేకుండునుగాని, కృష్ణరావుకూడ విని నందున నాపరాభవము సహింప నలవి కాకుండెను. కష్టములన్నిటికిఁ గారణుఁడైన కాశీమాలిని సాధ్యమైనచో మ్రింగివేయవలయు నని జమాదారుఁ డనుకుండెను.

జమాదారుఁడు పోయినతరువాత నరగడియకుఁ గొన్నియుత్తరము లొకదూత తీసికొనివచ్చెను. ఆయుత్తరములు చదువఁగనే సుల్తానుని ముఖవికాసము మాఱెను. సైదుసాహేబునాధిపత్యముక్రిందనున్న బెంగుళూరు సైన్య మాంగ్లేయులచేఁ దఱుమఁబడి గుజల్‌హట్టి కనుమలయొద్దకుఁ బాఱిపోయినదనియుఁ, బశ్చిమముగనున్న పాలఘాటుచెర్రికూడ నాంగ్లేయుల యధీనమయ్యెననియు; నాయుత్తరములవలనఁ దెలిసెను. కోపానలము రగులు చుండినను నప్పుడుచేయునది యేమిలేక మఱునాఁడు దర్బారునకు హాజరు కావలయునని యందఱకుఁ జెప్పి, యానాఁడు సుల్తానుఁడు కొలువు ముగించెను.

జమాదారుఁడు పరాభవజనితదుఃఖముతో నిల్లుచేరి గుమ్మము దిగెను. నిజసేవకుఁడైన మదారుఁ డెదురుగవచ్చెను.

మదా—అయ్యా, ఎవతెయోవచ్చి మీకొఱకు గనిపెట్టుకొనియున్నది. పొమ్మన్నఁబోదు. మిమ్మునుజూచి కాని పోనను చున్నది.

జమా—ఎవతె! దానికేమికావలె? ముసలిదా? పడుచుదా?

మదా—స్వామీ! దేవరవారే చిత్తగింపఁగలరు. తలమొదలు కాళ్లవఱకు ముసుఁగు వేసికొని యున్నది.

జమా—ఏమి యీవింత! అయితే మీరందఱు బయట నుండుఁడు. రహస్య విషయమేమో! (లోనికిఁబోయి) ఎవతెవు నీవు. నైతానువలె నిప్పుడు వచ్చితివి. చెప్పుము.

ఆమె—(వణఁకుచు ముసుఁగుతొలఁగించి) జమాదారూ! దేవుఁడు మనలను రక్షించునుగాక. సోజన్ బీని మఱచితివా (అని పాదములపైఁబడి మోకాళ్లను గట్టిగఁబట్టికొనెను).

జమా—సోజన్ బీవా? సోజన్! సోజన్! (ఆలోచించి) ఎవతెవు నీవు? జ్ఞప్తికిరాలేదు. ఓహో నీది సేలముకాదూ? నీవిదివఱకే చచ్చితివే; గోరీలో నుండి బయటికి వచ్చితివాయేమి? ఇదంత నాకుఁ గలకనిన ట్లున్నది.

సోజన్—కాదు కాదు. మాది సేలముకాదు. ఏండ్లు పైనిఁబడుటవలన రూపు మాఱినది. నన్ను మఱచిపోయితివా? ఇందనుక నిన్నుఁ గౌఁగిలించికొన్న ప్పుడు పడసెట్టితివి. మన యిద్దఱసంబంధము జ్ఞప్తికిరాలేదా?

జమా—(ఆమెను లేవనెత్తి మోహితుఁడై ముద్దిడుచు) సోజన్! కాశిమాలి పటేలుమీఁది కోపముచేఁ బిచ్చియెత్తినట్లుండి నిన్నుఁ బడద్రొబ్బి పోయితిని. నీవిప్పటికిని జ్ఞప్తికి రాలేదు సోజన్బీ.

సోజన్—అల్లా అల్లా! కాశిమాలి నెఱుఁగుదువా?

జమా—వాని నెఱుఁగుదును. వాని యజమానుని ఖానునిఁగూడ నెఱుఁగుదును. చాంద్రత్రాఁడు తెగ. నాపరువు తీసివేసెను. అయితే అవి యిప్పుడెందుకు నెమ్ము. కాశిమాలిని నీవేమెఱుఁగుదువు?

సోజర్ — అతనితో మాటలాడవలసియున్నది. ఆయనవిషయముతో నేమిగాని మన వెనుకటి కార్యములగురించి ముచ్చటలాడుకొందము. నన్నింకను మఱచిపోలేదుగదా ?

జమా — అల్లా సాక్షి. మఱచిపోలేదు. ఇప్పుడు హాయిగ నున్నది. కాని రహస్యముగఁ జీఁకటిపడ్డతరువాత రమ్ము. అప్పుడు సుఖముగఁ గాలము గడపుదము.

సోజర్ — తప్పకుండ వచ్చెదను. ఇన్నిదినములకు వార్త వినఁబడుచున్న నీమాటలు నాచెవులకుఁ బండువు చేయుచున్నవి.

జమా — అయితే యిప్పుడు బయటికిం పెదను. రమ్ము. మాపటికివచ్చుట మఱవకుసుమీ ?

---

## ముప్పదినాలుగవ యధ్యాయము

ప్రియసంయోగముకొఱకుఁ గాలవిళంబనాసహనయై గవాక్షమునొద్ద గుమ్మాబీ కూర్చుండి సోజర్ యొక్క రాకను నిరీక్షించుచుండెను. సూర్యుఁడు క్రుంకినది. ఒక్కొక్కప్పు డింద్రియము లవశములగుచు శూన్యంబైన యావ కాశంబుపై దృష్టినిగిడించి, హైందరాలి గోరీవద్దఁ గొట్టఁబడు నగారాధ్వని నామె వినుచుండెను. మాటిమాటికి మనస్సు కాశిమాలిపై వ్రాలుచుండెను. ఉద్యానవనమునుండి గవాక్షముగుండ మందానిలము గొనివచ్చు సౌరభ మామె కానందము కలుగఁజేయఁజాలక పోయెను. కాశిమాలి తప్ప నామె కనుల కన్యవస్తువు గానరాకుండెను. రుచ్యములైన పదార్థములనైనను భుజింప నిచ్చగింపదు. మోహారసమోయన నశ్రుబిందువులుకారి కపోలములపైఁబడినను, బడినవని గ్రహింపఁజాలకుండెను. చివర కిచ్ఛాప్రేరితయై తనకుఁదానే యిట్లు పలికెను.

"ఎందుకింత యాలస్యమైనది. భగవంతుఁడా ! తాళఁజాలను. సోజ నతనితోఁ గ్రీడసల్పుచున్నదేమో? అది ముసలిది. దానినిఁ గాశిమాలి ప్రేమిం

చునా ? ఆపనిచేసినయెడల నోడలు చీల్చెదనని సోజనెఱుఁగదా ? ఇంక కొంతసేపు నిరీక్షించెదను. నాపాలిటి దైవము వచ్చుచున్నాఁడేమో! (శబ్దమువిని) ఎవరక్కడ ?”

“సోజన్నీని” అని ప్రత్యుత్తరము వచ్చెను.

కుతుబ్బా—సోజన్నీ ! త్వరగ రమ్ము. నీకోఱ కెంతకాలమైనదే, కనిపెట్టికొని యుండ మొదలుపెట్టి ! చెప్పవే. ఏమైనది. సిద్ధముగనున్నాను. చూచి మాటలాడితివా ? ఏమన్నాఁడు ? నన్ను రమ్మన్నాఁడా ? తాను వచ్చెద నన్నాఁడా ?

సోజన్—ఆయనను జూచితిని.

కుతుబ్బా—సోజనూ ! అయ్యమ్మా ! నీవెంతకఠినురాలవే. నాశరీరము మండిపోవుచున్నది. చెప్పవలసినమాట శీఘ్రముగఁ జెప్పవుగదా.

సోజన్—అమ్మా చెప్పెదనుగాని వినఁగలవా ?

కుతుబ్బా—అల్లా ! అల్లా ! ఆలస్యమింకను జేయుదువు గదే?

సోజన్—అమ్మా! యీదినము సుఖముగ నిద్రపొమ్ము. రేపు మనస్సు తేలికగ నుండును. అప్పుడు చెప్పెదను.

కుతుబ్బా—సుఖమా ? నిద్రపోవుటా ? గోడ్రాలికేమి తెలియునురా, బిడ్డలకష్టమని నాబాధ నీవేమెఱుఁగుదువు ? కన్ను మూఁతపడునా ? సోజన్.

సోజన్—ధైర్యముతో వినుము. జరిగిన దంత చెప్పెదను.

కుతుబ్బా—అయ్యో, కఠినులారా ! ధైర్యముతోడనే యున్నానే. కాలము గడపక చెప్పవే.

సోజన్—నే నతనియింటికి వెళ్లితిని. రహిమానుఁ డచ్చటనే యుండెను. కొంతసేపు తలుపువద్దఁ గనిపెట్టుకొని యుంటిని. ఖానుఁడు వెళ్లెను. ఒక జవానువచ్చి “నీవెవరు” అని నన్నడిగెను. “కాశిమాలితోఁ బనియుండి వచ్చితిని,” అని చెప్పితిని. అతఁడు లోనికిఁ బోయెను. అతనివెంట నేనుఁ బోయితిని. “అక్కడ నాగు, కాశిమాలికిఁ జెప్పెదను” అని యతఁడు

పక్కపోయెను. నే నచ్చట నాగితిని. నిమిషములు గంటలుగ నుండెను. "షామ్మా. కాశిమాలి పిలుచుచున్నాఁడు" అని యతఁడు వచ్చి చెప్పెను. పరుఁగుచుఁ బోయితిని. కాశిమాలి వ్రాయుచుండెను. "నిలువుము, ఎవ్వతెవు నీవు" అని యాతఁ డడిగెను. ఆయనమాటల మాధుర్యము చెప్పశక్యము కాదు.

తుమ్మా—సోజనా! నీవెంత నిర్దయురాలవే. "పోయితిని. వింటిని. అడిగితిని" అని వ్యర్థపుమాటలతో సరిపుచ్చుచున్నావుగాని, ముఖ్యమైనమాట చెవిని వేయవైతివి.

సోజనా—అమ్మా. త్వరపడకుము. చెప్పుచున్నాను. "నేను మీ పరిచారికను. ఒకవార్త తెచ్చితిని. వినుదురా?" యని యడిగితిని. "కానిమ్ము, చెప్పుము" అని యతఁ డానతి యిచ్చెను. "వ్రాఁత చాలించి నామాట లాలకింపుఁడు" అని ప్రార్థించితిని. అంగీకరించి నావైపునకు మరలి కూర్చుండెను. కొంగు మూటవిప్పి నీ విచ్చిన లవంగాలు మిరియాలు చేతిలోఁ బెట్టి "ఇవి యెందుకో యెఱుఁగుదురా?" యని యడిగితిని. అమ్మా యాతఁడు వాని వంక విచారముతోఁ జూచెను; "చచ్చిపోవనున్నవాని కివి యేల తెచ్చితివి" అనిపలికెను. ఆమె చక్కనిది. బారెడు నల్లని కురులుగలది. చేరెడు వెడల్పు కన్నులుగలది. పెదవు లెల్లప్పుడు తాంబూలము వేసికొనిన ట్లెఱ్ఱగ నుండును. ఆమె నడచుచుండినప్పటి సొంపు చూచితీరవలయును. ఆమె సౌందర్యము చెప్ప నానాల్కల కలవికాదు. మొగము కళకళలాడుచుండును. అదినూతనముగ వికసించిన పుష్పమువలె మృదువుగనుండును. కాశిమాలీ! ఆమె నిన్నుఁజూచినది. ఇఁక నాయిల్లాలి పరితాపమేమని చెప్పుదును?" అని నుడివితిని. ఆయన విచారపడి "ఏమి నాదురదృష్టము. ప్రపంచమునం దొక్కతెమీఁదఁ దప్ప నా కెవ్వతెమీఁదను బ్రేమలేదు. మేమిద్దఱము కలిసికొనలేదు. ఆమెను నేనెఱుఁగను. వచ్చారులలో ననేకులు గలరు. వారిలో నెవరినైన మోహింపు మనుము. కాశిమాలి యాశవదలుమనుము." అని యతఁడు నెమ్మదిగఁబలికెను. అమ్మా తుమ్మా

ఛీ ! నీవు రాజసౌధములోనుండు భోగమువారిపడుచువని యతఁడు తలంచెను. కాని "ఆమె భోగముది కాదు. మగనాలు. ఆమె చక్కఁదనము నెంతవర్ణించినను దఱుఁగదు" అని వాక్రుచ్చితిని.

కుమ్మూ—సోజన్బీ ! అప్పుడేమిచెప్పెను ?

సోజన్—అమ్మా వినుము. "ఆమె మగనాలని నీవు చెప్పితివి. ఆమె నన్నెట్లు ప్రేమించినది? అదిపాపము. అట్టిప్రేమ యపవిత్రము. ఆమెకు భర్త యొకఁడుండ నేనెవ్వఁడను ? పొమ్ము. కాశిమాలి విటకాఁడు కాఁడని చెప్పుము. గౌరవహీనుఁడు కాఁడని తెలియఁ జేయుము; అన్యాయమార్గ వర్తికాఁడని నుడువుము ; పరిశుద్ధచరిత్రుఁ డనుము; ధర్మనిరతుఁ డనుము; సత్యశీలుఁడనుము; ఛీ ! ఇట నుండకుము" అని యతఁడు చివరకుఁ దీక్ష్ణముగఁ బలికెను. నేను మరల మాటలాడఁ బ్రయత్నించితినిగాని యతఁడు వినకపోయెను. ఏమిచేయుదును ?

కుమ్మూ—చివరకు జరగిన దిదియా ? ఓసీ తెలివిమాలినదాన. నేను మగనాలి నని యెందుకుఁ జెప్పితివే. భోగమువారి పడుచునని చెప్పినఁ జేపట్టు నేమో ! ఓసీ మొద్దు. మనసు కరఁగించుమాటలు చెప్ప లేకపోయితివి గద. నాప్రాణములన్ని యతనిమీఁదనే యున్నవని చెప్పకపోయితివే. ఆమె చచ్చుననిమైనఁ జాలిపుట్టింప లేకపోయితి వేమే.

సోజన్—అమ్మా నేనేమిచేయఁగలను ? ఇంకొకతెను ప్రేమించెనఁట.

కుమ్మూ—ఎవరాలంజ ? భోగపుముండ కాఁబోలును. దానినెట్లు పలఁచి నాఁడే. కాదు. కాదు. ఎవతెయై యుండును? అమీనాయై యుండును. ఆమెప్రాణము లాతఁడు కాపాడెను. ఇద్దఱు నొకచోట నుండిరి. సోజన్ ! గ్రహించితివా ? అన్నివిషయములు కనులకుఁ గట్టిన ట్లగపడుచున్నవి.

సోజన్—అమ్మా నీవన్నమాట నిజమేయైయుండును. కాని యీనిఁవ యింతవఱ కామెమీఁద లేదు.

కుమ్మా—అమీనా జాణ. తెలివి గలది. బయటఁబడ నీదు. అబ్బా!
సాతాపము పట్టఁజాల కున్నాను.

సోజర్—అవును. ఏమిచేయఁగలము ?

కుమ్మా—ఏమిలేదు. అమీనా! అయ్యో నా ప్రాణమున కెక్కడ దాపరించితివే. ఖానునితోఁ జేరి మాయిద్దఱ నెడఁబాపితివి. కాశిమాలినిఁ బ్రేమింప వచ్చుటకి నీవే వచ్చితివి. సోజనూ! దీనిని విడిచిపెట్టరాదు. తప్పక కసి దీర్చికొనవలయును. నీచేతనైనంత సహాయము చేయవలయును.

సోజర్—దానికడ్డు చెప్పుదునా?

కుమ్మా—ప్రొద్దు పోయినది. పరుండుదము. బడలికగా నున్నది.

సోజర్—భగవంతుఁడు నీయభీష్టము నెఱవేర్చును గాక. నీవు పరుండుము. నేను బరుండుదును లెమ్ము. నాకిప్పుడు నిద్రరాదు. వాయువు మనోహరముగ వీచుచున్నది.

కుమ్మా నిద్రించెను. సోజర్ నిట్టూర్పులు విడుచుచుఁ దాను జమాదారునితో సంభాషించుట, యాతఁడు ముద్దుపెట్టుకొనుట, యనురాగపూరిత వాక్యములు పల్కుట, జ్ఞప్తికిఁ దెచ్చికొనెను. మందానిలము సౌరభవహంబై పూలచెట్లపైనుండి వచ్చుచుండెను. నడురాత్రి యయ్యెను. చుట్టుపట్టుల నిశ్శబ్దముగ నుండెను. అప్పుడప్పుడు కావలికాండ్ర యీలలు, కుక్కల యఱపులు, వినవచ్చుచుండెను. క్రమక్రమముగ వేయెండ వ్యాపించి గవాక్షముగుండఁ గుమ్మాబీ పవ్వళించిన గదిలోనికిఁ జొచ్చి, మొదట మృదువైన కేశభారంబుపై బ్రసరించి తరువాత మొగముపై నలరారెను.

మోహాతిరేకంబునఁ జంద్రుఁడామెను నిజకరంబులచే స్పృశించుచుండినట్లుండెను. అప్పటి యాకామినీరత్నంబు సోయగంబు వీక్షించిన నే మానవుని గుండె నీ[illegible]ఁడును? "కాశిమాలి యిప్పు డీ యువతినిఁ జూచిన వెనుకటి పెంకెతనము మాని మోహపరవశుఁడై పైనిఁబడును. అయ్యో! అట్టివేళ యేనాఁడు ప్రాప్తించును. ఈమెయదృష్ట మెట్లున్నదో

రేమన లేఱుఁగుదురు. ఇంతకు దేవుఁడెట్లు వ్రాసిన నట్లు జరగును. కన్నులు మూసికొనిపోవుచున్నవి. ప్రొద్దు పోయినది. పరుండెదను." అని యొత్తిగిల్లి సోజన్సీ నిద్రపోయెను.

తెల్లవాఱినది. సుల్తానుని యాజ్ఞచొప్పున సర్దికారులు, రౌతులు, మాపటీలు, పదాతులు వారు వీరననేల? అందఱు దర్బారునందలి యుత్తరువులు వినుటకుఁ గోటలోఁ గుమిగూడిరి. గంభీరవాక్యములతో వారి యుత్సాహమును రేపి కనుమల క్రిందివైపున నున్న యాంగ్లేయసైన్యముమీఁదికిఁ బోవుటకు, మఱునాఁడు బయలుదేఱ సుల్తానుఁడు నిశ్చయించెను. అందఱు సహర్షహామికతోఁ బ్రయాణమగుటకు సిద్ధముగ నున్నామని ప్రత్యుత్తరమిచ్చిరి.

---

## ముప్పదియైదవ యధ్యాయము

ఖానుఁడు మఱునాఁడు యుద్ధమునకుఁ బోవలయునని యమీనాకుఁ దెలియ నామె విన్నఁబాటొందెను.

ఖాను—అమీనా! ప్రియవల్లభా! అధైర్యము కూడదు. నిన్నొక్కతెను విడిచిపెట్టిపోవను. నీదాది మీరాను నిన్నుఁ గనిపెట్టుకొని యుండును. ఇంకను దాసీజన ముండును. నీకేమి భయము?

అమీ—నాథా! సుల్తానునిచే గౌరవింపఁబడి ప్రదుగుచేఁగాఁ బేరు ప్రతిష్ఠలు సంపాదించిన తమ పాదము లంటుటకైనఁ దగినదానను కాను. నాకు మీ పాదములధూళియే జీవనము. యుద్ధములో మీకు గాయముతగిలిన సేవ రుపచారముచేసెదరు? ఎవరు మీ హృదయతాపమును దీర్చెదరు? కాళిమాలికిఁ గాదుగదా, మఱియొకరికిమాత్ర మంత శ్రద్ధ యెందుకుండును? అప్పు డమీనా జ్ఞప్తికి రాదా?

ఖాను—ప్రియసతీ! ఇప్పుడు పోరాడవలసినది పరంగీలతోనై యున్నది. విగ్రహారాధకులైన హిందువులే యైనచో గొఱ్ఱెలవలె నఱికివేయవచ్చును

గాని పరంగీల జయించుట దుర్ఘటము. కలహము భయంకరముగ నుండును. ఆఫిరంగుల మోఁత లాకత్తుల జళిపించుట లారక్త ప్రవాహములు చూచి నీవు సహింపఁగలవా ?

అమీ—నాథా ! మీకు సహాయ మొనర్చుటకు నన్ను యుద్ధములోనికిఁ గొని పొండు. నా శిరస్సున కొక తలగుడ్డచుట్టి చేతికొక కత్తియిచ్చి రణమునకుఁ బంపి నాచర్యల వీక్షింపుఁడు. మహారాష్ట్రస్త్రీ లనేకపర్యాయము లట్లు శౌర్యకార్యము లొనరించియుండ ఢిల్లీముఘుల్ వంశస్థుల రక్తము నాదుల యందుఁ బ్రవహించుచున్న నే నొక్కసారియైనఁ జేయలేనా ?

ఖాను—(ఆశ్చర్యముగ గొంతెత్తి) అల్లా సాక్షి. నీవు నిజముగ వీరభార్యవు. నీకింత సాహసమున్నదని యిదివఱకెఱుఁగను. సుందరీ ! రమ్ము. నాతోడ యుద్ధమునకుఁ గొంపోయెదను.

అమీ—(భర్త బుజముమీఁదఁ దలవాంచి) ప్రాణనాయకా ! మీదయకుఁ బాత్రురాల నైతిని. ఇప్పుడు మీరుతప్ప నాకెవ్వరును లేరు. తల్లి, తండ్రి, దైవము, భర్త నాకు మీరే. మీరు యుద్ధమునకుఁ బోయినది మొదలు మీకేమి సంభవించునోయని యింటివద్ద నేను పరితపించకుండ మీ వెంట నన్నుఁ దీసికొనిపోవుట కంగీకరించితిరి. కృతార్థురాల నైతిని.

ఖాను—నాకేమిసంభవించును ? అమీనా ?

అమీ—ముందు రాఁబోవునది నాకుమాత్ర మేమిఁ దెలియును ? ఏదియైనను రావచ్చును ? మీ రీవిషయ మెఱుంగరా ?

ఖాను—అమీనా ! నేను ముందుముందుగ నాలోచింపను. వచ్చిన దను భవింపక తీరునా ?

అమీ—నిజమే.

ఖాను—ప్రియా ! నీవన్నట్లు హాని కలిగినఁ గలుగవచ్చును. పరంగీలతో యుద్ధము సాధారణమైనదికాదు. నావెంట నేలవచ్చెదవు ? నీవాకష్టముల

కోర్వలేవు. కాశిమాలి యుద్ధమునకు రాఁడు. అతఁడు నిన్ను సంరక్షించుచుండును గావున నిచటనే యుండుము.

అమీ—మనోవల్లభా! మిమ్ము నెడఁబాసియుండను. అతఁడెవఁడు నన్ను రక్షించుటకు? ఎచ్చటికైనను మీతోడనే వచ్చెదను. మిమ్మువిడిచి యొక్క క్షణ ముండను. ఇందనుక రానిచ్చెదనని మరల నిట్లేల మాటలాడెదరు?

ఖాను—అమీనా! కోపపడకుము. నీధైర్యమును నమ్మలే దనుకొంటివా? ఆ నాఁడు మరాటిదండు గ్రామమును గాల్చుచుండ గోపురముపైనుండి మనమందఱము చూచినప్పుడే నీ సాహస మెఱిఁగితిని. సుందరీ నీవది మఱచితివా?

అమీ—(కాశిమాలికిఁ దుపాకియందిచ్చిన విషయము జ్ఞప్తికిరాఁగ సంభ్రమముప్పతిల్లుడుఁ బ్రయత్నముతో నణఁచికొని) నాథా! మఱవలేదు. పిఱికి దానను గాను గావుననే మీవెంట రాఁగోరుచున్నాను. ఇఁక నేనుజక్కఁ బెట్టవలసినవి చక్కఁబెట్టి ప్రయాణమునకు సిద్ధముగ నుండుమని మీరానునకుఁ జెప్పెదను.

ఖాను—అయితే పొమ్ము. నేను గాశిమాలినిఁ జూచి వచ్చెదను. అమీనాను గాపాడ వలసినదని నే నతనినిఁ గోరినప్పుడు "నేను రానుగాన నా పెను మీవెంటఁ దీసికొని పొండు" అని చెప్పెను. అతనివద్ద కిప్పుడు పోవుచున్నాను.

ఖానుఁడు వెడలెను. అమీనా యేకాంతమునందుండెను. ఆమె తలంపులు కాశిమాలిమీఁద నుండెను. ఖానుఁడింట లేసప్పు డమీనాయొద్ద నుండుటకుఁ గాశిమాలి కిష్టములేదు; కాశిమాలివద్దనుండుట కమీనా కిష్టములేదు. ఇద్దఱును లోకమునకు వెఱచిరి. నిందకు భయపడిరి. ఇప్పుడైనను ఖానుఁడు యుద్ధమున కేఁగిన తరువాతఁ గాశిమాలితో సరససల్లాపము లాడవలెనని యామె యభిలషించినచో, నేదియో యొక కారణముచెప్పి భర్తను మెప్పించి యింటి వద్దనుండఁగలదు. కాని యాసతీ తిలకంబునీతి శ్లాఘ్యమైనది.

మీరాను వచ్చి "ఇదియే మంచిసమయము. ఇట్టి సమయము మరల రాదు. ఖానునిఁ బోనిమ్ము. కాశిమాలియు నీవును సుఖముగ నుండవచ్చును." అని యెన్నిరాం భ్రమజనకవాక్యములఁ జెప్పి యామెనింటనుంచి కాశిమాలితోఁ గలుపవలయునని యెంచెను. మీరానెంతవచించిన నేమి? ఆమె మనస్సు చలించినదికాదు. "పరంగీల గిరంగుల మ్రోఁతలు విన లేము. నెత్తురు ప్రవాహములు చూడలేము. అమీనా! యుద్ధభూమికిఁ బోవలదు" అని యాతీరునఁ గొంతసేపు మీరాను భయజనకముగ బోధించెను. ఎన్నిచెప్పిన నామె ఖానునివెంటఁ బోవుటకే నిశ్చయించుకొనెను. మీరానుకూడఁ జెపరకు వెంబడించుట కొప్పుకొనెను. ఒకటిరెండుదినములు చెప్పఁదగిన విషయములన్ని చెప్పిన నమీనామనస్సు తిరిగియుండునేమోయని మీరాను తలఁచెనుగాని వ్యవధి లేదు. మఱునాఁడు బయలుదేఱవలసి యుండిరి. ఆరాత్రియన్ని సిద్ధము చేసికొని మఱునటిదినము రెండుజాములకు సుల్తానుఁడు ససైన్యముగఁ గదలెను. శ్రీరంగపట్టణమునకుఁ దిరిగి కొలఁదికాలములో మరలివత్తుమనుకొనిరి గాని, వారు తలంచినంతకంటె నెక్కువకాలము పట్టెనని చదువరులు తెలిసికొనఁ గలరు.

---

## ముప్పదియాఱవ యధ్యాయము

గుజల్‌హట్టి కనుమల క్రిందికి సైన్యముచేరెను. అప్పటి కాంగ్లేయులు దుర్గము తరువాత దుర్గమును నిర్నిరోధముగ స్వాధీనపఱచి కొనుచుండిరి. కఠోరవార్త లొకదానివెంట నొకటి తెలియుచున్నకొలఁది సుల్తానునకు రోషానలము హెచ్చుచుండెను.

పరంగీల నొక్కసారి పూర్తిగఁ బరాభవించిన నపకీర్తి తొలఁగునని యెంచి సుల్తానుఁడు భవానీనది ససైన్యముగ దాఁటెను. సుల్తానుని సైనికులమితోత్సాహముతోఁ బోరాడిరి. ఆంగ్లేయసైన్యము నిలువలేక పాఱిపోయి

మఱియొక సేనాధిపతి తానివచ్చుచున్న సహాయసైన్యమురాకను బ్రతీక్షించుచుండెను. ఇంతలో నఖండవృష్టికురిసి సుల్తానుసైన్యము చీకాకాయెను. పరంగీలు పలాయితులైరని తెలియునప్పటికి వానచేఁ బడిసి చిందఱవందఱగ నున్న సైన్యము చక్కఁబడియుండలేదు. సుల్తానుఁడు విజృంభించి యాంగ్లేయుల వెంబడింపవలసినదని యుత్తరు వొసఁగెను. పరంగీ లాత్మరక్షణ మొనర్చికొనుచు జాగరూకతతోఁ బోవుచుండిరి.

అలసియున్నందున నాంగ్లేయ సేనాధిపతి శావూరను చిన్నగ్రామములో నాగి శ్రమతీర్చికొన నిశ్చయించెను.

సుల్తానుఁడు సైన్యము నచటికిఁ గొంపోయెను. ఆంగ్లేయులు ధైర్యముతోఁ బోరాడి శత్రువులఁ దఱిమిరి. సుల్తానుఁడు పరాభవమొందెను. ఈ యవమానముచేతను గలహములో సమర్థుఁడైన యోధుఁడొకఁడు మృతుఁడగుటవలనను మనస్సుచెడి యతఁడాంగ్లేయులతోఁ బో రప్పుడు చాలించి, కావేరీనది మీఁది యీరోడ్డుపట్టణమునకు సైన్యమును నడిపించెను. ఇంగ్లీషు పటాలములు రెండుకలిసి వీరిపైకివచ్చెను. మహమ్మదీయసైన్య మీరోడ్డునుండి కోయంబుత్తూరునకుఁ బోయి యచ్చటనుండుటకును భయపడి దారాపురమునకేఁగి, యందున్నయాంగ్లేయుల హింసించి, స్వపరాజయజనితరోషము కొంత తీర్చికొనెను. ఆంగ్లేయులు సేలమునకు వచ్చుచున్నారని తెలియవచ్చినందువలనను, నచ్చటినుండి మైసూరునకుఁ బోవు కనుమ లసంరక్షితములై యున్నందువలనను, సుల్తానుఁడు శీఘ్రముగ నచటికేఁగెను. దక్షిణమున నున్న తిరిచినాపల్లి నుండి యుత్తరమున నున్న సేలమునుండి మైసూరిలోనికిఁ బోవు టాపూరు కనుమచుట్టునున్న దేశము నాంగ్లేయులు కాపాడుచుండిరి. పరంగీల సైన్యమెక్కువగ నచ్చటనుండుట చూచి తిరిచినాపల్లికి దక్షిణముగ నున్న దేశ మరక్షితముగ నుండుననితలఁచి సుల్తానుఁడు తిరిచినాపల్లి మార్గమునఁ బోయెను.

అతనిక్రోధానలంబు మొట్టమొదట శ్రీరంగములోని ప్రసిద్ధదేవాలయము మీఁదఁ బ్రజ్వరిల్లి పిమ్మటఁ గరమాండలు తీరమందలి యసంఖ్యాకం

బైన గ్రామంబుల ధ్వంసమొనర్చెను. గుళ్ళలోని పూజరుల దోచుటయకాదు ; విగ్రహముల ఖండించుటయగాదు ; గృహములఁగాల్చుటయ కాదు ; జనుల హింసించుటయ కాదు ; ఆ ముసల్మాను సైనికులదౌష్ట్య మేమని చెప్పవచ్చును! ముందుండిన మరాటీలకంటెను, బిమ్మట వచ్చిన పిండారీలకంటెను, హెచ్చుగఁ గ్రూరకార్యములు చేసిరి. టయాగరు తిరునామలికోటల స్వాధీనముచేసికొనిరి. సుల్తానుఁ డాంగ్లేయుల మీఁద ఫ్రెంచివారికిఁ గల ద్వేషమును హెచ్చించి సహాయమును బొందఁజూచెం గాని పుదుచ్చేరిమండలాధీశుఁ డతనిమాటల నుపేక్షించి ఫ్రెన్సురాజైన పదునాఱవ లూయికిఁ బంపఁదలఁచిన రాయబారమునకుఁ బ్రోత్సాహ మొసఁగలేదు.

మఱియు నుత్తరమునుండి నైజాము, మహారాష్ట్రులు వచ్చుచుండిరి. లార్డు కారన్‌వాలీసు గొప్పసైన్యముతో రాయవేలూరువద్ద నుండెను. ఇవ్విధమునఁ జిక్కులలో నున్నటిప్పు చెన్నపట్టణముపైఁబడి ధ్వంసము చేయవలయునను నభిప్రాయముఁజంపి, పూర్వోక్త శత్రువులఁ దార్కొనుట కరిగెను. ఎంత ప్రయత్నము చేసినను సుల్తానుఁడు సమయమున కెదుర్కొనఁ జాలనందున నిర్నిరోధముగ శత్రువులు మైసూరుపీఠ భూమి నారోహించిరి.

సుల్తానుని భార్యలు బెంగుళూరిలో నుండిరి. ఆంగ్లేయులు మహీశూరమునఁ బ్రవేశించినందున నేది యెట్లుండునో యని తలఁచి, యతఁడు నిజకాంతల బెంగుళూరినుండి తన శిబిరమునకుఁ గొనివచ్చి యచ్చటినుండి శ్రీరంగపట్టణమునకుఁ బంపుట కేర్పాటు చేసెను.

ఆంగ్లేయులు దినదినము విజృంభితులై పట్టణమువెనుక పట్టణము, నాక్రమించుచుండుట సుల్తానుని జనులకుఁ దల్లడపా టొనరించుచుండెను.

శిబిరవిషయ మిటులుండ శ్రీరంగపట్టణములోని వార్తల నారయుదము. సైన్యముపట్టణము వదలి చాలదినము లాయెను. అంతకుముందు సుల్తానుని భేరీరావంబులకుఁ బటహ నినాదంబులకుఁ దూర్యస్వనంబులకుఁ బ్రతిధ్వనించిన కోట, యిప్పుడు నిశ్శబ్దముగనుండెను. కాని శత్రువులు మీఁదికి వచ్చినప్పు

డెపరించుటకుఁ దగినయేర్పాటులు మాత్రము కావింపఁబడెను. ఇన్నిపను లిట్లు జరుగుచుండఁ గాశిమాలి యూరకుండవలసివచ్చెను. కర్మఠుఁడైన కాశిమాలి కర్మాభావము సహింపలేక సుల్తానుని సమీపమున నిల్చుండి యాంగ్లేయులతో బాహాబాహి పోరాడ నువ్విళ్లూరుచుండెను. కాశిమాలియొక్క చర్యల నతి కుతూహలములతోఁ గనిపెట్టుచుండిన యువతి యొకతె గలదు.

మన్మథానల దగ్గలంబయి పురపురం బొక్కుచు నొక్కొక్కవేళఁ బ్రియుని దూఱుచు, నొక్కొక్కతఱిఁ గుంటెనకత్తెయైన సోజనును బ్రతిమాలుచు నుండిన కుమ్మాబీయే యావనిత. సోజను గృహమువెడలి కొంచెము దూరమేగి కాశిమాలివద్దకుఁ బోవకయే తిరిగివచ్చి "అమ్మా నన్ను రావలదని వెడలఁ గొట్టెను" అని బొంకులాడ మొదలిడెను. చీకటిపడినది. దట్టమైన మేఘము లంబరమును గప్పియుండెను. గృహోపరిభాగంబులం బలలెత్తియున్న వృక్షముల కొమ్మలఁ జలింపఁజేయుచు, మూయఁబడిన గవాక్షముల తలుపులఁ గొంచెము తెఱచుచు, వాయువు వీచుచుండెను. కుమ్మాసోజనులు తప్ప మఱి యెవరు నచ్చటలేరు. మోహసంజాతదురంతసంతాపంబు కుమ్మాబీహృదయంబున నిమిష నిమిషంబునకు హెచ్చుచుండెను. ఆమె దిగ్గనలేచి గవాక్షముతీసి,

"సోజన్ ! నే నిఁక నాఁగఁజాలను. నడురాత్రి యైనది. వీథుల నెవ్వరును లేరు. పోవుదము లెమ్ము. ఇదియే సమయము." అని యాతురముతో ననెను.

సోజన్:—అమ్మా ! ఎక్కడకుఁ బోవుట ? కాశిమాలి యొద్దకా ?

కుమ్మా:—సోజన్ ! నీకుఁ దెలియదా! కాలముగడపకు; లెమ్ము. ఈమంట పట్టలేను. ముసుఁగు వేసికొనుము. నేను సిద్ధముగనున్నాను. నీవు త్రోవ యెఱుఁగుదువుగదా?

సోజన్:—అమ్మా ! కాళ్ల త్రిమ్మటయేకాని యేప్రయోజనము లేదు. నీకు మానాభిమానములు లేని యెడలఁ బోవచ్చును. వలదు వలదనిన కొలఁది మీఁదఁ బడుటయెట్లు ?

కమ్మా:—పాపాత్మురాల! మాటలతో సరిపుచ్చవలయు నని చూచుచున్నావు. నన్ను కడు చూడలేదు. చూచిన వదలిపెట్టడు. నీవాలస్యము చేయకుము. ఒకనిమిషములో నాప్రియుని కౌగిట నుండెదను.

సోజను:—అమ్మా! మనము పోయిన ట్లెవరికైనఁ దెలియును నేమో.

కమ్మా:—తెలిసినను నాకు లక్ష్యములేదు. మాపుట్టినింటికిఁ బోయితినని చెప్పెదను. భయమనుకొంటివా? ఈమాటలు నీకెందుకు. బయలుదేఱుము.

మాఱుమాటాడిన ముప్పువచ్చునని యెఱుఁగును గాన, సోజన్నీ తత్క్షణమే ముసుఁగువేసికొని కమ్మావెంటఁ బ్రయాణమయ్యెను. ఇద్దఱు మేడ మీఁదినుండి దిగుచుండ మెట్లకడ్డ నొక పరిచారిక యెదురాయెను. "మాపుట్టినింటికిఁ బోయివచ్చెదము. మావెంట నెవరిని రానీకుము" అని యామెకుఁ గమ్మాబీ చెప్పెను. ఇరువురు బహిర్ద్వారముదాఁటి వీథిలోఁ బ్రవేశించిరి.

కమ్మా:—సోజను! నీచేయి పట్టుకొననిమ్ము. చీకటిలో భయముగనున్నది. మేఘములు కారు క్రమ్మియున్నవి. గాలికూడ ఝుంయ్మని వీచుచున్నది.

సోజను:—కనుకనే తిరిగి యింటికిఁ బోవుదము రమ్ము. ఇంతభయంకరమైన చీఁకటిలో నేఁగుట మంచిదికాదు.

కమ్మా—ప్రాణముపోయిన నొప్పుకొందును. ఇంటికిఁ బోవుట కల్ల. ఈదినము నామనోహరునిఁ గౌఁగిలించి తీరవలయును. చేయి యిచ్చి పద.

శీఘ్రగమనమునఁ గొన్నిగొందులు దాఁటినతరువాత నొకయింటివద్ద నిలిచి యిదియే యనిచెప్పి కమ్మాచేతిలోనున్న నిజహస్తమును సోజను విడిపించికొని "రహస్యముగ నింతటనైనను దిరిగిపోవుదము రమ్ము. అవమానమొందిన పిమ్మటఁ జింతించిన లాభములేదు" అని సోజన్నీ వాక్రుచ్చెను.

"ఓర్వలేనిదానా! దుష్టాత్మురాల! కఠినురాల! నాతాపము నీవే మెఱుఁగుదువే. తలుపు నెట్టుము." అని కమ్మా పలికెను. తప్పదనుకొని సోజను గట్టిగఁ దలుపు గొట్టెను. తత్క్షణమే ద్వారము తెఱవఁబడెను. ఇద్దఱు మనుష్యులు లోపల నిల్చుండిరి. వారితో సంభాషింపకయే కమ్మాసోజను లెఱుకగల

నాతిపతో త్వరత్వరగ లోనికిఁ జనిరి. వీరు పోవుచుండగ నచ్చటనున్న మనుష్యులలో నొకఁడు "పటేలదృష్టవంతుఁడు" అనియెను. "నాకాశ్చర్యముగ నున్నది. ఇన్నిదినములనుండి కోటలో నున్నానుగాని యిదియెన్నఁడు చూడ లేదు." అని మఱియొకఁడు వాక్రుచ్చెను. ఈమాటలు వినుచునే వారు కాశీమాలియున్న గదియొద్దకుఁ జేరిరి. గవాక్షముగుండ ఏసోజును తొంగిచూడఁ గాశీమాలి చదువుకొనుచుండెను. "అమ్మా! ఇతఁడే. లోనికిఁబొమ్ము" అని యామెచెవిలోఁ జెప్పఁగఁ గుమ్మూ ధైర్యసాహసములు గలయువతియే, యైన నాసమయమున జంకుచు గదిలోఁ బ్రవేశించెను.

కాశీమాలి—(పుస్తకము మడిచి) ఎవతెవు నీవు? బయటఁ గాపుండియున్న గాఁడిదలు నిన్నెందుకు రానిచ్చిరి?

కుమ్మూబీ మాటాడలేక పరవశయై యతనిపాదముల పైఁబడి పిక్కలను గౌఁగిలించుకొని యేడ్చెను. పైనివేసికొనిన ముసుఁగు తొలఁగినందున మేఘవిముక్తమైన చంద్రబింబమువలెఁ బ్రకాశించుచున్న యామెముఖమును వీక్షించి లేవనెత్తి "నారీరత్నమా! ఇంతచక్కనిదానవు. నీ వెవతెవు?" అని సానురాగముగఁ బ్రశ్నించెను.

కుమ్మూ—మిమ్ముఁ బ్రేమించి మీమీఁదఁ బ్రాణములు పెట్టుకొని, యాఁకలిగొన్నవాఁ డన్నమునువలె మిమ్ముఁబొందఁ నిరీక్షించుచున్న యా యువిదయే యిప్పుడు మీచేతులలో నున్నది.

కాశీమాలి—నీవు భోగమువారి పడుచుదానవు కానియట్లున్నావు?

కుమ్మూ—కాను. కాను.

కాశీ—అయితే నీవు మగనాలివి. కాకపోయిన నీ కాయుంగర మేల యుండును?

కుమ్మూ—మనోహరా! దాఁపనేల? చెప్పెద నాలకింపుఁడు. నాభర్త ముదుసలి. ఇంటివద్ద లేఁడు. ఉన్నను బ్రేమింపఁడు. నావంకఁ జూడనైనఁ జూడఁడు. కనుక మగఁ డుండియు లేనిదానను. పెండ్లియయ్యుఁ గాని

దానను. నిన్నుఁ జూచినది మొదలు నామనస్సంత నీమీఁదనే యున్నది. నాచక్కదనము నీది. నాప్రాణములు నీవి. నేను మీదానను. రక్షింపుము ప్రేమింపుము. కౌఁగిటఁ జేర్పుము.

ఆ మోహనమా! ఎంతటిదానవు! నీతిమంతుల గుండెలఁగుండ నీరు చేయుదువుగదా. అనురాగరసపూరితములైన యాకన్నులామనోహరములైన మాట లానవవికసిత కుసుమసదృశమైన వదనము కాళిమాలిం బరవశు నొనర్చెను. ఆమె శరీరము మన్మథానలముచే నుడుకెత్తి యుండెను. అత్యంత మోహాంధుఁడై నామెను కాళిమాలి కౌఁగిటఁ జేర్చి తలవెండ్రుకల సవరించి కపోలములు ముద్దు బెట్టెను. ఆమె గాఢానురాగయై యతనివక్షోదేశమున నిజోరస్స్థలము నుంచి యాశ్లేషించి హృదంతరాళోద్గతమైన మోహాతిరేకవాక్యములఁ బలికెను. ఆసమయమున నీమె ఖానుని భార్య యైయుండునా, యనుతలంపు మనస్సులో నతనికిఁ బట్టెను. "ఇంటివద్దలేని పకీరుఁడే. ఇదివఱకున్న భార్యను వదలిన నాయి నమే." యని తనలోఁ దా ననుకొని "యువతీ! దేవుఁడుసాక్షిగాఁ జెప్పుము. నీ వెవతెవు? నా కనుమానముగ నున్నది. పహెమాను ఖానుని భార్యవు కావా?" యని యంతఁ దాతురముతో నడిగెను. ఆమె మాటాడలేకపోయెను; నోరు మూఁ సెను; కన్నులు విభ్రమము చెందినవి. ఎన్నిసారు లడిగినఁ బ్రత్యుత్తరము లేదు; మొగ మాకస్మికముగ వాడినది; చేతులు పట్టువదలెను. కాళిమాలి గట్టిగఁ బట్టికొనియుండనిచో నామె క్రిందఁబడియుండును. హఠాత్తుగ నట్టి దా విషయము కనుఁగొనుటచే నైరాశ్యంబునఁ బొడమిన దుఃఖాతిశయంబు వలన నామె మూర్ఛిల్లెను. "అల్లా! అల్లా! తెలివితప్పి పడిపోయినది. ఏమి చేయు దును?" అని కాళిమాలి యఱచెను. ఆమాటలు విని లోనికి సోజన్బ ప్రవేశించెను.

కాళి—సోజనూ! చెప్పుము. చెప్పుము. ఈమె ఖానుని భార్యకాదా?

సోజన్—స్వామీ! అడుగనేమి? మిమ్ము వరించినది. మీయదృష్టము మంచిది.

కాళి.—నే ననుకొనినట్లే యైనది. అదిగో జల మక్కడ నున్నది. అచ్చటి కీపెను దీసికొనిపోయి మొగముమీఁద నీళ్లు చల్లుము. తెలివి వచ్చును. ఈ రహస్యము నే నెవరికిఁ జెప్పను. నాతో నశింపవలసినదే. ఈవిషయ మామెకుఁ జెప్పను. ఖానుఁడు నాకు మిత్రుఁడు. నాకు మేలుచేసినవాఁడు; గురు సమానుఁడు. అతనియెడ ద్రోహ మొనర్పను.

కాళిమాలి యాగదినుండిపోయి యదృశ్యుఁడయ్యెను. కుప్మూ కన్నులు తెఱచి యట్టిటు చూడ, సోజను తప్ప నెవరును లేరైరి. సోజను జరిగినదంత చెప్పెను. లజ్జ, యవమానజనితక్రోధము, మాత్సర్యము మనమున ముప్పిరిగొనఁ గుమూబీ సోజన్ వెంటరా నిల్లు సేరెను.

---

## ముప్పదియేడవ యధ్యాయము

హార్బర్టు వివిక్తదుర్గమునకుఁ బంపఁబడినతరువాత నెలలు గడచినవి. అతనికి మోక్షాశ యావంతయు లేకుండెను. ఏవైపునకుఁ దిరిగి చూచినను గను చూపుమేర నిరంతరముగ వ్యాపించియున్న పర్వతపంక్తులు దృగ్గోచరములై నైరాశ్యమును హెచ్చించుచుండెను. ప్రియబంధువుల నందఱఁ దలఁచికొని వారు తనను మృతునిగ భావించియుందు రని చింతించునప్పు డతనికంటినుండి యశ్రుబిందువులు జారుచుండెడివి. ఇతఁడు నివసించిన పర్వతము లత్యున్నతము లగుటచే మిక్కిలి చల్లగ నుండెను. మనోహరములైన పూలచెట్లు విరళముగ నుండెను. ఇంగ్లాండులో మాత్రమే యుండు నని హార్బర్టు తలఁచిన పుష్పము లనేకము లతని కచ్చటఁ గనఁబడెను. సూర్యకాంతి ప్రసరించినప్పుడు తళతళ మెఱయు నీరములతో సెలయేళ్లు మనోజ్ఞముగఁ బ్రవహించుచుండెను. పక్షులు నానావిధధ్వనులు కావించుచుండెను. ఇవియన్ని ప్రియావియుక్తుండైన కామికింబోలె స్వేచ్ఛారహితుండైన హార్బర్టునకు సంతోషదాయకములు కాఁజాలకపోయెను.

ఇవ్విధమునఁ గాలము గడచెను. అతనినిఁ గనిపెట్టియున్న వారిలో నప్పుడప్పుడు మార్పులు జరిగి, యొకనాఁడు హిందూస్థానిభాష మాటాడఁ గలిగిన యొక క్రొత్తయతఁడు వచ్చెను. తప్పించుకొని పోవలయునని హార్బ్రట్టునకు బుద్ధి వోడమెను. కాని యా సాంద్రారణ్యమునందు మార్గదర్శకుఁడు లేకుండఁ బోవుట దుస్సాధ్యము. హిందూస్థాని వచ్చిన యతనితో మాటలాడ హార్బర్ట భిలషించెను గాని యందఱ యెదుటఁ బల్కరించుటకు వీలు లేదాయెను. కొన్నిదినము లైనతరువాత నతఁడు కోరిన సమయము వచ్చెను. ఆపర్వతములమీఁద మిక్కిలి శీతముగ నుండుటవలన హార్బర్టెండలోఁ బరుండి చలి గాచికొనుచు నల్దిక్కుల వ్యాపించియున్న యాయరణ్యమును వీక్షించుచుండెను. మేఘము లెడనెడ సూర్యుని నాచ్ఛాదించుటచేఁ గలిగిన నీడలు వృక్షములను గప్పి, పర్వతశిఖరములపై వ్యాపించి, లోయలలోఁ బ్రేలాడి భవానీస్ఫటికనీరంబుల నిస్తేజంబులుగఁ జేసి, యొకచోటినుండి మఱియొకచోటికిఁ బోవుచు, హార్బర్టుయొక్క దృష్టి నాకర్షించుచుండెను. వాయువు నిశ్చలముగ నుంటచే వృక్షాగ్రముల యందున్న పల్లవములు సహితము కదలకుండెను. అంతట నిశ్శబ్దముగ నుండెను గాని, పుష్పములపైనుండి లేచి స్వస్వాస్త మధుకోశస్థానంబులగు లోయలలోనికిఁ బోవు భ్రమరముల ఝుంకారములు మాత్ర మప్పుడప్పుడు వినవచ్చుచుండెను. తటచుగ మనోవిస్తృతత్వమునకు నిదానంబైన తాదృశ నిశ్చంచలసమయంబున హఠాత్తుగఁ దుపాకులధ్వని శ్రోత్రగోచరం బయినట్లు హార్బర్టు తలఁచి దిగ్గనలేచి నిబ్బరించి ధ్వనివచ్చినవైపునకు మరలి యాలకింపఁ బ్రారంభించెను.

ఇంత యాకస్మికముగ నింత యాతురముతో నతఁడు నిలువఁబడుట చూచి యతని పార్శ్వమునఁ బరుండియున్న హిందూస్థానిభాష మాటలాడఁ గల యాతఁడు "సాహెబ్! ఏమి చూచుచున్నావు?" అని యడిగెను.

హార్బ—అఱపకుము. మెల్లఁగ వినుము. అదిగో తుపాకి—అదిగో—ఆధ్వని. యాలకింపుము. ఇది యెక్కడిదియై యుండును?

క్రొత్తమనుష్యుఁడు—దేవుని కెఱుక.

హార్బ—అదిగో పొగ చూడు.

క్రొత్త—నిజమే.

హార్బ—నీవు హిందూస్థాని చక్కఁగ మాటలాడఁగలవు. ఇదివఱకు నన్నేల పల్కరింపలేదు?

క్రొత్త—ఇతరులముందఱ నీతో నేను మాటలాడఁగూడదు. నీ వేమైన సైగ చేసినను మాటలాడినను నాప్రాణమునకు మోసమువచ్చును. అట్లెన్నఁడు చేయకుము.

హార్బ—నేను జాగరూకుఁడనై యుండెదను. నాప్రాణమునకును నీప్రాణమునకును మోసము తెచ్చిపెట్టను. అయితే తక్కినవా రెచ్చట నున్నారు.

క్రొత్త—కొందఱు వేటకుఁ బోయిరి. మిగిలినవారు దుర్గములో నున్నారు.

హార్బ—అదిగో! ధ్వని.

క్రొత్త—చూడు. పొగకూడఁ గనఁబడుచున్నది.

హార్బ—(చూచి చూచి) ఏది? నా కగపడలేదు.

క్రొత్త—నాలువిధముల సుల్తానుఁ డచ్చటనుండి యుద్ధము చేయించుచుండును. అంతదూరమునుండి వినవచ్చుట యత్యద్భుతముగ నున్నది.

ఏ రీతీరున సుమా రఱగంటవఱకు నాలకించిరి. అంతట సాయంకాల మున నహమ్మదు (క్రొత్త మనుష్యుని పేరు) పోయి మిగిలినవా కీవిషయము చెప్పెను.

చీఁకటి పడినది. ఉపరిభాగంబున నాకాశము నల్లగ నలుపు గ్రక్కు చుండెను. చీఁకటిలోఁ గొంతసేపున్నతరువాత సమీపముననున్న వస్తువులు కనఁబడుట సహజముగాన, వారు తమప్రక్కలనున్న చెట్లు తాలు మాత్రము చూడఁగలిగిరి. హార్బర్టును వెంటఁబెట్టుకొని యందఱు పర్వతశిఖర మారో హించిరి. కాని యేమి వీక్షింపఁగలరు? ఏవైపుచూచిన నభేద్యంబయిన తమోబాహుళ్యం బనంతంబైన కాలతత్వంబు మానవబుద్ధినిం బోలె

దద్ద ప్రెక్కలను దనలోనికిఁ జొరనీకుండెను. దిగ్వలయ మగనాదు లంధకార లీనంబు లాయెను. వారందఱు కొంతసేపాసక్తితో నాలోకించిన తరువాత నిదివఱకు ధ్వనివచ్చిన పైపుననే వెలుతురు గనబడెను. ఒక మంట గుండ్రముగఁ దిరుగుచు గాలిలోనికి లేచి క్రిందఁబడెను. ఇట్టివి యొకటివెంట నొకటి యనేకములు కనఁబడెను. ఆమంటల వృత్తాంతము హార్బర్టెఱుఁగి నిజదేశీయులం యుద్ధమునందుఁ గాల్చుచుండిరేమో యని, తహతహపడెను. అచ్చటనున్నవా రంద ఱొకరిమొగ మొకరు చూచికొనుచు నామంట లేమై యుండు నని యాలోచింపఁ దొడఁగిరి. చివర కహమ్మదు "మాకాండ్రు స న్నడుగుచుచు న్నారు. ఆమంట లెక్కడివి? ఆకాశమునుండి పడుచున్నవా? పరంగీల కీ కిటుకులన్ని తెలియును. కనుకఁ జెప్పుము" అని హార్బర్టు నడిగెను.

హార్బ:—ఆకాశమునుండి కాదు. అక్కడ ముట్టడి జరగుచున్నది. ఫిరంగులు మొదలగునవి కాల్చుచున్నారు. సుల్తానుఁడు యుద్ధము చేయుచున్నాఁడేమో?

అహమ్మ:—ఎఱుఁగను. కనుఁగొని చెప్పెదను. (దగ్గఱనున్నవారి నడిగి) అవును. యుద్ధము జరగుచున్నదని వినికిడి గలదు. పరంగీలు బార్మహాలులో నున్నారని తెలియుచున్నది.

మంట లగపడుట మానెను. శీతబాధ సహింపఁజాలక యందఱు భూధరాగ్రమునుండి దిగి స్వస్వస్థానంబులఁజేరి శయనించిరి. హార్బర్టునకు మాత్రము నిద్దుర పట్టలేదు. ప్రసూతిసమయంబున గర్భస్థపిండంబుంబోలె, నతఁడు మోక్షమార్గము వెదకుచుండెను. అసహాయముగఁ బోవలయు నని తలంచెను గాని, యధ్వానములై యోజనములకొలఁది వ్యాపించియున్న యరణ్యములు, నగాధములై భయావహముగనున్న పర్వతప్రపాతములును, [illegible] రా నిరుత్సాహుఁ దగుచుండెను. చింతింపఁ జింతింప మోహ మెక్కుడు. దూరమై నిరాశ హెచ్చెను. అహమ్మదుతోఁ జెప్పుదునా? ఇద్దఱునొకరి కింత భాష మాటలాడఁగలరు. అహమ్మదు బీదవాఁడు. ధనమిచ్చె

స్థితిలో లేడు. స్వేచ్ఛకొఱకు హార్బర్టు వేలువేలయిన నిచ్చుటకు సిద్ధముగ నుండెను. ఇతనినిఁ గనిపెట్టవలసినపని అహమ్మదునకు వచ్చినది. అందఱు గాఢ నిద్ర చెందియుండిరి. హార్బర్టునకుఁ గావలియుండవలసిన వాఁడైనను నడురాత్రి యగుటచే నహమ్మదు నిద్రాభరంబునఁ గూరుకుపాట్లు పడుచుండెను. నిట్టూర్పు విడిచి "అహమ్మద్ ! అహమ్మద్ !" అని హార్బర్టు మెల్లగఁ బిలిచెను. అతఁడు పలుకలేదు. ఎవరువిందురో యని దడిసిదడిసి మరలఁ బిలిచెను. అహమ్మదు విని "ఎందుకుఁ బిలుచుచున్నావు" అనియడిగెను. "నాసమీపమునకు రమ్ము. రహస్య మాడవలసియున్నది" అని హార్బర్టు నుడివెను. అహమ్మదు లేచిపోయి హార్బర్టువద్దఁ గూర్చుండెను. అది యొక సుగుణ చిహ్నముగ నున్నందునఁ గొంచెము ధైర్యముతెచ్చికొని "అహమ్మదూ నీవు నామీఁద దయగలిగి యున్నావు. నీఋణము తీర్చుటెట్లు ? ఇంకొక సహాయము నీవలనఁ గావలసి యున్నది." అని హార్బర్టు వాక్రుచ్చెను.

అహమ్మ—మిమ్ము నమ్మరాదు. పరంగీలు మోసకాండ్రని మావాండ్రు చెప్పుదురు.

హార్బ—మావిరోధు లట్లు చెప్పుదురు. నీవే సాక్షి. ప్రాణములైన నిత్తుముగాని, యాడినమాట తప్పము. నమ్ముము.

అహమ్మ దేమియు బదులు చెప్పలేదు.

హార్బ—అహమ్మదూ ! నా కీసమయమున సహాయ మొనర్పుము. నిన్ను నమ్మియున్నాను. నాప్రాణములు నీచేతిలో నున్నవి. నామీఁద దయగలిగి వినుము. ఈమాటలు మఱియొకని కెవ్వనికిఁ జెప్పకుము. కొన్ని సంవత్సరములనుండి చెఱలో నున్నాను. నాకుఁ ఏ దండ్రులు గలరు; తమ్ములుచుంరు. వీరందఱికంటె నెక్కుడైన మఱియొకవనిత గలదు. నేను మృతి నొందితినని వారందఱు నాశవదలిగొని దుఃఖించుచున్నారు. నాతండ్రికి చూడఁగలిగామరుడను. వారిసంతాపము తలఁచినసైన జాలిరాదా? ఆసహించిరి. - ...

తమో బాహుళ్యక

అహమ్మదు ప్రత్యుత్తర మిచ్చినవాఁడు కాఁడు.

హార్బ—అహమ్మదూ! నీకు దయలేదా? నావంటి దీనుని రక్షించుటకుఁ గోరిక వుట్టదా? తలిదండ్రులుగల కొడుకవు గావా? తమ్ములు చెల్లెండ్రు గల యన్నవుకావా? భార్యగల భర్తవుకావా? వీరందఱు ని న్నెట్లు ప్రేమింతురో యెఱుఁగవా? నీ వగపడకున్న నెట్లు చింతింతురో తెలియదా?

అహమ్మ—అన్ని యెఱుఁగుదును.

హార్బ—నాకు భార్యలేదు. ఆదుఃఖముమాత్రము తప్పినది. అయినను విఫల మనోరథయై నన్ను మృతునిగభావించి చింతించు నొకతరుణి గలదు. దుఃఖముచేఁ బొగులుచున్నవారికి సుఖము, నిరాశావ్యాకులితుల కాశ కలుగఁ జేసి పుణ్యాత్ముఁడ వగుట కేల వెనుదీయుచున్నావు?

అహమ్మ—సాహెబ్! నే నేసహాయమును జేయఁజాలను.

హార్బ—చేయఁగలవు. మావాండ్రు సమీపమున నే యున్నారు. వారియొద్దకుఁ గొంపొమ్ము. నీవు గొప్పబహుమాన మందఁగలవు.

అహమ్మ—నాకు లక్షరూపాయ లిచ్చినను నట్టిపని చేయను గాని, నీమొగము చూచిన జాలియగుచున్నది. నీవు తక్కిన పరంగీలవంటివాఁడవు కావు. నిన్ను నమ్మెదను.

హార్బ—నమ్మును. కృతఘ్నుఁడను గాను. నాప్రాణములు నీచేతిలో నున్నవి. ఏమిచేసినను సరే. నేను నీవాఁడను. ఇఁక నేమి చెప్పఁగలను?

అహ—చాలును. నిన్ను నమ్ముచున్నాను. కోయంబుత్తూరువఱకుఁ గొనిపోయెదను. మావా రచ్చట లేకపోయిన మన యిద్దఱప్రాణములకు మోసము వచ్చును. నాకుఁ దలిదండ్రులు గలరు. భార్య గలదు. కుమారుఁడు గలఁడు. సుల్తానున కీవిషయము తెలిసినయెడల వారినిఁ బీడించును. నీకొఱ కింత తెంపు చేసితిని.

హార్బ—పరాక్రమశాలీ ! అది నే నెఱుఁగుదును. నీవు సోదరుఁడవని తలఁచుచున్నాను. బహుమాన మింతయని నిశ్చయింపవలసియున్నది.

అహమ్మ—అది యిప్పు డడుగను. నీవు పెద్దమనుష్యునివలెఁ గనఁబడుచున్నావు. నీకుఁ దెలియదా ?

హార్బ—ప్రాణములతో నన్ను మావారిలోఁ గలిపితివేని నీవు బ్రతికియుండు నంతకాలము దారిద్ర్య మెఱుఁగకుందువు. ఉద్యోగము కోరుదువేని నీ సాటివారందఱు నిన్నుఁజూచి యసూయ పొందు పదవినిఁ బడయఁగలవు. ఎప్పుడు బయలుదేఱుదము ?

అహ—రేపు జాడ తెలియును. తెలిసినతరువాత నేర్పాటుచేసెదను.

ఆంగ్లేయులు కోయంబుత్తూరును ముట్టడించిరనియు సైనను సుల్తానునకే యెక్కువ జయము కలుగుచున్నదనియు, మఱునాఁడు వార్త తెలిసెను. ఆసాయంత్రము "మీవారికంటె సుల్తానున కెక్కువజయము కలుగుచున్నదఁట. ఇప్పుడు పోయిన మేలగునా?" యని యహమ్మదు హార్బర్టు నడిగెను.

హార్బ—ఏమైనను బోయి తీరవలయును.

అహ—అయితే వేటనెపము పెట్టి రేపు తీసికొనిపోయెదను. నిన్నట్టిట్టు త్రిప్పవలయునని యిదివఱకే చెప్పియున్నాను. మావారు ఒప్పికొనిరి. సిద్ధముగ నుండుము. చాలదూరము నడువవలయును. త్రోవలో నాలస్యము చేయుంట వచ్చుటకే.

ఆనాఁడు తెల్లవారెను. సాంద్రహిమంబు పర్వతారణ్యంబులఁ గప్పియుండెను. పథంబు దృగ్గోచరము కాకుండెను. కాని సూర్యోదయ మైన తరువాతఁ గ్రమక్రమముగ మంచు విరిసిపోయెను. అహమ్మదు హార్బర్టులు బయలుదేఱిరి. మార్గమధ్యమున సృష్టివైచిత్ర్యంబుల నుద్ఘోషించు నైసర్గిక విలాసదర్శనీయప్రదేశంబుల నతికుతూహలముతో హార్బర్టు వీక్షించుచుండ నహమ్మ దామనోజ్ఞప్రదర్శనముల మూర్ఖుఁడు జ్ఞానమునుంబోలె, సరకు గొనకయే పోవుచుండెను. సౌరభవంతంబులై మార్దవవికాసంబుల మూర్తులో

యన మనోహరంబులై యున్న కుసుమంబుల నవచయించి "హా! ఇట్టి భూతలస్వర్గం బిచ్చట నున్నదని మా వా రెఱుంగరు గదా" యని యాశ్చర్య పడుచుఁ దా నప్పుడు కోసిన పుష్పములు చూపి తనవారిని సంతోషింపఁ జేయవలయునని హార్బ ర్టాతుస్సుక్యుఁడై యుండెను. కంటకావృతములై, నిమ్నోన్నతములై, శిలాకర్కశములైన యధ్వముల నడచి నడచి యలసట చెందిరి.

ప్రొద్దు గ్రుంకుచుండెను. పశ్చిమదిశయందు మేఘములు రక్తవర్ణము వహించియుండెను. మహాకారములైన పర్వతముల నీడలు విశాలారణ్య భూములమీఁదికి శీఘ్రగమనమునఁ బ్రాఁకుచుండెను. వృక్షవనీజాగ్రభాగంబులు సువర్ణవికారంబులునాఁ బ్రకాశించుచుండెను. విశంకటగండశిలా తలంబుల స్రవించు జలధార లస్తమయకాంతి ప్రసరణంబునఁ గనులు మిఱుమిట్లు గొనునట్లు మెఱయుచుండెను. "అలసితివా! సాహెబ్! పరంగీలు సుకుమారు లనుకొంటిని. నీ వీకష్టముల నోర్చుట వింతగా నున్నది" అని యహమ్మ దనెను.

హార్బ—ఆశ్చర్య మెందుకు? ఇంక నొకగంటసేపుకూడ శ్రమలేక నడువఁ గలను. మా స్థైర్య సాహసములు నీ వెఱుఁగవు.

అహ—అయితే పద. చీఁకటిపడుచునుక నడుచుదము. ఈపూవులన్ని యెందుకు మోసికొని వచ్చుచున్నావు? పాఱవేయరాదా? తేలికగ నుండును. ఈచిచ్చిపూ లెక్కడఁ జూచినను గలవు.

హార్బ—కాదు కాదు. ఇవి మాదేశములో దొరకుపుష్పములు. నాస్నేహితులకుఁ గోసికొని పోవుచున్నాను. స్వదేశపదార్థముల విదేశమునఁ గనుఁగొనుట యెంతసంతోషకరము? నీ వెంతత్వరగ నడిచిన నే నంతత్వరగ వచ్చెదను. ఈపూవులు నిన్నేమిచేసినవిలెమ్ము. పద. ఇవి నాకు బరువుకాదు.

అర్ధక్రోశము నడిచి యొకస్థలమును చేరిరి.

అహ—ఈదిన మిచ్చటఁ బరుండుదము. అనేక పర్యాయము లిదిగో యీరాతిక్రింద నిద్రపోయితిని. ఈయడవిలోఁ దిరుగు చెంచులు మొదలగు

వారు మనపట్టను ఏత్తురు. వారికి నాలుగు పోగాకుముట్లిచ్చినట్లైన సంతోషింతురు.

హార్బ——విచిత్రము.

అహ——వారినిగూర్చి సొంతముగఁ జెప్పెదను. కొర్తాలిక్రిందఁ బరుండుము. చలికి వెచ్చగ నుండును. నేను గొన్నిచిదుగులు, కంపలు తీసికొని వచ్చెదను. మంటవేసి కొందము.

కత్తి తుపాకి హార్బర్టువద్దఁబెట్టి కట్టెలకై యహమ్మదు పోయెను. హార్బర్టేకాంతముగ నారాలిక్రింద విశ్రమించుచు స్వజనంబును జూచు సమయము సమీపించె ననిసమ్మోదముతో నుండెను. తల్లి, తండ్రి, అమీ యతని మనోనేత్రములకు గోచరమైరి. కనులుమూసికొని ప్రియానురాగముల జ్ఞప్తికిఁ దెచ్చికొనుచుండెను. ఆసమయమున నాకస్మికముగ భయావహంబైన గర్జనము గుండెబ్రద్దలగునట్లు శ్రోత్రగోచరంబాయెను. వెంటనే శూలసమానంబై దీర్ఘంబై హార్బర్టునకు మరణపర్యంతము మఱపునకురాని యొక యార్తనాదము వినవచ్చెను. కలగుండుపడి యతఁడు తనవద్దఁబడియున్న ఖడ్గము నొరలోనుండి లాగి ధ్వనివచ్చిన వైపునకుఁ బరుగెత్తెను. కాని యేమి ప్రయోజనము ? కట్టా! అతని స్వాతంత్ర్యదాత ! మార్గదర్శకుఁడు! తన్ని మేషముతోఁ బోయెను.

---

## ముప్పదియొనిమిదవ యధ్యాయము

వివిక్తాధ్వానమరుభూములఁ గ్రమ్మరి క్రమ్మరి పిపాసార్తుండైన పాంథుండు జలకలశంబుగని యవర్ణ్యౌత్సుక్యంబుతో వక్త్రసమీపమునకుఁ దెచ్చికొనఁ దడాలునఁ దత్పాత్రం బనివార్యంబైన యొకానొక శక్తిచే నెగురఁగొట్టంబడుట వీక్షించినచోఁ బౌరుషవాదుల చిత్తసమున్నతి విజాతీయ తేజస్సంయోగంబునఁ బార్థివంబుల రూపంబుంబోలెఁ బరిణామమొందక

మెట్లు ఎఱుఁగును? దీర్ఘంబై, ప్రకీర్ణంబై, నిరంతరంబై, నిమ్నోన్నతపథంబై, సంభోస్వకాలయవనికా దుర్జ్ఞేయంబైన జీవయాత్రయం దాకస్మికకార్య కారణంబుల నెఱుంగ నెవ్వఁ డోపు? యాదృచ్ఛికంబులైన సుఖదుఃఖంబుల నిక్కృతిం బొందక, ద్వంద్వంబుల నతిక్రమించు కష్టంబులు సంభవించినపుడెల్ల స్వసంచిత్తోత్సాహముతోఁ బ్రయత్నించి నిజపుమార్థంబు సాధించు కర్మ వరుఁడు ధన్యుఁడు; అతఁడే జ్ఞాని. అతఁడే తపస్వినధన్యుఁడు; అతఁడే పరమ ... హార్బర్టు సహజముగ ధైర్యవంతుఁడే యైనను సద్యోరసమయమున మనస్సుని స్వాధీనమం దుంచికొనలేక పోయెను. ఉన్మత్తునివలె నిర్భయముగ నాలుదెసలఁ నట్టిట్టు తిరిగెను. అయ్యో! నిజకార్యము చవుజెంచి తలి ద్రుల నాలుబిడ్డల దుఃఖాంబుధి ముంచి పట్టుదవి నహమ్మదు ప్రాణంబులం గోల్పోవుట హార్బర్టున కెంతసంతాపము కలిగించియుండదు?

స్వదేశీయులఁ జూచు సంతోషము, స్వసంఘమునందుఁ జేరు నానందము, స్వాతంత్ర్యము పొందు భాగ్యము నతని కనులెదుటనున్నట్లుగ కడ చివరకు—గటా—దిగంతములు దాఁటి యదృశ్యము లయ్యెను. పర్వతములు ప్రతిధ్వనించునట్లు "అహమ్మదు! అహమ్మదు!" అని యతఁడఱచిన యఱపు లిన్నిన్ని యని చెప్ప నలవికాదు. ఏదుష్టమృగ మేదిక్కున కీడ్చికొని పోయెనవో యని వెతక నారంభించెను. కొంతవఱకు జాడ కనఁబడెం గాని పిమ్మటఁ గంటకావృతము లైన పొద లభేద్యముగ నుండెను. ఎట్టకేలకు మొదట విశ్రమించిన రాతిక్రిందికి హార్బర్టుచేరెను. బుద్ధి చెదరియుండుటచే వ్యాఘ్రముయొక్క భయంకరధ్వానంబు నహమ్మదుయొక్క యార్తనాదంబు మరలమరల వినఁబడినట్లుండి హార్బర్టు దిగ్గన లేచుచుండువాఁడు.

చీఁకటి హెచ్చినది. వాయువు వీవసాగెను. మేఘము లాకాశమునఁ దిరుగాడుచుండెను. అతఁడు రాతిచాటున నుండుటవలన శీతబాధ తగ్గక పోయినను గట్టె, కంప వేసి మెల్లఁగ రగులఁజేసిన మంటమాత్ర మారిపోకుండ నుండెను. వాన యధికమైనది. కొండలు నెత్తములచుట్టును లోయలయందును

సెలలయందును భయంకరముగ శబ్దించుచు ఝంఝానిలంబు విసరఁదొడంగెను. ఏదిక్కు వీక్షించిన నభేద్యమైన తమోబాహుళ్యంబు దప్ప వేఱొండతనికి దృగ్గోచరము కాదాయెను. కర్తవ్యముం గూర్చి యతఁడు చింతింప సమకట్టెను. ఆగుల్మంబు లాకంటకంబు లాప్రపాతంబు లావన్యసత్త్వంబులఁ గడచి యెట్లు పోఁగలఁడు? ఒకవేళ నివియన్ని దాఁటి మైదానముచేరినను విరోధులచేఁ బట్టుపడి నిరయంబుకంటె ఘోరంబైన చెఱసాలలో నుండవలసి వచ్చును. మఱియుఁ బర్వతములపై నిప్పుడు మనస్సున కొకవిధమున దుఃఖము నుపశమింపంజేయుచున్న శీతల మందానిలంబులు, కుసుమసౌరభంబులు, మనోజ్ఞప్రదర్శనంబులు దూరము కావలసివచ్చును.

ఐనను హర్బర్టు నిరుత్సాహము చెందలేదు. స్వదేశీయులు సమీపమున నుండి రని, యచటికిమార్గము సులభముగఁ గనుఁగొన వచ్చు నని, యతఁడు తలఁచి ధైర్య మవలంబించి యలసియుండుటచేఁ గనులుమూసికొని నిద్రించెను. తెల్లవాఱెను. హర్బర్టు కన్నులు తెఱచెను. కాని యేమి యగపడినది! ప్రకృతి ముసుఁగువేసికొనెనో యన మెయిలు సాంద్రముగ వ్యాపించి యుండెను. హర్బర్టది చూచి నిరాశానిబిడజంబాలనిర్మగ్నుఁడై కొంత సేపటికి మనస్సుకుదుటఁబడుడు, నాలోచించి తిరిగిపోవుటయే యుక్తమని నిశ్చయించి కొనెను. అహమ్మదుయొక్క కత్తి, డాలు, తుపాకి యతనిపార్శ్వమునఁ బడి యుండెను. ఘట్టనచేసిన మందు దమ్ముకొని యుండుటవలనను మందుగొమ్ము గుండ్లసంచులు నహమ్మదు మొలయందే కట్టఁబడి యుండుటచేతను దుపాకి నిరుపయోగకరముగ నుండెను. అతఁడు త్రోవలోఁ గోసినపుష్పంబులు స్వకీయ స్వజననిరీక్షాశవలె వాడియుండెను. అది యతఁడు స్వాతంత్ర్యమునొంది మిత్రులతోఁ గూడి సంతోషముగ నుండవలసిన రోజు. అయ్యో! అట్టి శుభదిన మెప్పు డతఁడు ప్రాపించును? అచ్చటనున్న యాయుధములఁ దీసికొని తిన్నగ వచ్చినత్రోవం బోవఁ దొడఁగెను.

వాన మరలఁ బ్రారంభమైనది. కదధ్వ మెడ తెగక యత్యంత శ్రమాసాపేక్షముగ నుండెను. వారు భక్షించుటకై తెచ్చిన రొట్టెలమూట యపహ ష్మదః వీపున నున్నందున రాత్రినుండి హర్బర్టునకు భోజనములేదు. అందుచే క్షుద్బాధ దుస్సహముగ నుండెను. ఆనాఁడు పగలంత నడచి నడచి కొన్ని సమయములఁ ద్రోవతప్పి, కొన్ని వేళలఁ గాలుజారి క్రిందఁబడి కొన్ని యవసరంబులఁ గ[illegible]దేహుఁడై, యొకపట్టు మిట్టలెక్కి పల్లములకు దిగునలసట, యొకప్రక్క నాయుధములబరువు, నొకవైపు దుస్సహమైన యాఁకటిబాధ శోషిల్లఁజేయ, నతఁడు గన్నులలోఁ బ్రాణములుపెట్టుకొని రాత్రి యేతెంచుడుఁ జీకటి నల్దిక్కుల వ్యాపించిన తరువాత దుర్గము చేరెను. గుడిసెలు, మినుకుమినుకునఁ బ్రకాశించు దీపములు, కనులఁబడినతోడనే యతనికిఁ గొంతయాయాసము తగ్గెను. వానకుఁదడిసి చలిచే గడగడవణఁకుచు క్షుత్పీడ సహింపఁజాలక యతఁడు నిజావాసములోఁ బ్రవేశించెను. అచ్చటఁ గావలివాండ్రు మంటవేసికొని చుట్టును గూర్చుండి యుండిరి.

హర్బర్టుపోవఁగనే వారందఱొకనిమేషము ఱెప్పవాల్పక యతనిని జూచి తటాలునలేచి పైనిఁబడి పట్టుకొని యహమ్మ దెక్కడనున్నాఁడని నూఱువిధములఁ బ్రశ్నించిరి. అమహ్మదు నాయుధము లతనియొద్దజూచి యితఁ డహమ్మదును జంపెనని తలఁచి యెల్లరు క్రోధ ఘూర్ణితచిత్తులైరి. ఒకఁడు ఖడ్గము నొరలోనుండి దూసెను. కాని హర్బర్టు యొక్క దీనదృక్కులును దుఃఖవినమితముఖంబును జూచి యతఁ డమాయికుఁడని గ్రహించి శాంతించిరి. అంతట హర్బర్టు చేతనైనరీతిని జరిగినవృత్తాంతము సైగలవలనఁ దెలియఁజేసి చంపఁబడినచోటును వ్రేలితోఁ జూపెను. అహమ్మ దందఱితోఁ గలిసిమెలిసి యనుకూలముగ నుండువాఁడు గావున నతనింగూర్చి యెల్లరు శోకించిరి. అలసి యున్న హర్బర్టున కన్నముపెట్టి విచారింపఁదొడఁగిరి. వారు మాటలాడినది హర్బర్టు తెలిసికొనలేక పోయినను, సందర్భములంబట్టి యాస్థలముచాపుటవుఁ దనను గొనిపోవుదురని మాత్రము గ్రహించెను. అతఁ డనుకొనినది నిజమే యాయెను. ఆరాత్రి యతనిని నెమ్మదిగ నిద్రపోనిచ్చిరి. మఱునాఁడు వారిలోఁ

బదునల్గురాయుధములు తీసికొని హార్బర్టును వెంటఁ బెట్టికొని బయలుదేఱిరి. అతనికిఁ బ్రయాణము దుఃఖకరముగ నుండినను దనకొఱకుఁ జచ్చిన మిత్రుని శవము నవలోకించుట యబ్బునని యతఁడు తృప్తిఁ జెందెను. మనోజ్ఞములైన పర్వతములపైఁ బ్రాతఃకాలమున నడచుట కూడ నతని కిష్టమైన కార్యమై యుండెను. గడచినరాత్రియం దుండిన వానయు గాలియు నాఁగెను. వన్యకుసుమంబుల పరిమళంబులు హెచ్చుగ వచ్చుచుండెను. పూనిక్కాతో హార్బర్టందఱకంటె ముందునడచుచుఁ ద్రోవ చూపుచుండెను. అతఁ డా రాతివద్దకుఁ బోవుమార్గము తీయఁగనే యహమ్మదు మాయోపాయముచేసి హార్బర్టును విడుప యత్నించె నని వారంత నొకరిమొగ మొకరుచూచికొని సంభాషించిరి. అంత వారా రాతిసమీపమునకుఁ జేరిరి. అహమ్మదు కట్టెలకై పోయినవిషయ మతఁ డచ్చట నిల్వఁబడి బోధించి తా నిదివఱకుఁ గొంతదూరము కనుఁగొనిన జాడ వెంట వారినిఁ దీసికొని పోయెను.

జాసక్ త్రాళ్లకొసల నావరించియున్న బూజినారు వెంటను జాగరూకులైయుండిరి. వారిలో నేర్పరియైన గుఱికాఁడు ముందునను వచ్చెను. జాడలు తీయుటయందు వారు తీఱినవారు గావున హార్బర్టున కభేద్యములగు దోఁచిన పొదలలోఁగూడ జాడ కనిపెట్టిపోయిరి. కొంతదూరము పోఁగిన తరువాతఁ బురోభాగంబున దట్టమైన యొక పొదలోనుండి యొక కాకి లేచుట చూచిరి. అది కావుకావని యఱచుచు నాపొదపైని తిరుగాడెను. ఆయఱపువిని తక్కిన కాకులు గ్రద్దలు రాపులుగులు కర్ణకఠోరముగ నఱచుచు పైకిలేచి తిరుగ మొదలిడెను. ఇదియంతచూచి యొకనక్క దగ్గఱనున్న పొదలో దూరెను. శవ మచ్చటనున్నదని వారు గ్రహించి గుసగుసలాడి యందఱు ధైర్యశాలులే గాన వెనుదీయక ముందుకుఁబోయిరి. చినిఁగినవస్త్ర మొకటి యొకపొదమీఁదఁ బడియుండెను. ఇంకఁ గొన్నియడుగులు వేయఁగనే నెత్తురుమడుగులు విచ్ఛిన్నములైన యవయవములు కంటఁబడెను. అహమ్మదు యొక్క యాకారము గుఱుతుపట్టుటకు వీలులేకుండెను. మందుకొమ్ము గుండ్లసంచులు మొలయందుం

డెను. రొట్టెలమూట చంకకుఁ గట్టఁబడి వీపునఁబడియుండెను. అట్టిసమయమున మృతుని విరోధులమనస్సు సయితము వ్యాకులపడుట సహజమైయుండ మిత్రులు శోకించిరని చెప్పనేల? హార్బర్టుఁ జఱకంటె నెక్కువగఁ బరితపించెను.

పెద్దపులియే యీపనిజేసినదని తెలిసికొని దానినివెదకుట కారంభించిరి. ఒక చోట గుఱ్ఱుమనుశబ్దము వినవచ్చెను. ఆధ్వనివినఁగనే హార్బర్టునకు గుండెలలో గుండెలులేవు. అచ్చట నందఱు నాగిరి. మరలనాశబ్దము సమీపమున నున్నట్టు వినవచ్చెను. ధ్వనివచ్చినవైపున కొకఁడు తుపాకికాల్చెను. ఇఁక నేమి చెప్పవలయును? శ్రోత్రపుటంబులు బద్దలగునట్లు,గాయమువు శకలంబులగురీతి, గోండ్రిల్లుచు భీకరాకారంబైన వ్యాఘ్రంబు బయటికి వచ్చి కృష్ణపీతపార్శ్వంబులు సూర్యకాంతి నైఅయుచుండ నాజనంబుపై దృష్టినిగిడించి వెనుకకు మరలి పరుగెత్తెను. కాని నిరభ్యంతరముగ దుముకుచుఁ బోవుటకు వీలు లేదాయెను. ఒకలోయ యడ్డమువచ్చెను. దాని యావలిగట్టు మిక్కిలి యెత్తుగనుండి దూఁకుట కసాధ్యముగ నుండెను. గట్టున నిల్వఁబడి శార్దూలము తడఁబడుచుండ నొకఁడు గుఱిచూచి తుపాకికాల్చెను. గుండు పృష్ఠభాగమునకుఁ దగిలెను. వెనుకను మరలి తీవ్రముగ గోండ్రిల్లి చేయునదేమి లేక లోయను దాఁట సాహసించి తప్పించి యెగిరెను.

ఆవతలిగట్టుమీఁదికిఁ బూర్తిగఁ బోఁజాలక జారుచున్నను గోళ్లతో గట్టిగ రాలను బట్టికొనుచు నదిపైకిఁజేర యత్నించెను. ఇంతలో మఱియొకఁడు సూటిగఁ గాల్చెను. ఆగుండు దానిపుఱ్ఱెకుఁ దగులుట హార్బర్టు వీక్షించెను. అంతట నది ఊఁలుచు గోళ్లుపట్టువదలఁ జఱియలోఁ బడియెను. వీరందఱు పరుగెత్తిపోయి చూచిరి. వ్యాళము రాలకుఁ దాఁకి దొల్లుచుఁ గ్రిందికిఁ బోయెను. అది యదృశ్యమైనదనుకఁ జూచి వెనుకకుఁ దిరిగి వారు శవమున్న చోటికిఁ బోయిరి. అవయవములు కొన్నివిచ్ఛిన్నములై యుండుటవలనఁ జీనుఁగును మఱియొకస్థలమునకుఁ దీసికొనిపోవుట కనువుగాకుండెను. వారు

తమ వేటకత్తులతో నచ్చటనే యొకగుంట త్రవ్వి దానిలో నహమ్మదునుంచి పైని ఇసుక కంప దట్టముగవేసి తగినచోటఁ గొంతసేపు విశ్రమించి యిద్దఱు బయలుదేఱిరి.

స్వాతంత్ర్యభంగంబు, మిత్రమరణంబు సంభవించిన యచ్చోటు వదలిపోవుట హార్బర్టునకు సంతోషకరముగ నుండెను. వారిలోఁ గొంద ఱతనిం జూచి నవ్వుచుఁ, గొందఱు కొట్టు సుంకించుచుఁ, గొందఱు తిట్టుచుఁ బోవ మొదలిడిరి. ఇవి తిలకించి పాఱిపోవుటకు యత్నించినయెడలఁ జావు నిక్క మనుచున్నారని హార్బర్టు గ్రహించెను. అందఱు వాసస్థానమును జేరిరి. అప్పటినుండి హార్బర్టుయొక్క జీవిత మవిదిత విశేషంబు.

లార్డుకారన్‌వాలీసు యుద్ధము ప్రకటించినతరువాత నాంగ్లేయ సైన్యము మైసూరు పీఠభూమి నవలీలగ నారోహించెనని యిదివఱకుఁ జెప్పి యుంటిమి. ఇంతకుఁ బూర్వము కొలఁదికాలముక్రిందట ఫిలిప్పు, నతనిభార్య యెళీనాయు, నామీ సోదరుఁడైన చార్లెసును హిందూదేశమునకు వచ్చి యుండిరి. ఫిలిప్పునకు సైన్యములో నధికారపదవి యొసంగఁబడెను. చార్లెసు సైనికుఁడుగ నుండెను. శిబిరమునందు ఫిలిప్పు చార్లెసు లిద్ద ఱొక గుడారము నందే నివసించియుండిరి. వీరిద్దఱుకాక తక్కిన యాంగ్లేయులుకూడ హార్బర్టు నవస్థనుగూర్చి చింతించుచు నీయుద్ధావసానమున నతని వృత్తాంతము బయటఁ బడఁగలదని యాశ కలిగియుండిరి. కథాక్రమమునకు వత్తము.

ఆంగ్లేయసైన్యము మైసూరులోని బెంగుళూరిని ముట్టడించెను. మహమ్మదీయసైన్యము ధైర్యముతోఁ బోరాడెను, గాని పట్టణ మాంగ్లేయుల యధీన మాయెను. బెంగుళూరికోట కధిపతిగనుండిన మహమ్మదీయయోధుఁడు చూపిన పరాక్రమంబు, వీరభావంబు, సాహసంబు నచ్చటి జనులమనస్సులందు నేఁటి కిని నాటికొని యున్నవి. సంపాదనము చాలిచాలని కట్వాలుహరంబేయైనను సారకాయతంబుఱ చేతఁబట్టి వీరసత్త్వల పవిత్రకార్యంబులం గీర్తించుచు

వీరిద్దఱు పరిశీలింప మొదలిడిరి. నానానామములు కనఁబడెను. పలువురు ప్రియకాంతలకుఁ దలిదండ్రులకుఁ దెలియఁజేయఁబడుటకు వ్రాసిన వార్తలనేకము లగపడెను. కటా! ఆయక్షరముల విలిఖించిన హస్తంబులు మృణ్మిళితంబులయి యుండెను. "ఫిలిప్స్! ఫిలిప్స్! ఇటురమ్మిటురమ్ము" అని సంభ్రమముతోఁ జార్లెసఱచెను. ఫిలిప్సు శీఘ్రగమనంబున నచ్చోటున కేఁగ నక్షరచిహ్నితమై గోడలో నంటింపఁబడిన యొకశాసనఫలకమును జార్లెసు చూపెను. దాని నిట్లు చదివిరి.

"హార్బర్టు...............

మేనెల 24, 17—ఇచ్చోటినుండి యనేకులు క్రిందికి ద్రొబ్బఁబడి దుర్మరణమొందిరి. నామరణమునకు నేను నిరీక్షించుచున్నాను. ఆపుణ్యకాలము రేపువచ్చును. నాకష్టములు గడముట్ట—"

తరువాత నక్షరములు స్ఫుటముగఁ గానరాలేదు. ఎవఁడో యాఫలకమీఁద రాలువిసర నక్షరములు చెదరి మాసిపోయినవి. దుఃఖముపట్టజాలక ఫిలిప్సు బిగ్గఱగ నేడ్వ నారంభించెను. ఎంతయో యాశపెట్టికొని వెతకుచున్నవారి కట్టి చెడువార్త తెలియుట దుస్సహముగదా. ఫిలిప్సును జార్లెసోదార్ప యత్నించెను గాని యతఁడుకూడ శోకసంతప్తుఁడాయెను. ఇంక నేమైనఁ గనుఁగొనవచ్చునేమో చూతమని ఫిలిప్సు మరలఁ గుడ్యములను బరీక్షించెను. చార్లెసు పరిశీలించి పరిశీలించి "ఫిలిప్సూ! ఇదిగో యిది చూడుము. త్వరగవచ్చి చదువుము" అని పిలిచెను. అక్షరము లస్ఫుటముగ నుండెను. ప్రయత్నింపఁగ నీక్రిందివాక్యములు చదువఁగలిగిరి.

"......తారీఖున జబ్బుగనున్న హార్బర్టు నీ ఘోరస్థానమునుండి తీసికొనిపోయిరి. " జాన్ సిమ్సను.

"చార్లెస్! మన కింక నాశగలదు. భగవంతుఁడా! నీయనుగ్రహము మాపైనిఁ జూపితివి. నిన్నుఁ గొనియాడ నెంతవారము? రక్షింపుము" అని ఫిలిప్సు సంభ్రమంబునఁ బలికెను.

---

తంబులైన లతానికుంజంబులు కన్నులకు విందొనర్చుచుండెను. సబవృక్షములు సాంద్రంబులై సూర్యాతపంబు నడ్డగించుచుండెను. ఒకచోట దుస్సహబాధా హతుండైన నార్బ ట్టీ తపస్వాలయానికి సమీపంబున యుండెను. ఫిలిప్పుచార్లెసులు పసముల నికిం జనిరి. వృద్ధుడగు నా ఫకీరు బహుశాఖా సమన్వితంబైన చింతచెట్టుక్రింద నిజోచితాసనంబునం గూర్చుండి యత్యావ్యక్తస్వరముతో ఖొరాను పఠించుచుండెను. అతనిమొగంబువాడి దేహాస్వస్థతను సూచించుచుండెను. ఫిలిప్పు సమీపించి "సలాం! బాబా! నేము మాంగ్లేయాధికారులము. మీతో మాటలాడం గోరి వచ్చితిమి." అని పలికెను.

ఫకీరు—(సకరుణముగ) సలామాలేకుం దయచేయుండు. మతములని యెంచం బడిన పరంగీలకు స్వాగత మొసంగవలసిన రోజు వచ్చినది. ఈమాట మిమ్ముంగూర్చి కాదు. ఈవృద్ధునియొద్దకు మీరు నిస్సంశయముగ రావచ్చును. చిత్తశుద్ధి, శాంతము కలిగియే తెంచినవారు నాకు సంభావ్యులే. ఏపనికొఱకు కరుణించితిరి?

ఫిలిప్పు—సంన్యాసీ! చూడ మీరు దయార్ద్రచిత్తులుగా గనంబడుచున్నారు. మీరు పరమతాసహిష్ణువులు కారని మీముఖము చెప్పక చెప్పుచున్నది. మీ కన్నులలద్వేషము లేదని మీపలుకులే బోధించుచున్నవి. పీడితులైనవారికి సహాయము చేయుదురని మాకు దృఢవిశ్వాసము కలిగినది. సోదరతుల్యుండైన మిత్రుం డొకండు పోయెను. అతనికొఱకు వెదకుచున్నాము. మావారిలో నొకనిని మీరు మీవద్దనుంచికొని రక్షించితిరంట. అతండే మామిత్రుండేమో యని సందేహాస్పదముగ నున్నది. దయచేసి యతని పేరు చెప్పుడు.

ఫకీరు—(ఆసక్తితో) నాయనా! అతడు నీకు చుట్టమా?

ఫిలిప్పు—అయ్యా! అతని పేరు చెప్పినయెడలం జుట్టమో కాడో తెలిసికొనంగలను.

ఫకీరు—పేరా? (జుట్టునవ్రేలు పండ్లసందునఁ బెట్టికొని) జ్ఞప్తికిరాదు. నోటిలో నాడుచున్నది. హా—హా—ఏమో బాగుగ స్ఫురించుచుండ లేదు.

ఫిలిప్సు—హర్బర్టా?

ఫకీరు—ఔనౌను అదే మఱచితిని. నాయనా! ఆపేరు వినుట నాచెవులకుఁ బండువుగ నున్నది. అతనిని మిక్కిలి ప్రేమతోఁ గాపాడితిని. అతఁడు సాధువు. మీశీతలదేశవిశేషములఁ బలుమాఱు చెప్పుచుండెడు వాఁడు. ఏహ్యముగ జాతియందుఁ బ్రేమ నా కతఁడు కలుగఁజేసెను.

ఫిలిప్సు—దయామయుఁడైన యా భగవంతుఁడు మీపుణ్యకార్యములఁ బరికించుచు నేయున్నాఁడు. తగినఫలము ననుగ్రహింపఁగలఁడు. అయ్యా! హర్బర్టు ప్రస్తుత మెచ్చట నున్నాఁడు?

ఫకీరు—ఆవిషయము తెలియదు. నెలదినములు నావద్ద నుండెను. అతఁడు బ్రతుకఁడని యందఱు ననుకొనిరి. భగవంతుని యనుగ్రహమువలన నామందులు పనిచేసినవి. జ్వర మాగెను. అతఁడు మాటలాడఁగలిగి శరీరమునకుఁ గొంచెము బలముకలుగఁగనే సుల్తానునివద్దనుండి యుత్తరువు వచ్చెను. ఆయుత్తరువు తెచ్చినవాఁడు క్రూరస్వభావుఁడు. పాపము! అంతట హర్బర్టును నాయొద్దనుండి కొంపోయిరి. ఆదిమొదల తనిజాడ తెలిసినది కాదు. అతనినిఁ గాపాడుమని మీకు నాకు నందఱకు రక్షకుఁడైన యా పరమాత్మునిఁ బ్రార్థించితిని.

ఫిలిప్సు—(ఫకీరునకు హృదయపూర్వకవందనము లర్పించి) అయితే యతని జాడ యిఁకఁ దెలియదు కాఁబోలును. అయ్యో!

ఫకీరు—నాయనా! ధైర్యము వదలకుము. అతఁడు జీవించియున్నాఁడనియే నా కాశయున్నది. సుల్తానుఁ డెల్లప్పుడు క్రూరుఁడు కాఁడు. న్యాయాన్యాయములు కూడ విచారించును. హర్బర్టును జంపవలయు ననునభిప్రాయ మతనికి లేదు. నానావిధముల నతఁడు శ్రీరంగపట్టణములో నుండవచ్చును.

అప్పటికే మీరు పోవుచున్నారుగదా ఇంక నొకవిషయము గలదు. వినుఁడు. మీరు హార్బర్టుయొక్క మిత్రులు. దేవుఁడు పంపినట్లుగ వచ్చితిరి. అతఁ డిచ్చట రహస్యముగ వ్రాసి యొక లకోటా యిచ్చి పోయినాఁడు. మీరున్నచోటికి వచ్చి యిదివఱకే యిచ్చియుందుం గాని యస్వస్థుఁడనై యున్నాను. అదిగాక పెద్దవాఁడను. నడువలేను. ఈయుత్తరము నాసద్దనున్నటు సుల్తానునికిఁ దెలిసినయెడల నీతోఁట నాకుఁ దక్కదు. అట్టి హానివచ్చినను రానిమ్మని యుత్తరము సందికొంటిని.అందుల కతఁడు చూపినకృతజ్ఞత యిప్పటికి నాకు జ్ఞప్తియందున్నది. అతని యాకారము కనులలో మెదలుచున్నది.

ఫిలిప్సు చార్లెసు లాయుత్తరములఁ జూడ సత్యాసక్తితో నుండిరి. తన చిన్నగృహములో నుండిన యుత్తరము తెచ్చుటకై లేచి నడువ యత్నించెను. వారు లేచి యతనినిఁ బట్టికొని మెల్లఁగ నడిపించుచు గృహమునొద్దకుఁ గొంపోయిరి. వారిని బైఁటనుంచి లోనికిఁబోయి పకీరు లకోటా తెచ్చియిచ్చెను. వారు దానిని విప్పఁబోవ నచ్చట విప్పవలదని వారించి హార్బర్టునుగూర్చి సాకల్యముగఁ జెప్పుఁడని యతఁ డడిగెను. వినవినఁ బకీరుయొక్క కన్నులనుండి యశ్రుకణంబులు కొన్ని వెలువడి వాడి లోనికిఁ బోయిన బుగ్గలమీఁదఁబడి జారి నరసిన గడ్డములోఁ బ్రవేశించి యదృశ్యము లయ్యెను. ప్రొద్దు గ్రుంకిన దనుక సంభాషించిరి. దిశలయందుఁ జీకటి వ్యాపించుడు ఫిలిప్సు చార్లెసులు పకీరునకు సలాములొనర్చి సెలవుగైకొని నిజనివాసముం జేరి యతిసంభ్రమముతో లకోటా విప్పిరి. "ఎవరైన నాంగ్లేయాధికారికి" నని పైవిలాసము గల యొకయుత్తర ముండెను. దానిని ఫిలిప్సు తెఱచెను. కారాగృహబాధలను, ఘోరదుర్గముమీఁదఁ దాను దుర్మరణ మొందకుండుటను భావిదశాసందేహమును దెలియఁజేయు పఙ్క్తులు హార్బర్టుచే వ్రాయఁబడి యుండెను. మఱియు నాయుత్తరమును జూచిన యాంగ్లేయాధికారి దానిని ప్రభుత్వము వారికిఁ బంపవలయు ననునొకప్రార్థనయుం దుండెను. ఇదికాక యింకను

మూఁడుత్తరము లుండెను. ఒకటి కాంటయునకు, మఱియొకటి యామినికి, వేఱొకటి ఫిలిప్పునకు నని పైని విలాసములు వ్రాయఁబడియుండెను. ఫిలిప్పు తన యుత్తరమును జింపి చదివెను. తాను బడిన బాధలు, ఫకీరు చూపిన యవ్యాజప్రేమను విశదముగ వర్ణించి యెన్నిసంవత్సరములు గడచినను నినుగాంచు నాశ వదలుకొనలేదని హార్బర్టు వ్రాసెను. ఆపత్త్రికలఁ జూచినతోడనే ఫిలిప్పుత్సాహవంతుఁడై "చార్లెసూ! హార్బర్టు ప్రాణముతో నున్నాఁడు. ఇంతకష్టకాలమున వదలక భగవంతుఁడు చూపినదయ స్పష్టముగఁ గానవచ్చుచున్నది. నిజము స్పష్టముగఁ దెలియువఱకు నీయుత్తరములవిషయ మితరులకు మనము చెప్పఁగూడదు" అని వాక్రుచ్చెను. సేన బాలాపురమునకు సమీపమున నున్నంతకాలము ప్రతిదినము ఫిలిప్పుచార్లెసులు ఫకీరును సందర్శించుచుండిరి. కృతజ్ఞతాసూచకముగ ధనమొసఁగఁ బ్రయత్నించిరి గాని ఫకీ రంగీకరింపఁడాయెను. వస్త్రములు, సాలువులు మొదలైనవస్తువులు సమర్పింప నతఁడు సంతోషముగఁ గైకొనెను.

సైన్యము ప్రయాణమగుదినమున ఫిలిప్పు చార్లెసు లతనితోఁ జాల కాలము సంభాషించి యాతనియొద్ద సెలవుతీసికొని మరలఁ గలసికొనునట్లు భగవంతుఁ డనుగ్రహించుఁ గాక యని ప్రార్థించి నిజశ్రేణికలకుం బోయిరి. దండు శ్రీరంగపట్టణమునకు బయలుదేఱెను. నైజాము పంపినసైన్యము వచ్చి కలిసికొనెను.

సముద్రమువలె నున్న తత్సైన్యములో నప్పుడు నానాజాతుల మనుష్యు లుండిరి. విలాసవంతుఁడైన పారశీకుఁడు, సాహసుఁడైన యాఫ్ఘనుఁడనివార్యుఁడైన బెలూచి, పరుషుఁడైన పఠానుఁడు, మృదుశరీరుఁడైన దక్షిణుఁడు, పరాక్రమశీలుఁడైన రాజపుత్రుఁడు, దుర్జయుఁడైన మహారాష్ట్రుఁడు కలిసి గుమిగూడియుండిరి. ఏతాదృశబలంబు శ్రీరంగపట్టణమును సమీపించెను గాని జయము చేకొనలేదు. శ్రీరంగపట్టణమును స్వాధీనముచేసికొని హార్బర్టును వీక్షింపఁగల మను కొండంతయాశ భగ్నమాయెను.

ఆంగ్లేయులు పరాభూతులై వెనుకకు మరలిరి. వీరికి బెంగుళూరి యందుఁ గలిగిన విజయోత్సాహము పూర్ణముగ నశించెను. సుల్తానుఁ డీసమయమున బెంగుళూరి నాక్రమించి తక్కిన శత్రుగతదుర్గముల స్వాధీనము చేసికొనవలసియుండెనుగాని, యతఁ డట్లు చేయక శ్రీరంగపట్టణము పరాయత్తము కాకుండుటకే మిక్కిలి సంతోషించెను. ఆంగ్లేయులఁ దఱుముటకుమాత్ర మతఁడు రహిమాన్ ఖానుని, కాశీమాలి మొదలగు యోధులఁ బంపెను. వారును వారిం దఱిమి తిరిగివచ్చిరి. సుల్తానుని కొల్వులో నంతయు విశ్రాంతి కలిగినట్లుండెను. దర్బారులకుఁ గాశీమాలి పోవుచు సుల్తానుని పరిచయ మెక్కువగఁ జేసికొనుచుండెను.

ఖానుఁడు శుద్ధాంతంబున నమీనాతోఁ గ్రీడింప మొదలిడెను. అతఁ డెప్పటివలెఁ దక్కినభార్యల యెడఁబ్రేమ మాఱయుటచే వారి కొకప్పుడేని దర్శన మీకుండెను. దురంతసంతాపంబునఁ బురపురఁ బొక్కుచున్న కమ్రూబీ కమీనాపైఁ గ్రోధ మగ్గలమయ్యెను. మంత్రప్రయోగవశంచేసి యమీనాను బాధపెట్టుఁడని యామెతల్లిని మాంత్రికురాలైన కరీనాను ప్రేరేపించెను. మంచిరోజు కుదురక కొన్నిరోజులు, పాపభీతిచేతఁ గొన్నిరోజులు, సోమరితనముచేత నదిగో యిదిగో యని కొన్నిరోజులు జరపి చివర కొకనాటిరాత్రి మంత్రప్రయోగము చేసెదనని కరీనా చెప్పెను.

ఈనియమితకాల మింక రెండుమూఁడుదినములకు వచ్చునన హర్మత్ కమ్రూబీ లమీనాయెడ మితిలేనిమైత్రి చూప మొదలిడిరి. అమీనా యమాయకురాలు గావునఁ దత్కృత్రిమస్నేహము నిజమని నమ్మి వారితోఁ గలసిమెలసి యుండెను. అమీనాయొక్క సౌందర్యము, మార్దవము, సౌశీల్యము నొక్కపర్యాయమేనిఁ గరీనా తిలకించియుండినచో హృదయము కరఁగి మంత్రప్రయోగ మామె మానియుండును.

అమీనా నిష్కపటమై, పవిత్రమైనమనస్సు గలతరుణి. ఆమెతలంపు లెల్లప్పుడు తనను వలచి తనప్రేమ కాస్పదుఁడైన కాశీమాలీ మీఁద నుండెడివి.

అదియొక చచ్చవుకమైన గది. నేలదిమ్మెస కొట్టఁబడి గట్టిగనుండెను. బాగుగ నూడ్చుటచే నంతటఁ బరిశుభ్రముగ నుండెను. ముగ్గుతో నొక్క మనుష్యాకారము వేసి దానిమీఁద నరబ్బియక్షరములు వ్రాసి దానితలపైఁ గురీనా కూర్చుండి మంత్రోచ్చారణముచేయుచు జపమాలపూసలు శీఘ్రముగఁ ద్రిప్పుచుండెను. ఒకప్రక్కన నాముదపుదీపము వెలుఁగుచుండెను. రాత్రియగుటచే తాదృశప్రదర్శనము కుమ్మా హుర్మతీబీలకు భయజనకముగ నుండెనని చదువరులే యూహింపఁగలరు. వారినిఁ జూచి "వచ్చితిరా? నేను జెప్పినట్లు భోజనముచేసి పరిశుభ్రముగ నున్నారుగదా. సులేమాన్? ఫేరూన్! షూదాద్! ఉల్లీకన్! ముల్లికన్! వీరి పేరులు తలఁచుకొని నిజముచెప్పుఁడు. లేనియెడల నీక్షణము మీ నెత్తులనే యణఁచును." అని కురీనా వాక్రుచ్చెను.

కుమ్మాహుర్మత్—అమ్మా! నీవు తినుమని చెప్పినవే తింటిమి. నీవు చేయు మనినన్నిసారులు స్నానము చేసితిమి.

కురీనా—మంచిది. ఇదిగో కత్తి, అదిగో తెల్లకోడి. మీయిద్దఱిలో నెవరైన నీకోడినిఁ గోసి నెత్తురీబొమ్మమీఁదఁ జల్లవలయును. ఆలస్యము చేయఁ గూడదు. (వారు కంపమొందఁ మొదలిడ) ఛీ? ఎందు కీపిఱికితనము? ఈపని చేయకపోయినయెడల మంత్రము పాఱదు. అవి మీమాట వినవు.

కు. హు—అమ్మా! అవియనఁగ నేవి? మామాట విననివి?

కురీనా—ఏవా? ములీక, హామూన్, మస్లత్, యూసఫ్, ముల్లీక్, యాప్టాక్, షేక్‌సుద్దు, ఇవియన్ని పిశాచములు; నెత్తురులేకుండిన నవి మీమాట వినవు. కాలము దాఁటిపోవుచున్నది. ఆలస్యము చేయఁగూడదు. కోడినిఁ గోయలేని నమీనాకు రావలసిన తెవులు మీకే వచ్చును.

ఇద్దఱిలోఁ గుమ్మాబీ ధైర్యవతికావున సాహసించి కత్తిదీసికొని యొక్కవ్రేటునఁ గోడితల తెగఁగోసెను. అది మరణవేదనకు విలవిలఁ దన్నుకొనుచుండెను.

కరీమా—మంచిది. కుష్మా! దానిని వదలకుండఁ బట్టికొనుము. నెత్తురు ధారాళముగనే కారుచున్నది. అది మంచిచిన్నె. ఇఁక నీబొమ్మమీఁద బిగింపుము—చాలును—ఆఁ. శక్తులువచ్చి నిలుచున్నవి. (కొంచెముసేపు మెల్లగ మంత్రముచ్చరించి తరువాత గొంతెత్తి "అయ్‌బుద్యూ! అయ్‌శేక్‌సద్దా! అయ్‌నర్యూ! అయ్‌నష్రావ్! అయ్‌మర్దూవ్! శక్తులారా! ఇదిగో రక్తము. కడుపునిండఁ ద్రావుఁడు; అమీనాలోఁ బ్రవేశింపుఁడు. అహోరాత్రములు పీడింపుఁడు. హో! భూతములారా! ఇవిగో మీ పేరులుచెప్పి యీనిమ్మకాయ నైదుసూదులు గ్రుచ్చుచున్నాను. మీ రట్లే యమీనాను గ్రుచ్చుఁడు. సూదులను బలుసుతినినకొలఁది నమీనా దేహము కృశించిపోవును గాక! అమీన్! అమీన్! అమీన్! అమీన్! అమీన్!" అని యఱచి యట్లే యుచ్చరింపుఁడని వారికిఁ జెప్పెను. "అమీన్" అని పలికినప్పుడెల్ల నాపె యొక్కొక్కసూదిని నిమ్మకాయకుగ్రుచ్చి దానిని వారిచేతికిచ్చి యమీనాయొక్క శయన గృహము తలుపునద్దనైన లేక యాపె పరుండు మంచముదగ్గఱనైనఁ గాల్లగాఱుపోవలఁ బెట్టిరమ్మని చెప్పెను. కరీనా లేవకముందే పిశాచముల వలని భీతిచే శీఘ్రముగ నడచుండివెడలి యిల్లు చేరెను. అందఱు గాఢనిద్రా వివశులై యుండినప్పుడు నిశ్శబ్దముగఁ గుష్మాబీ యమీనాయున్నగది కేఁగి తలుపునొద్ద నిమ్మకాయ పెట్టి దానిచుట్టు కుంకుమచల్లి మరలివచ్చెను. తీయఁబడినప్పుడు తలుపు లోనికిఁ బోవునది గాన నిమ్మకాయకుఁ జలనము కలుగదని కుష్మాబీకి నమ్మిక.

---

## నలువదియవ యధ్యాయము

ప్రభాతమాయెను. తూరుపురేఖలు కాన్పించెను. ఖానునిపార్శ్వమున సుఖనిద్రం జెంది లేచి బయటికిఁబోవుటకై యమీనా తలుపుతీయ నిమ్మకాయ

కంటఁబడెను. ఆనిమేషమున నామెను గలిగినభయమును—చదువరులారా! మీర యూహింపుఁడు. కాయమును జూచినతోడనే యామె కంపితదేహయై విస్మృతమైన వెఱ్ఱియున బడెను. ఖానుఁడు దుమికిపడి లేచివచ్చి చూచి యమీనా కంటె నధికముగ దడిసెను.

మనదేశమం దిప్పటికి విద్యాధికులలోనైతము మంత్రవేత్తల నెడను శేఖులను ముగ్గులను విశ్వాసము చెందువా రనేకులు గలరు.

మాంత్రికుల కారోపింపఁబడు నద్భుతశక్తులు చదువరు లెఱిఁగియే యున్నారు. తమ్మునిద్దఱినో లేక యొకరినో చంపుటకై యీప్రయోగము చేసిరని ఖానుఁడు నమీనాయుఁ దలఁచిరి. దానిని మొదటఁజూచినది యమీనా గావున నామెచావే నిక్కమని యామెకు భయము గలిగెను. ఖానుఁ డామె భయమును దీర్పలేఁడని పైసందర్భమువలనఁ దెలియఁగలదు. ఇఁక నామెదాని యైన మీరా నొకతె గలదుగాని యమీనాకంటె నామెకు మూఢవిశ్వాసము లెక్కువై గలవు. ఆనాఁడు గృహమున నందఱు విషాదముప్రాంకితవదనంబులతో నుండిరి. కుమ్మాహార్స్త్రీలు తెలియనివారివలె వచ్చి యొబాటుమాటలు పలుకుచు శక్తిని బ్రయోగించినది ఖానునిమీఁదికిఁ గాదనియు, నమీనా మీఁదికే యని మాకుఁ దోఁచుచున్నదనియు నభిప్రాయమును దెల్పువారివలె వాక్రుచ్చిరి.

ఖానుఁడు కాశిమాలిని రప్పించి జరిగినవృత్తాంతము వినిపించెను. అమీనావంటి యమాయికురాలిపై నెవరికిని ద్వేషముండదని, యామె కెట్టి హానికలుగదని, ధైర్యవాక్యములు కాశిమాలి ఖానునికిఁ జెప్పెను. ఎవరీప్రయోగము చేసియుందురా యని లోలోపల నాలోచింపఁ గాశిమాలి కొకరిపై ననుమానము పొడమెను గాని, యాపేరతఁడు బయల్పఱుపక మనస్సులోనే యుంచికొనెను. మీరానువలన, జుల్ఫికారునివలన, యువతీరత్నమైన యమీనాస్థితి తెలిసికొని చింతిల్లుచుఁ గాశిమాలి ఫకీరులతో నాలోచించి ప్రతీకారములు సల్పెను. అతఁ డమీనాపేరుచెప్పి కానుక లిప్పించెను; మహా

త్తులగోలీలలో దీపములఁ బెట్టించెను; మంత్రాక్షరముల నన్నముతోఁ గలిపి యమీనా నాయన్నము తినిపించెను; తాకెత్తముమీఁది బీజాక్షరముల నీటిలోఁ గడిగి యాజలమును ద్రావించెను; మఱియు జ్ఞానవంతులకు హాస్యాస్పదములుగఁ దోఁచినను వారు పరమశ్రద్ధతో నాచరించు నేతాదృశవిచిత్రకర్మముల ననేకములఁ జేయించెను. కాని యమీనాయొక్క జబ్బు తీరలేదు. ఆమె నానాటికిఁ గృశించుచుండెను. జబ్బులో వెంటఁబడిన జ్వరము వదలకుండెను. ఒక్కొక్కప్పు డామె పంచావియం దేకాంతమునఁ బరుండి స్వచ్ఛాకాశముపై దృష్టి నిగిడించి తలపోసి. తలపోసి, తనువుదొఱంగి గగనమార్గమున సంచరించుచున్నట్లామె యెంచిన దేవతలం జేర నిచ్చగించుచుండును. మరణము తప్పదనుకొనినందునఁ బుట్టినింటికిఁ బోయి చిన్నటనాఁటఁగోలె మక్కువముఁ బెంచిన తల్లి చేతులలోఁ బ్రాణములు విడువవలయునని యామె యెన్నిసారు లభిలషించి యుండెను? హైదరాబాదునకుఁ బంపుఁడని ఖానుని నామె యెన్నిపర్యాయములు ప్రార్థించియుండెను? ఖానుఁ డంగీకరింపక "పరంగీలు దేశము నాక్రమించుకొనుచున్నారు. మరాటీదండు, నిజాముసైన్యము, మార్గముల మెలఁగుచున్నవి. కావున నిప్పు డిల్లువెడలుట యపాయకరము" అని ప్రత్యుత్తరము చెప్పుచువచ్చెను. ఇట్టిజబ్బులు దీర్ఘకాలముండునవికాని ప్రాణాపాయకరములు కావు. చేయఁబడు ప్రతిక్రియలవలన జాడ్యముపోయి యెప్పటియమీనాయై ఖానుని కానందదాయిని యగునేమో ! ఆశవదలుటకుఁ గారణములేదు కాని ధీరత, నిష్కళంకత, సత్యసంధత, నిష్కుటిలత ఇన్నిసుగుణములుకల ఖానుని హృదయమునం దొక దుర్గుణము దాఁగిదాఁగి—అయ్యో పాపము ? అమీనా కపాయకరమై, వెలువడెనని వ్రాయుటకు మా కలము వెనుదీయుచున్నది.

అమీనా జ్వరముచే దినదినము కృశించుచుండెనని చెప్పియుంటిమి. ఆమెకన్నులు లోతునకుఁ బోయెను; కపోలములు వాడి వత్తలయ్యెను; పెండ్రుకలు ప్రతిదినము దువ్వకపోవుటచే మాసి యట్టగట్టియుండెను; పెదవు లెండియుండెను. మిసిమిలేక చేతులు సన్నములయ్యెను; గాళ్లు పీలలై యుండెను

కడియములు వదులాయెను; ముఖమునఁ గాంతి తగ్గెను. ఈచిహ్నములు దయ్యము లింకనుబట్టి యామెను బాధించుచున్నవని చూచువారికిఁ జెప్పక చెప్పుచుండెను.

ఖానుని కమీనామీఁద నిష్టము నానాఁటికి క్షీణించెను. ఖానుఁడు కాముకుఁడని, యతని కమీనాపై నున్నది మోహముకాని ప్రేమకాదని, దీని వలనఁ దెలియుచున్నది. మోహము కామప్రేరితము. ప్రేమ యీశ్వరప్రేరితము. మోహము కాలికము. ప్రేమ కాలాతీతము.

అమీనా యారోగ్యముకలిగి సౌందర్యవతియై మనోహరిణిగ నున్నన్నిదినములు వక్షస్థలంబున నెక్కించికొనిన ఖానుని కామె వాడిన పుష్పమువలె, విలాసవిహీనయైనకొలఁది మోహము తగ్గఁజొచ్చెను. ఇదివఱకు కతఁడు కనఁబఱచుచున్న ప్రేమ యొక్కసారి పోయినది; యావిషయ మమీనాకుఁ దెలిసినచో నామెకష్టములు హెచ్చుపట్టునకుఁ దగ్గియుండును గాని యట్లు జరుగలేదు. చిక్కి శల్యమై జ్వరముచే బాధపడుచు నమీనా పరుండియుండ ననురాగరసపూరితమైన కనుంగవతో విలాసవతియైన కుమ్మూబీ వచ్చి కొద్దికొద్ది యుపచారములు సల్పుచుఁ జెలిమికలదానివలె నామె మంచమునొద్ద మందగమనంబున నట్టిట్టు తిరుగుచుండెను. అచ్చటికి వచ్చునప్పుడెల్లఁ గుమ్మూబీ శిరోజములఁ జక్కఁజేసికొని విరులుదురిమి, మనోజ్ఞవసనంబు ధరించి శోభనాకారముతో నుండును. ఖానుఁ డమీనాసమీపమున కెప్పుడేతెంచునో యామె తెలిసికొని యతనికంటె ముందుగ నచటికిఁ బోయి యమీనా కుపచరించుచున్న దానివలె నటించుచు, ఖానునికిఁ దనమనోహరవదనంబును జూపవలె నని యభిలషించినదయ్యు నతఁడు లోనికి రాఁగనే తటాలున లేచి పోవుచుండును. కొన్నిదినము లిట్లు జరుగుచు, ఖానుఁడు కుమ్మూతో మెల్లఁగ మాటలాడ నారంభించి క్షేమవార్త లడుగుచు నామె లేచి పోఁబోవఁ బోవవచ్చునను; లెమ్ముండుమని యాపుచు, మఱికొన్నిరోజులు గడిచిన తరువాతఁ జనువుతో నుల్లాసముగ సంభాషింప మొదలుపెట్టెను.

కుమ్మూఖానులమైత్రి కమాయికురాలైన యమీనా సంతోషించెను. తనయొద్దఁ గాక వేఱుచోట్ల ఖానుఁడు కుమ్మూతో సంభాషించుచుండె నని యామె యెఱుఁగదు. ఎఱిఁగినను దనవలెనే కుమ్మూకూడ ఖానునికి భార్యయే కావున వారిద్దఱు సంభాషించి యన్యోన్యానురాగము కలిగియుండుట యుక్తమే యని తలఁచియుండెను. కాని యేకపత్నీరతుఁడైన భర్తతో జీవయాత్ర గడపె సౌఖ్య మనుభవించు నదృష్టము లేకపోయె నని మాత్ర మామె పలుమాఱు చింతించుచుండెను.

దినదినము ఖానుఁడు కుమ్మూబీమీఁదఁ గనఁబఱచుచున్న యనురాగాతిశయము మీరాను కనిపెట్టి ఖానుఁడు కుమ్మూబీయింటికిఁ బోవుచున్నాఁడనియుఁ నామెతోఁగలసి భుజించుచున్నాఁడనియు, సాయంకాలము లామెతోఁ గడపుచున్నాఁడనియు, నమీనాకుఁ జెప్పెను. అమీనా విని చిఱునవ్వు నవ్వెంగాని విచారమొందలేదు. అమీనాకు రోషము కలిగించుమాటలు మీరా యెన్ని చెప్పిన, నామె మాత్సర్యపడఁజెందక ఖానుఁడు కుమ్మూబీతో ననుకూలముగనుండుట మంచిదే యనియును, నిక ముందు సవతియు దానును జెలిమిగలిగి యుండవచ్చుననియు బదులుచెప్పెను. నిర్మలమైనబుద్ధిగలవారి తలంపు లిట్లేయుండును గదా! అమాయికురాలైన యమీనాయొక్క హృదయము నిర్వ్యాజప్రేమతో నిండి క్రోధమాత్సర్యములకుఁ జోటులేక యుండెను. కటా! చెడు దినములు మిక్కిలి సమీపమునకు వచ్చెను.

ఖానుఁ డమీనాయొద్దకు బొత్తిగ రానిదినములుకూడఁ దటస్థించినప్పుడు, భర్త తిన్నగలే నుంటచే వచ్చి యుపచారము సల్ప వీలులేకపోయె నని కుమ్మూబీ వర్తమానము పంపినప్పుడు, నాలుగైదుదినములు వరుసగ ఖానుని దర్శనమే లేక కడచినప్పుడు, స్వాతిమెఱుపువలెఁ నతఁడు వచ్చి త్వరితముగ నవి యవి యడిగి వెంటనే వెడలిపోవునప్పుడు, తత్తన్విహృదయము కుమ్మరవానియావముంబోలెఁ గుములిన దని వేఱుగఁ జెప్ప నేల? రోగమువలని బాధ, భర్తచేఁ ద్యజింపఁబడుట, ప్రేమించుబంధువులు దగ్గఱలేమి, అయ్యో!

ఆయిల్లాలికష్టముల నేమని వర్ణింతుము? మరణ మెప్పుడు వచ్చునా యని యూపె నిరీక్షించుచుండును.

కుమ్మాబీయొక్క సంతోషము చెప్ప శక్యము కాదు. ఆమె చేసినపని నెఱవేఱెనని. కురీనా కామె వస్త్రములు, సొమ్ములు, ధనము కొల్లగ నిచ్చెను. ఖిన్నతాస్యమై గోరీవేచియున్నను నావృద్ధమాంత్రికి కుమ్మాబీ యొసఁగిన భూషణాదుల నత్యాశతో గ్రహించి పకీరులకు, మహాత్ములకుఁ బంచిపెట్టెద నని దాఁచెను. "తెల్లకోడినిఁ గోయుమన్నప్పు డనుమానించితివి. కోయఁబట్టియే యిప్పుడు శక్తులు మనము చెప్పినట్లు విని యమీానాలోఁ బ్రవేశించినవి. కోడినిఁ గోసినప్పుడు నెత్తురు బాగుగఁ గాఱినది. అది మంచిచిన్నె యని నేను జెప్పలేదా!" "హూం శక్తులారా! హాషేక్ సుద్దూ! హీనై తాన్ పుత్రులారా! పట్టుఁడు; రక్తము పీల్చుఁడు; పిప్పిచేయుఁడు; నాకంటె నధికులు రాలు వచ్చి మిమ్ము వెడలఁగొట్టినదనుకఁ బోకుఁడు. నన్ను మించినవా రెరీ? కుమ్మా" అని గంభీరవాక్యము లప్పుడప్పుడు కురీనా పల్కుచుండును. ఖానుఁ డొక్కొక్కవేళ నిరాదరణముచేసిన ట్లగపడినను మనసునఁ బెట్టికొనక కురీనా యొక్క హితోపదేశము ననుసరించి కుమ్మాబీ మిక్కిలి వినయముచూపుచు దినదినము నూతనాలంకారములు నవీనవస్త్రములు తాల్చుచు సుందరవద నంబుతో నతనికన్నులకు విం దొనర్చుచుండెను.

ఒకనాఁడు కురీనా కుమ్మాను బిలిచి "అమ్మా! నీకొక మందిచ్చెదను. దాని నన్నములోఁ గలిపి నీభర్తకుఁ బెట్టుము. పెంచినకుక్కవలె నీ కతఁడు లోఁబడును. పాషాణమువంటి మనస్సైన నీమందు తగిలినవెంటనే నీరగును. దీనిని రహస్యముగ సిద్ధముచేసితిని. ఇదిగో తీసికొనుము" అని యామం దొసఁగెను.

ఇట్లు వశ్యౌషధములు పురుషులకుఁ బెట్టు ఘోరాచారము మన హిందూదేశమునఁ బూర్వకాలమునుండి వచ్చుచున్నది. కనుకనే శ్రీవ్యాస మహర్షి మహాభారతారణ్యపర్వమున:—

శ్లో. జిహ్వయా యాని పురుషస్త్వచా వా హ్యుపసేవ్యతే
తత్ర చూర్ణాని దత్తాని హన్యుః క్షిప్ర మసంశయః,
జలోదర సమాయుక్తాః శ్రిత్రిణః పలితా స్తథా
అపుమాంసః కృతాః స్త్రీభిః జడాంధబధిరా స్తథా."

అని వచియించియున్నాఁడు.

ఈదురాచారము స్త్రీలలోఁ బ్రబలుటకుఁ బురుషుఁడే కారణ మని చెప్ప వచ్చును. నిర్బంధపాతివ్రత్యము స్త్రీపై విధించి పురుషుఁడు స్వేచ్ఛావిహారములు సల్పుచు వ్యభిచారాదిదోషదూషితుఁడై యెప్పు డామె నాదరింపక పోవుచున్నాఁడో, యప్పుడే యామె యెట్లైన మగనినిఁ దనవైపునకుఁ ద్రిప్పుకొనవలయు నని ప్రయత్నించుచున్నది. స్త్రీ లజ్ఞానముచేఁ దాముపెట్టు మందులు తమ భర్తలను జడులుగ, నంధులుగ, బధిరులుగఁ, బలితులుగఁ, గుష్ఠరోగులుగ, నపుంసకులుగ, జలోదరులుగఁ జేయు నని తెలియక చివరకు దుఃఖముల పాలగుచున్నారు. స్త్రీలు పురుషులు నొక్కవిధమున సన్మార్గమునందుఁ జరింతురేని నిట్టి ఘోరకార్యములు జరుగ నేరవు.

షకీనా చెప్పినప్రకార మన్నములో మందు కలిపి ఖానునికిఁ గుమ్మాబీ పెట్టెను. అతఁ డెప్పటివలె భుజించెను. ఆ నాఁటిరాత్రి యిద్దఱు క్రీడించిరి. కొన్నిదినముల క్రిందట శత్రుత్వము వహించియుండిన కుమ్మాబీ యిప్పుడు ఖానునకుఁ బరమప్రియురా లయ్యెను. విలువగలచీరలు, రవికలు, సొమ్ములు ఖానుఁ డామె కనురాగముతోఁ దెచ్చి యిచ్చుచుండెను. ఇదియంత నావలనఁగదా యయ్యెనని షరీనా యుప్పొంగుచుఁ, గుమ్మా యొసఁగు బహుమానంబుల నాశతోఁ గొనుచుండెను. కుమ్మాబీయొక్క సంకల్పము పూర్తిగ సిద్ధింపలేదు. అన్నికోరికలీడేఱెనుగాని యమీనాయొక్క మరణము కొఱదపగ నుండెను. కాలవిలంబనాసహనయై యామెకు విషముపెట్టి చంపవలయు నని కుమ్మా యొకనాఁడు ప్రయత్నించెను గాని "ఎండి వరుగైపోవుచున్నది. కొలఁదిదినములలో నదియే చచ్చును లెమ్ము" అని మరల నూరకుండెను. ఆమె

తలంచిన ట్లయినా చావలేదు. ఆమె ప్రతికి సాహసోన్యపతియై వెనుకటి వికాసముపొంది ఖానునిచిత్తమును మరల నాకర్షించునేమో యని, కిర్మాని భయపడి మేదోరెయొక యుపాయమునర్చి చంపుటకై నోజనుతో నాలో చించెను గాని యేలనో యామె క్రూరకార్యములు చేయుటకు సాహసింప లేదు. కరీమా కావించిన తంతువలన ఫూర్మత్ బీ కెట్టి ప్రయోజనమును గలుగ లేదు. అయినా దురవస్థ యామెకు గాలిపుట్టింప జరిగినపంత యుపయోగపడ కలంచెనుగాని, కిర్మానీకి ఏడిసి యూరకుండెను. అతనివలల కేమిచేసెనో చేసెను గాని తరువాతఁ గరీమా కుష్మాయిలు చేయు కుతంత్రములలోఁ బ్రవేశింప కుండుటకు ఫూర్మత్ బీ నిశ్చయించుకొనెను.

బాగామహల్లులోని సుల్తానుని కోట లాంగ్లేయుల యధీనములాయెను. కృష్ణఘర్ కోట యధిపతిమాత్రము లోఁబడక సహాయసైన్యము పంపు మని సుల్తానునికి వర్తమాన మంపెను. అప్పుడున్న యుందఱిలోఁ గాశిమాలి ప్రైర్య శాలియై సుల్తానునిదృష్టి కాగివచ్చినందున నాతని యాధిపత్యముక్రిందఁ గొంత సైన్యము పంపఁబడెను. కాశిమాలి యసాధారణప్రజ్ఞనుజూపి యాంగ్లేయుల బాఱఁదోలి తిరిగి వచ్చెను. సహాయమూర్థము కాశిమాలి కృష్ణఘుర్ కోటకు వెళ్లి నప్పుడే ఖానుని నిరాదరణ మయినాయెడల నధికమాయెను. మరలివచ్చిన తరువాతఁ గాశిమాలి యమీనాదుస్థితిని ఖానుని ప్రవర్తనమును గుఱ్ఱించి విని చింతించెను. "ఎట్టిసహాయముచేయు మనినను జేయుటకు సిద్ధముగ నున్నాను." అని యమీనాకు జుల్ఫికారునితోఁ జెప్పి పంపుచుండెడువాఁడు. ఆమెను బుట్టినింటికిఁ బంపు మని యనేకపర్యాయములు కాశిమాలి ఖానునకు బోధించెను గాని యాతఁడు వినినవాఁడుకాఁడు..........................

................................................................

శ్రీరంగపట్టణసమీపమునఁ బరాభూతమై యాంగ్లేయసైన్యము మరలి పోయినతరువాతఁ గొన్ని నెలలు గడచినవి. సైన్యమునందలి లోపములు చక్కఁ

పెట్టఁబడెను. నిపుణుఁడైన సేనాధిపతి క్రియఁ గొంత సైన్యమును నైజాము పంపెను. విజృంభితులై మహారాష్ట్రులు వచ్చి యాంగ్లేయులఁ గలసికొనిరి.

ఆంగ్లేయు లివ్విధమున యుద్ధసన్నద్ధులై శ్రీరంగపట్టణముమీఁదికి మఱియొకసారి దాడి వెడలిరి. త్రోవలో దుర్గములు సులభముగ స్వాధీనము లాయెను. లటఫాలిబేగువంటి మహాశూరుఁడు రక్షించుచున్న నందిదుర్గముకూడ నాంగ్లేయులకు లోఁబడెను. సైన్యము శ్రీరంగపట్టణ సమీప భూములకు వచ్చెను. పట్టణములో జనులహృదయములు తల్లడిల్లుచుండెను.

నైజాము మహారాష్ట్రసైన్యములు వెంటరా, వచ్చుచున్న యాంగ్లేయుల మహాటోపంబు గాంచి సుల్తానుని సైనికులు కలఁగిరి.

1792-వ సంవత్సరము జనవరి 25-వ తారీఖున శ్రీరంగపట్టణములో నున్న పౌరజను లాదినమును జీవితాంతమువఱకు మఱువలేరు. ఆరోజున నాంగ్లేయసైన్యము సముద్రమువలె శ్రీరంగపట్టణ బాహ్యప్రదేశంబులఁ బ్రవేశించెను. ఎత్తైనగోడలు, మేడలు, గుట్టలు నెక్కి జనులు, సైనికులు నాంగ్లేయులఁ జూచి యాశ్చర్యపడిరి. రణవాద్యముల మ్రోఁతకనుగుణముగ నడుగుతప్పక సైన్యము నడచుచుండెను. విచ్చలవిడిగ నిజాముసైనికులు మహారాష్ట్రులు విజృంభించుచు వచ్చుచుండిరి.

సుల్తానుఁడు నిజసైన్యమును గోటలో సన్నద్ధముగఁ జేర్చెను. బారులు తీర్చి వారి నతఁడు నిల్వఁబెట్టెను. సేనాధిపతు లుచితస్థానములం దుండిరి. అలంకరింపఁబడి యుద్ధమునకై సిద్ధముచేయఁబడిన యశ్వముల హేషారవంబులు గజముల బృంహితనాదంబులు కర్ణకఠోరంబులై వినవచ్చుచుండెను. భేరీధణంధణధ్వానంబులు పగవారిగుండెలు బ్రద్దలుచేయుచు వాయుమార్గమును వ్యాపించుచుండెను. సాహసాధిక్యత నుద్రేకించిన సైనికులచేఁ బ్రయోగింపఁబడు ఖడ్గముల మెఱుపులు కన్నులు మిఱుమిట్లు గొల్పఁజేయుచుండెను. నభోమధ్యంబున సూర్యుఁడు తీక్ష్ణంబుగఁ బ్రకాశించి సాయంకాలమగుచు, పశ్చిమాంబుధిం గ్రుంకఁ బోవుచుండెను. సైనికులు ధరించిన చిత్రవసనంబులును, రజతసువర్ణమయాంచితహస్తాం

బులు నరుణకాంతిచే వింతరంగుల నీనుచుండెను. ఒరలనుండి దూయఁబడిన ఖడ్గములు దీప్తిమంతంబులై రక్తిమ వెడలఁ గ్రక్కుచుండెను. గుఱ్ఱములమీఁద, నేలఁగలమీఁద, నున్నమనోజ్ఞములగు పల్లనులు నూతనవికాసమునొంది శోణవర్ణంబున నలరారుచుండెను. ఆసమయమున నచ్చట పెలకొలఁది నున్నజనులకు బ్రతికియుండినంతకాలము తత్ప్రదర్శనము మఱపునకు రాలేదు.

---

## నలువదియొకటవ యధ్యాయము

క్రమక్రమముగ నమీనా పొందుచున్న కార్శ్యమును జూచి సహింపలేక యెట్లయిన నామెను బుట్టినింటికిఁ బంపవలయునని మీరాసు నిశ్చయము చేసికొనెను.

ఆంగ్లేయులు కోటసమీపమునకు రేపు వత్తురనఁగ నానాఁడు మధ్యాహ్న మమీనాయొద్ద కేఁగి యిదివఱకనేకదినములనుండి బోధించినదానికంటె నెక్కువగఁ జెప్పెను. "తప్పక నీవు నీపుట్టినింటికిఁ బోవలయును. లేదా కాశీమాలి యండంజేరి యతనిగ్రామమునకేఁగి యతనిపల్లెపట్టునఁ గొన్నిదినములుండి శరీరమునకు బలమువచ్చినతరువాత హైదరాబాదునకుఁ బొమ్ము. ఇచ్చట నుండునంతకాలము జాడ్యము కుదురనేరదు. పంచప్రాణములు నీమీఁద విడుచు తలిదండ్రు లుండ, హృదయస్ఫూర్తిగఁ బ్రేమించు కాశిమాలి యుండ, ఖానుఁడు పెడమొగము పెట్టినప్పటికి నతనియింటనుండి కృశించి చచ్చుట యనుచితము. చచ్చినతరువాతఁ జేయున దేమిలేదు. ఒకవేళ మరణమే సంభవించినను పగ్గఱకు రాని ఖానుని గృహమున మృతినొందుటకంటెఁ బెంచిన తల్లిదండ్రుల కన్నుల యెదుటఁ బ్రాణములు విడుచుట యుక్తము." అని మీరా నామెకు నూఱిపోసెను. అమీనా మొదట నమ్మలేక భీతిల్లి చివరకొడఁబడి ఖానునిగృహమునుండి వెడలు నుపాయము కనుఁగొను మని చెప్పెను.

అంతట మీరా నచ్చటనుండి లేచి యింటికిఁ గాశిమాలి యరుదెంచు సమయము తెలిసికొని సోదరుఁడైన జుల్ఫీను వెంటఁబెట్టికొని యతని నివాస

మునకుఁ బోయెను. అప్పటికిఁ జీకటిపడినది. గడియతీసియున్న తలుపు తెఱచి మెల్లఁగ నావరణములోఁ బ్రవేశించి తమ నెవరేనిఁ జూచుచున్నారేమో యని నల్దిక్కులఁ దిలకించిరి. దూరముగ నొకస్త్రీ యుండెంగాని యామె వారి కంటఁ బడమి నెవరు లేరనుకొని గడియ వేయకుండఁ (గడియయేల తీయఁబడెనో వా రెఱుఁగరు) గాశిమాలియున్న గదిపగ్గఱకు వెళ్లిరి. అతఁడు పగలు పనిచేసి వచ్చినందున నలసి తిన్న సీమీఁదఁ బరుండి చదువుకొనుచుండెను. పంచపాకలోఁ జప్పుడువిని సేవకులు వేచియున్నారని తలఁచి లోనికి రావచ్చునని యతఁడు చెప్పెను.

జుల్ఫి—అయ్యా నేను జుల్ఫిను. మా అక్కను దీసికొనివచ్చితిని. ఆమె మీతో మాటలాడఁ దలఁచియున్నది.

కాశిమాలి—(భయపడిలేచి) ఏమి? ఏమి సంభవించినది? అమీనాకు విపత్తు కలుగలేదుగదా!

మీరాను—లేదు లేదు. నిన్న నేఁడు కొంచెము తిరుగుచున్నది. కాని కాశిమాలీ! అమీనాకడగండ్లు వింటివా? (అని జొటజొటఁ గన్నీరు కార్చెను.)

కాశిమాలి—మీరానూ! ఎఱుఁగుదును. ప్రతిదినము మనజుల్ఫి చెప్పుచున్నాఁడు. నడచుచున్నను బనిచేయుచున్నను నాకన్నులలో నమీనా మెదలుచున్నది. స్వప్నములయం దామె నెల్లప్పుడు చూచుచున్నాను. ఒకొక్కప్పు డామె పూర్వవిలాసముతోఁ గానవచ్చును. అయ్యో! ఆమె కిట్టిదుర్గతి ప్రాప్తించినది! కోరనేని నాప్రాణములనైన నర్పించి యామెకు సహాయముచేయుటకు సిద్ధముగ నున్నాను.

మీరాను—కాశిమాలీ! నీవు తలఁచిన నీపని యెంత? సహాయముచేయఁగల వని, చేయుదు వని యెఱుఁగుదును. పటేల్ సాహెబ్! నీవే యామెపాలిటి దేవుఁడవు. నీపాదములాన—నీవె దిక్కు (అని పాదములపైఁ బడి విల పించెను.)

కాశి—(ఆమెను లేవనెత్తుచు) మీరానూ! లెమ్ము. ఇదే చెప్పుచున్నాను. సహాయమొనర్పుటకు వీలున్నయెడల నాప్రాణములైన లెక్కసేయక ప్రయత్నించెదను.

మీరాను—(కన్నీరు తుడిచికొనుచు) అయితే పటేల్ సాహెబ్! ఆలకింపుఁడు. అమీనాతో మాటలాడి యొప్పించితిని. ఆమెను శ్రీరంగపట్టణము దాటించి పంపితిమా, పోయి మీతల్లియొద్దఁ గొన్నిదినములుండి బలమువచ్చినతరువాత నెమ్మదిగ నిల్లుచేరును.

కాశి—ఖానుఁడు పంపఁడా?

మీరాను—ఖానుఁడా? ఛీ. వానిమొగాన నుమ్మివేయ! ఒకతులువకులాఁడి దొరకినది. అయ్యకాని దానితో సరి. అమీనా కీదుండగము చేసిన పదియే యని నాతలఁపు. పుట్టినింటికిఁ బంపుమని యమీనా యొకసారికాదు, రెండుసారులు కాదు, లక్షసారు లడిగినది. త్రోవలో నామెను ఫరంగీలు బాధింతురఁట. అందువలనఁ బంపఁడఁట. ఛీ! తనవలెనే ఫరంగీలుకూడ నాడువారితో యుద్ధముచేయుదురని యనుకొనినాఁడు కాఁబోలును. కాశి మాలీ! ఆముసలివానిపై నాశ లేదు. నిజముగ లేదు.

కాశి—ఆమెనుజూచి జాలియైన నొందఁడా?

మీరాను—దేవుఁడు సాక్షి. ఏఁబదినిమిదిరోజులైనవి. తిరిగి చూచినవాఁడు కాఁడు. పాపము! ఆమె సత్యవంతురాలు గనుక నోర్చియున్నది. మఱి యొకతెయైన నేమిచేయునో!

కాశి—(నిట్టూర్పు విడిచి) ఆమె లేచుటకుఁ గూర్చుండుటకుఁ శక్తికలిగి యున్నదా?

మీరాను—సందేహములేదు. ఆమె శరీరము దుర్బలముగ నున్నను మనస్సు స్థిరముగ నున్నది. ఎప్పుడింటినుండి వెడలిపోవుదునా యని వేచియున్నది.

కాశి—(నిట్టూర్పు విడిచి) అయ్యో! ఫరంగీలువచ్చి యీపట్టణము ముట్టడించియున్నప్పు డెట్లు స్థానము వదలిపత్తును? ఇన్నిదినములనుండి సుల్తానుని యన్నముదిని

సమయ మేతెంచినప్పుడు విడిచి పోవచ్చునా? ఒకవారము క్రిందట నీ విషయ మెందుకుఁ జెప్పకపోయితివి?

మీరాను—కాశిమాలీ! నీవు పట్టణములో లేవు. నీవు తిరిగివచ్చినప్పటినుండి యామెకు బోధించి బోధించి చివర కొప్పించి యిప్పుడు మీకుఁ జెప్పితిని.

కాశి—(తటాలున) తాళుతాళు. అమీనాతండ్రి బ్రతికియున్నాఁడు గదా?

మీరాను—ఆయన నెవ రెఱుఁగరు? రుస్తుం మూలిబేగన్న నందఱకుఁ దెలియును.

కాశి—నే నడిగిన దొకటి. నీవు చెప్పునది మఱియొకటి. అతఁడు జీవముతో నున్నాఁడా?

మీరాను—బ్రతికియే యున్నాఁడు.

కాశి—అయితే యతఁడు తప్పక యిచ్చటికి వచ్చియుండును. రాకపోయిన మాత్ర మేమి? వారి కొప్పగించినయెడల వారే తీసికొనిపోయెదరు.

మీరాను—ఎవరికి? కాశిమాలిసాహెబ్! ఒప్పగించుట యెవరికి?

కాశి—పరంగీలకు సహాయార్థము వచ్చిన నైజాము సైనికులకు.

మీరాను—ఏమి యీయాశ్చర్యము! అమీనా దినములు మంచివిగ నున్నవి. నైజాముసైనికులే యిచటికి వచ్చిన నింకేమి కొఱత? రుస్తుం రాకపోయి నప్పటికి నమీనాను గొమరితవలెఁ గన్నుల కద్దుకొనువా రనేకులు గలరు.

జుల్ఫా—అక్కా! ఇంకఁబోయి పరుండుదము. రేపు సంతోషముగ నమీనాతో మాటలాడుదము. ముచ్చటగ నమీనా కాశిమాలులు కలిసి యుండఁ జూచుభాగ్యము మన కెన్నఁడబ్బునే లక్కా.

మీరాను—ఆమీన్!

కాశి—(ఆలోచించి) ఒకసవారిని బోయీలను సిద్ధముగ నుంచెదను. నీవు రేపురాత్రి యామెను దీసికొనిరావలయును. మీరానూ! ఆమె మాయిం

టికి వచ్చునా? వచ్చి నాతో నొక్కముచ్చటాడి తరువాత బయలుదేరి పోవుట కిచ్చగించునా ?

మీరాను—దాని కెట్టి యాటంకము చెప్పడు. ఆభారము నాది. నేను దీసి కొనివచ్చెదను.

కాశి—ఆలస్యము చేయకుము. పొమ్ము. అన్ని సిద్ధముచేయుదును. ఆమెను నేను స్వయముగ నైజాము సైన్యాధిపతి కొప్పగించెదను. మాపల్లియొద్ద కామె పోయినయెడలఁ బుత్రికనువలెఁ జూచి యాదరించును. నే నమీనా కేమగుదునో యిప్పుడు విచారింపవలదు. భగవంతుఁడు వ్రాసిన ప్రకారము కాఁగలదు.

మీరానును జుల్ఫికారుఁడును బోవుటకై లేచి కాశిమాలివద్ద సెలవు గైకొనుచుండ నంతవఱకుఁ దలుపుచద్దఁ గూర్చుండి జరిగినసంభాషణము పూర్తిగ వినుచుండిన యొకస్త్రీ తటాలున లేచి కొంచెము దూరమున నుండిన పొద చాటునకుఁ జనెను. కొన్నినిమిషము లచ్చట డాఁగియుండి వారు పోయినతరువాత నీపె వారివెంట నేఁగెను. ఈపొలఁతి యెవ్వతెయోకాదు. సోజనే.

కొన్నిరాత్రులు గడచినపిమ్మట గుమ్మూ కరీనా లొకగదిలోఁ గూర్చుండి ఘోరముగ వినఁబడుచున్న యాంగ్లేయుల ఫిరంగుల మ్రోఁతలకు భయపడుచు నాలోచించుచు రహస్యముగ మాటలాడిరి. చివరకు గొంతెత్తి "ఈవిషయము హుర్మత్బీ యెఱుఁగునా? ఆమె యొంటు కిచ్చటికి రాలేదు?" అని కరీనా యడిగెను.

కుమ్మూ—అమ్మా! ఆమె యెఱుఁగునుగాని పిఱికిది. ఫిరంగులధ్వనులకు వెఱచి బయటికి కడుగుపెట్టుచున్నదికాదు. ఇఁక నాలస్య మేల చేసెదవు?

కరీనా—ఈఫిరంగుల మ్రోఁతలు నాగుండెను బ్రద్దలుచేయుచున్నవి కుమ్మూ.

కుమ్మూ—ఇదివఱకుఁ జెల్లకోడినిఁ గోయఁ జెనుదీసినప్పుడు, నన్నుఁ బిఱికిదానా యని యంటివి. ఇప్పుడు పిఱికియామె యెవతెయో కనఁబడుచున్నది. ఫిరంగులు మన నేమిచేయును? నేను మరల ఖానునివద్దకుఁ బోవలయును.

కురీనా—అమ్మా! అమీనా యిది లేకుండఁగనే చచ్చెను. మున్నా షేకుసుద్దూ నాకుఁ గలలో నగపడి చెప్పినది. మరల నన్నెందుకుఁ గష్టపెట్టెదవు?

కుమ్మూ—నే నామాట నమ్మను. కురీనా! అబద్ధము లాడుచున్నావు. అమీనా లేచి తిరుగుచున్నదఁట. ఇదిగో యుంగరము. తీసికొనుము. ఇఁక రమ్ము.

కురీనా—కుమ్మూ. దేవుఁడు నిన్ను రక్షించును. ఈయుంగరము నూర్గురు ఫకీరుల భోజనమునకు వచ్చును. నేను జచ్చినప్పుడు దీనితో నూఱు ఖొరానులఁ గొనవచ్చును.

కుమ్మూ—ఈమాటలకేమి? లెమ్ము. ఆలస్యమగుచున్నది. కావలసిన వస్తువులు సిద్ధముగ నున్నవి.

ఇద్దఱు లేచి వెనుక మంత్రప్రయోగము చేసిన గదిలోనికే మరలఁ బోయిరి. కుమ్మూ తలుపుమూసి గడియ వేసెను. ఆగదిలో ముగ్గుతో వేయఁబడిన బొమ్మయొక్క శిరస్సుమీఁదఁ గురీనా కూర్చుండి బయటికి వినఁబడి వినఁబడకుండ మంత్రములు చదివెను. రెండు మూఁడు నిమిషములు గడచిన తరువాత నామె, కొంగుముడి విప్పి దానిలో నున్న మన్ను, బూడిద, క్రింద వేసి వానిలో నీరుపోసి కలిపి యొక మంటిబొమ్మను జేసెను. బొమ్మను జేయుట పూర్తి యగుచుండినకొలఁది మంత్రము నెక్కువ బిగ్గరగఁ జదువ మొదలిడెను. పూర్తియైనపిమ్మటఁ గన్నులు మూసికొని లోలోనఁ గొణఁగి మఱియొకముడి విప్పి కట్టె మేకులఁ దీసికొని మంటిబొమ్మతలమీఁద, జేతులమీఁద, గాళ్లమీఁదఁ, బాదములమీఁద, నుదుటముమీఁద, వీఁపుమీఁద గొట్టి భయావహముగ శపించెను. దానిం జూచి కుమ్మూబీ వణఁకెను.

మేకులు గొట్టి "కుమ్మూ! చూచితివా? బొమ్మ యెంత బాగుగఁ గుదిరినదో! పున్నమనాఁడు తగులఁబెట్టఁబడిన శవపుబూడిద, నీళ్లాడి చచ్చిన యాఁడుదానిగోరీయొక్క మట్టి, కలిపి యీబొమ్మను జేసితిని. అవి దొరకక యెన్ని పాట్లు పడితినో నీవే యెఱుఁగుదువు? ఇంతకు దీనిమీఁదఁ గప్పటకు గుడ్డ యున్నదా?" అని కురీనా వాక్రుచ్చెను.

గుండె తెచ్చుకొని "అల్లా! నీకుఁ బదివేలు సలాములు. అమీనాకంటఁ బడకుండఁ దప్పిపోయినది. ఈబొమ్మ నన్నేమిచేయలేదు. దీని నిచ్చటినుండి తీసివేయుదును" అని తనలోఁదా ననుకొని కొంచెము సంకోచించి చివరకు "బిస్మిల్లా హిర్ రహిమాన్-ఇర్-రహీమ్" అని యని దానినెత్తి దుప్పటిక్రిందఁ బెట్టికొని వీథిలోనికిఁ బోయెను.

కుష్మాటి గృహమునొద్ద దానిఁ బెట్టవలయునని యామె తలఁచెను గాని నాశమొనర్చుటయే యుక్తమని యెట్టకేలకు నిశ్చయము చేసికొనెను. మసఁకమసకగఁ జీకటియయుండెను. పెంట దిబ్బకొఱ కామె యటునిటుచూచి యొకటి కనుఁగొని దానిమీఁద నున్నతుక్కులు వెడలఁగొట్టి యచ్చటికిఁబోయెను. "ఈబొమ్మవలని యరిష్టము దీనినిఁ జేసిన వారికగుఁగాక! ఆమీన్! ఆమీన్!" అనియని దానిమీఁద నుమ్మివేసి నేలకుఁగొట్టి కాలితోఁద్రొక్కి పొడిచేసి యాపొడిని కాలితో మెత్తగ నూఱి ఘోరముగ శపించుచు నద్దిక్కులకు నాపొడి నెగఁజల్లెను. ఇక నపాయము సంభవింపనేర దని యామె సంతృప్తిఁ జెందెను. తరువాత నమీనాయొద్దకు వెళ్ళినప్పు డామె సుఖముగనుండుటచేతనే తానుజేసిన పని సఫలమైన దని మీరానునకు గుఱుతుగ నుండెను.

.................................................................... ...

"సోజర్! నిజమా? అబద్ధమాడుచున్నావా?"

సోజర్—జమాదారుఁడా! అబద్ధముకాదు. వారు కాశిమాలి యింటికిఁబోవుచుండఁ జూచితిని. అనుమానపడి వారికగపడకుండ నేనుగూడ నచ్చటికేఁగి తలుపుప్రక్కఁ గూర్చుంటిని. వా రనుకొనిన మాటలన్ని వినఁబడినవి.

జమా—అయితే ఖానుని యింటినుండి యమీనాపోవుట యెప్పుడు? ఈ రాత్రికా? రేపా?

సోజర్—కాదుకాదు. ఈరాత్రికే యామె కాశిమాలి కౌఁగిట నుండఁగలదు.

జమా—ఏమీ! కాశిమాలీ! నీనీతి నేఁటికి బయటఁబడినది గదా! ఓహో!

సమయము చిక్కినది లెమ్ము. హోజక్! చీకటిపడఁగనే కాదూ, మనకు బయలుదేఱుట.

హోజ — ఔను. మీఖాను జబ్బుతోఁ జెప్పఁగ వింటిని.

జమా — మంచిది. ఇఁకఁ బొమ్ము. ముద్దులాఁడీ! నీమీఁదఁ బ్రేమ నాకెన్నఁడును పెఱుఁగదు. రాత్రి ప్రొద్దుపోయిన తరువాత రమ్ము. తెల్లవాఱువఱకుఁ గాలము గడపుదము.

జమాదారుఁడు ఖడ్గముఁబూని ఖానుఁడున్న స్థలమునకుఁ బోయెను. అతఁడు కోటగోడపై నియమితస్థానమందుండి దగ్గఱకు వచ్చిన జమాదారునిఁ జూచి "ఓహో! నీవా? రమ్ము" అని పలికెను.

జమా — మీతో రహస్యము చెప్పవలసి యున్నది. నాలు గడుగులు క్రిందికి దిగి రండు.

ఖాను — సుల్తానుఁ డేమైనఁ జెప్పిపంపినాఁడా? ఏమి టది?

జమా — (లోలోపల నవ్వుచుఁ గష్టముతో నవ్వు నాఁపి) మీయింటివిషయము లడుగఁబోవుచున్నాను. క్షమింపవలయును. మీభార్య జబ్బుగా నున్న దని వింటిని.

ఖాను — నిజమే కాని నీయభిప్రాయమేమో నాకుఁ దెలియకున్నది. ఎగతాళి చేయుచున్నావా యేమి?

జమా — అల్లా! అల్లా! ఎగతాళికాదు. ఆమె నిజముగ జబ్బుతోఁ జచ్చుటకు సిద్ధముగనున్నదా? (ఇంచుక నవ్వి) కాశీనూలి యామె నెన్నఁడో బ్రతికించె నని చెప్పికొనుచున్నారు. నిజమా? అబద్ధమా?

ఖాను — ఛీ! మూర్ఖుఁడా? ఇఁక మాటలాడకుము. నన్నుఁ బరిహాసించి నాతోఁ జదురుమాటలాడుటకు నీవా? నే నివి సహింపను.

జమా — ఓహో! ఏమి నీకోపము! నీమంచికే చెప్ప వచ్చితిని. కానక పడి పోవుచున్నావు.

ఖాను — నా మంచికా?

జమా—నీభార్యకుఁ జెవు లున్న దని నీవు వాస్తవముగఁ దెలియునా? అందులో నటనము లే దని నమ్మితివా? మోసము లే దని తలఁచితివా?

ఖాను—మోసమా? నటనమా?

జమా—ఎందుకు మరల నట్లందువు? వినుము. నీభార్యయైన యమీనాయొక్క రోగము పోవుటకుఁ గాశిమాలి మంత్రములు పెట్టించిన విషయము నీ వెఱుఁగుదువా?

ఖాను—కాశిమాలియా? అమీనాకా? నాభార్యను గుఱించి మాటలాడుటకు నీకు నో రెట్లువచ్చినదిరా?

జమా—పనికిమాలిన ముసలివాఁడా! వినుము. నేను నీమిత్రుఁడను. నేను సాధారణముగ నీభార్యను గుఱించి మాటలాడుటకు సాహసింపను. నీవు పెద్దవాఁడ వైతివి. పేరు సంపాదించితివి. గౌరవము పొందితివి. నన్ను నీవిదివఱ కవమానపఱచినప్పటికి నీయందు నాకు భక్తి గలదు. ఇట్టినీ కప కీర్తి వచ్చుచుండఁజూచి యోర్వఁజాలను.

ఖాను—అపకీర్తియా?

జమా—ఔనౌను. ఏమి యాశ్చర్యమా? నీవంటి ముసలివారు యౌవనవతులను బెండ్లాడి యనుభవించు ఫల మిదే. చక్కనిభార్య దొరకినది గదా యని మురిసియుచుఁ జంకఁబెట్టికొని వచ్చినట్లుకాదు. చూడుము. నేఁటిరాత్రికి నీయింటినుండి యొకస్త్రీ మరల రాకుండఁబోవుటకుఁ బ్రయాణమగుచున్నది.

ఖానుఁ డీమాట వినినవెంటనే నిశ్చేష్టితుఁడై క్రిందఁబడఁ బోవువాఁడాయెం గాని దైవవశమునఁ దప్పెను. అంతటఁ దెలివి తెచ్చికొని ఖడ్గమెత్తి రౌద్రాకారుఁడై జమాదారునిపై కేగెను.

జమాదారుఁడు జంకక గంభీరముగ "ఖానుఁడా! నీమేలుకోఱకుఁ బ్రయత్నించుచున్న యీప్రాణినిఁ జంపనెంచితివేనిఁ జంపుము" అని వాక్రుచ్చెను.

ఖాను—అల్లా! అల్లా! దుష్టుఁడా! అబద్ధమాడితి వని యొప్పుకొనుము. క్షమించెదను.

జమా—నాప్రాణము పోయినను సరే కాని యబద్ధమాడితి నని యొప్పుకొనను. నిజమే చెప్పితిని. ముమ్మాటికి నిజమే చెప్పితిని.

ఖాను—హా! భగవంతుఁడా! ఎంత చెడుకాలము! నమాయనిసలెనున్న కాశీమాలి యింతపనిచేసెనా?

జమా—అమీనామాత్రము మంచిదా? కపటము కనుఁగొనలేక పోయితివి. ఆడువారు చేయుమాయలు సృష్టికర్తకుఁ దెలియవు. నీవలె మోసపోయినవా రనేకులు గలరు హా హా హీ హీ.

ఖాను—జమాదారుఁడా! నవ్వకుము. నవ్వవలసిన సమయముకాదు. ఈవిషయము నీకెట్లు తెలిసినది? చెప్పుము. నెమ్మదిగ విందును.

జమా—ఎట్లు తెలిసిన నీ కెందుకు? కావలసినపని యైనది. నమ్మవేని నిన్నుఁ దీసికొనిపోయి కన్నులారఁ జూపెదను.

ఖాను—ఎక్కడకుఁ దీసికొని పోయెదవు?

జమా—కాశీమాలి యింటికి రాలేవా?

ఖాను—(పెద్దగొంతుతో) ఇప్పుడే పోవుదము. ఆలస్యము చేయకుము.

జమా—కాదు. కాదు. ఇప్పుడు కాదు. ఇంకను అట్టి యపాయము జరుగలేదు. బహుశః యేమియు జరుగకపోయే యుండవచ్చును. రాత్రికి నావెంట వచ్చెదవా?

ఖాను—తప్పక వచ్చెదను.

జమా—అందనుక నెమ్మదిగనుండుము. నేనే పొరపాటుపడి యుండవచ్చును. కాశీమాలి మంచివాఁడు. అక్కడ దుష్కార్య మేమి లేనిచోఁ జూచి పోవుటకు వచ్చితి మని చెప్పుదము. తెలిసినదా?

ఖాను—(మనోవైకల్యముచే విని వినక) నేను బాగుగ వినలేను. మరలఁ జెప్పుము. జమాదారుఁడు పూర్వప్రకారము వాక్రుచ్చెను.

ఖాను—ఆఁ. వచ్చెదను. ఇచ్చటనే యుండెదను. నాశరీరములోఁ బ్రాణముం
డిన నెచ్చటనున్నను వచ్చెదను, పిలువుము.

జమా—పోయివచ్చెదను. సెలవా !

ఖాను—మంచిది.

ఖానుఁడు పూర్వస్థానమున నుండెను. తుపాకుల మ్రోఁతలు, ఫిరంగుల ధ్వనులు భయంకరముగ నుండెఁగాని, యవి ఖానునికి వినఁబడలేదు. జమాదారుని కఠోరవాక్యములే యతని చెవులలో నిరంతరము మ్రోఁగుచుండెను.

---

## నలువదిరెండవ యధ్యాయము

"అమీనా లెమ్ము. నిండుగ ముసుఁగు పెట్టికొంటివి. ఇఁక నేమి భయము? త్రోవలో నందఱు కలఁతనొంది తిరుగుచున్నారు; తుపాకుల మ్రోఁత లెప్పుడాగునా యని యెదురుచున్నారు. మన నెవ్వరు చూడరు. ఒకవేళ నెవఁడైనఁ బైకివచ్చినయెడల జుల్ఫికారుఁడాయుధముల ధరించి కాపాడుచున్నాఁడు. కాశిమాలి సాహాయ్యపడుచున్నాఁడు. వేళయైనది రమ్ము." అని మీరా నమీనా నుత్సాహవాక్యములు చెప్పెను. ఆమె రెండుమూఁడుసారులు మంచము మీఁదినుండి లేవఁబోయెనుగాని దుర్బలయైనందున శక్తిలేకపోయెను. చివరకుఁ బ్రయత్నముతోఁ బ్రక్కపైఁ గూర్చుండి "మీరానూ ! నేను లేవలేను. నాచావీయింటిలోనే యున్నదని కాశిమాలికిఁ జెప్పుము. నడువఁజాలను. మోకాళ్ళు వణఁకుచున్నవి. నా కిఁక నాశ లేదు." అని యమీనా దుఃఖించెను. మీరాను కొంచెముసే పూరకుండి బుద్ధికిఁదట్టుడు శీఘ్రముగఁబోయి శీతలపానముం దెచ్చి యామెకిచ్చి త్రావుమని బలవంతపఱచెను. ఆమె త్రావెను. ఆమె కప్పుడు దార్ఢ్యము కలిగెఁగాని ఫిరంగులు తుపాకులు భయంకరముగ మ్రోఁగుచున్నందున రాలేనని చెప్పెను. పిఱికితనమును నిందించుచు రోషము వచ్చుమాటలు మీరా నాడెను. పాపము ! అమీనా హృదయము వికలమా

యెను. సహజధైర్యశాలిని యైనను మానవతులకుండు లజ్జాసౌశీల్యముల నామె వదలలేకపోయెను. కాశిమాలి యింటికిఁ బోయినదని, కాశిమాలితోఁ సంభాషించినదని, నలుగురెఱిఁగినచోఁ గలుగఁబోవు నపకీర్తి యామె కమితభయాపాదకమయ్యెను. కాశిమాలి యమీనాకుఁ బెనిమిటి కాఁడు. అతనియిల్లామెది కాదు. ఐనను మీరానుయొక్క ప్రోత్సాహవచనంబులు, భావిసౌఖ్యసూచకవాక్యంబులుఁ, నిరుపమానకారణపరంపరలు తుద కామె తలంపులను మార్చెను.

యువతుల కుండఁదగు వినయమార్దవాదిసద్గుణములు కలదియైనను వీరవంశసంజాతయగుటచే భేరీధ్వనులకు, రోషవాక్యములకు నుప్పొంగుశక్తి యొకటి యమీనాయం దణఁగియుండి సమయమువచ్చినప్పుడు వెలువడుచుండును. మీరాను నూఁతగాఁగొని యామె బయలుదేఱెను. బహిర్ద్వారము కడకు వచ్చి మీరాను మెల్లఁగ దగ్గెను. వెంటనే తలుపుతీయఁబడెను. ఆయుధపాణియై వేచియున్న జుల్ఫుకారుఁడు వీరును గలిసిపోయిరి.

అమీనా యుత్సాహముతోఁ నడువసాగెను. ఈపెవలె ముసుఁగువెట్టికొని యేకాకినులై కొందఱు, సపరివారికలై కొందఱు యువతులు శీఘ్రగమనంబునఁ బలుదిక్కులకేఁగుచుండిరి. పదాతులు, రాహుత్తులు మొదలగువారు గమ్యస్థానముల కరుగుచుండిరి. శతఘ్న్యాది సంజనితారావంబులు నిరంతరముగఁ గర్ణగోచరము లగుచుండెను. వాని కమీనా కంపిల్లెఁగాని మీరాను చెప్పిన ధైర్యవాక్యములు విని గుండె తెచ్చుకొనియెను. కాశిమాలిగృహసమీపమునకుఁ జేరిరి. అమీనావృత్తాంతము కనిపెట్టుట కిద్ద ఱచటఁ జాటున వేచియుండిరి. వారు జమాదారుఁడు, ఖానుఁడు. వీరిద్ద ఱిట్లు వత్తురని యమీనా యెప్పుడు తలఁచియుండలేదు. "ఖానుఁడా! అదిగో చూడు. అక్కడ నగపడిరా? వచ్చుచున్నారు." అని జమాదారుఁడు రహస్యముగ ననెను.

ఖాను—ఎక్కడ? జమాదారుఁడా? ఎక్కడ? నాకెవ్వరు కనఁబడుచున్నవారు కారు.

జమా——కాదు. కాదు. నేనే భ్రమించితిని. వీ రటుపోయిరి. వారు తలుపుదగ్గ ఱకు వత్తురు.

ఖానుఁ డూపిరి త్రిప్పికొనెను. ఇతఁడును జమాదారుఁడును గాశిమాలి యింటికెదుటనున్న పెద్దగోడనీడలోనుండి చూచుచుండిరి. ఖానుని హృదయమునఁ గ్రోధము మండుచుండెను. ఒక్కొక్కనిమిషమునందు నమీనాను బ్రతిమాలియైన నంచికొనవలయునని యతఁడు తలంచుచుండెను గాని, యామె యన్నిదినములనుండి యొనర్చిన మోసము బుద్ధికిఁ దట్టుటచే నుగ్రాగ్రహగ్రస్తుఁ డగుచుండును.

ఖానుఁడు కాశిమాలిని మొదటినుండి కుమారునట్లు పిలుచుచు నాదరించెను. అతఁడు సంపాదించిన ద్రవ్యము కూడఁ బైతృకంబు పుత్రునకుంబలె నతనికిఁ జెందుటకు సిద్ధముగ నుండెను. ఇవ్విధముగ దత్తకతుల్యుఁడైన కాశిమాలి కృతఘ్నుఁడై ద్రోహ మొనర్చెనని మనస్సునకుఁ దోఁచినప్పుడెల్ల ఖానుఁడు తోఁకత్రొక్కిన పామువలె నుగ్రుఁ డగుచుండును. రోషము, క్రోధము, మాత్సర్యము నతని మనంబునఁ బెనఁగొనియుండెను. అప్పు డతని దృష్టి బహిర్ద్వారముమీఁదనే యుండెను. చెవిదగ్గఱకువచ్చి రహస్యముగ ఖానుఁడా! చూడుము. రెండాకారములు కనఁబడుచున్నవి. కాదుకాదు. మూఁడవవాఁడు పురుషుఁ డింకొకఁడు కనఁబడుచున్నాఁడు. చూడుము. లావుగ నున్నాఁడు. అదిగో గుంజుచున్నది—అమీనా యాగుచున్నది—వాఁడు లోనికిఁ బోవుచున్నాఁడు. పొడచి వేయుదునా" అని జమాదారుఁడు పలికెను.

ఖాను—(చేతులుచాచి నాతిస్ఫుటస్వరముతో) అమీనా! అది నీయిల్లు కాదు! లోనికిఁ బోకువె. మరలవె. కాశిమాలి కడప నీ పేపనిమీఁదఁ ద్రొక్కెదవే! యా అల్లా! నామాట లవి వినుచున్నది కాదు. పోయినది. అయ్యో! ఇంటిలోఁ జొరఁబడినది. అయ్యో! అయ్యో! నిన్నెంత కష్టపడి పెండ్లాడితినే.

జమా—(ఉల్లాసముతో) ఖానుఁడా! నేను జెప్పలేదా? ఇప్పు డెవరిమాట లబద్ధములో తేలినవిగదా. రమ్ము. వాకిటి కెదురుగఁ బోయి తరువాత జరుగు వృత్తాంతము కనిపెట్టుదము. తలుపు తీయఁబడినదే యున్నది. ఇప్పటికైన నీ వాపవచ్చును.

ఖాను—ఏ మాపవచ్చును?

జమా—తరువాతఁ జెప్పెదను రమ్ము. (అని చేయివట్టి యీడ్చెను.)

ద్వారమునొద్ద శబ్దము వినఁబడఁగనే కాలవిళంబనాసహనుఁడై తహతహపడుచున్న కాశిమాలి లేచి యెదురుగ నేఁగి యమీనా నాదరించి గదిలోనికిఁ దోడ్కొనిపోయి మృద్వాసనంబునఁ గూర్చుండఁబెట్టి కౌఁగిలించికొని "అమీనా! నావంకఁ జూడుము. ఒకమాటాడుము. సుందరీ! ఎంత చిక్కిపోయితివి?" అని సానురాగముగఁ బలికెను. ఆమె మొగముముసుఁగు జారి కృశించిన యాకార మతని కంటఁబడెను. అతఁడినుమడించిన ప్రేమతో "రమణీ! ఎట్టియాపద నొందితివి! నీవు సుఖముగ లేవని వినిననాఁటినుండి నాహృదయసంతాప మింతింతకాదు. లోకమునకు వెఱచియు స్త్రీలమనస్సులు చంచలము లనియు నూరకుంటిఁగాని లేనిచో నిదివఱ కెన్నిసారులు ఖానుఁ డింటలేనప్పుడు నిన్నుఁ జూచియుందును? కోమలీ! నీ కికఁ గష్టములు తప్పినవని స్పష్టముగఁ జెప్పఁగలను. ఈదినము ప్రయాణము చేయుటకు శక్తికలదా? లేనియెడల నిచ్చట నుండుము. నీవు నాదానవు. నిన్ను నాప్రాణములకంటె నెక్కువగఁ జూతును. అమీనా! అనేకసంవత్సరములనుండి యెట్లు నిన్నుఁ బ్రేమించుచుంటినో నీ వెఱుఁగవు. నాశరీరము నీది. నాప్రాణము నీదె. (అని కపోలములు చుంబించి గట్టిగఁ గౌఁగిలించికొని కురులు సవరించెను.)

జమా—ఖానుఁడా! చూచితివా? గదిలోనికిఁ బోయిరి.

ఖానుని నోటినుండి మాట రాదాయెను. కన్నులు చింతనిప్పులవలె నెఱ్ఱగ నుండెను. ఖడ్గము హస్తమునం దమరియుండెను.

జమా—నామాట నిజమో కాదో, యిప్పుడైనఁ జూడుము. చేయిపట్టుకొని

పుచున్నాఁడు. కౌఁగిలించుకొనుచున్నాఁడు. నీభార్యను వాఁ డాతీరునఁ జేఱచుచుండ నెట్లోర్వఁగలవు? ఖానుఁడా! మగవాఁడవా నీవు? ఛీ ఛీ.

అప్పుడు మీనాను "కాశీమాలీ! సల్లాపముల కిది సమయముకాదు. సవారి సిద్ధముగనున్నది. రండు నీవు వెంటవచ్చెదవా? పటేలుసాహెబ్" అని నుడివెను.

కాశీ—అమీనా! ఇఁక లెమ్ము. చివరము ద్దొక్కటి యిమ్ము. (అని బుగ్గలు ముద్దు పెట్టుకొని యధరపానము చేసెను.)

అలతాపస్వి చుంబితాధరయై కాశీమాలిమోమును జూచెను. ఆచూచినప్పటి కన్నుల వర్ణింప నేతరము?

అనురాగానందమోహంబుల నాశ్రువుల్ వెడలఁగ్రక్కుచుండెను. కాశీమాలి తిరిగి గాఢపరిష్వంగ మొనర్చి యామెవదనంబున వదనంబుచేర్చి పరమానందభరితుఁ డయ్యెను.

జమా—ఖానుఁడా! ఇంతటనైనఁ గాఁసినదా? చూడుము. ఆమె సిగ్గువిడిచి యేమి చేయుచున్నదో.

ఖానునకుఁ గ్రోధము నిర్భరమగుడు నుత్తరాంగంబు వగిది ననివార్యుఁడై ధ్వనిపురస్సరంబుగఁ దలుపులనెట్టి కాశీమాలియింటిలోనికిం బోయి గర్జిల్లి ఖడ్గము జళిపించెను. ఆభ్రుకుటికౌటిల్య, మానయనారుణిమ, యాముఖరౌద్రము చూచిన నాగుండెలు నీరగునట్లుండెను. తమయుద్దఱ ప్రాణంబు లసిధారార్పితంబు లగునని కాశీమాలి తలంచెను గాని దైవవశమున నతనికిఁ గత్తివ్రేటు తగులలేదు. అమీనా శరీరమునుండి రక్తము చిమ్మనగ్రోవినుండి జలముభంగిఁ దీవ్రంబుగఁ గాఱఁ బ్రారంభింప నామె క్రిందఁబడెను.

చిలుకకొయ్యకుఁ దగిలింపఁబడియున్న తనఖడ్గమును గాశీమాలి లాగెను. అది రాకపోయెను. తడఁబడి దానినిఁ బలవంతముగఁ దీసి యొఱనుండి కత్తినిదూసెను గాని యది త్రాఁడుతో నంటఁగట్టఁబడియుంటచేఁ బ్రయత్నము వ్యర్థమాయెను. ఇవియంతయు నిమిషకాలమున జరిగెను. రక్తస్రావము కంటఁబడిన

తోడనే హృదయము చెదరినందున ఖానుఁడు ఖడ్గమును గ్రిందఁ బడవేసి చేతులుముకుళించి గాలిసోఁకినవానివలె నమీనాను జూచెను. "దుర్మార్గుఁడా! ఏమిచేసితివిరా?"యని కాశిమాలి ప్రశ్నించుచుండ నతఁడు నోటినుండి మాట రాక వెనుకకుమరలి యతిశీఘ్రగమనంబునఁ బరుగెత్తెను. బయటనున్న జమాదారుఁడు సంతోషముపట్టఁజాలక యట్టహాసము చేసెను. అది జమాదారుని కంఠస్వరమని కాశిమాలి గుఱుతుపట్టి రోషావేశుఁడై ఖడ్గముపూని వారివెంటఁ బడెను. వారు పరుగెత్తుచు బయటితలుపు వేసిపోయిరి. కాశిమాలి తలుపుతీసికొని వీథిలోఁ బడునప్పటికివా రదృశ్యులైరి. ఐనను గ్రోధాంధకారంబున నేదోయొక వైపునకుఁ బరుగెత్తెను. కాని వారుపోయినత్రోవ వేఱైనందున నతఁడెంతదూరమేఁగిన నగపడినవారు కారు.

కాశిమాలి యిల్లు విడిచిన యొకనిమిషమునకుఁ బడిపోయిన ట్లోకస్త్రీ శీఘ్రగమనంబునవచ్చి "అల్లా! అల్లా! ఏమోమునిఁగినది. ఖానుఁడును జమాదారుఁడును జావుబ్రతుకులమీఁదఁ బరుగెత్తుచున్నారు. ఏమాయెనో గదా." యని పలుకుచుఁ దలుపునెట్టి లోనికిఁ బోయెను.

అమీనా ధరించిన ధవళాంబరము రక్తసిక్తమై యుండెను. ఆనారీమణి మృదుకేశంబు లసృక్ప్రవాహంబునఁ దేలియుండెను; నేత్రంబులు నిమీలితంబులై యుండెను. లోనికివచ్చిన స్త్రీ నెత్తురుమడుగు చూచి నిశ్చేష్టితురాలై కొంతవడికి ధైర్యము తెచ్చికొని "ప్రాణమున్నదేమో! మీరానూ! ఎవరు లోపల? మీరానూ! అయ్యో! అయ్యో! ఏమాత్రము కొనయూపిరియున్నను జాకిరి చేసి బ్రతికింతునే. మీరానూ! పలుకవు?

**మీరాను**—(లోపలినుండివచ్చుచు) ఎవరా పిలుచుచున్నవారు?

**స్త్రీ**—ఎవరుకాదు. నేనే.

**మీరాను**—నేనన్న నెవరు? పేరుచెప్పుము.

**స్త్రీ**—నేనే మీరానూ. సోజనును. త్వరగ రమ్ము. కొంచెమాశయున్నది.

**మీరాను**—(అచ్చటికివచ్చి) సోజన్! నీ వెట్లు వచ్చితివి?

సోజక్ — ఎట్లువచ్చిన నిప్పుడెందుకు ? తరువాతఁ జెప్పెదను. ఆమెను లేవ నెత్తుము.

కత్తిదెబ్బనుజూచి యిద్దఱు గుండెలు గ్రుద్దికొనిరి. మీరా నామెను స్పృశించెను. శరీర ముష్ణముగనుండినందునఁ బరుగెత్తి యామె జుల్ఫును దోడ్కొనివచ్చెను. ముగ్గురు నామెను బరీక్షించిరి. ముక్కువద్ద వ్రేలుపెట్టి చూచిరి. గాలియాడెను. జీవమున్నదని మువ్వురు సంతోషించిరి. "అమీనా నిక్కడనుండి తీసికొనిపోవలయును. ఖానుఁడువచ్చి పూర్తిగఁ జంపును. ఒక రహస్యమైన యిల్లున్నది. ఆయింటిలో నామెను బరుండఁబెట్టుదము." అని సోజ నవెను.

మీరాను — సోజనూ ! నీమాట లెట్లు నమ్మఁగలము. ఈహత్యకు నీవే కారణ మని నా కనుమానముగ నున్నది.

సోజక్ — అల్లా ! అల్లా ! ఇఁక నే నేమిచెప్పుదును ? భగవంతుఁ డెఱుఁగును. నామనస్సెఱుఁగును. పుణ్యమునకుఁబోయినఁ బాపము వెంటవచ్చు నందురు. కాల మాతీరది. మిమ్మనిన నేమిఫలము ! మీకిష్టమైనయెడల దిక్కులేని యమీనాను వదలిపొండు. బొందిలోఁ బ్రాణముండువఱకు నుపచారముచేసి బ్రతికించెదను. విడిచిపెట్టుటకు మీకు వచ్చిన వచ్చునేమో కాని నాకుఁ గాళ్లురావు. (అని కన్నీరు కార్చెను.)

సోజనుయొక్క వచోవచనదైన్యంబులఁ జిలకించి మీరా నామెను విశ్వసించెను. జుల్ఫుకారుఁడు వ్రణవైద్యుఁడు కావున మెడకుఁ బ్రక్కన బుజముమీఁదనున్న గాయమునకు నేర్పుకొలఁదిఁ గట్టుకట్టెను. మొదటినుండి సిద్ధముగనుండిన సవారిలో నమీనా నెక్కించి తీసికొనిపోయిరి. సోజను చూపిన గొందిలోని యింట రహస్యముగఁ బాన్పుపై నామెను బరుండఁబెట్టిరి.

..............................................

పరమధ్వానములొనర్చు వృకసృగాలములు సమీపమున నిర్భయసంచారములు సల్పుచుండ, దృక్కరాళములైన దివాంధంబులు భయంకరముగఁ గూయుచుండఁ, దిరువాన్కూరు మహాయుద్ధసంకులసమరమునఁబడి యేకాకియై

నిరయమునందుంబలె గడపిన ఘోరరాత్రివంటి రాత్రి మరలం గాశిమాలికి దట స్థించెను.

ప్రియార్త్తవీక్షణ సంజనితానివార్యాగ్రహాకృష్టుండై సింహకిశోరంబు వగిది వెడలి మద్యపానమైథునాదిదుష్కార్యదూషితంబులగు ప్రదేశంబుల సహిత ముపేక్షింప శ్రీరంగపట్టణమునందలి వాడవాడలం గ్రుమ్మరెంగాని జమాదారుండు గాని ఖానుండుగాని కనంబడలేదు. అంతట విషణ్ణుండై "మనో హారిణివై, గాఢపరిష్వంగంబున న్వక్షోదేశంబుపై నణంగియుండి యాస్మాకీన చుంబనంబులను వ్రీడా పురస్సరంబుగం బ్రతిచుంబనంబులొనర్చి యపర్ణ్యానంద మొదంగూర్చిన యమీనా! హా! నిమేషకాలమున దూరగ వైతివా? మృత్యు దేవతాపహృత జీవకళవైయైన నీకళేబర మెట్లు చూడనోపుదును? అమీనా! హంసతూలికా మృదూపధానంబుపై విశ్రమించి కోమలకేశంబుల మనోజ్ఞ ముగం బ్రదర్శించు నీశిరంబు రక్తసిక్తంబై కఠినభూతలంబునం బడియుండ నెట్లు వీక్షించి సహింతును? అమీనా! మద్బహిఃప్రాణంబవై, జీవితానంద హేతుభూతంబవైన నీయొక్క శవాలోకనంబున నాగుండె వకావకలై పగిలి స్వర్గగతుండనై నిన్నుం గలసితినేని ధన్యుండను." పుణ్యుండను అని తలం చుచు గృహమున కేంగెను.

శోణబిందువులు కుడ్యాధోభాగంబులం జింది బిందురూపమున వ్రేలాడి జారిపడిన జాడలు కనంబడుచుండెను. శయ్యపైం బఱపంబడిన ధవళాంబరంబు జరిగినఘోరహత్యకు నిశ్శబ్దసాక్షియోయన రక్తచిహ్నాంకితమైయుండెను. మనస్సులకు నిర్మలానంద మొదంగూర్చు నామందిరము బస్వుడు భయాధిదేవతానివాస భూమిగ నుండెను. అమీనామాత్ర మచ్చట నతనికిం గనంబడలేదు. కనులం బడినచోం గాశిమాలి యేమయియుండునో యూహింప నెవరితరము?

అతండు నష్టద్రవిణుండైన లుబ్ధునిభంగి నంతట వెదకెను. కాని యామె యగపడలేదు. అతండు "జుల్ఫికారుండు మీరాను కలసి నాకు సంతాపము తొలంగించుటకై యామెను గొంపోయి పూడ్చిరి కాంబోలును. హా! అమీ

నా ! కట్టకడసారి చూపైన లభింపకపోయెను గదా ? మరాటీవంశము పైఁబడిన నాఁడు నీవు తుపాకినందిచ్చిన ప్రేమ యెట్లు మఱపునకువచ్చును ? అమీనా ! గాయమునకుఁ గట్టుకట్టిననాఁడు నన్ను ద్వదీయమృదుహస్తంబులతో స్పృశించిన యనురాగము నాశరీరముమీఁద మచ్చయియుండుటచేఁ నెట్లు మఱపునకు వచ్చును? అమీనా! సంకెదుర్గములో బోయీలు నీవెక్కియున్న పల్లకిని నా సమీపమునకుఁ గొనివచ్చియున్నప్పుడు నాపైఁ బ్రసరించిన నీదృక్కుల సౌభాగ్యం బెట్లు మఱపునకు వచ్చును? అమీనా! మహోద్యద్యుద్ధంబున ఖడ్గహతులచే క్షతగాత్రుండనై గుహాంతములోఁ బడియున్నప్పుడు యప్సరస యన్నుపపానంబులుబలె రజతపాత్రంబుతో శీతలోదకంబులిచ్చిన నీ మనోమార్దవం బీకాయంబున నాత్మ యుండునంతకాల మెట్లు మఱపునకు వచ్చును? అమీనా! నిమేషముక్రింద మద్బాహువులమధ్యమున నుండి నేను నీదాన నని భవన్నిలాసస్పృష్టులచేఁ జెప్పకచెప్పె గుడంబుకంటె శర్కరకంటె మధువుకంటె నమృతంబుకంటె మధురంబైన యధరపానం బొసంగిన నీసౌకుమార్యం బుచ్ఛ్వాసనిశ్వాసము లాడునంతపర్యంత మెట్లు మఱపునకు వచ్చును?

"హా ! అమీనా ! మనసమాధ్యాత్మికసంబంధముచేఁ బరలోకమునైనఁ గలియుదునని స్వల్పవిశ్వాసము కలదుగాని, యీలోకమున వైహికసంయోగము లేకపోయినను వారమునకు లేక మాసమునకు లేక సంవత్సరమున కొక్కసారియైన నీవదనంబు చూచి సంతుష్టిచెందఁగలనని యాసపడితిని. అయ్యో ! అమీనా ! నాయభీష్టము తుదముట్ట దాయెను. ఎంత దురదృష్టుఁడను ? ఎంత నిర్భాగ్యుఁడను?" అని విలపించుచుఁ బవ్వళించెను గాని నిద్రపట్టినది కాదు.

ఖానునిపై మరలఁ గ్రోధ మగ్గలముకా నతఁడు పటాలున లేచి నెత్తుటఁ దడిసియున్న వస్త్రములువిడిచి ధౌతములు ధరించి ఖడ్గహస్తుఁడై బయిటికిఁ బోయెను; తెల్లవాఱువఱకు సందుల గొందులఁ దిరిగి యింటికి వచ్చెను.

యుద్ధములో మృతినొందినచోఁ దన ద్రవ్యము తల్లికిఁ జెందవలయు నని మరణశాసనమువ్రాసి, దానినిఁ దీసికొని కాశీమాలిమసీదునకేఁగి, యచ్చటఁ

ప్రాతస్తవప్రార్థనకై వచ్చియున్న మూలా కాశాసనమునిచ్చి చెప్పవలసిన విషయములు పూర్తిగ వివరించెను. ఇంతలో సుల్తానుఁ డధికారిపరివృతుఁడై మసీదున కేతెంచెను. ప్రార్థన ముగిసినది. అంతట కదలసాగిరి. అప్పుడు సుల్తానుఁడు గొంతెత్తి

"ఆగుఁడు. నాలుగుమాటలు జెప్పవలసియున్నవి. కమ్రుద్దీన్! సయ్యద్ సాహెబ్! సయ్యద్ గఫూర్! బకీర్ సాహెబ్! కాశిమాలీ! అసమానశూరులారా! యోధాగ్రేసరులారా! రణవిద్యాపారీణులారా! మీ కందఱకు రాజుగను బవిత్రమైన మీమతమున కధిపతిగను నే నిప్పుడు కొన్ని యవసరములైన మాటలఁ జెప్పఁబోవుచున్నాను. ప్రపంచమునం దెచ్చటఁ జూచినను సర్వభూతదయాళుండైన యీశ్వరునియందు భక్తియు, విశ్వజనీనకార్యధురంధరుండైన యుపనీపతియందు విశ్వాసమును, లోకస్థితికిఁ గారణములై కన్పట్టుచున్నవి. రాజునకు భృత్యునకు నాధారాధేయభావంబు కలదు. పండితవిరాజమానంబై, దివ్యరత్నమండితంబై, కల్యాణపరంపరాశోభితంబైన సభామందిరంబుల మెలంగునప్పుడును, దుర్వారఖడ్గఘోరంబై, రక్తప్రవాహాభీలంబై, హేషాబృంహణారావసంకీర్ణంబై, భేరీధణధణంధణధ్వాన భయంకరంబైన యుద్ధరంగంబుల విజృంభించునప్పుడును గలుగు మనోవికారంబు లుపాధిభేదంబునఁ దారతమ్య ముండినప్పటికి నిష్ఫలము సమానంబు. కృతజ్ఞత, విశ్వాసము—ఈ రెండు ధర్మములే రాజభృత్యులకుఁ గల పావనబంధమును దృఢీకరించుచున్నవి. ఏనాఁ డీధర్మములు వ్యస్తములగుచున్నవో, యానాఁడే రాజ్యప్రళయము సంభవించుచున్నది. జాతివ్యక్తులకు నాశము సంభవించుచున్నది. అస్మద్యోధులారా! మీలోఁ దుచ్ఛభోగంబులకొఱకు శాశ్వతధర్మంబును బరిత్యజించు ముష్కరులుండిన నుండవచ్చును. హితకారుల కహితంబొనర్చు కృతఘ్నులుండిన నుండవచ్చును. బుద్బుదప్రాయంబగు జీవనంబు సతంబని నమ్మి సత్కీర్తికి దూరులగు దుష్టులుండిన నుండవచ్చును. దుష్టభుజంగంబులభంగి నాస్తికీనపరిపాలనంబునఁ జెరిగి తన్నాశ

మనకు మార్గములు వేఱగు సహజము లుండిన నుండవచ్చును. మద్దత్తమైన యన్నంబు భుజించి దేహధారణము చేయుచు, నేఁడు నన్ను విడనాడి పోవం గల స్వామిద్రోహు లుండిన నుండవచ్చును. అవిగో వారికొఱకు నరకద్వారములు తెఱవఁబడియున్నవి. అదిగో దేవుఁడు వారిని శిక్షించుటకు దండము నెత్తి సిద్ధముగ నున్నాఁడు.

శూరులారా! మీలో నన్నుఁ బూజించు దాసులున్నారు. నాకొఱకుఁ బ్రాణము లర్పింపఁగల రాజభక్తులున్నారు. కార్చిచ్చునైనఁ గవయఁగల సాహసులున్నారు. మృత్యుదేవతనైన మర్దింపఁగల పరాక్రమశాలు లున్నారు. వైరుల నుగ్గునూచంబుగఁ బడఁగొట్టఁగల సింహసదృశులున్నారు. ఘోరధణధణ ధ్వానంబులే శ్రావ్యనాదంబులుగ వినఁగల ధీరు లున్నారు. ప్రజ్వలత్ఖడ్గంబే విలాసదండముగ వహింపఁగల యోధులున్నారు. సంకులసమరరంగంబే క్రీడాభూమిగ విహరింపఁగల మహావీరు లున్నారు.

సభికులు—అల్లాయార్! దీన్! దీన్!

సుల్తా—నాయకులారా! మనము మహమ్మదీయులము. పైగంబరు సంతానంబులము. కరుణాళుండైన యీశ్వరుని పరమవాత్సల్యముచే మహమ్మదీయ విజృంభణము దిగంతములవఱకు నిరంతరముగ సాగినది.

సభికులు—అల్లాహో! అక్బర్!

సుల్తా—నేఁడు మనయందలి ధర్మవిహీనతవలననో, మఱియేకారణముననో భగవంతుని కటాక్షవీక్షణము దూరమై మహమ్మదీయసామ్రాజ్యమునకు వినాశము వాటిల్లఁబోవునట్లు కన్పట్టుచున్నది. మహమ్మదీయులారా! ధర్మలోపముల సవరింపుఁడు. ఈశ్వరుని కరుణ సంపాదింపుఁడు. పూజ్యమైన మతమును నిలువఁబెట్టుఁడు. రాజ్యము నుద్ధరింపుఁడు. విదేశీయులు దేశమును ముట్టడించియున్నారు. కాలాకాశంబున ధూమకేతువులు కన్పట్టుచున్నవి.

పుణ్యాత్ములారా! సకలరాజాధిరాజ దత్తాలంకారశోభితంబైన యీ మహమ్మదీయశిరంబు విమతకల్మషపాదంబులపై నెట్లు వ్రాలఁగలదు? నేఁటి

[illegible] నభోంతరాళమున విజయచిహ్నముగ సంచరించుచున్న మహమ్మదీయ మహాధ్వజ మెబ్భంగి భగ్నమగును?

సభికులు—అల్లా! అల్లా!

సుల్తా—విక్రమవిరాజితులారా! ఈకోట యీపేట యీధర్మసభామంటపంబు యీవిలాసభవనంబు యీశుద్ధాంతసౌధంబు యీవిద్యాలంకార వస్తుసంగ్రహంబు లేరీతి దురహంకారులగు పరంగీల కొప్పగించి నీచాతినీచజీవనయాత్ర గడపఁగలము?

సభికులు—దీన్! దీన్!

సుల్తా—ధీరులారా! కారన్‌వాలీసుతో సంధివిషయమై ప్రశంసింప నతఁడు సర్వదా మనపై దూషణవాక్యము లాడియున్నాఁడు. మన రాజ్యములో నర్ధభాగ మీయవలయునంట.

సభికులు—హా! హా!

సుల్తా—యుద్ధపుఖర్చు లొసఁగవలయునంట. అకటా! నాకుమారుల నిద్దఱి వారి కాధిపెట్టవలయునంట. వీరులారా! ఈదారుణభాషణములు విని యెటు సహింతుము? సమయము వచ్చినది. లెండు. నడుముకట్టుఁడు.

సైనికులు—మహాప్రభూ! రక్తము నొసంగుటకు సిద్ధముగ నున్నాము. మీపాదములాన! భయంకరాకారమైన యాంగ్లేయసేనపమీఁదనైన నడుగుక వెనుదీయము.

అప్పు డచ్చటనున్నవారి కోపాటోప మింతింతయని చెప్పుటకు వీలులేదు. రక్తమన్నఁ గన్నులు మూసికొను పసిగూడ గంభీరవాక్యములఁ బలుకసాగెను. సుక్షుభితజలధిచందంబున జనప్రకరంబు ధ్వనింప మొదలిడెను. అందఱు నానలువెట్టువారు, పరంగీల శపించువారు, పండ్లుగీటువారు, బాహువు లప్పళించువారు, రణవాక్యోద్గార మొనర్చువారునై యుండిరి. తత్సమయంబున వారికి జనించినయుద్రేకము వర్ణనాతీతము; శాస్త్రానిర్వచనీయము.

సుల్తానుఁడు చేయియెత్తి వారించి యిట్లనియె: "మహాబలులారా! ఇంకొకమాట వినుఁడు. మొదలు దుర్మార్గదూషితుఁడైన కారక్ వాలీసును జక్కాడవలసియున్నది. తక్కినవారిని లేళ్లభంగి వేటాడవచ్చును. ఆకసము దుష్టుని నేయుపాయముచేనైన వధింపఁగల పురుషుఁ డెవ్వఁడు? ఎవ్వఁ డతనిని బ్రాణములతోఁ గొనివచ్చునో, లేక చంపి శిరంబునైనఁ దెచ్చునో, యాతఁడు మత్కృపాభాజనుఁడై మహాసంపదలఁ బొందఁగలఁడు. ప్రయత్నమున స్వప్రాణముల గోల్పోవునేని స్వర్గలోకమున సర్వసుఖముల ననుభవింపఁగలఁడు. అస్మత్సైనికులారా! మీలో నొక్కఁడైన నట్టిధైర్యశాలి లేఁడా?"

ఈమాటలు విని యుగ్రులై యిద్దఱు తటాలున గుంపులోనుండి ముందునకు వచ్చి మే మాపని చేయుదుమని గంభీరముగఁ బలికిరి. ఆయిద్దఱిలో నొకఁడు కాశీమాలి. రక్తనేత్రంబులు గలిగి నైరాశ్యసంతాపసూచకంబైన ముఖంబుతో గంపవయస్కుఁ డుండెను. అతఁ డెవ్వఁడో చదువరు లూహింపఁ గలరు. అతఁ డబ్దుల్ రహిమాన్ ఖానుఁడు. వీరిద్దఱు నచ్చట నొకరుండినట్లొక రెఱుఁగరు.

---

# నలువదిమూఁడవ యధ్యాయము

"కాశీమాలీ! నీవు దుర్బలుఁడవుగ నున్నావు. కావున నిన్నికార్యమున నియుక్తునిగఁ జేయఁదగదు. సమర్థులు చాలమంది గలరు" అని సుల్తానుఁడు వాక్రుచ్చెను.

కాశీమాలి:—స్వామీ! నన్ను మరలింపకుఁడు చావన్న నాకు భయములేదు. మరణకాల మాసన్నమయ్యేనేని గృహములో నుండినను దప్పదు. నేను దుర్బలుఁడనుగాను. చూడు నాదండచేయి. పిఱికివాఁడను గాను.

ఖాను:—మహాప్రభూ! ఈకార్యమునకుఁ దగినవాఁడను నేను. అతనికంటె ముందు మీకొలువులోఁ బ్రవేశించితిని. అతఁడు లేఁతవాఁడు. నేను వృద్ధుఁ

డను. చావ సిద్ధముగ నున్నాను. ఇంతకాలమునుండి మీయన్నము తింటిని. మీఋణ మెట్లు తీర్చికొందును ?

సుల్తా:—ఖానుఁడా! ఏల యట్లు మాటలాడుచున్నావు. నీచూపుకూడ వికృతముగ నున్నవి. జబ్బుగ నున్నావా ?

ఖాను:—జబ్బులేదు. సుఖముగనే యున్నాను. నేను మీదాసుఁడను. మీ వాక్యములు నాహృదయమును జలింపఁ జేసినవి. నాడే హానికి, సన్నుఁ బంపుఁడు.

సుల్తా:—శూరులారా ! మిమ్ము నిద్దఱఁ బంపుచున్నాను. భగవంతుఁడు మిమ్ముఁ గాపాడుఁగాక. మీ రీరాజహితైకకార్యమునఁ బ్రాణంబులఁ గోల్పోవుదు రేని దేశోద్ధరణమునకై జీవితములర్పించిన మహాపురుషు లగుదురు. ఏతాదృశమరణంబు సర్వజనసంస్తవనీయంబు; స్పృహణీయంబు. మీపవిత్ర నామములు ప్రజలహృదయ సీమలయందు శాశ్వతముగ నుండఁగలవు. పొండు. విజయులై తిరిగివత్తురేని సర్వశుభములు మీకొఱ కెదురుచూచుచుండును.

ఇద్దఱు సుల్తానునకు సలాములొనర్చి వెనుకకుఁ బోయిరి. ఒకరినొకరిద్దఱు స్పష్టముగఁ జూచికొనిరి. "రమ్ము. ఆలస్య మగుచున్నది." అని ఖానుఁడు కాశిమాలికిఁ జెప్పెను. సభికులు ప్రోత్సాహవాక్యము లాడిరి. "నావెంట రాఁదలఁచినవారు దక్షిణద్వారముకడ వేచియుండుఁడు" అనియఱచి ఖానుఁడు శీఘ్రగమనమున నింటికిఁబోయెను. ఇంటిలో నమీనా మీరాను సోజను లగపడనందున ఖానుఁ డేమనునో యని సేవకులందఱు భీతచిత్తులై యుండిరి. అంతయుఁ దాఱుమాఱుగ నుండెను. ఖానుఁ డింటిలోఁ బ్రవేశించి గుఱ్ఱమును సన్నద్ధపఱుపుమని సాహిణితోఁ జెప్పి యిదివఱ కమీనాశయనించుచుండిన గదిలోనికిఁబోయి తలుపుమూసెను. ఆమె పెంచిన కీరమల్లనఁ గూజితములఁ సల్పుచుండెను.

చిరపరిచయుఁడైన ఖానుఁ డక్షిగోచరుఁడగుడు గోపవంక ఱెక్కలాడించి యఱచి పంజరపుఁగమ్ములలోనుండి మెడ బయటికిఁబెట్టెను. అతఁడు దగ్గఱను వచ్చినప్పు డతని చేతిని ముక్కుతో స్పృశించి మొగమును జేతిమీఁదవేసి రద్ది యతని వంక మృదునేత్రములతోఁ జూడ మొదలిడెను.

భోగము లనుభవించిన సమయమునందు దారు విలాసార్థముంచికొనిన ప్రియవస్తువులన్ని యతనికంటఁబడెను. అమీనా నిలువుటద్ద మచ్చట నున్నది. సుగంధద్రవ్యము లచ్చట నున్నవి. చిత్రవస్త్రపరిపూరితపేటిక లచ్చట నున్నవి. శీతలమరుత్కిశోర సంజనక చామరములచ్చట నున్నవి.విద్యోతమాన మనోహర రజతసువర్ణమయపానపాత్రము లచ్చట నున్నవి. కాని మందస్మితముచేతను, మధురవచనములచేతను, విలాసవృత్తులచేతను, వర్ణనాతీతసౌభాగ్యవంతమైన వదనముచేతను, నిర్భర పరమానంద మొదఁగూర్పు నమీనామాత్ర మచ్చట లేదు. ఎచ్చటి కేఁగినది? స్వఖడ్గహతయై కళావిహీనయై పూడ్చి పెట్టఁబడి వికృతమైన శీతలదేహముతో నెచ్చటనో యుండెనని యతఁ డనుకొనెను.

కొన్నిగంటలకుఁ బూర్వ మమీనా లేచిపోయినప్పుడు తాఁజుమాఁటై యున్న పాన్పుమీఁద నతఁడు పడి గోడుగోడున దుఃఖింప మొదలిడెను. అతఁ డాసమయమున బాహ్యప్రపంచమును మఱచెను. అతని మనోనేత్రమున కమీనాతక్క వేఱొండు కనఁబడినదికాదు. నిమిషము లరిగెను. గడియలు దాఁటెను. అతఁ డెఱుఁగఁడు; తల్పంబుపైనుండి విలపించుచునే యుండెను. కొంతసేపటికొకఁడు వచ్చి తలుపునెట్టి "కాశిమాలి మొదలగువారు మీకొఱకువేచి యున్నారు. శీఘ్రముగ రావలయును"అని యఱచెను. ఈమాటలు ఖానునకుఁ దెలివితెచ్చుడు "వచ్చుచున్నాను. వచ్చుచున్నాను" అని ప్రకాశముగఁ జెప్పి "కాశిమాలి నన్ను మఱవలేదు. నావలె నతఁడును జావఁ గోరుచున్నాఁడు." అని తనలోఁ దా ననుకొనెను.

తలుపుతీసి యతఁడు బయటికిఁ బోవుచుండ నొకదాసి "అయ్యా! మీతోఁ గుప్తూబీ మాటలాడఁగోరుచున్నది" అనిపలికెను. "నేను జావఁబోవు

చున్నా నని చెప్పుము. అమీనాయొద్దకుఁ బోవుచున్నానని చెప్పుము" అని యతఁడు విదిలించి ప్రత్యుత్తరమిచ్చి సిద్ధముగనున్న గుఱ్ఱము నెక్కి యతివేగ ముగ నరిగెను.

కాశిమాలి—వచ్చితిరా? మీకొఱకే వేచియున్నాము.

ఖాను—కాశిమాలీ! ఏల నీవు చావునకుఁ దెగించితివి? బ్రతుకవలసిన వాఁడవుగదా.

కాశి—నీ వేరీతిఁ జావఁ గోరుచున్నావో, యంతకంటె నెక్కువగ నేను గోరుచున్నాను. దేవునియెదుటికిఁ బోయినప్పు డన్ని నీవె యెఱుఁగఁ గలవు. రమ్ము. వారందఱు మీకొఱకుఁ గనిపెట్టుకొనియున్నారు.

భాషమెట్టిదో కాని ఖానుఁడు హీ హీ హీ యని నవ్వెను. వాని సంభాషణ మానవ్వుతో నాగెను. అంతట నందఱు గుఱ్ఱములకు సైగ చేసిరి. అవి వాయువేగమునఁ బరుగిడెను.

తత్సమయంబున హయఖురోద్ధూతపరాగంబు బ్రహ్మాండకటాహంబున నిండి స్థావరజంగమపదార్థంబులు గనఁబడకుండ నొనర్చెను. తత్పదసంఘర్షణంబుచే, పౌరాణికులు చెప్పినట్లు సర్పరాజు భూమిని మోయుచున్నచో నతని వేయితలలు తప్పక యపుడె దిమ్ముపట్టియుండును.

ఆంగ్లేయుల శిబిరమును సమీపించి "మీ సేనాధిపతి గుడారు ఏది? చూపుము" అని యచ్చటఁ గాచియున్న సైనికు నడిగిరి. నైజామునొద్దనుండి సైన్యము వచ్చుచున్నదేమో యని తలఁచి యదిగోయని యతఁడు వ్రేలు చాచి చూపెను. అత్యుత్సాహమున వీరు గుఱ్ఱములఁ బరుగెత్తించిరి. కాని వీరిరాక మొదటినుండి శిబిరములోని యొకయధికారి కనిపెట్టుచు ననుమాన పడి వీరుపోవుమార్గమున కడ్డముగ నాయుధహస్తులగు భటులను నిలిపెను. కాశిమాల్యాదులు సమీపింపఁగనే యాంగ్లేయాధికారియొక్క యాజ్ఞచొప్పున సైనికులు తుపాకులఁ గాల్చిరి. కాశిమాలి గుఱ్ఱము బోరగిలఁబడెను. అతఁడు

కూడ దానివెంటఁ గ్రింపఁబడి ప్రక్కకుఁదిరుగ ఖానుఁడు నేలకు వ్రాలుటయు నశ్వము పగుగిడుచుంటయు నతనికంటఁబడెను. తత్క్షణమే కాశిమాలి మూర్ఛిల్లెను. గుఱ్ఱము చచ్చి కాశిమాలిమీఁదఁ బడియుండెను. కొంచెముసేపటికి తెలివి వచ్చుడు నతఁడు గుఱ్ఱముక్రింద కాలినిఁ దీసికొని లేవఁబోయెను గాని కాలు కదలినదికాదు. పాపము! అది విఱిగినది. అతఁడు మరలఁ గ్రిందఁబడి నల్దిక్కులఁ జూచెను. తనతో వచ్చిన వారిలో ననేకులు చచ్చిపడియుండిరి. కొందఱు దురంతశోకసంతప్తులై ఘోషిల్లుచుండిరి. అశ్వములు లెక్కకు మిక్కిలిగ మృతినొంది యుండెను. కొందఱు పరుగెత్తుచుండిరి.

ఆంగ్లేయాధికారి సిపాయాల వెంటఁబెట్టుకొని చిందఱవందఱగఁ బడియున్న కాశిమాల్యాదులనగ్గఱకు వచ్చెను. కాశిమాలి బ్రతికియుండుట చూచి యొకఁడు తుపాకిలో నమర్పఁబడిన కత్తి నెత్తిపొడువఁబోవ నాంగ్లేయాధికారి "ఆగు. చంపకుము. అతఁ డధికారివలె నున్నాఁడు. లేవనెత్తుము. ఆయుధములుమాత్ర మూడఁదీసికొనుము" అని యఱచి దగ్గఱకు వచ్చి కాశిమాలిం జూచి "ఓయీ నీవు మాచేతఁ జిక్కితివి. వెనఁగకుము. గాయము తగిలినదా?" యని యడిగెను.

కాశిమాలి:—(దైన్యముతో) అవును. కాలు విఱిగినది. నాకు బ్రతుకుపై నాశలేదు. బ్రతుకఁదగినవాఁడనుగాను. చంపుము.

అధికారి:—పాపము! బాధ మిక్కుటముగ నున్నది కాఁబోలును. (సిపాయీలంజూచి) మీలోఁ గొంద ఱితని నెత్తుకొని నాగుడారమునకుఁ జేర్పుఁడు.

కాశి:—అయ్యా! అదిగో అచ్చోట మాసేనానాయకుఁడు పడియున్నాఁడు. దయచేసి నన్నచ్చటికిఁ దీసికొనిపోయి కడసారిచూపు చూడనిండు. నిన్నటి వఱకు మేము ప్రాణస్నేహితులుగ నుంటిమి. మరణములో మేము వేఱుగ నుండఁగూడదు.

వారామాటలకు జాలినొంది యతనికోరిక నెఱవేర్చిరి. ఖానుఁడు బోరగిలఁబడియుండినందున మొగము కనఁబడకుండెను. కాశిమాలి ప్రార్థింప వారతనిని వెలికిలఁ బరుండఁబెట్టిరి. అతనిముఖము వికృతమై యుండెను. ఫాల భాగమున నొక రంధ్రముపడి నల్లనినెత్తురు కొంచెము బయటికి వచ్చియుం డెను. కాశిమాలి తనబాధ మఱచి పొంగిపొరలివచ్చుచున్న దుఃఖముపట్టఁ జాలక ఖానుని పార్శ్వమునఁబడి వెకివెక్కి యేడ్చెను. కొంతసేపటికి లేచి కూర్చుండి, "అయ్యా! ఇతఁడు ప్రసిద్ధిచెందిన శూరుఁడు; మా సేనాధిపతి. మామతాచారప్రకార మితని కుత్తరక్రియలు జరుపవలయును" అని యధి కారితోఁ జెప్పెను. ఆమాట విని యొక మహమ్మదీయుఁడు "దాని కేవిధమైన లోపమును జరుగదు. ఇతఁడు మాకు శత్రుఁడైన నగుఁగాక; మతములో సోద రుఁడు. మనమందఱము మహమ్మదీయులము. జరుగవలసిన క్రియలన్ని జరి పెదము." అని వాక్రుచ్చెను. కాశిమాలి "అయ్యా! మీరు నాపైనిఁ జూపిన దయకుఁ గృతజ్ఞుఁడనై వందనము లొనర్చుచున్నాను. ఇఁక నన్ను మీయిచ్ఛ వచ్చినచోటికిఁ గొనిపొండు. చత్తునో బ్రతుకుదునో యనువిచారము నాకు లేదు. నన్నుఁ బ్రేమించి నాచేఁ బ్రేమింపఁబడినవా రీలోకము విడిచిపోయిరి. జీవచ్ఛవంబనై యిఁక నేను బ్రతికినమాత్ర మేమిప్రయోజనము కలదు?" అని కన్నీరుకార్చుచుఁ బలికెను. అతనిమీఁద నాంగ్లేయాధికారికి దయ యధిక మాయెను. అతనిగుడారమునకుఁ గొంపోయి పాన్పుపైఁ గాశిమాలినిఁ బరుండఁ బెట్టిరి. అధికారికి మిత్రుఁడగు నాంగ్లేయవ్రణవైద్యుఁ డాకారితుఁడై వచ్చి మెలఁకువతోఁ గాశిమాలికాలినిఁ బరీక్షించి శస్త్రప్రయోగ మొనర్చి కట్టు కట్టెను. బాధ యుపశమించెను. కాశిమాలి కావైద్యునైపుణ్య మాశ్చర్యము పుట్టించెను. ఆంగ్లేయసైనికులు సుల్తానునిచేఁ బట్టుపడినప్పు డతఁడు చూపు కాఠిన్యము, నిప్పుడు తన కాంగ్లేయులు చూపుచున్నదయను దలఁచికొని యతఁడు తలయూఁచెను. ఆంగ్లేయులమీఁద నదివఱకుఁగల దురభిప్రాయ మప్పుడు కాశిమాలికిఁ జాలమట్టునకుఁ బోయెను. అతని కీతీరునఁ గారు

ణ్యాముచూపిన యాంగ్లేయాధికారి ఫిలిప్పే. ఇతఁడు హార్బర్టుయొక్క జాడ కనుఁగొనుటకై సుల్తానుని సైన్యములో నెవనినైన లోఁబఱచుకొనవలయు నని ప్రయత్నముచేయుచు సమయము తటస్థించినందునఁ గాశిమాలి నాదరించెను. ఫిలిప్పు కాశిమాలినిఁ బలుకరించుచు కుశలవార్త లారయుచుండెను. కాలి గాయము కుదిరినకొలఁది నిద్దఱు మిత్రులై పలువిషయములఁగూర్చి సంభాషింప సాగిరి. ఒకనాఁడు ప్రస్తావవశమున "సుల్తానుఁడు కారాబద్ధులైన యాంగ్లేయుల ఘోరముగ హింసించెనని వింటిని. అది నిజమగునా?" యని ఫిలిప్పడిగెను. కాశిమాలి ధర్మజ్ఞుఁడుకావున నట్టిరహస్యములు శత్రువులకుఁ జెప్పిన రాజద్రోహ మగు నని యెంచి సందిచ్చినవాఁడు కాఁడు. "పోనిమ్ము. ఖైదీలలో నెవనితోడనైన నెప్పుడైన సంభాషించియుంటివా" యని ఫిలిప్పు మరలఁ బ్రశ్నించెను. "నే నొక యాంగ్లేయునితో బెంగుళూరిలో మాటలాడితిని. ఒకసమయమున సుల్తానుని దర్బారులో నతని ప్రాణరక్షణముకూడఁ జేసితిని." అని కాశిమాలి చెప్పెను. ఫిలిప్పు సంచలితమనస్కుఁడై "ఎత్తైనవాఁడు; రాగి వెంట్రుకలు కలవాఁడు; కాఁడూ?" అని సంభ్రమమున నడిగెను. కాశిమాలి కతఁ డెట్టివాఁడో త్వరగ జ్ఞప్తికి రాలేదు. ఉదుదుడుకు సమయముల నతఁడు చూచియుంటచే మఱచెను. కొంచెము సేపాలోచించి యతఁడే యైయుండు నని తలఁచి "పాప మతఁడు మరల నాకగపడలేదు" అని ప్రత్యుత్తర మిచ్చెను.

ఫిలిప్పు—ఏమి ? ఎందువలన ?

కాశిమాలి—సుల్తానుఁ డతనిని జంపుమని యుత్తరు విచ్చెను. దర్బారునుండి యతనిని దీసికొనిపోవుచుండఁ జూచితిని. మరలఁ గనఁబడలేదు. ఆఘోరాజ్ఞ నిర్వర్తించువాఁడు జమాదారుఁ డొకఁడు కలఁడు. అతని హృదయము సైతానునకు నివాసము.

ఫిలిప్పు—ఇంతకుఁ బూర్వమునుండి యెవఁడో దుర్మార్గుఁ డున్నాఁ డని చెప్పుచుంటివి. వాఁ డీ జమాదారుఁడా యేమి ?

కాశీ—వాఁడే. పాప మాపరంగీమీఁద దుమ్మివేసి బలవంతముగ నీడ్చుకొని పోయినాఁడు. అట్టి దురవస్థలోనుండికూడ నాతో నతఁడు కృతజ్ఞతా వాక్యము లాడెను. అతనిని రక్షించుటకు నా కధికారము లేకపోయెను. ఏమిచేయుదును? అతఁడు బాలాపురమునకు సమీపమున నున్న ఘోర దుర్గముమీఁదనుండి క్రిందికిఁ బడద్రొబ్బఁబడి చచ్చియుండును.

ఫిలిప్పు—లేదు. లేదు. అక్కడఁ జావలేదు. అది నేను నిశ్చయముగ నెఱుఁగుదును.

కాశీ—నీ కెట్లు తెలియును? ఆయన నీకేమికావలె? సాహెబ్!

ఫిలిప్పు—అతఁడు నాకుఁ దోఁబుట్టువుతో సమానుఁడు. నామఱఁది. అతని చెల్లెలిని నేను వివాహమాడితిని. మేము బాలాపురమువద్ద విడిసినప్పుడు నీవు చెప్పిన దుర్గమున కేఁగి చూచితిమి. అతనిపే రచ్చట వ్రాయఁబడియుండెను. జ్వరపీడితుఁడైన యతని నచ్చటినుండి తీసికొనిపోయి రని మఱియొక కారాబద్ధుఁ డచట గోడమీఁద వ్రాసెను. మాకుఁ గొంత ధైర్యము వచ్చినది. జాడలు తీయుచుఁడియుచు బాలాపురములో నున్న యొకఫకీరు నాశ్రమమునకుఁ బోయితిమి. ఆయాశ్రమము నీ వెఱిఁగియే యుందువు.

కాశీ—అవును. చల్లని ఛాయావంతమైన నివాసముకాదా? ఎండలో నడచుటవలన నలసిసొలసి వచ్చిన బాటసారులకు శీతలపానము లొసఁగి నిజాశ్రమమున విశ్రాంతినిచ్చు పుణ్యాత్ముఁ డాఫకీరు.

ఫిలిప్పు—ఆఫకీ రాకారాబద్ధుని నాదరించి మందులిచ్చెను. జ్వరము వచ్చుట యాగిన తరువాత నీవు చెప్పిన జమాదారుఁడే మరల నతనిం దీసికొనిపోయె నఁట. ఎచ్చటికో యాఫకీ రెఱుఁగఁ డఁట.

కాశీ:—అయ్యో! ఇఁక నాశలేదు. జమాదారుఁడు క్రూరుఁడు. ఐనను సుల్తానుని యాజ్ఞలేని దేపనియుఁ జేయఁజాలఁడు. (కొంచెముసేపు గగనమువంకఁ జూచి) ఆఁ. మీరిఁకఁ బట్టణమును ముట్టడింతు రనఁ గొలఁది దినములక్రిందట నొకకారాబద్ధుని గుఱించి వారిద్దఱు మాటలాడుచుం

దఁగ వింటిని. అప్పు డచ్చట మఱియెవ్వరు లేరు. పరాసుశూరులకంటెను మిగుల నేర్పరియై దుర్గనిర్మాణమునందు నాయుధశాస్త్రమునందు నిపుణుఁడైన యాంగ్లేయుని గుఱించి సుల్తానుఁడు వాక్రుచ్చుచుండెను. ఆతఁడు మీవాఁడే యైయుండునా ?

ఫిలిప్సు:—ఆతఁడే. నీ విప్పుడు చెప్పిన గుఱుతులన్ని సరిపోయినవి. అపనులలో నిజముగ నతఁ డధికప్రజ్ఞాశాలి. ఇఁక నేమైన నెఱుఁగుదువేని చెవుల వేయుము.

కాశీ—అతని నెట్లైన సుల్తానుని కొలువులోఁ జేర్చుకొనవలయునని ప్రయత్నించిరి. పెట్టవలసిన యాశలన్ని పెట్టితిమనియు,నిఁక నతని బతిమాలుట నిష్ఫలమనియుఁ, జమాదారుఁడు సుల్తానునకుఁ జెప్పెను. సుల్తానుఁడు దురాగ్రహాగ్రస్తుఁడై యాదుర్గములోనే యతఁడు చచ్చుఁగాక యని తీవ్రముగ వాక్రుచ్చెను.

ఫిలిప్సు—(ఆసక్తితో) ఆదుర్గ మేదో యెచ్చట నున్నదో యేదిక్కున నున్నదో తెలియునా?

కాశీ—సాహెబ్! నే నెఱుఁగను. ఈజిల్లాలోమాత్రము లేదు. అతఁ డింకను బ్రతికియుండినచోఁ బడమటఁ గొండగు మలబారులవద్ద నేకీకారణ్యములో నేకొండబోటిమీఁదనో యుండును. ఆబోటు లెల్లప్పుడు మంచుతో నిండి చుక్కలఁ జూచుచుండును. రోజులకొలఁది నడచినను దఱుఁగని యడవులు మలలచుట్టు క్రిక్కిరిసియుండును. అక్కడఁ దిరుగుచుండు చెంచులు నేనాదులు నెఱుకులు, భయంకరులుగ నుందురు. వారి మాటలు, వారి యునికి—ఏమి చెప్పుదును? అచ్చోట నుండుటకంటెఁ జచ్చుట మేలు. అయితే యింతకు నతఁడు మీవాఁడు కాఁడేమో.

ఫిలిప్సు—(నిట్టూర్పు విడుచుచు) కాఁడేమో అయినను గొంచె మాశపట్టి కొని యూగులాడుచున్నది. కోట మాయధీనమైనప్పుడు, మేము సుల్తా

నుని గర్వ మణఁచినప్పుడు, మావానిజాడ మాకుఁ దెలియకపోయినయెడల, మాదుఃఖమునకు మేర యుండదు.

కాశి—భగవంతుఁడు మీకోర్కెఁ దీఱ్చుఁగాక! సాహెబ్! పరదేశీయుఁడ నైనను బగవాఁడనైనను నీవు నాపైఁ జూపినదయకేప్రత్యుపకారము చేయఁగలను? నాయొడలిలోఁ బ్రాణములుండువఱకు నిన్ను మఱవను. దేవుని కృపవలన మీమఱఁది సురక్షితుఁడుగ నుండి మీ కగపడెనేని నేఁ బరమానందము నొందెదను. అతఁడు జీవించియున్నాఁ డనునాశ నాకు మాత్ర మంతగ లేదు. అయినప్పటికిని యుద్ధము పూర్తియైన తరువాత నేను జీవించియుండునెడల సాధ్యమైనంతవఱకు కతనిని వెదకి మీ కొప్పగించెదను.

ఫిలిప్సు—భగవంతుఁడు నిన్ను రక్షించుఁగాక. నేను నిన్ను నమ్ముచున్నాను. మావిరోధులు మమ్ము వర్ణించినట్లు కృతఘ్నులము, క్రూరులము కామని యిప్పుడు నీ వెఱిఁగితివిగదా? బ్రతికియున్నాఁడో లేఁడో యని యెడ తెగని చింతచేఁ జీవుడుచున్న మాకు మావాఁడు మృతినొందెననియేని స్పష్ట వార్త నీవు తెచ్చినయెడలఁ, జిత్తము నైరాశ్యకూపంబునఁ బడియైన నలఁదురు మానియుండఁగలదు.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

చివర కాంగ్లేయులును సుల్తానుఁడును సంధి చేసికొనిరి. సంధిపత్రము నందలి యొడంబడిక ప్రకారము చెఱసాలలోనున్న యాంగ్లేయులను సుల్తానుఁడు వదలిపెట్టెను.

వారిలోఁ గొందఱు చెఱసాలలోనుండియే వయోవృద్ధులైరి. కొందఱు కన్నులలోఁ బ్రాణములు పెట్టికొనియుండిరి. కొందఱు శుష్కించిన యవయవములతోఁ గాలికిఁ బడిపోవున ట్లుండిరి. బలవంతముగ ముసలానులైనవారు తల గడ్డల నేలకుఁగొట్టి తన్మతమును దూషించుచుండిరి. ఫిలిప్సుచార్లెసులు కుతూహలముతోఁ గారాగారవిముక్తుల నందఱఁ బరీక్షించిరి గాని హర్బర్టు కనఁబడ

లేదు. ఉన్నయంనఅ విడిచిపెట్టితి ననియు హార్బర్టు మృతినొందె ననియు సుల్తానుఁడు చెప్పెను. ఫిలిప్సు చార్లెసు లాశవదలిరి. తొడగుదేశపు బెడివంపు టరణ్యములలో నుండునేమో యని తలంచిరి, గాని యచ్చటఁగూడ విఫల మనోరథులైరి. ఇన్ని దినములనుండి వారి హృదయంబులఁ దేలియాడుచుండిన యాశ యడుగునకు మునిఁగిపోయెను.

ఈవార్త లింగ్లాండునకుఁ జెలిసెను. ఆంగ్లేయులు విజయులయిరని దేశము సంతోషించెంగాని యుద్ధములోఁ బ్రియబంధువులఁ గోల్పోయి శోకించిన కుటుంబములలోఁ బ్రధానములైనవి రెండుండెను. వీరి యాశ చాల దినముల క్రిందటనే భగ్నమాయెంగాని యప్పుడప్పుడు తెలియవచ్చిన వార్తలు కొంచెము ధైర్యము కలిగించుచుండెను. ఇప్పుడు నిశ్చయవార్త తెలిసినందున సంపూర్ణముగ నిరాశులైరి. ఆమీకి హార్బర్టువిషయమై యాశగలదని యెవ్వరు నెఱుఁగరు. ఇంతకుఁబూర్వ ముత్తరముల కట్టవచ్చినపుడెల్ల నాతురముతో నామీ చూచుచుండెను. ఈఘోరవార్త వచ్చినపు డామె వంచితురాలైన ట్లార్తిం బొందెను. ఇందువలన నామీకూడ హార్బర్టుయొక్క క్షేమవార్తకొఱ కెదురుచూచుచుండినట్లె వారందఱు తెలిసికొనిరి. ఆమీ మనఃస్థైర్యము కల వనిత. ఆమె దేవునియందు భారమువైచి స్వీయజనుల ప్రేమకుఁ, బరుల గౌరవ మునకుఁ బాత్రురాలై నిష్కళంకజీవయాత్ర గడపుచుండెను.

---

## నలువదినాలుగవ యధ్యాయము

జరిగిన సంధివలన సుల్తానుని కాంగ్లేయులపైఁ గ్రోధము హెచ్చెను గాని, మైత్రి ఘటిల్లలేదు. 1789-90 సంవత్సరములలో జరిగిన పరాసు రాజ్యవిప్లవ (French Revolution) ఫలితముల నభిలషించి యాదేశము నందువలెఁ దన దేశమందును సుల్తానుఁడు సంవత్సర నామాదులందు మార్పు లొనరించెను. పరాసులవిధమునఁ దానుగూడ నూతనశక మారంభించెను; యుద్ధ

నౌకానిర్మాణమున కేర్పాటులు చేసెను; విదేశములతో వ్యాపారము చేయఁ దలఁచి శ్రీరంగపట్టణములో నేఁటికిఁ గనఁబడుచున్న పెద్దహస్తి శాలలఁ గట్టించెను; జ్యోతిశాస్త్ర మందమితపరిశ్రమ మొనర్చెను; పాశ్చాత్యశాస్త్రజ్ఞులు కనిపెట్టిన యంత్రములఁ గొన్నింటిఁ దెప్పించి వాని యుపయోగములఁ గనుఁగొనెను; యుద్ధపుఁదొందఱలు లేకపోవుటవలన నీతీపన రాజ్యాభివృద్ధికరము లగునట్టియు మనోవికాసకారణములగునట్టియుఁ గార్యములఁ జేయుచుండెను.

కాశిమాలి ప్రణము మానినతరువాత వార్బర్టు జాడ యేమాత్రము తెలిసినను దెలియఁజేసెదనని చెప్పి ఫిలిప్పునొద్ద సెలవుగైకొని సల్తానునికడ కేతెంచి తనవిషయమును దెలుపుచు నొక విన్నపము పంపెను. సుల్తానుఁ డతని సాహసమునకు మెచ్చి యధికారమును జీతమును హెచ్చించెను. కాశిమాలి విశ్రాంతి పుచ్చుకొనుటకై సెలవుగైకొని స్వగ్రామమునకుఁ బోయెను. అమీనా పరలోకమునందున్నదని యతఁడు తలఁచెను. ఆమెను పాఁతిపెట్టిన చోట నొకసొగసైన గోరీకట్టించియైన సంతృప్తిఁజెందవలయునని యతఁడు కోరి, యామె యెచ్చట భూగతయైయున్నదో విచారించి తెలుపు మని తన మిత్రుని కొకయుత్తరము వ్రాసెను గాని, యాతఁ డెంత ప్రయత్నము చేసినను నామెజాడ కనుఁగొనఁజాలక తెలియలేదని కాశిమాలికిఁ బ్రత్యుత్తరము వ్రాసెను.

కొన్నిదినములు జరిగినపిమ్మట ఖానుని ద్రవ్యము తనకుఁ జెందినట్లు కాశిమాలికిఁ దెలిసెను. ఖానుఁడు బ్రతికియున్నప్పుడే మరణశాసన మట్లు వ్రాసెను. దానిప్రకారము ద్రవ్యమంత కాశిమాలికే కాక భార్యలకుఁగూడఁ గొంత పోవలసియుండెను. అమీనా యెచ్చటనున్నది తెలియకపోవుటవలన నెప్పుడువచ్చి యడిగిన నప్పుడిచ్చుట కామెకుఁ జెందవలసిన ద్రవ్య మొక చోట భద్రము చేయఁబడెను. హుర్మత్బీ తనసొత్తుతీసికొని పుట్టినింటికిఁ బోయెను. కమ్మాబీయొక్క చక్కఁదనము ప్రఖ్యాతమై యుండినందున

సుల్తానుఁడామెను నిజాంతఃపురములోఁ జేర్చికొనెను. తాను 'సంపాదించినది కాక ఖానుని సొత్తుకూడ వచ్చి పడుటవలనఁ గాళిమాలి సంపన్నుఁడాయెను. తల్లి వృద్ధురాలయ్యెను గాన, నామెను సాధ్యమైనంతవఱకు సుఖపెట్టవలయు నని యతఁడు తలఁచి పరిశుభ్రమై యందమైన యిల్లొకటి క్రొత్తగఁ గట్టించి యామెకుఁ గావలసినవస్తువులు కొఱంతలేకుండ సమకూర్చుచుండెను; నూతనముగ నొక మసీదును గట్టించెను; అమీనా నానాఁటిరాత్రి రక్షించినచోట నొక మందిరమును నిర్మించెను. ప్రతిదిన మతఁడు సాయంతనవేళలం దామందిర సమీపమున వృక్షములనీడ క్రింద హిందువులని, మహమ్మదీయులని, భేదము లేక చేరినమిత్రులతో సంభాషించుచుండెను. ఎవరును దగ్గఱలేని సమయమున జరిగిన విషయములం గూర్చి చింతించి నోటికడకువచ్చిన యన్నపుముద్ద యెగుడఁగొట్టఁబడెఁగదా, యని యొక్కొక్కప్పుడు నిట్టూర్పు విడుచుచుండును.

ప్రొద్దస్తమించి చీఁకటి పడినతరువాత నింటికిఁ బశువులన్ని పొలమునుండి వచ్చినవో లేవో చూచి, తల్లియొద్దఁజేరి తా ననుభవించిన కష్టసుఖముల నామెకుఁ గథారూపమునఁ జెప్పుచుండును; సెలవుదినములు గడచినప్పుడు మరల మరల సెలవుకోరుచుఁ దుదకు నాలుగైదు మాసములైనతరువాతఁ దల్లిని విడిచి సుల్తానుని కొల్వునకుఁ బోయెను.

ఈపర్యాయము కాళిమాలి శ్రీరంగపట్టణమున కేఁగుటయే కాని యతని మనస్సంతయు స్వగ్రామమునందే యుండెను. అదికాక యిప్పుడు క్రొత్తవాఁడైన జమాదారునికి సుల్తానునియొద్ద నధికారము, పలుకుబడి హెచ్చెను. ఇంతకుఁ బూర్వము జరిగిన సంధివలనఁ గాళిమాలికిఁ గల జాగీరుగ్రామములు నైజాము నకుఁ బోయెను. అందుచే నితఁడు రెండుప్రభుత్వములకు లోఁబడియుండవలసి వచ్చెను. ఆలోచించి సుల్తానునికొల్వు చాలించి యింటివద్ద నెమ్మదిగఁ గాల క్షేపము చేయవలయునని యతఁడు నిశ్చయించుకొనెను. ప్రయాణమునకుఁ దగిన యేర్పాటులు కావించికొని యొకనాఁటి సాయంకాలమున సుల్తానుఁడు నిండుకొలువుండ నతఁడు లేచి ముందునకు నాలుగడుగులు వేసి వినతుఁడై "మహా

ప్రభూ ! ఆజ్ఞయేని భృత్యుడొక విజ్ఞాపనము చేయుటకు వేచియున్నాడు" అని పలికెను.

సుల్తా—అడ్డులేదు. కాశిమాలీ ! చెప్పవచ్చును.

కాశి—మహాప్రభూ ! మీపాదముల మ్రోలనుండి దినదినాభివృద్ధి గాంచుచు మితిలేని మేలు లనుభవించుచున్న మాబోంట్లకుఁ బ్రభు దర్శనమే మహానంద దాయకము. స్వామీ ! అవధరింపుఁడు. ఉద్యోగముమాని చిరకాలాపేక్షిత మైన విశ్రాంతి పొందవలయునని సేవకుఁడు కోరుచున్నాఁడు. రాజకీయవ్యా పారముల యందు దాసశక్తిగాని, పేరాసలయందు భ్రమగాని, సేవకుని కిప్పుడు లేదని యీసభాసదులందఱెఱిఁగియున్నారు. నేనిప్పటికే కార్య మైన సెలవేర్చియుంటి నేని నది తమకు దయవలనఁగాని, నాశక్తివలనఁగాదని, నాకుఁ దెలియును. నాస్థానమందు నాకంటె శ్రేష్ఠుఁడు మఱియొకఁడు రాఁగలఁడు. మాతల్లి వృద్ధురాలైనది. ఇల్లు, వాకిలి, పొలములు, మొదలగు నవి కాపాడుకొనుచుఁ దమకటాక్షమువలన నెమ్మదిగఁ గాలము గడపెదను.

సుల్తా—(ఱెప్పవాల్పక చూచి) కాశిమాలీ ! ఏమనుచున్నావు ? ఉద్యోగము మానెద ననియా ?

కాశి—అవును. స్వామీ ! అవును. పలు రపాయములలోనుండినప్పు డితరులు వెనుదీసినను, నేను నాప్రాణమునుగూడ లక్ష్యింపక యడ్డపడితిని. మృతి నొందిన ఖానుఁడును నేనును ధైర్యముతోఁ బరంగిలమీఁదికిఁ బోయితిమి. దురదృష్టవశమునఁ బ్రయత్నము విఫలమాయెను. కష్టకాలమున మి మ్మనుస రించి యుంటిని. ఇప్పుడేలినవారు మంచిదశలో నున్నారు. పరాసులు మీకు మిత్రులుగ నున్నారు. హిందూదేశమునందలి రాజులు దేవర నగ్గించుచున్నారు. పరంగీ లనుకూలురై యున్నారు. ఎచ్చటఁజూచిన మీప్రభ సాగుచున్నది. సంతోషముగనున్న సమయమున సెలవుగైకొని పోవలయు నని వేచియుంటిని. మీయందఁజేరినది మొదలు మీరు వేయి గన్నులఁ గనిపెట్టి, నాకుఁజేసిన యుపకారముల నెన్నటికిని మఱవంజాలను.

సుల్తా—ఏమి ? పరిహాసము లాడుచున్నావా ? కాశిమాలీ ! నాకు నమ్మకము పుట్టక
యున్నది. అయినను నీ మొగముచూడ దుస్సంకల్పము లేనట్లు కనఁబడు
చున్నది. ఎగతాళి కాదుగదా ! నిజము చెప్పుము.

కాశి—మహాప్రభూ ! దేవరపాదములే యాధారమైన నాయొక్క నోటినుండి
యేలినవారి యెదుట నెగతాళిమాట యెట్లు వచ్చును ? ఈవిషయము విన్న
వింపవలయునని చాలకాలము క్రిందటనే సంకల్పించియుంటిఁ గాని, సమ
యము దొరకినది కాదు. నేఁడు ప్రభువులుల్లాసముగ నున్నారని మనవి చేసి
తిని. పోవఁదలఁచినప్పుడు మంచిగఁ బోవవలయునని నాకోరిక.

సుల్తా—(భ్రూకౌటిల్యముతో) నేను సంతోషముతో నున్నప్పుడు నీ వీవార్తచే
కలఁత కలుగఁజేసితివి. కోపగ్రస్తచిత్తుఁడనైయున్న సమయమునఁ జెప్ప
వలసియుండెను. ఎప్పుడో యొకప్పుడు చెప్పితివి. దానికేమి లెమ్ము. విశ్వాస
పాత్రుఁడవై మమ్ముఁ జాలకాలము కొల్చితివి. నీవు మాజ్ఞప్తియం దుండె
దవు. పోవుదు మనువారిని మేము పట్టుకొనము. పోయినవారి స్థానముల
నించుటకు సమర్థు లనేకులు గలరు. నీవు పోవచ్చును. కోపపడితివని నీ వను
కొనవలదు. సగౌరవముగ నిన్నుఁ బంపెదము. (సేవకునిఁ బిలిచి) ఓరీ ! నీవు
పోయి రెండు సాలువులు, నొకపట్టుగుడ్డయు, నొకభూషణము, నొకమంచి
గుఱ్ఱము, నొకకత్తియు, నొకడాలును, దెమ్ము. (సభాసదులఁ దిలకించి)
గొప్పతనమును గనిపెట్టి సుల్తానుఁ డెట్లు మన్నించునో చూచెదరుగాక.

సుల్తానుఁ డింత దయచూపునని కాశిమాలి తలఁపలేదు. ఉగ్రుఁడై పైనిఁ
బడునేమో పాఱిపోవుదమని కూడ నతఁ డనుకొనియుండెను. కాని యిప్పు
డతనికిఁ గన్నులనిండ నీరు గిఱ్ఱునఁ దిరిగెను.

అనేక సంవత్సరములనుండి పోషించిన యాయుపకారిపై నతనిచూ
పులు కదలక నిలిచెను. తెమ్మనిన వస్తువులతో సుల్తానుని సేవకుఁ డరుదెంచెను.
సుల్తానుఁడు వాని నించుకసేపు పరీక్షించి "కాశిమాలీ ! సమీపమునకు రమ్ము."
అని పిలిచెను. దగ్గఱకుఁ గాశిమాలి యేఁగెను. సుల్తానుఁడు లేచి నిలువంబడి

సాలువులు కాశిమాలిపైఁగప్పి తలగుడ్డ, భూషణము, చేతికిచ్చి "కాశిమాలీ! నన్నుఁ గౌఁగిలించికొనుము. నిన్ను నేను ప్రేమించుచున్నాను. కృతజ్ఞతతో నిన్నెప్పుడును జ్ఞప్తియం దుంచికొనియెదను. భగవంతుని దాసానుదాసుఁడైన యీసుల్తానుని మఱవకుము. ఎవఁడైన సుల్తానుని దూషించుచో నీ నాలుక యతని సుగుణములఁ గొనియాడుఁ గాక. నీ వెప్పుడైన మరల నుద్యోగ మపేక్షించితివేని నీస్థానము నీకీయఁబడును. భగవంతుఁడు రక్షించుఁగావుత. పొమ్ము." అని సకరుణముగ వాక్రుచ్చెను. "మహాప్రభూ! నే నేమోపకారి ? నాప్రాణ ముండునంతకాల మేలినవారి మఱవఁ జాలను. మిమ్ముదూషించిన దూషణ వాక్య మొక్కటియైన విని సహింపను. నే నెచ్చటికేఁగిన నచ్చట మీదయ కని జను లాశ్చర్యపడుదురు. అభ్యుదయపరంపరాభివృద్ధి మీ కగుఁగాక, యని భగవంతుని సర్వదా ప్రార్థించుచుందును." అని కాశిమాలి గద్గదస్వరముతోఁ జెప్పి ప్రణామముకావించి వెనుకకునడచి సభామందిరమునువిడచి బయటికిఁ బోయెను. అలంకృతమైన యశ్వము సిద్ధముగనుండెను. డాలు, కత్తి, పట్టికొనిన మనుష్యులు నిల్చుండిరి. అంతట నబ్బురపడి చూచుచుండఁ బటాలున నెగిరి యతఁడు గుఱ్ఱముమీఁదఁ గూర్చుండి మిత్రులను సలాములొనర్చి వాహనము నడిపించెను. మఱునాఁడు ప్రాతఃకాలమున శ్రీరంగపట్టణపుఁ గోటదాఁటి స్వగ్రామాభిముఖుఁడై యతఁడు పోవుచుండెను.

ఆరాత్రి సుల్తానునివద్ద జమాదారుఁ డొక్కఁడేయుండి యనేక విషయములం గూర్చి ముచ్చటించి "అయ్యో కాశిమాలిని బోనిచ్చుట గొప్ప పొరపాటు కదా" యని పెద్దగ వాక్రుచ్చెను.

టిప్పూ—ఏమి ? ఏమి ?

జమా—అతఁడు మనగుట్టంత యెఱుఁగును.

టిప్పూ—అయితే యేమి లెమ్ము. విశ్వసనీయుఁడు.

జమా—(ఫూవ్ అని నవ్వి) అక్కడనే మీరు పొరపడితిరి. పరంగీలకుఁ గాశిమాలి ప్రాణస్నేహితుఁడు.

టిప్పు—పరంగీలకా ?

జమా—అతఁడు పరంగీలతో నెన్నిపర్యాయములు పోటులాడెను ? మీ కెఱుఁగరా ? వారిని నిందించినవారి నెందఱి నితఁడు తిరిగి నిందించెను? మీపాపములాన ! అతఁడు కృతఘ్నుఁడు. కానిచో ముసలివాఁడా మూఢకవాఁడా? ఏల మీకొలువు మానెను ?

టిప్పు—(ఏమితోఁచక) అది నాకుఁ దెలిసియుండెనేని—

జమా—రావలసినసొమ్ము దమ్మిడిపోకుండ వసూలుచేసికొనెను; నగలు, ధనము, సర్వము హైదరాబాదునకుఁ జేర్చెను.

టిప్పు—నిజముగనా ?

జమా—ఔనౌను. ఇచ్చినపత్రికలను రప్పించెదను. దీనిలో నబద్ధ మావంతయైనను లేదు.

టిప్పు—యా అల్లా ! పామును బెంచిన ట్లాయెను. హైదరాబాదునకా ? అతఁడు పోవుచున్నది ? జమాదారుఁడా.

జమా—మొదలు సికంధరు జాహాకుఁబోయి పరంగీలచెవులలో మీరహస్యములూది శ్రీరంగపట్టణపుఁగోట పటము వేసియిచ్చెను. అతఁడెప్పుడును శిల్పులతో నుండుట మీ కెఱుఁగరా ?

టిప్పు—(కోపముతో) చాలుఁ జాలును. అతని నూరు చేరనీయఁగూడదు. తెలిసినదా ?

జమా—నిమిషమైన నాలస్య మొనర్పను. కాలికొలఁది నడచినచో నతనిని గలసికొనవచ్చును.

టిప్పు—కాశిమాలి నెదుర్కొనఁ జాలినవారు మనసైనికులలో నెవరున్నారు ?

జమా—కాశిమాలినేకాదు. నరకమును, నరకములోనున్న సైతానునుగూడ ముట్టడింపఁగల వీరులున్నారు. సారాయిమాత్రము పూర్తిగ నుండవలయును. తప్పక యతనిఁ బట్టి తెప్పింతును. నామాట చూడుఁడు.

జమాదారుఁడును సుల్తానునియొద్ద సెలవుగైకొని బయటికిఁబోవుచు "వీఁడిదివఱకొకసారి తప్పించికొనియెను. ఈపర్యాయముకూడఁ దప్పించికొనియెనా, యదృష్టవంతుఁడు." అని యనుకొనెను.

.................................................................

సుల్తానునియొద్ద నంతఁబూర్వమే సెలవు పుచ్చుకొని కాశిమాలితోఁ గలసిపోవుదమని కొందఱు కనిపెట్టుకొని యుండిరి. వారును గాశిమాలియుఁ గలిసి యుల్లాసముగఁ బ్రయాణము చేయుచుండిరి. వారిలోఁ గొందఱు పెద్ద గుఱ్ఱములఁ గొందఱు పొట్టిగుఱ్ఱముల నెక్కియుండిరి. వారిలోఁ జాలమంది మహీశూర (మైసూరు) దేశముయొక్క యుత్తరదిశయందు నానాప్రదేశములకుఁ బోవవలసినవారై యుండిరి. కొందఱు హైదరాబాదునకుఁ గొందఱు కాశిమాలియొక్క గ్రామముండిన జిల్లాకును బోవనుండిరి. బాట తేటగ నుండెను. సల్లాపములాడుచుఁ బోవుచుండిరి గావునఁ గ్రోశములు క్రోశములు వారికిఁ దెలియకుండఁగనే గడచినవి. బెంగుళూరునకుఁ బోవురాజమార్గము మీఁద మదూరునది పాఱుచోట దట్టమైన యడవి కలదు. అచ్చట దొంగలు పేరుచెప్పి కొట్టుదురని ప్రసిద్ధి. కాని కాశిమాల్యాదులు దృఢకాయులై యౌవనముననుండుటచే లక్ష్యముచేయక పోవుచుండిరి. ఎడమప్రక్కనుగల పొదలలోనుండి ధ్వని వినఁబడి తుపాకిగుండు వచ్చెను. ఆగుండెవరికిని దగుల లేదు. చూచుచుండ మఱియొకగుండు వచ్చెను. ఆగుండుతగిలి వీరిలో నొకఁడు క్రిందఁబడెను. కాశిమాలి యెడమబుజమునకుఁ గొంచెము దెబ్బతగిలెను. కోపోజ్జృంభితుఁడై యతఁడు "లంజకొడుకులు. పట్టుకొనుఁడు." అని యఱచుచు ఖడ్గముదూసి పొదలలోఁ బడెను. తక్కిన వారతనిని వెంబడించిరి. దొంగలలో ముగ్గురఁ గాశిమాలి చంపెను. ఇద్దఱకు గాయములు తగిలెను. తక్కినవాండ్రు పలాయితులైరి. వ్రణబాధితులైన యిద్దఱను గాశిమాలి పట్టుకొనెను. "ఈలంజ కొడుకు మొగము నే నెఱుఁగుదును. జమాదారుని దయ్యములలో వీఁడొకఁడు" అని కాశిమాలియొక్క మిత్త్రుఁడనెను. "ఈరెండవగాడిదకొడుకు నిన్న దర్బా

రులా నగపడెను. ఏమిరా! ఎందుకు మామీఁదికి మీరు వచ్చితిరి? మీ కేమి యపకారము చేసితిని?" అని కాశీమాలిని పలికెను.

దొంగ—(వణఁకుచు) అయ్యా! సుల్తానుఁడు పంపెను.

కాశీ—(వానిని గ్రుద్ది) ఛీ! గాడిద! అబద్ధము లాడుచున్నావు.

దొంగ—అయ్యా కొట్టకుఁడు. మీరు చిక్కనియెడల మాకు గుఱ్ఱములుగూడ నీయవలసినదని యిదిగో సుల్తానునియుత్తరువు. చూడుఁడు ముద్ర.

నిజముగ నది సుల్తానునిముద్రయే. కొంచెమునే పాలోచించి కారణము గ్రహించి "పొండు. మీ రొకరుపంపఁగ వచ్చితిరి గాన, మిమ్మేమి యనను. ఇప్పటినుండియైన బుద్ధి తెచ్చికొని బ్రతుకుఁడు. నీవు చేసినపని తెలిసినదని నామాటగ జమాదారునకుఁ జెప్పుఁడు. నీకు నాకుఁ గల సంబంధ మీనిమిషముతో నంతమొందెనని నేను జెప్పినట్లుఁగ సుల్తానునితోఁ జెప్పుఁడు. పొండు." అని వాక్రుచ్చి "త్వరగ నదలింపుఁడు. ఈ బాటవదలి కాలిడొంకలగుండఁ బోవుదము. నే నెవరికి నపకారము చేయకపోయినను నాకు వచ్చుచున్న యపాయములఁ జూచుచున్నాడ గదా" యని తనవెంట వచ్చువానితోఁ గాశీమాలి యనెను. శీఘ్రగమనమునఁ బోయిరి. టిప్పు వంచనాసహిష్ణుఁడై నలుప్రక్కలకు మరల మరల మనుష్యులను బంపెను గాని వారి యన్వేషణములు నిష్ఫలము లాయెను.

---

## నలువదియైదవ యధ్యాయము

1798-వ సంవత్సర మేప్రిలు 26-వ తేది ప్రాతఃకాలమున శ్రీరంగపట్టణములో నూరిమీఁద నూరు పడినట్లుండెను. లక్షలకొలఁది జనులు రాజసౌధపురోభాగంబున నొకయాయతనముచుట్టు మూఁగియుండిరి. తదాయతనమధ్యమున నొక చిన్నచెట్టు నాటఁబడియుండెను. దాని నెచ్చటినుండియో పెల్లగించి తీసికొనివచ్చిరి గావున, దానియాకులు సూర్యతీక్ష్ణ

మొక్కవఱ్ఱైనకొలఁది వాడుచుండెను. ఈ చెట్టును వివిధవర్ణములతో నలంకరించిరి. దానిపైని నొకయీఁటె నుంచిరి. ఈఁటె చివర నెఱ్ఱని టోపి యమర్పఁబడియుండెను. ఈటోపి ప్రజాస్వాతంత్ర్యమును సూచించుట కుద్దేశింపఁబడినది. ఈఁటె, టోపి ఫ్రెంచిరాజ్యవిప్లవ (French Revolution) చిహ్నములు. పలురంగుల వేషములు ధరించి ఫ్రెంచిసైనికులు నధికారులు పరమోత్సాహముతో నావృక్షమును బరివేష్టించియుండిరి.

మార్తాండుఁడు క్రమక్రమముగ నభోమధ్యప్రదేశమును సమీపించుచుండెను. జనసమూహముయొక్క కరతాళధ్వనులు, కేకలు, మిన్ను ముట్టుచుండెను. ఆప్రదేశ మప్పుడు సజీవసంకులారణ్యముగ నుండెను. ప్రాకృత స్త్రీపురుషు లొండొరులపైఁబడి చూచుచుండిరి. వేసఁగియగుటచే జనులకుఁ గాళ్లు చుఱ్ఱుమన మొదలిడెను. శిరోవేష్టనములు లేనివా రంద ఱెండవేడిమి సహింపలేక నెత్తిపై ముసుఁగులు వేసికొనిరి. చెమ్మట యగ్గలమాయెను. బొట్టు పెట్టికొనినవారి మొగములనున్న కుంకుమ మొదలగునవి నీరై ముక్కులమీఁదుగఁ గాఱ నారంభించెను. కొందఱు యిండ్లచూరులనీడలను, మఱికొందఱు నేదిష్ఠమహీరుహచ్ఛాయలను నిల్చుండ మొదలిడిరి. ఎల్లరు కాలవిలంబనాసహిష్ణువులై యుండిరి.

సుల్తానుని భేరి వాయింపఁబడెను. జనుల కేకలు మట్టాయెను. అందఱు నిశ్శబ్దముగనుండి భేరీధ్వని వచ్చినవైపు చూడఁదొడఁగిరి. పొట్టివారు కాళ్ల మునివ్రేళ్లమీఁద నిల్చుండి నిక్కినిక్కి సందుచేసికొని వీక్షించిరి. సుల్తానుఁడు దృగ్గోచరుఁ డాయెను. ఏతాదృశజనసమూహమునకు దర్శనమిచ్చినప్పుడు సుల్తానుఁ డెట్టి మనోహరవేషముధరించి యెంతరాచఱికపుఠీవిమై వచ్చెనో, తెలిసికొనుటకుఁ జదువరులు తహతహపడుచుందురు.

ఆనాఁడు సామాన్యవస్త్రములే యతని శరీరముపై నుండెను. వజ్రవైడూర్యాద్యమూల్యమణు లతని యుష్ణీషంబుపైఁ బ్రకాశించుచుండలేదు. గజాదివాహనములు నిజస్థానములయందే బద్ధములై యుండెను. జమాదారుఁడు,

నగరనిపరిజనులు, ముందుగ నేతెంచి "రాజుగారు నడచివచ్చుచున్నారు. లెండు. తొలఁగుఁడు. త్రోప చేయకుఁడు" అని యఱచుచుఁ గడలనివారిని గొట్టుచు నెట్టుచు గ్రుద్దుచు జనులమధ్యమున నొకవిశాలమైన మార్గము నొనర్చిరి. ఒత్తుడున తాళలేక కొందఱు బలహీను లుద్యుకుడిచి ప్రాణములఁ దక్కించుకొంద మని గుంపులోనుండి సందుచేసికొని బయటికి వచ్చిరి. ఎట్టకే లకు సుల్తానుఁ డరుగుదెంచెను. పరాసువారు సలాములొనర్చి స్వాగత మొసఁగిరి. పరాసులలో ముఖ్యుఁడు చాపియసు. ప్రస్తుతకర్మజాతము నిర్వర్తించుట కీచాపియసును బురోహితునిఁగ నియమించిరి. ఇతఁడు సుల్తానుని నాయతన మధ్యస్థవృక్షమునకుఁ గొంపోయి "నే నిదివఱకు మీతో విన్నవించిన విషయ ములు జ్ఞప్తియందుంచికొని దృఢచిత్తముతో నుండుఁడు" అని చెప్పెను. వృక్షముక్రింద నొకవేదిక యుండెను. ఆవేదికపై నగ్ని కొంచెముగ మండు చుండెను. గుగ్గిలము, సాంబ్రాణి మాటిమాటి కామంటలో వేయుచుండిరి. సువాసన యంతట వ్యాపించెను. చాపియసు, మఱికొందఱును వేదికమ్రోల సాష్టాంగపడి స్వాతంత్ర్యమును సంబోధించి యుద్రేకకరముగఁ బ్రార్థించిరి. కొంద ఱాప్రార్థనల యర్థమును సుల్తానునకు బోధించుచుండిరి. ప్రార్థన ముగిసిన తరువాతఁ జాపియసులేచి రాజచిహ్నము లేవి యని టిప్పు నడిగెను. శిరము మీఁద ధరించు నొక భూషణమును, శిరోవేష్టనమునఁ బెట్టికొను బంగారు పూఁతగల యీఁకను సుల్తానుఁ డతనిచేతి కిచ్చెను. ఉష్ణీషము రాజచిహ్న ములలో ముఖ్యమైనదిగాన దానినొసఁగుఁడని చాపియసు కోరెను. సుల్తానుఁడు సమ్మతించి దాని నిచ్చెను. చాపియసు వానిని వేదికపై మంటలోఁ బడవేసెను, ఇవి కాలెను. భస్మీకృతరాజచిహ్నధూమపూతములైన యీఁటెను, టోపినిఁ జాపియ సతనికిచ్చి ధరింపుఁ డని చెప్పి త్రివిధవర్ణాంకితధ్వజము నతనిపై నాడించెను. మహీశూరమహీనాథుఁడగు టిప్పు పరాసురాజ్యప్రకృతి ననుసరించె నని ఘోషించిన వేమో యన రెండువేలమూఁడువందల ఫిరంగు లొక్కపెట్టున బ్రహ్మాండకటాహము బ్రద్దలగునట్టు మ్రోఁగెను.

ఇబ్భంగి రాజచిహ్నముల నగ్నికుండములో వేల్చి ప్రజాప్రభుత్వము స్థాపించెద నని సమయము చేసిన యిమ్మహానుభావుఁ డఖండపరాక్రమమునకుఁ దోడు, ప్రగాఢమనఃస్థైర్యమునకుఁ దోడు, విజ్ఞానవికసితబుద్ధితోఁ గార్యముల నిర్వహించియుండినయెడల హిందూదేశచరిత్ర మెట్లుండెడిదో యెవ రెఱుఁగుదురు ?

పరాసువారిమైత్రి సుల్తానున కుత్సాహదాయకమై యుండెను. నలువదియైదు వేలమంది ఫ్రెంచిసైనికులు పెర్రాను నధికారి క్రింద సింధియావద్ద నుండిరి. పదునాలుగు వేలమంది రేమండను నధికారి క్రింద నైజాముసంస్థానమున నుండిరి. రాజ్యప్రకృతులఁ దాఱుమాఱొనర్చి వీరాతివీరుండై, భూదేవి యరుదుగఁ గనిన పుత్రులలో నొకండై, ఫ్రాన్సుదేశీయుండగు నెపోలియను బోనపార్టి యను మహాయోధుం డాకాలంబున నీజిప్టుదేశముపై కపారంబైన సైన్యంబుతో దాడివెడలెను. బోనపార్టి యీజిప్టునుండి గణనాతీతచమూపరివృతుఁడై జయధ్వజములు తూగాడ హిందూదేశమునకు బయలుదేఱి బొంబాయిలో ధూమనౌక దిగి యాంగ్లేయులఁ బాఱఁదోలుటలో సుల్తానునకు సహాయ మొనర్చు నని యందఱు ననుకొనుచుండిరి. సుల్తానుఁడు తదాగమనమును బ్రతీక్షించుచుండెను. బోనపార్టి వచ్చినతోడనే సింధియావద్దనున్న నలువదియైదు వేలమందిని, నైజామువద్దనున్న పదునాలుగు వేలమందినిఁ, బెర్రాను రేమండులు తీసికొని, టిప్పును జేరున ట్లేర్పాటు కావించికొనిరి. అందుచే సింధియానైజాములు సుల్తానునకు మిత్రు లగుదురు. మహారాష్ట్రులు బలవంతమైన పక్షమేది యని చూచి సుల్తానునిఁ జేరుదురు. ఆఫ్ఘన్స్థానపు జెమన్షా సహాయ మొనర్తు నని వాగ్దానము చేసియున్నాఁడు. రాజపుత్రులు, నేపాళరాజు, ఢిల్లీచక్రవర్తి తోడ్పడెద మని చెప్పిరి. ఇవ్విధమునఁ బరాసువారు, నైజాము, సింధియా, మహారాష్ట్రులు, జెమన్షా, రాజపుత్రులు, నేపాళభూపతి, ఢిల్లీ సార్వభౌముఁడు, తరంగసంకులంబులైన మహార్ణవంబులంబోలి

సైన్యంబులతో బాసటగ వత్తు మని వచించిరి. సుల్తానుని యభీష్టంబు నెఱవేఱు కాలం బేతెంచెనే మో యని నలుపురు తలంప మొదలిడిరి.

ఈసమయమున నాంగ్లేయులకు "లార్డు మార్నింగ్టను" అనునతఁడు ప్రధానపరిపాలకుఁడు (Governor-General)గ వచ్చెను. ఈతని గుణవిశేషముల నాంగ్లేయులు మిక్కిలి శ్లాఘింతురు. హిందూదేశమున నడుగు పెట్టి నప్పటినుండి యితఁడు రాజ్యవ్యవస్థనుగూర్చి దీర్ఘముగ నాలోచింపఁ దొడఁగెను. మహస్ద్వీపమునందలి ఫ్రెంచి యధికారికిఁ డిప్పు రాయబారము పంపెను. అఖండసామ్రాజ్యధురంధరుఁడైన టిప్పుతో స్నేహము కలిగినందుల కతఁడు సంతసించి సుల్తానుని ధ్వజముక్రిందఁ జేరవలసి దని తన ప్రజలకుఁ బ్రకటించెను.

ఈప్రకటన కలకత్తాలోని యాంగ్లేయులకుఁ దెలిసెను. యుద్ధ మనివార్య మని వారు గ్రహించిరి. కలకత్తాలో నున్న మార్నింగ్టను వెంటనే బయలుదేఱి హైదరాబాదునకుఁ బోయి నైజాముతో సంధి కావించి, యచ్చటి పరాసువారిపైఁ బడెను. ఫ్రెంచిసైన్య మప్పుడు సిద్ధముగ నుండకపోవుటచేఁ బరాభూత మయ్యెను. ఈవార్త సుల్తానునకుఁ దెలిసి యతని మనోవ్యథకుఁ గారణమయ్యెను. గోరుచుట్టుపై రోఁకటిపోటు చందమున నాంగ్లేయ శూరుఁడగు నెల్సను నైలునదియొద్దనుఁ బరాసువారినిఁ బూర్తిగ నోడించె నని, పిడుగువంటివార్త మఱియొకటి తెలియవచ్చెను. టిప్పునకు ధైర్యము తగ్గెను. సింధియా, హోల్కారు మొదలగు రాజుల యుత్తరము లుత్సాహకరములుగ నుండలేదు. రాజపుత్రులు వెనుదీసిరి. నైజా మాంగ్లేయులకు మిత్రుఁడాయె నని యిదివఱకే చెప్పియుంటిమి. సుల్తానుఁ డసహాయుఁడై చేయున దేమిలేక దర్బారులయందు మాటిమాటికి నిజసైన్యము నుద్బోధించి పురికొల్పుచుండెను. ఆంగ్లేయుల ఘోరకృత్యముల నిర్వచించి జనులకు వారిపై ద్వేషమును హెచ్చించుచుండెను.

1798-వ సంవత్సర మీవిధమునఁ గడచెను. 1799-వ సంవత్సరము ప్రవేశించెను. ఆంగ్లేయులముట్టడి నెదిరించుటకో ఘాట్లపైకి వెడలి ఢీకొనుటకో సుల్తానుఁడు నిశ్చయించికొనవలసిన సమయ మేతెంచెను. ఎట్టకేలకు రెండవ పద్ధతియే యుక్తమని యతఁ డెంచెను. సయ్యదు సాహేబునకుఁ బూర్ణయ్యకును గోటనొప్పగించి చండశౌర్యమైన సైన్యమును దీసికొని బొంబాయినుండి కొడగుగుండ వచ్చుచుండిన యాంగ్లేయసాహిని నెదిరింప నతఁడు ప్రస్థానమొనర్చెను. ఉభయసైన్యములు సదాశీరువద్దఁ దారసిలెను. అయిదుగంటలకాలము ఘోర రణము జరిగెను. ఓపికతో నింకఁ గొంచెముసేపు పోరాడినఁ బర్యవసాన మెట్లుండెడిదో కాని సుల్తానుఁ డేకారణముననో వెన్నుచూపి శ్రీరంగపట్టణమునకుఁ బోయెను.

---

## నలువదియాఱవ యధ్యాయము

1799-వ సంవత్సరము మార్చి 27-వ తేదీ ప్రాతఃకాలమున మదూరునదివద్దఁ బ్రదర్శన మత్యద్భుతముగ నుండెను. ఇదివఱకుఁ గాళిమాలి దొంగ లెదుర్కొనిన దిచ్చటనే. ఇప్పు డచ్చట నపారమైన సుల్తానునిసైన్యము వ్యూహాకారముగ నేర్పడియుండెను. వెలస్లీచే నడుపఁబడుచు మల్లవల్లికిఁ బోవుచున్న యాంగ్లేయసైన్యమును దాఁకి యోడింపవలయునని సుల్తానునిసైన్యము సిద్ధముగనుండెను. సుల్తానుఁడు యుద్ధమును బరీక్షించుటకై యొకమిట్టయెక్కి కౌతూహలముతో నుండెను. సహాయార్థ మరుదెంచిన నైజాముసైన్యముతోఁ గలిసి యాంగ్లేయులు వచ్చుచుంట సుల్తానుఁడు చూచెను. ఆంగ్లేయానీకము దగ్గఱదగ్గఱకు రాఁజొచ్చెను. శూరులును మహాఖడ్గధారులునైన తనయోధులను సుల్తానుఁడు వీక్షించి జయము కలుగునని నిశ్చయించికొని "ప్రారంభింపుఁడు. ఖడ్గధారలచే హతము కావింపుఁడు. మైఁ బడుఁడు" అని యఱచెను. ఆంగ్లేయులు తుపాకులఁ గాల్చిరి. సంకులసమర ముత్పన్నమయ్యెను. కట్ట

కడకు సుల్తానుని సైన్యము చెల్లాచెదరాయెను. పరంగీలు శత్రువుల పైఁబడి ధ్వంసముకావించిరి. రక్తము ప్రవాహమై పాఱెను. సుల్తానుఁడు పరాజయ ఖేదోద్విగ్నమానసుఁడయ్యు రోషాతిశయమును మొగమునఁ జూపట్ట నిజపట్టణము చేరెను. మైసూరిసైన్యము నిచ్చవచ్చినట్లు ఖండించి కరవాలము రక్తమయమైయుండ జయోత్కర్షముతోఁ దిరిగి వచ్చుచుండిన యొకమహమ్మదీయవీరుని కాంగ్లేయు లెదురుగఁబోయి యాతనిఁ బలువిధముల శ్లాఘించిరి. అతఁ డా స్తోత్రములను పాటింపక "ఫిలిప్పెచ్చట నున్నాఁడు. చూపుఁడు" అని యడిగెను. వా రతనిని సగౌరవముగ ఫిలిప్పునొద్దకుఁ దోడ్కొనిపోయిరి. అతఁడు "ఫిలిప్పూ! ఇదిగో రక్తసిక్తమైన కత్తి. నే నన్నమాట తప్పను" అని నుడివెను.

ఫిలిప్పు—కాశిమాలీ! నిన్ను నే నెఱుఁగనా!

మా నాయకునివద్దకుఁ బోవుదము రమ్ము. నీవంటివారిమీఁద నతనికి మితిలేని ప్రేమ.

కాశి—ఇప్పుడు నేను జంపినవారిలోఁ జాలమంది నన్నెఱిఁగినవారే యై యున్నారు. ఐనను మీపక్షమున నున్నప్పుడు మీకు ద్రోహము చేయ వచ్చునా? నన్ను మీరు మొదట నమ్మలేదు. ఇప్పుడైనఁ దెలిసినదికదా!

ఫిలిప్పు—మేము కృతఘ్నులము కాము. చూచెదవు లెమ్ము. రమ్ము. నాయకుని కడ కేఁగుదము.

ఆరాత్రి వీరుని పుఱికొల్పఁబడుచు వెలస్లీగుడారమునకుఁ బోయి యచ్చటఁ బరుండెను. ముందుకుఁ బోవలసిన మార్గమునుగుఱించి వెలస్లీ ఫిలిప్పు నడిగెను.

కాశిమాలి—ఎఱిఁగినవాఁడను గాకపోయినను నామాటల నాలకింతురేని మార్గ విషయమై నాకుఁ దోఁచినదంతయుఁ జెప్పెదను.

వెలస్లీ—చెప్పుము.

కాశి—కోటమార్గము విడువవలయును. సొసిల్లివద్ద రేవు గలదు. ఆరేవున నదిని సులభముగ దాఁటవచ్చును. ఆకస్మికముగఁ బట్టణముపైఁ బడవచ్చును.

వెల్లస్లి—నిజముగనా ?

కాశి—మీపాదములాన. నిజము. ఇదంతయు నేల ? వచ్చుట కంగీకరించుచున్నచో, ఫిలిప్పున కాస్థలము చూపుదును. ఫిలిప్పు నన్ను నమ్మునో నమ్మడో.

ఫిలిప్పు—ఏమైనను సరి. నిన్ను విశ్వసించెదను.

వెల్లస్లి—కాశిమాలియందు నాకు నమ్మికగలదు. తగిన ప్రతిఫల మతనికి దప్పక యీవలయును. ఫిలిప్పూ ! నీవు పోయి రేపుదాంచి విశేషములు నాకుఁ దెలియఁజేయుము.

ఫిలిప్పు—చిత్తము. రేపు ప్రాతఃకాలముననే తెలియఁబఱచెదను.

కాశి—రమ్ము. మఱికొందఱు వచ్చెదమనుచున్నారు. వారినిఁగూడ బయలు దేఱఁ జేయుము. త్వరపడుము.

---

## నలువదియేడవ యధ్యాయము

సుల్తానుఁడు నిరాశాకూపంబునఁ బడెను. సైనికులలో ననేకులు మృతులైరి. పలువురు పాఱిపోయిరి. మదూరుయుద్ధమైనతరువాత నాల్గవదినమునఁ బటకుటీరసభామందిరంబున సుల్తానుఁడు కూర్చుండియుండెను. ఆంగ్లేయులు వచ్చుచున్నట్లు జాడ తెలియకపోవుటవలన వారు వెనుకకుఁ దిరిగిపోయిరని యతఁడు తలఁచెను. అకస్మికముగ నొకసైనికుఁడు భయవికృతముఖుఁడై గుడారములోనికి వచ్చెను.

సుల్తా—ఏమిరా? ఎందుకు వచ్చితివి? బిగ్గఱగఁ జెప్పుము.

సైనికుఁడు—అయ్యో! పరంగీ లేఱుదాఁటి వచ్చిరి.

సభికులు—ఎక్కడ? ఎక్కడ? ఎప్పుడు?

సుల్తా—గాడిద! అబద్ధములాడుచున్నావా? నీరక్తము పీల్చెదను. నిజము చెప్పుము. ఎచ్చట దాఁటిరి?

సైని—సాస్లివద్ద.

సుల్తా—సాస్లివద్దనా? మార్గము చూపిన ద్రోహి యెవఁడై యుండును?
సభి—మహాప్రభూ! కాశిమాలియై యుండును. అతఁడు మదూరునదివద్ద.
నాంగ్లేయులపక్షమున వచ్చెను. మేమందఱము చూచితిమి.

సుల్తానుఁ డీమాట వినినతోడనే మ్రాన్పడెను. "కాశిమాలి, సాస్లి" యను రెండు మాటలు మాత్ర మతనినోటినుండి యెడనెడ వెడలెను. అందఱు నిశ్శబ్దముగ నుండిరి. కొంతసేపటికిఁ జలివిరాఁగ సుల్తానుఁడు లలాటంబును జేతితోఁ స్పృశించి లేచి నిలువంబడి సభను వీక్షించెను. అతని దీనవదనముఁ కనుఁగొని సభికులు దుఃఖభరితులైరి. జొటజొట వారికన్నులవెంట నీరు కాఱ నారంభించెను.

సుల్తానుఁడు "శూరులారా! దుఃఖింపకుఁడు. దేవుఁడు నన్నుఁ ద్యజించెను. నావంటిదీనునితో నిఁక మీ కేమిపని? మీరు విశ్వాసపాత్రులై చాల కాలము నాకొల్వులో నుంటిరి. అనేకపర్యాయములు మీయెడఁ గఠినముగ నుంటిని. అవియన్ని మనస్సునఁ బెట్టుకొనక నన్ను క్షమింపుఁడు. నాకు దుర్దినములు సంప్రాప్తించినవి. నాకును మీకును ఋణానుబంధము తీఱినది. దయ యుంపుడు. నేను—" అని మాటలాడుచుండ సభలోనుండి యొకయధికారి లేచి యతని పాదములపైఁబడి వెక్కి వెక్కి యేడ్చెను.

సుల్తానుని స్వరమిదిఱకే గాద్గద్యవికృతమై యుండెను. సంతోషతరంగితమైన సమయంబులందును, గోపోజ్జృంభితమైన వేళలయందును, భయోద్వేజితమైన కాలంబులందును, వివిధాకృతులఁ దాల్చియుండు నాతని నెమ్మో మీ యనివార్యశోకోపహతమై వహించినరూపము సభికులను దుఃఖాబ్ధియందు ముంచెను.

ఘోరాపద లావరించినను, ప్రాణసమాన ప్రియబంధువు లకాలమృత్యుదేవతాపహృతులైనను, ద్విషద్ధనుర్ముక్తనారాచములు దేహమును భేదించుచుండినను, దడినొందని యావీరుని కనుఁగవ యానాఁ డశ్రుకణపూరితమాయెను. ఆమహాపురుషుని భావ మాసమయమున నెట్లుండెనో కాని కన్ని

రనివార్యముగఁ గాఱ నారంభించెను. అత్తఱి సభికులయుద్రేకము వర్ణింప నలవి కాదు. ఏడ్చువారు; గుండెలు గ్రుద్దుకొనువారు; శత్రువులఁ దిట్టువారు; ఒట్టులు పెట్టికొనువారు నైరి. రహస్యవిరోధములుగల వారుకూడఁ బగలుమఱచి సుల్తానునికొఱకుఁ బోరాడ నేకీభవించిరి; దేశరక్షణార్థము రక్తముకార్చుటకు నుద్యుక్తులైరి. ఆఙ్గ్లేయులు పట్టణమును సమీపించి ముట్టడించిరి. దినములు గడచెను. ఫిరంగులు, తుపాకులు గర్జిల్ల నారంభించెను. శత్రువులు కోటగోడ బ్రద్దలు చేయుచుండిరి. సుల్తానుఁడు సైన్యమును సన్నద్ధపఱచి సయ్యదు గఫ్ఫూరును గుద్యరక్షణమున నియోగించెను.

మే నెల మూఁడవతారీఖున సుల్తానుఁడు కూర్చుండి కర్తవ్య మాలో చించుచుండ నొకఁ డశ్రుపూరితనయనుఁడై వచ్చి సయ్యదు గఫ్ఫూరు మృతి నొందెనని చెప్పలేక చెప్పెను. సుల్తానుఁడు నిర్విణ్ణుఁడై యతనికి సగౌరవముగ నుత్తరక్రియలు జరుపవలసిన దని యాజ్ఞాపించి సౌధపురోభాగమున బహిరంగ ప్రదేశమందుఁ గూర్చుండి భోజనమొనర్చి విచారగ్రస్తుఁడై యుండెను.

ఉన్నట్టుండి కోటగోడమీఁద నొకభీకరవిగ్రహము కనఁబడెను. సుల్తానుఁడు నిర్భిన్నహృదయుఁడై కొంచెము సేపతనిని వీక్షించి యాతఁడు "బయార్డు" అని గ్రహించెను. అతనివెంట మఱియొకఁడు వచ్చెను. ఇతఁడు మహమ్మదీయుఁడు. ఇద్దఱును సింహములవలెఁ గోటలోనికి దుమికిరి. వారివెంట లెక్కించుటకు వీలులేకుండ సైనికులు వచ్చిరి. "అల్లా! అల్లా! బయార్డు, కాశిమాలి, కోటలోనికి వచ్చిరి. సైనికులారా! పొండు! వారిని రాకుండ నాపుఁడు" అని సుల్తానుఁ డఱచెను.

---

## నలుపదియెనిమిదవ యధ్యాయము

సుల్తానుని సైనికులందఱు చావుతెగువతో గండికడకుఁ బరుగెత్తిరి. ఆఙ్గ్లేయసైన్యము చీమలబారువలెఁ గోటలోనికి వచ్చుచుండెను. ఇరుపక్షముల వారు తుపాకులు, ఫిరంగులు విచ్చలవిడిగఁ గాల్చిరి. ఆసమయమునఁ గోటలోని

కలవరము వర్ణనాతీతము. జనులు తమతమధనమును భూషణములను భూమియందు గుప్తముకావించి ప్రాణములఱచేతిలోఁ బెట్టికొనియుండిరి; ఫిరంగుల మ్రోఁత లాగినచోఁ గాన్కలు చెల్లింతు మని దేవతలకు మ్రొక్కిరి. దేవాలయములందును మసీదులందును బ్రార్థనలు నిరంతరముగ జరుగుచుండెను. ఆపణంములయందు బేహారులు ధాన్యసంచయంబు పరులపాలగునని చింతచే నిరాశులై యుండిరి. వృద్ధులు పుత్రపౌత్రాదుల మధ్యమునందుండి పూర్వమేతాదృశ సమయములందు దా మనుభవించిన కష్టములఁ జెప్పుచుండిరి. ఒండొరులను బిచ్చికొనుటకై కొందఱు కేకలు వేయుచుండిరి. నిండ ముసుఁగులు వేసికొని పాదాలంకారముల మ్రోఁత ఘల్లని వినఁబడుచుండఁ గొందఱుబీబీలు పడిపడిగ నొకచోటినుండి మఱియొకచోటికిఁ బోవుచుండిరి. మరలివచ్చెదమో రామో యని సైనికులాలుబిడ్డలఁ గౌఁగిలించికొని యెట్టకేలకు వారిని విడిచి, ధైర్యముతో మృత్యువదనంబునం బడఁబోయిన ట్లరిగిరి. సుల్తాను దంతపుపురమునకేఁగకయ యాయుధహస్తుఁడై గండియొద్దకుఁబోయి శత్రువులను గాల్చుచుండెను. రాజాఖానుఁడను నొకయధికారి "మహాప్రభూ! తమ రిట్టిసమయమున నిచ్చట నుండఁగూడదు. శత్రువులను మేము చాలఁ దోలెదము. ఏలినవారు సురక్షితమైన స్థలమునకుఁ బోవలయును" అని ప్రార్థించెను గాని యాతఁడు రణమనిన జంకని మహావీరుఁడు కావున "నే నిచ్చటనే మృతినొందెదను. నన్నుఁ జంపి నామీఁదుగ నడచిపోవలయునే కాని నాశరీరములోఁ బ్రాణము లుండువఱకు శత్రువులను రానీయను. గభీరమైన యీపరిఖ దాఁటవలసియున్నది గదా! అదియంత పరంగిలరక్తముతో నిండినదనుక వారికి సాధ్యముకాదు" అని గంభీరముగఁ బలికెను.

ఆంగ్లేయులగడ్తదగ్గఱకు వచ్చిరి. ఖేయ మగాధమై. విశాలమై, దాఁటుటకు సాధ్యము కాకుండెను. ఆంగ్లేయసైనికు లత్యుత్సాహముతోఁ దరించు నుపాయము వెదకుచుండిరి. చెక్కలు పఱవఁబడి దాఁట ననువుగనున్న స్థలమును దేశద్రోహియైన కాశిమాలి చూపెను. హిందూదేశచరిత్రము నవలో

కించినచో నిట్టి రాజద్రోహులో దేశద్రోహులో ప్రతిరాజ్యవినాశమునకుఁ గారణభూతులైనట్లు మనకుఁ దెలియఁగలదు ! పరంగీలు గుములుకట్టి ఝల్లల మీఁదుగ నగడ్తదాఁటిరి. మహమ్మదీయరాజ్యనాశనము, స్వాతంత్ర్యాపహరణము, విదేశీయాధికారము నొక్కపర్యాయము దుస్స్వప్నములుగ నతని మనస్సునకుఁ బొడకట్టఁ జివర నిమేషమువఱకు మొక్కవోని ధైర్యముతోఁ బోరాడెను. కాని సుల్తానునిసైనికులు కొందఱు ద్రోహులై పరులం జేరిరి. పెక్కు ధారాదారుణప్రవిదారణంబున విదారితులైరి. చూర్ణగోళాదులు తక్కువయాయెను. శాత్రవసముద్ర ముప్పొంగి తరంగంబులు పైకిం బైకిఁ వచ్చుచుండెను.

దుష్టులైన పరంగీలు రక్తపిపాసగల వన్యమృగములవలెఁ బరుగులిడుచు నేతెంచుచుండిరి. అహతభయుండై, నిరంకుశమనోవ్యాపారుండై, వీరరక్తపరిపూరితనాడీచయుండై, మహాసామ్రాజ్యధురంధరుండైన సుల్తానుఁడు శత్రువులచేఁ గల్గుచావపవిత్ర మని యెంచి శుద్ధాంతకాంతామణులను స్వఖడ్గంబునఁ దునుమను బిమ్మట నాత్మహత్యకావింపను దలఁచి పల్లకిబోయీలను బిలువుఁడని చెప్పెను. పల్లకివద్ద కతనిని రాజాఖానాదులు గొంపోయిరి. ఆయొత్తుడులోఁ బోయీలు సందుచేసికొని తాళేకపోయిరి. "పూర్ణయ్య సకుమారుఁడై తప్పించికొనిపోయెను. తమరుకూడ నదీద్వారముగుండఁ బోయి పశ్చిమమున దుర్గములలో నుండవచ్చును" అని రాజాఖానుఁడు చెప్పెనుగాని సుల్తానుఁడు సమ్మతింపలేదు. ఇంతలోఁ దుపాకిగుండొకటి వచ్చి యతనికిఁ దాఁకెను. చూచుచుండఁగనే మఱియొకటి వీపునఁబడెను. రక్తము స్రవింప మొదలిడెను. అంతట నతనిని బల్లకిలోఁ బరుండఁబెట్టిరి. "దప్పి. దప్పి. నాలుక యెండిపోవుచున్నది." అని సుల్తానుఁడు దీనముగఁబలికెను. ఆసమయమున రక్తబిందువులుతప్ప జలాసారములెచ్చటఁ గనఁబడవాయెను. పరంగీలు రక్తాభీలఖడ్గంబులు జళిపించుచు నావరించియుండిరి. సుల్తానునిఁ గోటద్వారముకడకుఁ గొంపోయి 'సుల్తానుఁ డని చెప్పినచో మిమ్ము రక్షించెదరు. సెలవేని నాఁటితో విన్నవించెదను.' అని రాజా-

ఖానుఁడు హాక్రుచ్చెను. 'వలదు వలదు. నేను సుల్తానుఁడ నని తెలిసినచోఁ గసి తీర్చికొనుటకై చిత్రవధ కావించెదరు' అని యాతఁడు మెల్లఁగ నుడువుచుండ నొకయాంగ్లేయుఁడు వచ్చి యతనిమెడయందలి స్ఫటికమాలను త్రెంచెను. సుల్తానునకుఁ బోవుచున్న ప్రాణము మరలవచ్చెను. అతఁడు పటపటఁబండ్లుగొఱికి ప్రక్కనున్నకత్తితో నొక్కవ్రేటా సైనికుని బుజముపై వేసెను. ఆవీరహస్తము ఖడ్గము నెత్తుట కదియే చివరసారి. సైనికుఁడు బాధకోర్వలేక చేతనున్న తుపాకి కాల్చెను. గుండు సుల్తానుని కపాలమును భేదించుకొనిపోయెను.

అతనికన్నులు సర్వచరాచరప్రకృతినిఁ దుదిపర్యాయం బొక్కట వీక్షింపనెంచినవో యన గిఱ్ఱునఁదిరిగి నిశ్చంచలములయ్యెను. లయంబునందుఁ బార్థివశరీరంబులన్ని యీమంటిపాలిట్లగు నని చూపుభంగిఁ దల నేలకు వ్రాలెను. తేజస్సు దూరమాయెను.

రాజాఖానుఁడు కోపోద్దీపితుఁడై యాయాంగ్లేయుని నఱకెను. మఱి కొంద ఱాంగ్లేయులు క్రమ్మి ఖానునిఁ గాల్చిరి. అతఁడు మరణమునందుఁగూడ యజమానుని వీడలే ననుభంగి సుల్తానుని పార్శ్వమునఁబడి ప్రాణంబుల విడిచెను.

సుల్తానుని సైన్యము చెల్లాచెదరై పోయెను. కోట యాంగ్లేయుల యధీనమాయెను. కాళీమాలి చార్లెసు ఫిలిప్సులు కలిసి హార్బర్టును గనుఁగొనుటకై కోటయందంతటఁ గలయవెదకి విఫల మనోరథులైరి. జమాదారునిఁ బట్టికొని మర్దించినచో హార్బర్టెచ్చట నున్నాఁడో తెలియఁగలదని కాళీమాలి యతనికొఱ కన్వేషించెను గాని యతఁడు కనఁబడినవాఁడు కాఁడు.

సూర్యుఁ డస్తాద్రి కరిగెను. సాంధ్యరాగ ప్రసరంబుచే రక్తలిప్తంబులైన ఖడ్గంబులు వింతరంగుల నీనుచుండెను. మసకలు క్రమ్మ నారంభించెను. చీఁకటి పడినకొలఁది యుద్ధభూమినిఁ జూచినవారికి గుండె లవియుచుండెను. భిన్నభిన్నములై కాళ్లు, చేతులు నెత్తుటి మడుగులలోఁ మునిఁగి మునఁగక యుండెను. జనసమ్మర్దంబు వలనను, రానురాను జీఁకటి వ్యాపించుచుండుటవలనను, బిశిత భక్షణాపేక్షంబులయ్యుఁ గుంఠితాశంబులై గృధ్రవాయసాదులు సమరరం

గంబుపై ధ్వని పురస్సరంబున వలయములు దిరిగి స్వకీయములైన గూండ్లకుఁ జేరెను. అచ్చోట వసించియుండిన భయాధిదేవతయొక్క కృష్ణవర్ణ దేహచ్ఛాయయో యనఁ దనుంబు సాంద్రంబై యావరించెను. సర్వసత్వసంహారదక్షుండైన భగవంతుం డా ప్రపన్నంబు నగణ్యనేత్రంబులతోఁ జూచుచుండె నన నక్షత్రంబులు గగనమండలంబునందు విరాజిల్లుచుండెను.

ఆనాటిరాత్రి యాంగ్లేయసైనికు లొనర్చిన దుర్నయములు చెప్ప నలవికాదు. వారు కవాటార్గళోద్ఘాటనం బొనర్చి భయముచే నగము చచ్చియుండిన జనుల బాధించి ధనముదోఁచిరి. ఇండ్లను నిప్పంటించిరి. పరపురుషుం డనఁ జంద్రదర్శనంబున ముకుళించు కమలంబుంబోలె, విముఖులగు పతివ్రతల మానము నహితము భంగపఱచిరి. మద్యపానప్రమత్తులై, ధనాశాపిశాచావేశులై, సబలాబలభేదంబు పాటింపక యందఱ మర్దించిరి. అట్లు దుర్బాధాపీడితులైన జనుల యాక్రందనములును, బిల్లలయేడ్పులును బలవంతముగఁ జెఱపట్టఁబడుచుండిన స్త్రీలయఱపులును నిరంతరములై వినఁబడుచుండెను. నిప్పంటింపఁబడిన గృహములు జ్వాలాజాలాకరాళములై యుండెను. ప్రళయకాలము నాఁటిరాత్రి యంతకంటె భయంకరముగ నుండనేరదేమో యని తోఁచెడిని. వారు కోరినట్లు శీఘ్రముగఁ దెల్లవాఱకపోవుటవలనఁ దమ దురదృష్టమునకుఁ దోఁడు రాత్రి దీర్ఘీకృతమయ్యెనేమో యని యాపట్టణజనులు దలంచిరి.

నిదాఘసమయంబునఁ బిపాసార్తునికి సారసాహారంబు చందంబున, నహరాగమంబపేక్షించుచుండిన యాజనులకుఁ గొక్కొరోకోయని కోడికూఁత వినఁబడెను. ఉండనుండఁ దూర్పురేఖలు దృగ్గోచరము లాయెను. మనుజుల యాక్రందనాది రవంబు లణఁగి కాకుల యఱపులు హెచ్చెను. కర్మసాక్షి వచ్చినచోఁ జోరుల సాహసము, జారుల నిర్లజ్జయు, దుర్మార్గుల దౌష్ట్యము నీతీరునఁ బటాపంచలై పోవునని తెలుపుభంగిఁ దమంబు విరియఁజొచ్చెను. సూర్యకాంతి నింకఁ జూడమని నిరాశచెందిన యనేకులు తొంగితొంగి చూచుచు వచ్చుచుండిన భానునిఁ బరమోత్సాహముతోఁ గన్నులపండువుగ వీక్షించిరి.

సైనికులు దుండగముల మానిరి. చీఁకటియుండిన స్థలమునఁ బ్రకాశము విధంబున నిరాశయుండినచోట ధైర్యము, కష్టముండినచోట సుఖము, క్షోభ ముండినచోట శాంతి ప్రవేశింప మొదలిడెను. రాజాఖానాదిమృతసేవకపరి వేష్టితమైయున్న సుల్తానుని శవముకనుఁగొనఁబడి రాజసౌధమునకుఁ గొంపోఁ బడెను.

మృషావిషాదంబు నంతఃపురస్త్రీలందఱు కనఁబఱచిరి కాని నిజముగ దుఃఖించినవా రిద్దఱుండిరి. వారు సుల్తానుని పట్టమహిషి, తల్లి. వీరిద్దఱు ఱొమ్ములు గ్రుద్దికొనుచు నతనిపైఁబడి రోదించిరి. "తండ్రీ! కడుపు దుఃఖము పెట్టిపోయితివి. ఈముసలితనమునందు నాకు దిక్కెవ్వరు? ఈపరంగీలనోటిలోఁ దుమ్మువడ! నీప్రాణమునకు శత్రువులైరి. నాకడుపు కాలినట్లు వాండ్ర తల్లి కడుపు లెప్పుడు కాలునో! దేవుఁడా" యని తల్లియు "ఎంతకోపము వచ్చి యుండినను నే నగపడినతోడనే దయతోఁజూచుకన్నులు—అయ్యో— ఇప్పుడు నావంకఁ దిరుగవేమి? నే నెంత పాపాత్మురాలనో! యుద్ధమునకుఁ బోవుచున్నారన్న నాప్రాణములు సగము పోవుచుండెడివి. అశుభముగ నుండు నేమో యని మాటలాడకుంటిని. ఇంక నేమి శుభాశుభములు? దేవుఁడా! అయ్యో! నిమిషము కనఁబడకపోయిన నెప్పుడు వత్తురో యని యెదురు చూచుచుందును. ఇప్పుడెంతసేపు చూచిన నెవరువత్తురో భగవంతుఁడా" యని భార్యయుఁ బలువిధముల విలపించిరి.

మతచోదితమైన యవసానకర్మములు జరుపవలసియుండెను. బలవంత ముగఁ దల్లిని, భార్యను లోనికిఁ గొంపోయిరి. ఉచితకార్యము లొనర్చిన తరువాత మక్కానుండి తెప్పింపఁబడి దాఁచిపెట్టఁబడిన యమూల్యాంబరము లతనికిఁ గట్టిరి. పైనిఁ గుడ్డకప్పి పువ్వులు చల్లిరి. ముల్లాలువచ్చి "సూరాయ్ పట్ హా" "ఖ్లులుఘ అల్లా" యను ఖొరాను మంత్రములు మూఁడుపర్యా యములు పఠించిరి. పాడెపైనుంచుటకు శవము నెత్తుచుండఁగ ముగ్గురు గుండెలు గ్రుద్దికొనుచు నెంతమంది నివారించిన నాగక పాడెదగ్గఱకు

వచ్చిరి. వారిలో నొకతె సుల్తానుని బెంచిన దాది. ఆమె "అయ్యో! అయ్యో! నాయనా! ఈ ఱొమ్ముల పాలుకుడిచి పెరిఁగితివి. ఇప్పు డెండిపోయియున్నవి. నాచంకలలో నెన్నిదినము లుంటివి! నిన్ను దించి యెఱుఁగను. ఇప్పుడు మంటిపా లగుచున్నావు.

ఇవియన్ని చూచుటకే కాఁబోలు నాకింత యాయుస్సు పోసినాఁడు భగవంతుఁడు. నాకెంత మొండిబ్రతుకో. అయ్యో! అయ్యో! ఎంత యన్యాయకాలము." అని నోటిమీఁదఁ జేయివేసి కొట్టికొనుచు బిగ్గరగ రోదించెను. రెండవయామె తల్లి. ఈమెదుఃఖము వచింప నలవికాదు. సుల్తానుని మొగముమీఁద వేయఁబడిన గుడ్డను దొలఁగించి నోటిమీఁద ఱొమ్ముమీఁదఁ గొట్టుకొని విలపించెను. మూఁడవయామె భార్య. ఈమెమాత్రము మాటాడక పట్టరాని దుఃఖమున నేడ్చెను.

శవవాహకులు పాడెనెత్తికొనిరి. ఆంగ్లేయాధికారులు బారుగనిల్చుండి శవము సమీపమునకువచ్చుడు మృతశత్రువునకు గౌరవము చూపుటకై టోపీలెత్తిరి. ఆంగ్లేయసైనికులు తుపాకులఁ దలక్రిందుగఁ ద్రిప్పి నిల్చుండిరి; బ్యాండువాద్యము వాయించిరి. శవ మేతావృశాంగ్లేయసైన్యముగుండ నిశ్శబ్దముగ మోసికొనిపోఁబడెను. పట్టణవీథులమధ్యమున నేఁగునప్పుడు పురుషులు దుఃఖమును దెలుపుస్వరములో "అల్లా, అల్లా" యని బిగ్గరగ నఱచిరి. స్త్రీలు ఱొమ్ములు గ్రుద్దికొనుచుఁ గేశభారంబు విరియఁబోసికొని శవమునకుముందు సాగిలఁబడి రోదించిరి. కొందఱు పరంగీలపేరు చెప్పి దుమ్మెత్తిపోసిరి. ముల్లాలపరమంత్రము లొక్కొక్క పాదము చదువుచుండ నందఱు దానిఁ దిరిగి పఠించుచుఁ బోవుచుండిరి. సుల్తానుని సైన్యాధికారులు, నైజాము సైన్యాధికారులు, చింతాముద్రాంకితవదనంబులతో నడచుచు శవమువెంట వెంట వచ్చుచుండిరి.

సుల్తానునికుమారులలో నొకఁడుమాత్రము గుఱ్ఱముసెక్కి దుఃఖపరవశుఁడై యనుగమించుచుండెను. ఎటుచూచిన నంతట దుఃఖముతప్ప వేఱొండు లేనట్లు కనఁబడెను.

ఆదినమున మూఁడుజాములవఱకు నెండ తీవ్రముగఁ గాసెను. పిమ్మట మేఘములు పొడసూపెను. ఉక్క యెక్కువాయెను. గాలి కదలకుండెను. ఎడనెడ నుఱుము లెచ్చటనో బయలుదేఱి గగనమునంత వణఁకించినట్లు మెల్లఁగ వినఁబడుచుండెను. తాప మధికమై జనులందఱు మేఘములవంక నప్పు డప్పుడు చూచుచు లోలోన నేమో మో యనుకొనిరి. శవ మూరిబయటికిఁ జేరెను. అచ్చటికిని సమాధిప్రదేశమునకును మధ్యమున విశాలమైన యొడారి గలదు. ఆ యొడారిగుండ జనము నడువసాగెను. గమ్యస్థానము దగ్గఱకు వచ్చిన కొలఁది వారి రోదనధ్వను లధికమాయెను. నిమిషనిమిషమునకు నుఱుముల శబ్దము బిగ్గరయగుచుండెను.

శవము శ్మశానభూమికిఁ జేరినది. సైనికులు బారులుగట్టి రెండు ప్రక్కల నిల్వఁబడిరి. వారిగుండ శవమును సమాధివద్దకుఁ గొంపోయి క్రిందికి దించిరి. సమాధిలోనుంచుటకు దానిని బయటికిఁ దీసిరి. ప్రధానుఁడైన ముల్లా దుఃఖసూచకస్వరముతో మంత్రము చదువ నారంభించెను. రెండుమూఁడు నిమిషములు గడచినతరువాతఁ గన్నులు మూఁతపడునట్లు మెఱుము మెఱసి గుండె లదర ఫెళ ఫెళ ఫెళమని యుఱుముఱిమెను. ఈధ్వని తగ్గినతరువాత మరల ముల్లా యొక్కస్వరము దీర్ఘమై వినఁబడెను. కొంతసేపటివఱకు మెఱుముగాని యుఱుముగాని లేదు. శవమును లేవనెత్తి సమాధిలోఁ బడ మటి పలాఁపిగఁ బరుండఁబెట్టి "సలాంవో ఆలేకుంవో రహిమత్ అల్లా" యని చదువ మొదలిడఁగనే మరలఁ జెవులు బ్రద్దలగున ట్లుఱిమెను. అంతట నెడతెగ కుండ నుఱుములు హెచ్చెను. వానగాని గాలిగాని లేదు.

దట్టమైన నల్లని మేఘములు దీర్ఘములుగఁ బెరిఁగిన తాళవృక్షముల యగ్రములపై వ్రాలియున్న ట్లగపడెను. ఒక్కొక్కప్పుడు తటాలున మెఱసి యాకాశమంతట వెలుతు రగుచుండెను. చచ్చి, శీతలశరీరముతో సమాధియందు నిశ్శబ్దముగఁ బడియున్న టిప్పును జూచి "రాజాధిరాజు, మహాశక్తిమంతుఁడు, సుల్తానుఁ డిట్లుపోవ మనమన నెంతవారము" అని జనులొకరివంక నొకరు దృష్టి

నిగిడించుచు ననుకొనిరి. ఆమహావీరునికిఁ గడపటిసారి గౌరవమును జూపుటకై సమాధి కిరుప్రక్కలఁ బత్తుకాలేర్పడ సైనికులు నిల్చుండిరి. “కాల్పుఁడు” అనునాజ్ఞ యధికారి యొసఁగఁగనే ఘననభోంతరాళము తాఁకుమాఱగునట్లు తుపాకులమ్రోఁత జనించి పశ్చిమముననున్న పర్వతములవఱకుఁ బోయి కోట లోను, బరంగీల శిబిరములోను, దత్కాలమున మ్రోఁగిన తుపాకుల యారావము నెదుర్కొనుటకో యన ద్విగుణితబలముతోఁ దిరిగి వచ్చెను. వాద్యములు వాయింపఁబడెను. ఎడఁబాయలేక భూమి యా వీరుని స్వగర్భమున నిడికొనెనేమో యన నతని శరీరము భూస్థితంబయ్యెను. అందఱు ఖిన్నులై పట్టణమునకు మరలిరి.

భరతఖండ మహానాటకరంగంబునం దొక పాత్రము నిజచారిత్రముచే మానవప్రపంచంబున కాశ్చర్యంబు పురికొల్పి తెరచాటునకుఁ బోయెను! మరల నాపాత్రము వచ్చునా? వచ్చి యే రూపమున నేతెంచునో!

ముసల్మానుమతత్రాత, మహీశూరమహీపాలుండు, శరణాగత శిబిచక్రవర్తి, ధైర్యమేరుధరాధరంబు వీరస్వర్గంబున కేఁగెను. దక్షిణాపథరణరంగములం దింతటి వీరుఁడు మరలఁ బొడకట్టియుండలేదు. తమోగుణం బగ్గలంబైన వేళల సందర్భవశమునఁ గ్రౌర్యంబు పూనువాఁడైనను, దత్క్రౌర్యంబును మించినదయను జనులపై నతఁడు చూపుచుండువాఁడు. అతని పరిపాలనమునందుఁ గృషీవలులు నిర్బాధితులై యుండిరి. క్షేత్రములు సస్యవంతములై యుండెను. వణిజు లైశ్వర్యముతోఁ దులఁదూగుచుండిరి. వేదవేదాంగ పారంగతులైన బ్రాహ్మణు లగ్రహారములు, మాన్యములు, కండికలు గలిగి యుండిరి. మంత్రి పూర్ణయ్య యగుటచే బ్రాహ్మణాదులకుఁగూడ న్యాయము నిరవద్యముగ జరుగుచుండెను.

---

# నలువదితొమ్మిదవ యధ్యాయము

దుర్గమారణ్యామధ్యంబునఁ బర్వతశిఖరంబులపై హార్బర్టును జదువరులు విడిచిపెట్టి చాలకాలమైనది. అప్పర్వతములయందలి స్వాభావిక ప్రదర్శన మేకాకిగ నున్న యతనిమనస్సున కానందదాయకమై యుండెను. అల్లనల్లన వీచు మరుత్కిశోరంబులును, మృదుదళంబులు గల్గి తూఁగాడు నానావర్ణ కుసుమంబులును, గొంబసిమి నీను చివురుం జొంపంబులును నతని దృష్టి నాకర్షించుచుండెను. ఎచ్చటనో లోయలలో బయలుదేఱి మాటిమాటికిఁ బొదలలో నదృశ్యమగుచుఁ దళతళమను జలముతోఁ బ్రవహించుచున్న పిల్ల యేఱులు, వానియొడ్డున నల్లిబిల్లిగ నల్లుకొని చిత్రకుసుమ శోభితములై తన్నది జలములపై నర్తనము సలుపు లతలుగల నికుంజములు, నతనికిఁ గలిగించిన సంతోషము కేవలానుభవగోచరంబు. చల్లనిగాలికి కించుక యొకప్రక్కకు వ్రాలి చలించుచున్న పచ్చికగల బయళ్లలో సంజవేళలందు విశ్రమించి నప్పుడు సల్లాపము లాడుచున్నట్లు కూయుచున్న కోయిలల శ్రావ్యస్వరం బులు, వలయములు తిరుగుచు నాకాశమునఁ గనుచూపుమేర దాఁటి యదృశ్య ములగుచుండు భరద్వాజంబుల సోయగంబు, నతనికిఁ జెప్పనలవికాని సమ్మోహ మావహించుచుండెను, అప్పుడప్పు డివి బీచివుడ్డు పార్కులో నామీతోఁ గలిసి యనుభవించిన యానందము నతనికి స్ఫురింపఁజేయుచుండెను.

ఆపర్వతముల కావలఁ బ్రపంచమున నేమి జరుగుచున్నది యాతఁ డెఱుఁగఁడు. ఉన్నతశిఖరమునుండి చూచినప్పుడు విశాలప్రదేశము తప్ప నేమియు నతని కగపడదు. ఎచ్చట నేమి సంభవించుచున్నదో యని యతఁ డాలోచించును గాని ప్రయోజనమేమి? విషయముల వివరించు నాప్తుండు కాని, పరామర్శంబుకాని, యింద్రియార్థసన్నికర్షంబుకాని లేనిచో జ్ఞాన మె ట్లుత్పన్నమగును?

ఆంగ్లేయులు శ్రీరంగపట్టణమును బ్రశమమున ముట్టడించి తిరిగి విడిచి పోయి రనిమాత్ర మతఁడు కావలివానివలన వినెను. అప్పటినుండి కారాగృహ

విముక్తి మరణమునందే కాని బ్రతికియుండఁగ నాశలేదని యతఁడు నిశ్చ యించికొనెను; జీవితము, సంస్కారయుతమైన బుద్ధి, యర్థకార్యముల యందు వినియోగింపఁబడుట కలలోని వార్త యని భావించెను; హృదయము నందుఁగల దయాదాక్షిణ్యములు విషయరహితములగుట వ్యర్థములుగదా యని చింతించెను.

అతనికిఁ బ్రకృతియే నెచ్చెలియై యుండెను. అప్పటప్పటికి నూతన వికాసమునొందు నాపెనెమ్మోము నపరిమితప్రేమతోఁ దిలకించుచు, నిమ్నో న్నత ప్రదేశంబులఁ బ్రవహించు సేఱుల నిస్వనంబులను, జలించు నటవీవృక్ష ముల నుండివచ్చు నినదంబులను వినుచుండును. ఈదృశనాదంబు లా ప్రకృతి కాంత స్వకీయ వైవిక్త్యంబులందు వినిపించు శ్రావ్యగానంబులో యని మనస్సు నకుఁ దోఁపక మానదు.

కొన్నిదినములైన తరువాతఁ గావలికాఁ డొకఁడు కుక్కను వెంటఁ బెట్టికొని వచ్చెను. ఆకుక్క హార్బర్టునకు మచ్చికపడినందున నాయకుఁడు పోవునప్పుడు దాని నతని కిచ్చెను. అది తిరిగి బదులు చెప్ప లేకపోయినను దానితో నతఁ డింగ్లీషు మాటలాడుచుండును. ఇద్దఱును జిగిమీఱు సేటి యొడ్డులపైఁ గూర్చుండినప్పు డతఁడు నీటిచప్పుడును, దుమ్మెదల ఝుమ్మను పాటలును విని విని, లేయెండలో మెఱయుచుఁ దిరుగాడు నీఁగలను, దేనెను గ్రోలుచుఁ బువ్వుపువ్వుమీఁదఁ వ్రాలు నాకుచిల్కలను జూచి చూచి, యొకపరి మేరలేక నెగడియున్న బయళ్లగొనబునకు, గొండవరుసలయందమున కును, మఱియొకతఱి నెమ్మదిగ హాయిగొల్పు సెలలసొబగునకును, గుబురుగ నున్న గుట్టలసోయగమునకును, మెచ్చి మెచ్చి తల యూచి యూచి యెదుట నున్న కుక్కతో నింటిని దల్లిని నామినిఁ బేర్కొని ముచ్చట చెప్పుచుండును.

ఇట్లుండ నొకనాఁడు చినుకులు పడెను. మందమారుతము వీవసాగెను. అప్పటికిఁ జైత్రమాసపునిర్జలవాయువులు తగ్గిపోయెను. గ్రీష్మము ప్రారంభ మగుచుండెను. హార్బర్టొకచోటఁ బరుండి యప్పటప్పటికి నూతనాకారములను

వహించుచుండిన యా ప్రదేశములను జూచుచుండెను. ఆనాఁడు వానకురిసెను గానఁ, దరుగుల్మాదులు విలసనము నొందెను; సుమసౌరభంబు మనోహరముగ వచ్చుచుండెను. రక్షకనాయకుఁడు వచ్చి "లెమ్ము నీకు వార్తతెచ్చితిని." అని హార్బర్టుతో ననెను.

హార్బర్టు—చెప్పుము. ఏమిటి యావార్త ? జమాదారుఁడు మరల వచ్చుచున్నాఁడా ? ఇక్కడకుఁ జేరెనా ?

నాయ—కాదు కాదు. నీవు బయలుదేఱి ప్రయాణము చేయవలసియున్నది.

హార్బ—(నిర్భిన్నహృదయుఁడై యాతురముతో) సుల్తానుఁడు నన్నుఁ గొనికమ్మనెనా ?

నాయ—లేదు లేదు. సుల్తానుఁడు చచ్చెను. కోట పరంగీలచేతిలో నున్నది.

హార్బ—(దిగ్గనలేచి యఱచి) ఇది నిజమా ? కలయా ? నాయకుఁడా ! సుల్తానుఁడు చచ్చె నని నీ విప్పుడు చెప్పితివా ?

నాయ—(కన్నీరు గద్గదానఁబడ) సాహెబ్. అవును. మహానుభావుఁ డైన సుల్తానుఁడు యుద్ధములోఁ బోరాడుచుఁ జచ్చెను. ఆయన కేమి ? పుణ్యాత్ముఁడు. నీ విప్పుడు వచ్చెదవా ? నిన్ను మీవారికడకుఁ దీసికొనిపోయిన యెడల వారికి నామీఁద ననుగ్రహము కలుగవచ్చును. ఈయుద్యోగము నే వదలిపెట్టెదను. ఎవరు దీనిని గోరరు. ఇక్కడ మన ముందుమేని నెవ్వరు మనలను జ్ఞప్తియం దుంచికొనరు. నీయభిప్రాయ మేమి ?

ఈమాటలన్ని హార్బర్టు వినలేదు. మోక్షకాగమము ప్రప్రథమమున జ్ఞానచక్షువునకు గోచరమైన యచ్చోట, స్వాతంత్ర్యవార్తాశ్రవణము దివ్యనాదముంబోలెఁ గర్ణప్రాప్తమైన యాస్థలమున, నతఁడు మోకాళ్లపై వ్రాలి కృతజ్ఞతాపరిపూరితంబై భక్త్యావేశజాజ్వల్యమానంబైన హృదయంబుతో నేమియో ప్రార్థించెను. ఏమని ప్రార్థించెనో? ఎవరికిఁ దెలియును ? ఉప్పొంగుచున్న సముద్రమునందుఁ దరంగములట్లు జనించి యనిర్వాచ్యంబులైన యతని భావంబులు జగదంతర్యామియైన భగవంతుని సింహాసనము నుద్దేశించి వెడలు

చుండెను. అతఁడుచ్చరించిన శబ్దంబులు స్వసహ్వాయప్రపంచంబునఁ గలిసి పోయెను.

..................................................................................................

కొన్ని దినములు గడచినతరువాత నొకసైన్యాధికారి పనిలేక యట్టిట్టు తిరుగుచుఁ బగలురెండుజాములవేళ ఫిలిప్పుగుడారమున కేఁగి "ఫిలిప్పూ! మంచముమీఁద వేసికొని యొకదీనుని సైనికులు మనశిబిరమునకుఁ గొనివచ్చిరి. చూచితివా? అతఁ డదివఱకు దుర్గములో బంధింపఁబడియుండెను. పాప మతనికి జ్వరము వచ్చుచున్నది. త్రోవలో నడవులయందాఁగి యాఁగి యతనిం దెచ్చిరి. అచ్చట నది వెంటఁ బడినది. అయినను—వైద్యము చేయుచున్నాఁడు. ఇప్పు డతఁ డాసుపత్రిలో నున్నాఁడు." అని ప్రశ్నించెను. ఫిలిప్పు నుత్తరము వ్రాసికొనుచుఁ దలయెత్తి "ఎవఁడో హిందువు కాఁబోలు." అని యనెను. "కాదు. కాదు. మనవాఁడే. దుర్గములో మిగిలినవారిలో నొక్కఁడే యఁట." అని యాయధికారి ప్రత్యుత్తర మొసఁగెను. ఫిలిప్పునకుఁ బ్రాణములన్ని లేచి వచ్చెను. అతఁ డేమో యని టోపీ నందికొని యెక్కటి కాగితము లచ్చటవదలి యతి శీఘ్రముగ గుడారమునుండి పరుగెత్తెను. ఏల యిట్లు తొందఱపడు చున్నాఁడని యాయధికారి యాశ్చర్యపడి నెమ్మదిగ నడచుచు ఫిలిప్పేగిన వైద్యశాలకుఁబోయి చూచెను. ఫిలిప్పుజ్వరగ్రస్తునిపార్శ్వమునఁ దనమోకాళ్లపై వ్రాలి యతనిహస్తములను బట్టికొనియుండెను. అతనికిఁ గన్నీ రనివార్యమై కాఱుచుండెను. మాటలాడనుంకించెను గాని ఫిలిప్పు శక్తుఁడు కాకపోయెను. జ్వరపీడితునికన్ను లూర్ధ్వచలనమునొందెను. దైవప్రార్థన చేయుచుండెనన నధరము పరిస్పందనము చెందెను. ఎట్టివికారముచేతను జూపశక్యములుగాని నిష్కళంకకృతజ్ఞత, నిర్భరసంతోషము, సంపూర్ణశాంతి యతని రమణీయవదనంబునఁ గన్పట్టుచుండెను. వచ్చినయధికారి యిదియంత చూచి "ఎన్నిదినములనుండియో వెతకఁబడుచున్న హర్బర్టు కాఁబోలును. వారి నిప్పుడు కదలింపఁ గూడదు" అని తనమనోవికారమును గనఁబడనీకుండ నచ్చోటు వదలి పోయెను.



"నే నా పె బుజముమీఁద వంగి ముద్దుపెట్టుకొంటిని.
ఆమె పెదవి విఱిచి నవ్వి మొగము త్రిప్పెను."

పుట. 309

నిజముగ నతఁడు హర్బర్టే. ఆబాల్యము సోదరసమానుఁడుగ నుండిన మిత్త్రునిహస్తముల స్పృశించినప్పుడును, పలికించి యతనిని గుర్తించినప్పుడును, హర్బర్టు తనబాధలన్నిటి మఱచిపోయెను. దుర్దశావారిధియందుఁ దేలియాడి తేలియాడి యతఁ డిప్పుడు తీరమునందలి కొమ్మను బట్టికొనెను. ఇఁక మునుఁగఁడు. ఇదివఱకెట్లో యతనిని గొనివచ్చుచుండిన శిథిలప్లవమువలని భయము కూడఁ బోయెను.

ఆమంచముపైనుండి హర్బర్టును లేవఁదీసి ఫెలిప్పుగుడారమునకుఁ జేర్చిరి. చాన్లెసునెలిప్పులు పార్శ్వమునఁగూర్చుండి జరిగినవిషయములన్ని చెప్పుచుండ వినివిని యంతకుఁబూర్వ మనేకపర్యాయములు మోసపుచ్చిన స్వప్నమే మోయని హర్బర్టు తలఁచెను. కొంతసేపటికి నిద్రించి పలుస్వప్నములఁ గాంచి కలవరించెను; వైద్యులమందులవలనను, మైకొనిన విశ్రాంతివలనను, స్వస్థతచెంది తెల్లవాఱఁగనే లేచి చుట్టుప్రక్కలఁ జూచెను. మిత్త్రులందఱు సంతోషముద్రాంకితవదనంబులతోఁ గనఁబడిరి. అప్పుడుమాత్ర మతఁడు తన కగపడినదంత నిజమని నమ్మెను. అంతవఱక నతఁడు విశ్వసింపలేదు.

---

## ఏఁబదియవ యధ్యాయము

### (ఉపసంహారము)

ప్రియమిత్త్రుల యుపచారములవలనఁ గ్రమక్రమముగ హర్బర్టున కొడలు కుదిరెను. హర్బర్టు కనఁబడె నని సంతోషించువాఁడు మఱియొక్కఁడు కలఁడు. అతఁడు కాశిమాలి. ఫెలిప్పతనిని దనగుడారమునకు రప్పించెను.

“ఫెలిప్పూ! హర్బర్టునుగూర్చి నిరాశ చెందవల దని యెన్ని పర్యాయములు మీకుఁ జెప్పితిని? సుల్తానుఁడు చంపఁడని యెన్నిసారు లనియుంటిని?” అని కాశిమాలి యనెను. సుల్తానుఁడు బ్రతికియుండినచోఁ గలసికొనము గదా యని హర్బర్టు మొదలగువారు తలలూఁచిరి. కాశిమాలి నిట్టూర్పువిడిచి సుల్తానునిఁ బలువిధములఁ గొనియాడెను.

ఫిలిప్పు—నిన్ను సుల్తానుఁడు చంపఁదలఁచినప్పటికి నీ వతనియందుఁ బరమ విశ్వాసము కలిగియున్నావు.

కాశి—నిజముగ నా కతనియందు విశ్వాసము కలదు. హిందూదేశమున నట్టి మహావీరుఁ డొకఁ డుద్భవించెను. అతని కార్యాసక్తి, జనవశీకరణము, సూక్ష్మదృష్టి యనన్య సామాన్యములు. నిరుపమాన ధైర్యశాలి కావున శూరమరణము నొంది వీరస్వర్గమున కేఁగెను. అతఁడు సేవకులపై మితిలేని దయగలవాఁడు; ప్రేమించినవారికిఁ బ్రాణమిత్రుఁడు; మహాపురుషుఁడు!

ఫిలిప్పు—నీకు ద్రోహముచేసెను గదా?

కాశి—నా కతఁడు ద్రోహముచేయకపోయినయెడల మీ రిప్పు డెచ్చటనుండి యుండురో! విధి తప్పింప నెవ్వనివశము? దైవేచ్ఛయున్నచో నొకొక్కప్పుడు తృణమే పర్వతభేదమునకుఁ గారణమగును. విధికి జమాదారుఁడు నేనును సాధనము లైతిమి.

హార్బ—సుల్తానుఁడు నీకుఁ జేసిన ద్రోహ మేమిటి? కాశీం! మాయాంగ్లేయ శిబిరములో నిన్నుఁ జూచి యాశ్చర్యపడుచున్నాను. మావా రభయ మిచ్చిన వారిలో నీ వొకఁడ వనుకొనుచున్నాను.

కాశి—అబ్బో! అకథ చాల గలదు. ఆంగ్లేయుల ఫిలిప్పెఱుఁగును.

ఫిలి—అట్లుకాదు. నీవే చెప్పుము. నాకుఁ దబ్బిబ్బు కలుగవచ్చును. అయితే కాశిమాలీ! నీ వొకసుందరినిఁ బ్రేమించితివే యామెకుఁ గుశలమా?

కాశి—సాహెబ్! మీవలె మేము మాయాడువారినిఁగూర్చి మాటలాడము. అందువలన నేను నాభార్య క్షేమవార్త మీకుఁ జెప్పలేదు. మీ రడిగితిరి గనుకఁ దెలుపుచున్నాను. నామనోహారిణి సుఖముగ నున్నది.

హార్బ—కాశిమాలీ! ఎవరామె? ప్రేమకథయైనచో వినఁ గుతూహలము కలదు.

మొదట ననుమానించి తరువాత నుపక్రమించి యమీనాను నదినుండి

లేవఁదీసినది మొదలు సుల్తానుని కొల్వువిడిచిపోవునప్పుడు త్రోవఁగో మదూరు నడివచ్చఁ దాను ఘాతుకులఁ బాఱఁదోలుఁడఱకుఁ గాశీమాలి వివరించెను.

హార్బ—నీ వివాహవిషయము త్వరగఁ జెప్పుము. తక్కినయంశము లప్రధానములు.

కాశీ—కాదుకాదు. విను. వరుసగఁ జెప్పినఁగాని తెలియదు. నేను ఘాతుకుల వలని బాధతప్పించికొని స్వగ్రామముచేరి నెమ్మదిగ నింటిలోఁ గాలము గడపితిని. రసవంతములైన కావ్యములఁ జదివితిని. కొన్నిపద్యములు వ్రాసితిని. ప్రొద్దుపోవుటకై నాచరిత్రము వ్రాసికొంటిని. కొన్నిదినము లిట్లు జరిగిన తరువాత నుద్యోగమునందుఁ గోరికగలిగి దానికై ప్రయత్నించితిని. మాజిల్లాసుబేదారుని స్థలము ఖాలీగా నుండెను. మంత్రికి గట్నమిచ్చి యాయుద్యోగము సంపాదించికొంటిని. పన్ను వసూలుచేయుటయందు, నల్లరు లణఁచుటయందు, నాకుఁ దీరనిపని కలిగెను. అప్పటికి నేను హైదరాబాదున కెన్నఁడు పోయియుండలేదు. శిస్తువిషయమై మంత్రితో మాటలాడవలసినపని యొకటి యుండెను. పట్టణము చూచుటకూడఁ గలిసి వచ్చునని హైదరాబాదునకు బయలుదేఱి పోయితిని. మంత్రియు యువరాజును నన్ను గౌరవించిరి. యువరాజు సుల్తానుని ప్రవర్తనను గుఱించి, యతని జయకాంక్షలను గుఱించి, యాసక్తితోఁ బ్రసంగించెను. ఆహా! ఏమాహైదరాబాదు పట్టణము? అచ్చటి జాగీరుదారులు, జమీందారులు నెంత మర్యాదగలవారు! పట్టణము చూచి తీరవలయును. నేను మాయూరికి బయలుదేఱకముందు మంత్రియింటి కేఁగి చెప్పివత్తమని యొకనాఁడు సాయంసమయమున గుఱ్ఱమెక్కిపోవుచుంటిని. ఒక ముసలిస్త్రీ మంచివస్త్రములు కట్టుకొని నాగుఱ్ఱము ప్రక్కకు వచ్చి కళ్లెము పట్టుకొనెను. ఆమె యెవతెయో నా కప్పుడు జ్ఞప్తికిరాలేదుగాని మొగముమాత్ర మదివఱకుఁ జూచినదిగా నుండెను. ఆమె పట్టికొనినతోడనే గుఱ్ఱము కాలెత్తి యెగిరెను. ఆమె భయపడి కళ్లెమువదలి దూరముగఁబోయి గుఱ్ఱపువానిని గలిసికొని

యేమో మాటలాడెను. వాఁడాపెకు నావిడిసి యెచ్చటనున్నది చెప్పిన తరువాతఁ దాను రాత్రి కక్కడకు వచ్చెదనని తెలిపి నావంకఁ జేయి యాడించిపోయెను. ఆపె యెవ్వతెయై యుండునాయని నా కాదినమంత వింతగనుండెను. ఆరాత్రి యొక్క స్నేహితుని కడకు వెడలవలసియుండినను బోవక యాపె వచ్చునని తెలిసినందున నింటిలోనే యుంటిని.

చీఁకటిపడిన తరువాత నొకతె మఱియొక్కతెను వెంటఁబెట్టుకొని నా విడిదికి వచ్చెను. ఇద్దఱును ముసుఁగు వేసికొనియుండిరి. వారు నా సమీపమునకు వచ్చి నాపాదములమీఁదబడి సంతోషపూర్వకముగ ముద్దుపెట్టికొనిరి; కొంతసేపటివఱకు స్ఫుటముగ మాటలాడలేకపోయిరి; ముసుఁగుకూడఁ దీసిన వారుకారు; ఎట్టకేలకుఁ దీసిరి. ఒకతె మీరాను. ఈమెను వెంటనే గుఱుతుపట్టి కౌఁగిలించికొంటిని. హర్బర్టూ! రెండవయాపె సోజను. అమీనా బ్రతికి యున్నది, చచ్చినది స్పష్టముగఁ దెలిసికొనుటకు నామన స్సెంతయాతురము నొందెనో నే నిప్పుడు చెప్పలేను. "నిమిషమైన నాగలేను. చెప్పుము." అని యమీనాను గూర్చి వారి నడిగితిని. "మీర్ సాహెబ్! భగవంతుని దయవలన నమీనా జీవముతో నున్నది." అని మీరాను చెప్పెను. "నిజముగనా? అయితే యిప్పు డెవనియాలై యున్నదో! బహుశః గొప్పకుటుంబమువాఁ డెవ్వఁడో యాపె సౌందర్యవతి యని విని పునర్వివాహము చేసికొనియుండును." "లేదు. లేదు. ఇప్పటికి నాపె నిన్నుఁదప్ప మఱియెవ్వరిని స్మరింపదు. చక్కఁదనమున దేవకన్యలను మించియున్నది. ఆమెయొడలు, కన్నులు, కురులు, చేతులు, మొగము పూర్వముండినరీతి సుందరములుగ నున్నవి. నీవు సురక్షితముగ నిచ్చటికి వచ్చితి వని వినఁగానే యిదివఱకుఁ గడచినసంవత్సరము లాపెకు గడియలుగాఁ దోఁచెను." అని సోజను చెప్పెను. "మెడమీఁది గాయ మెట్లున్నది?" అని నే నడిగితిని. "అబ్బా! అబ్బా! అదేమిగాయమో కాని బాధపెట్టిపెట్టి మొన్న మొన్ననే మానినది. తినఁబోవుచు రుచులెందుకు? చూడవా? "అని మీరాను పలికెను." "ఇఁకఁ దాళఁజాలను. రమ్ము. నా కమీనాను జూపుము

నా కింకను పెండ్లికాలేదు. బహుశః వివాహము నాకయియుండకపోవునేమో! అయినను భగవంతుడు వ్రాసినవ్రాలు తప్పదు గదా.” అని నే నాతురముతో వాక్రుచ్చితిని. వారు నన్ను సంతోషముతో నమీనాయింటికిఁ గొనిపోయిరి. నేను వచ్చెదనని తెలిసి ముసుఁగువేసికొని నా అమీనాతల్లి యొకగదిలోఁ గూర్చుండియుండెను. ఆమెభర్త యుద్యోగవిధి ననుసరించి యెచ్చటికో పోయెను. కనుక నన్నియంశములు నామెతోడనే నేను మాటలాడవలసి వచ్చెను.

నన్ను నిర్వ్యాజముగఁ బ్రేమించి నన్నుఁదప్ప నితరుల నొల్లని నా ప్రియబాల, నాసౌభాగ్యవతి, నామనోహారిణి, నాబహిఃప్రాణము నివసించి యున్న యింటిలోఁ నడుగుపెట్టినప్పుడు, నామె కొన్నినిమిషములలో నాకౌఁగిలుచుండి నాభార్యకాఁగలదని తలఁచినప్పుడు నాగుండె యెట్లు కొట్టుకొనెనో యేమనిచెప్పుదును? రణరంగములయందు యుద్ధసైన్యమధ్యంబున నున్న సమయములఁ గూడ నంతకలవరము నాకుఁ గలిగియుండలేదు. ఆమీనాతల్లి నన్నుఁ జూడఁగనే యత్యానందముతో లేచి కౌఁగిలించికొని నాకు మర్యాద చేసి మావారుండినట్లైన నెంతసంతోషించి యుందురో యని యనెను.

“అమీనా యెచ్చటనున్నది? ఆమెకుఁ గాళిమాలి జ్ఞప్తియందున్నాఁడా? నేను సుల్తానునికొలువు మానితిని. నైజాము క్రింద నుద్యోగము చేయుచున్నాను. ఆలస్యమెందుకు? ముల్లానురప్పించి నిఖాచదివింపుఁడు. అమీనాను గన్నులారఁ జూచి మాటాడనెండు. తాళఁజాలకున్నాను.” అని నేను వాక్రుచ్చితిని. “ఛీ! ఏమాతొందఱ? వేడివేడి పాలుత్రావిన మూతివిూసములు గాలును.” అని యామె యనెను. “అమ్మా! నాప్రేమ నీ వేమెఱుఁగుదువు? ఇన్ని సంవత్సరములకు సెలవుగ నేఁడు చూడఁబోవుచుండ నీవిట్లనవచ్చునా? నే నిచ్చటనున్నానని యమీనాకుఁ జెప్పుము.” అని యంటిని. “ఉండు. ఇప్పుడే వచ్చెదను.” అనిచెప్పి యామె పోయెను. నేను లేచి మోహాతిరేకంబున నేమి తోఁపక

యట్టిట్టు తిరిగితిని. నదిలోనుండి యమీనాను దీసిననాఁడు జనించిన మన్మథ తాపంబు ద్విగుణితమై మరల నేతెంచెను. ఆమె వెనుక నొసంగినముద్దు నా పెదవులమీఁద నున్నట్లే యుండెను. తలుపువద్దఁ గాళ్లచప్పుడు వినఁబడెను. అమీనాతల్లి వచ్చుచున్నదేమోయని యనుకొంటిని. ముసుఁగు వేసికొని యను మానించుచు నొక్కతె తలుపుతీసికొని వచ్చెను. ఇఁక సందేహించుట వెఱ్ఱితన మని తటాలునఁబోయి యామెను కౌఁగిలించికొంటిని. అమీనాయని నాకుఁ దెలియును. వెంటనే ముసుఁగుతొలఁగించితిని. నాయానందమున కప్పుడు మేర లేదు. ఆమెను నాహృదయమునకుఁ గ్రుచ్చికొంటిని. మాయిద్దఱియాత్మ లైక్యముచెందెను. ఆ నాభాగ్యదేవతయొక్క చక్కఁదన మేమనివర్ణింతును? వెనుకటికంటె వన్నె హెచ్చి శరీరము మిసమిసలాడుచుండెను. కన్నులు, కాంతి హెచ్చి మోహజనకంబులై యుండెను. ముఖము తరుణవికాసము నొంది నన్నుఁ బరవశుఁ జేసెను. నన్నిఁక వదలిపోవలదని బతిమాలినట్లు ముద్దు వచ్చెడు కనుంగవతో నామె నన్ను వీక్షించెను. ఆమెచేయి నాచేతియందుండి వణఁకెను.

అమీనాభావమును గ్రహించితిని. "సౌభాగ్యవతీ! నిన్ను విడనాడను. నీవు నాదానవు. నేను నీవాఁడను. నాధనము, దేహము, ప్రాణము నీవి." అని యనురాగపూర్వకముగఁ జెప్పితిని. తల్లివచ్చి నా కౌఁగిటనున్న యమీనాను జూచి "ఓసి సిగ్గుమాలినదానా! ఇదేమి బులుపే" యని మెల్లగఁ నీసడించెను గాని, యమీనా నాఱొమ్ములోఁ దలదూర్చి ప్రక్కకుమరలి తల్లివంక దీన దృక్కులతోఁ జూచెను. అప్పటి యమీనా కన్నుదోయి యుత్తరులకే జాలి పుట్టింపఁ జాలియుండఁ దల్లిమనస్సును గరంచెనని చెప్పవలయునా? కూఁతునకు మగనియందుఁ గల ప్రేమనుజూచి యానందించి తల్లి యూరకుండెను.

ఆరాత్రి గడచినది. మఱునాఁటి సాయంత్రము మున్షీ వచ్చెను. అంతయు సిద్ధముగ నుండెను. జరుపవలసిన తంతుకూడ స్వల్పముగ నుండెను.

ఖోరానుమంత్రములుమాత్రము కొన్ని చదువవలసి యుండెను. కొందఱు బంధువులు మిత్రులు వచ్చిరి. వారియెదుట వివాహపత్రము వ్రాసితిని. అమీనాకుఁ గల స్థిరచరరూపంబైన సొమ్మంత నాకు వచ్చెను. గదిలో నొకతెర గట్టిరి. స్త్రీలువచ్చి తెరచాటునఁ గూర్చుండిరి. వారియందెలచప్పుడు, గాజుల ధ్వని, చెవులకు విందై వినవచ్చెను. మంత్రములను ముల్లాలు చదివిరి. నేవ్రాసిన పత్రము మీఁద సాక్షులు చేవ్రాలు చేసిరి. తల్లియమీనాకు మంగళాశీర్వచనము కావించెను. పరిజనులు "అమీన్ ! అమీన్ !" అనియఱచిరి. కొన్ని నిమిషములు గడచినతరువాతఁ దెర యెత్తఁబడెను. అందఱు నచ్చటినుండి లేచి పోయిరి. మేమిద్దఱము తప్ప నెవ్వరు లేరు. ఏమివర్ణింతును ? స్వర్గలోకమున నప్సరస్సంభోగము ప్రాపించు పుణ్యాత్ముఁడుకూడ, నప్పుడు నేను బొందిన యానందము ననుభవించియుండఁడు. నిమేషములు, గడియలు, జాములు దాఁటెను. వెనుక సంభవించినకష్టములను గూర్చి, ఖానుఁడు నఱకవచ్చినప్పటి కడగండ్లను గూర్చి, మాటలాడుకొనుచునే యుంటిమి.

"అమీనా" నీవప్పుడెట్లు తప్పించికొంటివి. గాయమెక్కడఁ దగిలినది? చూపుము." అని యడిగితిని. యువతీరత్నములకు సహజంబైన లజ్జతో నామె మెత్తని బంగారుపలకవలెఁ గోమలముగనున్న వీఁపుమీఁది చెఱఁగు తొలఁగించి రవిక విప్పి "ఇదిగో ! దాని ధర్మానఁ జంద్రహార మడ్డముగాఁబట్టి యింత మాత్ర మున్నదిగాని లేకపోయిన ఱొమ్ముదాఁకఁ గత్తి దిగఁబడి ప్రాణాలు—" అని వచించెను. నే నామెభుజముమీఁద వంగి గాయమును ముద్దుపెట్టికొంటిని. ఆమె పెదవి విఱిచి నవ్వి మొగము త్రిప్పెను.

"అమీనా! నవ్వు సరియేగాని యిటు మరలి యాసాంతము చెప్పుము." అని నడుము పట్టికొని నావైపునకుఁ ద్రిప్పితిని. "నాకు గాయముతగిలిన తరువాత నేనేమియెఱుఁగను. కొంతసేపటికిఁ గన్నులు తెఱవఁగ నొకగుడిసెలో నుంటిని. సోజను మీరానులు నాప్రక్కన నుండిరి. సోజను నెవ రెఱుఁగరు ?

పోవుచుండెను. దానిని నేను సగ్గఅకే వ్రాసియులేను. తరువాత నది యెంతో చెప్పి యెన్నోయొట్లు పెట్టికొని నా కుపచారాలు చేసెను గనుక, దానిని నమ్మితిని. నన్నుఁ బయుండఁబెట్టిన గుడిసె దాని కూఁతురిది. దానియల్లుఁడు సిపాయి యఁట. ఇంటిలో నందఱు నామీఁదఁ బంచప్రాణాలు విడుచుచుండెడువారు. జుల్ఫ కట్టుమార్చి కట్టు శ్రద్ధతోఁ గట్టి పుండు మానఁజేసెను. ఒడలికిఁ గొంచెమూపిరి వచ్చినతరువాత మావా రెక్కడ నున్నారని వానిని వీరి నడిగితిని. ఖానుఁడును గాశిమాలియు యుద్ధములోఁ బోయిరని తెలిసినది. ఇప్పుడు చెప్పఁ కూడదు గాని మీకొఱ కెంత కృశించితి ననుకొన్నారు? యుద్ధాలు గిద్ధాలు సద్దుమణఁగిన తరువాతఁ బేదరాలివలె బయలుదేఱి మీరాయను సోజను వెంటఁబెట్టికొని జేప్పనికి మ్రొక్కుచెల్లింపవలె ననుమిషతోఁ గోటదాఁటి మాదేశపు పొలములోఁ బడితిని. అప్పటులో మానాయన లేఁడు. సికంధర్ బేగు మాత్ర ముండెను. ఆయన మానాయనకు స్నేహితుఁడు. అతని కూఁతులతోఁ జిన్నప్పుడు నే నాడుకొంటిని. అందుచే సికంధర్ బేగు నా కొకపాలకి యిచ్చి యీహైదరాబాదునకుఁ బంపెను. ఎంతైనఁ బుట్టినింటితో సాటిగాదు. ఇక్కడకు వచ్చినతరువాత మరల నొడలునచ్చి యింతమాత్రము మీ కగపడఁగలిగితిని." అని యమీనా తన వృత్తాంతమును జెప్పెను. హర్బర్టూ! ఫిలిప్పూ! అమీనా ప్రేమను నాయానందమును జెప్పఁబోయిన మీకు విసుగుపుట్టును. కనుక నావిషయ మాపెదను. నేనమీనాను బెండ్లాడితినని మాతల్లి కుత్తరము వ్రాసితిని. ఆమె సంతోషముచేఁ బరవశయై నన్నుఁ జూచుటకై హైదరాబాదునకు వచ్చెను. మామేనమామ మాయింటిపనులన్ని చక్కఁబెట్టించుచుండెను గావున నేను మాయత్తగారియింటనే చాలదినము లుంటిని. ఇంతలో నమీనాతండ్రి వచ్చెను. ఆకుటుంబముయొక్క సంతోషము మీరే యూహించికొనఁగలరు. నాపేరు పట్టణములో నల్వురకుఁ దెలియఁజొచ్చెను. సుల్తానునితో యుద్ధము జరుగుచున్నదని యొకకింవదంతి పుట్టెను. నైజాము సర్కారు

వారు న న్నొక గుఱ్ఱపుదళమున కధిపతినిఁగాఁజేసి యొకబిరుదు నొసఁగిరి. "నీశౌర్యపరాక్రమములు యుద్ధమునఁ గనఁబఱచి పేరు తెచ్చికొనుము. నీకు జాగీరు నిచ్చెదము." అని మంత్రి చెప్పెను. తరువాత జరిగినదంత మీరెఱుఁగుదురు. మాయూరికి సమీపముననే రెండు జాగీరుగ్రామములను మా కిచ్చిరి. దీనికిఁ దోడు మాపిత్రార్జితము కలదు. అయిదువందల గుఱ్ఱములు గలవు. మాజీవనమునకుఁ గొఱఁతలేదు. మాతల్లి పూర్వకాలపుస్త్రీ గనుకఁ బెండ్లి సరిగా జరుగలేదనియు, భాగ్యవంతుని కూఁతును మఱియొక తెను వివాహమాడి యన్ని వేడుకలు చూపవలసినదనియు నన్ను బలిమాలెను. కాని నేను బ్రియురాలైన యొక్కతరుణితోడనే తృప్తిపొందితిని. మాకులస్థులందఱు నీతీరున నుండవలెననియే నాకోరిక. అనేకభార్యలఁ బెండ్లాడి తనకును భార్యలకును సౌఖ్యము లేక, కలహములచేఁ గలఁతనొంది కష్టములపాలైనవారి ననేకులఁ జూచితిని. ప్రేమ కెప్పుడును విభాగ ముండరాదు" అని కాశిమాలి తనచరిత్రమును సాకల్యముగఁ జెప్పెను. ఫిలిప్పు మొదలగువారు కాశిమాలి యౌదార్యమును గొనియాడిరి. "మేము మామాతృదేశమున నివసించునప్పుడు, కాశిమాలీ! నిన్ను నీభార్యను జ్ఞప్తికిఁ దెచ్చికొనుచుందుము. తప్పుగా నీకుఁ దోఁచని యెడల నాపె సౌఖ్యముగా వర్ధిల్లవలయునని కోరితిమని నీభార్యకుఁ జెప్పుము. నాభార్యకు నీభార్యకుఁ బరిచయము కలిగినట్లైన నా కానందముగ నుండును. అమీనావంటి నిర్మలహృదయను నాభార్య తప్పక ప్రేమించును. కాశిమాలీ! నాభార్యను నీకు బెంగుళూరిలోఁ జూపుదును. "ఆమెను గుఱించి నీభార్యకుఁ జెప్పుము." అని ఫిలిప్పు సప్రేమముగ వాక్రుచ్చెను. కాశిమాలి కన్నులనిండ గిఱ్ఱున నీరు తిరిగెను. "మీచిత్తవృత్తిని గుఱించి మీస్వభావమును గుఱించి నా కిదివఱకుఁ గల యభిప్రాయములు మాఱిపోయినవి. నాప్రాణ ముండునంతవఱకు మిమ్ము మఱవను. అమీనామీఁద మీరు చూపినదయకు నేను గృతజ్ఞుఁడనై యుందును. మిమ్ముఁగూర్చి యమీనాకుఁ జెప్పెదను. మీరు మీ పచ్చని

మనోజ్ఞప్రదేశములలో మెలఁగువేళలను, జల్లని తోటలలోఁ జెట్లనీడల సంచరించు సమయములందును, ధ్వనించుచుఁ బారునేఱుల తీరముల విహరించు నిమేషములందును, నమీనా గాశిమాలీలు మిమ్ముఁ బ్రేమించుచున్నారని యొక యాకాశవాణి మీ శ్రోత్రకర్ణములకు గోచరమగుచుండునుగాక. మమ్మిద్దఱ మఱవకుఁడు. శీఘ్రమునకుఁ బోయివచ్చెదను. సెలవు." అని గద్గదస్వరముతోఁ గాశిమాలి పలికి చనెను.

పిమ్మటఁ గొలఁదికాలమునకే ఫిలిప్పు ససైన్యుఁడై బయలుదేఱెను. కాశిమాలి తన గుఱ్ఱపుదళముతోఁ గూడ ఫిలిప్పును వెంబడించెను. వారు నెమ్మదిగ మజిలీలు చేయుచుఁ బోయిరి. హార్బర్టు దృఢపడినందున గుఱ్ఱము నెక్కి కాశిమాలి గుఱ్ఱముతోఁ బరుగెత్తింపఁ గలిగెను. బెంగుళూరు చేరి యందఱును గొంతకాల మచ్చట నాగిరి. ఫిలిప్పు భార్య చెన్నపట్టణమునుండి యచ్చటికి వచ్చెను. చిరకాల వియోగసంతప్తులయిన సోదరీ సోదరులు (ఎలీనాహార్బర్టులు) కలిసికొని పరమసమ్మోదము నొందిరి. ఎలీనాను గాశిమాలి చూచెను. అత్యంత సౌందర్యవతియైన యామెను ఱెప్పవాల్పక చూచుట దోషమని తలఁచినను నచట నుండినంతకాల మతఁ డామెను మనఃపూర్వకముగ గౌరవించుచుండెను. అతఁ డిల్లు చేరిన తరువాత బ్రతికినంతకాల మప్పుడప్పు డమీనాను, బిడ్డలను, దగ్గఱఁ గూర్చుండఁబెట్టికొని యా యాంగ్లేయ తరుణీమణి మృదుశరీరసౌభాగ్యంబును, విశాలనేత్రసౌందర్యంబును, సువర్ణ వికారకుంతల రామణీయకంబును నతి కుతూహలముతో వర్ణించి చెప్పుచుండెడువాఁడు. కాశిమాలి స్వగ్రామమునకుఁ బ్రయాణమయి ఫిలిప్పునొద్ద సెలవు పుచ్చికొనుటకు వచ్చి "నేను త్రోవలో బాలాపురమువద్ద ఫకీరును గలిసికొందును. అతఁ డిప్పటికిని జీవించియున్నాఁడు. మిమ్ము నప్పుడప్పుడు తలంచుకొనుచుండును. ఆయన కేవయిన వార్తలు చెప్పెదరా?" అని యడిగెను. "నేనుగూడ నందనుక నీవెంట వచ్చెదను. ఒకరోజు ప్రయాణమేకదా!" అని ఫిలిప్పు వాక్రుచ్చెను.

హార్బర్టును తానుగూడ బ్రయాణ మయ్యెద నని చెప్పెను. అందఱును బయలు దేఱి బాలాపురము చేరిరి. వీరినిఁ జూడఁగనే ముసలి ఫకీరునకుఁ గలిగిన సంతోషము చెప్ప శక్యముకాదు. తాను వెనుకఁ జేసిన యుపకారము లన్నిటి వారు సంపూర్ణముగ గ్రహించిరని నమ్మి, యపూర్వవస్తువాహనంబులచే, ధనకనకాంబరాదులచే, నమూల్యమణిగణంబుచేఁ బొందరాని సంతుష్టి నతఁడు చెందెను. ఫిలిప్పు హార్బర్టు లతనికి వర్షాశన మేర్పఱచిరి. అప్పటినుండి యతని యాతాయాతపాంథులదానము నపేక్షింపవలసిన యవసరము తీఱెను.

అచ్చట నేఁటికిని దృగ్గోచరములగుచుఁ బథికుల హృదయముల నాకర్షించు మనోజ్ఞవృక్షశ్రేణులక్రింద ననిర్వాచ్యమైన విచారముతో మిత్రులు వియోగము నొందిరి. కాశిమాలి యెగిరి గుఱ్ఱముపైఁ గూర్చుండుట ఫిలిప్పు హార్బర్టులు చూచిరి. నిమిషములో నతఁడు దూరవర్తియై చెట్లచాటున నదృశ్యుఁ డాయెను. వీరు మరల నెప్పుడును గలియలేదు గాని, జీవించి యుండినంతకాల మొకరి నొక్కరు మఱచినవారు కారు.

కోట యాంగ్లేయులయధీన మైనతరువాత మూఁడవదినమున నిద్దఱు మనుష్యులు కోటయొక్క బహిర్ద్వారము దాఁటి కావేరీనదినిఁ దరింపఁ బోవుచుండిరి. వారిలో నొకఁడు దిట్టమైన పొట్టిగుఱ్ఱముమీఁద మోయరాని బరువు వేసి దాని నడలించుచుఁ జనుచుండెను. గడచిన రెండు రాత్రులయందును వర్షము విస్తారముగఁ గురిసెను కాని నదిలోమాత్రము నీరు హెచ్చలేదు. "మదారూ! వేగముగ రమ్ము. ఇది బరువు మోయలేక పెనఁగులాడుచున్నది. ఏఱు రాలేదు. మన మదృష్టవంతులము. సులభముగ దాఁటవచ్చును." అని వారిలో నొకఁ డనెను. ఇతఁ డెవ్వఁడో చదువరులు జ్ఞప్తియందుంచికొని యుందురు. "ఇది నడవలేదు. జమాదారు సాహెబ్! బరువున కణఁగిపోవుచున్నది. ఇంకొక గుఱ్ఱమును గొని దానిమీఁద సగము బరువువేసినఁ దేలికగ నుండును. అబ్బో! ఈటబరు విదేమి మోయఁగలదు?" అని మదారుఁ డనెను.

"ఎందుకు వ్యర్థముగా రెండు గుఱ్ఱాలు. డబ్బు దండుగ. నాచేతఁ గాదు. ఒక్కటియే చాలును. దీనికి రోగమా మోయకపోవుటకు?" అని జమాదారుఁడు పలికెను.

అనేక సంవత్సరమునుండి యితఁ డధర్మమార్గముల నార్జించిన ద్రవ్యము, వెండియచ్చులు, బంగారుకడ్డీలు, విలువగల వస్తువులు నగణ్యములై యుండెను. రహస్యము తెలిసినవాఁడగుటచే నితఁడు సుల్తానుఁడు వచ్చిన దినమున నందఱు కంటె ముందుగ సొమ్ములు, ద్రవ్యము, కనకాంబరాదులు నిర్నిరోధముగ దోఁచెను. అన్ని కలిసి యేనుఁగుకూడ మోయఁజాలని బరువు గలిగియుండెను. ఇంతబరువు వాపొట్టిగుఱ్ఱముమీఁద వేసిన నది యెట్లు కదలఁగలదు? హాహాహా హాహామదూరా? మనము చెన్నపట్టణమునకుఁ బోయి పరంగీలతో వ్యాపారము చేయుచుండవచ్చును. మనల నక్కడ నెవ్వ రెఱుఁగుదురు?" అని జమాదారుఁడు సంతోషించుచుఁ బలికెను. "మంచిమాట సెలవిచ్చినారు. అంతకంటె మేలైన త్రోవ యిప్పు డేది లేదు," అని మదారుఁడు సవినయముగ ననెను.

వీరిద్దఱును గుఱ్ఱమును నడిపించికొనుచు నదీతీరమునకుఁ జేరిరి. తోట కెదుట నది విశాలముగ నుండెను. నీటియడుగునఁ బెద్దబండ చాలదూరము వ్యాపించి ప్రవాహవేగముచే ఛిద్రితమై కోసులు గలిగి హెచ్చుతగ్గులుగ నుండెను. గుఱ్ఱ మీబరువు వేసికొని యీబండలమీఁద నడచుట మిక్కిలి కష్టము గావున ననేకపర్యాయములు కాలుజారి పడుచు లేచుచుఁ బోయెను. చివర కది కదలఁజాలక యొకచోటఁ బరుండి రొప్ప నారంభించెను. "నీదుంపతెగ! నీవు చావ! లెమ్ము. లేవవా? (తోఁకను మెలియఁబెట్టుము) మదారూ! కొంచెము తోఁడుపట్టు. లేవనెత్తుదము." అని జమాదారుఁ డఱచెను. ఇద్దఱును గష్టపడి దానిని లేవఁదీసిరి. అది రెండడుగులు వేసి మరలఁ గ్రిందఁబడెను. జమాదారుని కేమి తోఁపలేదు. అతఁడు నైరాశ్యము చెందెను. మూటలు విప్పి తామే కొంచెము కొంచెముగ గట్టునకు మోసికొనిపోవుద మనుకొని యిద్దఱును గోత

ములను చెంపుచుండ మహాధ్వని యొకటి వినఁబడెను. "అదిగో! ఆధ్వని యేమిటి?" అని మదారుఁ డులికిపడి యడిగెను. "పిఱికిగాడిద! ఏమిలేదు. గాలివీచుచున్నది." అని జమాదారు కోపముతోఁ బలికెను.

నిజముగ నది వాయుధ్వని కాదు. కావేరీనది మిక్కిలి వేగముతో మూఁడడుగులయెత్తున వచ్చుచుండెను. అలలు, నురుగులు భయంకరములై యుండెను. కట్టెలు కంపలు పైనిఁ దేలియాడఁ ద్రోవలో నెదురైనదానినెల్ల ముంచివేయుచు భగవచ్ఛక్తిరూపంబు దాల్చి రోషావేశంబుతో సంచరించుచుండెనన వచ్చుచుండిన కర్దమీకృతవిశాలప్రవాహంబుయొక్క గర్జితములు హృదయవిదారకములుగ నుండెను. నదీమధ్యమున నంతటంతట జలము గిఱ్ఱునఁ దిరిగి యణఁగి యుబుకుచుండెను. కల్లోలసంఘట్టనంబున నుద్భవిల్లిన నీటిబిందువులు వాయువులోనికి లేచి దూరముగఁ బడుచుండెను. మదారుఁడు మొదట ధ్వనివినినప్పుడే యతిత్వరితముగ గట్టునకుఁ బోయెను. జమాదారుఁడు తిట్టుచు విసుగుకొనుచు మూటలు విప్పుచుండెను గాని పీటముళ్లు వేయఁబడినందున వచ్చినవికావు. పాపము! అన్నిసంవత్సరములనుండి యార్జించిన ద్రవ్యము విడిచిపెట్టిపోవుట కతనికిఁ బ్రాణ మొప్పకపోయెను. నిరాశతోఁ గత్తిదూసి యతఁడు మూటలఁ గోసెను. బంగారుకడ్డీలు క్రిందఁబడెను. మోయఁగలిగినన్ని యెత్తికొని యతఁడు తీరము చేరఁ బరుగెత్తెను. కాని ప్రవాహము విజృంభించి చుట్టును ధ్వనించుచుండెను. మదారుఁడును గట్టునఁగూడిన మఱికొందఱుజనులు నేదో యొకతాయిచూపి దానిమీఁది కెక్కుమని కూఁతలువెట్టిరి. కాని జమాదారునికి వారిమాటలు వినఁబడలేదు. వారిచేతిసంజ్ఞలఁజూచి యెత్తైనరాతి నెక్కుమనుచున్నారని యతఁడు గ్రహించి దాని నారోహించెను. ఎక్కక పోయినచో నతనిని ప్రవాహము ముంచివేసియుండును. ఒక్క నిమేషమువఱ కతఁ డాయున్నతశిలపై నిల్చుండెను. నీరు హెచ్చిహెచ్చి యతని పాదముల మట్టునకు వచ్చెను. అతఁ డారాతినిఁ గట్టిగఁ బట్టుకొని భగవంతునిఁ బ్రార్థించి

యీడ్చెను. అయ్యో! ప్రవాహవేగ మధికమాయెను. గర్జలాబులు పైకెత్తి చేతెంచెను. అతఁ డేమితోఁపక తచ్ఛిలాగ్రం బారోహించి నిల్చుండ యత్నించెను. పైసిఁ బెట్టఁబోయినప్పుడు - కటా - కాలుజారెను. అప్పుడు పెద్దకేకవేసి చేయియూడించుటమాత్రము గట్టుననున్నవారు చూచిరి. పిమ్మట నిమేషమున జమాదారుఁ డేఁడీ? భీకరతరంగంబు నిజగాంభీర్యంబునఁ బొరలి యనివార్య విజృంభణముతోఁ బరిభ్రమించుచుఁ బోయెను. నదీజలంబులపైఁ బ్రాణిచిహ్నం బేదియుఁ దరువాతఁ గన్పట్టలేదు.

బెంగుళూరిలో హార్బర్టు చాలకాల మాగలేదు. ఇంటి కుత్తరములు వ్రాసినతరువాత నెలదినముల కప్పుడు బయలుదేరెను. సముద్రముమీఁద నపాయములు కలుగుచున్నవని కొందఱు చెప్పినను హార్బర్టు లక్ష్యపెట్టక ప్రయాణముచేసెను. ఆమీఁద, స్వగృహము తప్ప వేఱొండవని మనోనేత్రమునకుఁ గన్పట్టలేదు. వానికాఱు కతఁ డెంత ప్రహృష్టహృదయుఁడెనో మనము ఊహింపనలవికాదు. అతనికి దినములు భారములుగ నుండెను. బయలుదేఱిన యైదుమాసముల కింగ్లాండులోని నోరునదీముఖంబున లంగరువేసిరి. హెంప్షా చాన్లెసులు తరువాత రానుండిరి.

1799 వ సంవత్సరము డిశంబరునెలయం దొక యుల్లాసకరమైన దినమున నాలుగుగుఱ్ఱములబండి యతిత్వరితముగ—పట్టణమునకుఁబోయి పూటకూలియింటివద్ద నాగెను. “ఇక్కడఁగాదు. మాస్వగృహమునకుఁ బోవలయును. మాయింటి కాల్టన్ నని పేరు. దాని నెఱుఁగుదువా? అచ్చటికిఁ దోలుము. త్వరగఁ బోనిమ్ము.” అని బండిలోఁ గూర్చుండినయతఁ డఱచెను. పూటకూలియింటి యజమానుఁడు బండిలోని యతని నొకనిమేషము ఱెప్పవాల్పకచూచి “కాఁడు కాఁడు. కాంటనుకుమారుఁడు కాఁడు. అప్పుడింత యెత్తులేఁడు. ఇంతకంటెఁ జక్కనివాఁడు” అని తనలోఁదలఁచుకొని మరల నతని వంకఁ గొంచెముసేపు చూచి “కాంటను కుమారుఁడే. చూడుము పోలిక.” అని

సాశ్చర్యముతో బిగ్గఱగ బ్రశ్నించెను. "అవును. నేను కౌంటును కుమారుఁడనే. నా పేరు హర్బర్టు. నాతో స్నేహమైన మాటలాడఁ దలఁచితివేని శీఘ్రముగఁ గానిమ్ము. పోవలయును" అని బండిలోనియతఁడనెను. పూటకూలి యజమానుఁడు తన టోపీ నెగురవేసి హుర్రా హుర్రాయని సంతోషసూచకములైన కేకలు వేసి "నీవు బ్రతికియున్నావని మే మెప్పుడు దలఁపలేదు." అని పలికెను. "మరల వచ్చి నిన్నుఁ గలిసికొందును. నమస్కారములు." అని యతనికిఁ జెప్పి హర్బర్టు గుఱ్ఱముల నడిపింపుఁడని బండిమనుష్యులఁ ద్వర పఱచెను.

ఆ దినమున నాట్స్‌ఫర్డులో సామీ, కౌంటును, మిసెసు కౌంటును మొదలగు వారందఱు సంభ్రమముతోఁ గూర్చుండి నవ్వుచుఁ గేకలువేయుచు బండి చక్రముల చప్పుడెప్పుడు వినవచ్చునాయని వేచియుండిరి. అమీయొక్క మనోవికారంబుల వర్ణించుట కష్టము. ఆమె సౌందర్యము హెచ్చెను; ముఖము వికాసముచెంది ప్రకాశించుచుండెను; శరీరకాంతి మనోజ్ఞముగ నుండెను, వెనుకటికంటెఁ గన్నులసోయగ మధికమై వదనమునకు నూతనలావణ్యము నాపాదించుచుండెను. అంతకంటె ముందుగ బండిచప్పుడు వినినయామె యొక్కతె గలదు. ఆమె యామీ. ప్రక్కనవా రామీముఖమును గనిపెట్టుచుండిరి. అదివఱకనేక వికారములను క్షణక్షణమునకుఁ బొందిన యామె మొగము ప్రకాశమానమాయెను. ఆమె యెక్కువయాసక్తితోఁ జప్పుడువిని తటాలునఁ దలుపు తెఱచి బయటికిఁ బోయెను. ఎవ్వరు నామెను వెంబడింపలేదు. చుట్టుప్రక్కలం బలకించి తిరిగివచ్చి యామె కురిచిలోఁబరుండి ఱొమ్ము మీఁదఁ జేయివేసికొని యెగరోఁజెను. ఇంతలో శరవేగముతో బండియే తెంచెను. అది యాగకముందే దానిలోని యువకుఁడు క్రిందికి దుమికి సంతోషపరవశుఁడై యున్న సేవకులనుదాఁటి యింటిలోఁ జొరఁబడి కుతూహలముతో నడసికొఱకు వేచియున్నవారిమధ్యమున నగపడెను. కురిచిలోనుండి యామీ యెగిరిచేతులు

చాచి యత్యంతానందంబున నతనిఁ గౌఁగిలించెను. హర్బర్టు నిశ్శబ్దముగ నామెను తన అంకమ్ములో గ్రుచ్చికొనెను. ప్రక్కనవారందఱు బాష్పపూరితనేత్రములతో నపసిచుట్టు గుమిగూడిరి. వారిబాష్పము లానందసంజనితములు. మృతినొందెనని యాశవదలఁబడిన హర్బర్టును మరలఁ జూచుటవలనఁ గలిగిన పరమహర్షముచే వారు పూర్వదుఃఖముల నన్నిటి మఱచిరి.

చిరవియోగమునందు సయితము చాంచల్యము లేక తనను ప్రేమించి వరించిన యువతిని హర్బర్టు గాఢపరిష్వంగమునఁ జేర్చికొనినప్పుడు చూచినవా రాయిరువుర యాధ్యాత్మికబంధము నిశ్చలమై, వారు నిరంతరాయంబైన యానందము ననుభవింతు రని తలఁచిరి.

సమాప్తము.

ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1953